# మల్లాది వెంకటరమణ

# సాహితీ సర్వస్వం

రెండవ సంపుటం

## కథా రమణీయం



# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

రెండవ సంపుటం

# కథారమణీయం-2

సంపాదకుడు: ఎమ్బీయస్ ప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam-2
KATHARAMANEEYAM-2 - *Editor: M.B.S. Prasad*

ప్రచురణ నెం. : 2343

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబరు, 2002.



ముఖపత్రం, లోపలి బొమ్మలు: డా॥ బాపు

**వెల: రూ. 150-00**
**విదేశాల్లో వెల: $ 15**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 4066986
ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.




మేము పోసిన నారుకి నీరు పోసి నల్భైయేళ్ళు ఆదరించి
పెంచి పోషించి పండించిన ప్రచురణకర్త, సహృదయుడు
బాపురమణలకు ఆప్తమిత్రుడు అయిన
శ్రీ నవోదయ (అట్లూరి) రామమోహనరావుగారికి
గౌరవంతో ప్రేమతో స్నేహపూర్వకంగా ఇది మా కానుక –

బాపు - రమణ

# భాషాకేళీ రమణ కుతూహలం

అద్యతన తెలుగు వచన సాహితీక్షేత్రంలో స్వయంకృషితో వినూత్నపదాల పంట నూర్పిళ్ళను సొంతం చేసుకొన్న భూస్వామి ముళ్ళపూడి వెంకటరమణ. పదాల, పదబంధాల, జాతీయాల, నానుడుల నడుంవిరగ్గొట్టి సరికొత్త అర్థాల అందాల స్ఫురణ కోసం భాషతో వెట్టిచాకిరీ చేయించుకొన్న గడసరి ఆసామి ముళ్ళపూడి వెంకటరమణ. కథావేదికమీద రమణగారి అరంగేట్రాన్ని – రమణగారి మాస్కుతో – బాపూగారే 1953లో ఆరంభించారు. నాటి నుండి తెలుగు కథకుల్లో నిత్యస్మరణీయుడు.

ఆధునిక తెలుగు కథాసాహిత్యంలో వీరిదొక ప్రత్యేక స్థానం. కథానిర్వహణలో వినూత్నమైన పంథాను ప్రవేశపెట్టారు. వ్యంగ్యం – పేరడీలన్న కాళ్ళతో అవి నడుస్తాయి. పదాల విరుపు, కొత్త కొత్త పదాల ప్రయోగాలన్న చేతులతో పాఠకులను అక్కున చేర్చుకొంటాయి వారి కథలు. రమణగారి చూపుకో ప్రత్యేకత ఉంది. ఆ కళ్ళతో వారి కథలు లోకాన్ని చూస్తాయి. టీన్‌ఏజ్ వాళ్ళ ఆలోచనలు గానీ, రాజకీయాల రణరంగంకానీ, అప్పులివ్వడం, తీసుకోడం అన్న అంశాలుకానీ వస్తువులుగా తీసుకొన్నప్పుడు వాటన్నిటికీ ఒక చక్కని దార్శనికతను తయారు చేసుకొంటారు. వాటి కనువైన పదజాలాన్ని సృష్టించుకొంటారు. వాటి ఆధారంగా అనుకూలమైన వాతావరణాన్ని తయారు చేసుకొంటారు.

సాధారణంగా రమణగారి కథల్లోని వస్తువులు సార్వకాలికాలుగా ఉంటాయి. అందుకే ఆ కథలు ఎప్పటికప్పుడు నిత్యనూతనం అనిపిస్తాయి. రచయితలు సామాజిక మార్పును ఆశిస్తారు. అందుకు తమ రచనల ద్వారా తమ పాఠకవర్గాన్ని మేల్కొల్పాలని కృషి చేస్తారు. అలాగే రమణగారి పాఠకులు మధ్య తరగతి వర్గం. రమణగారు ఆశించిన మార్పు – ఏయే సామాజిక తాత్వికతలతో, ఎక్కడ రావాలో పాఠకులకు – ఇదిగో ఇక్కడ... ఇక్కడ అంటూ పదేపదే చూపిస్తారు తమ కథల్లో. కింది తరగతుల వాళ్ళకు తెగింపుతో పనులు సాధించుకోగలమన్న ధైర్యం ఉంటుంది. ఉన్నత వర్గాలకు డబ్బే అన్నీ సాధించి పెడ్తుందన్న ధీమా ఉంటుంది. ఈ రెండూ లేక కలలు భోంచేస్తూ, ఎవరన్నా తట్టే తప్ప లేవలేనిది మధ్య తరగతి. ఆ మధ్య తరగతిలో సామాజిక చైతన్య స్ఫూర్తి కలిగిస్తే సామాజిక రుగ్మతలు కొంతవరకన్నా తగ్గవచ్చుని రమణగారి రచనాధ్యేయం. వీరివి పెద్ద కథలు. రమణగారు దశాబ్దం నుండీ కథారచనవైపు దృష్టి మందగించారు. నాలుగు దశాబ్దాల వీరి రచనలను కొత్త తరంవారికి పరిచయం చెయ్యదలచిన ఓ పత్రిక వాటిలో కొన్నిటిని సీరియల్‌గా ప్రకటించింది. పాఠకుల స్పందన అనూహ్యంగా ఉంది. దీనివల్ల రమణగారి కథాసాహిత్యం అజరామర లక్షణం కల్గిందనిపిస్తుంది.

విశాలాంధ్ర ప్రచురణాలయం అత్యంతాధునిక రచయితల సాహిత్యాన్ని సంపుటాలుగా ప్రచురిస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. ఆ ఉద్దేశంతో రమణగారి సాహిత్యాన్ని ఏడు సంపుటాలుగా ప్రచురిద్దామని పథకం రూపొందించాం. మిత్రులు ఎమ్బీయస్ ప్రసాద్‌గారు సంపాదక బాధ్యత స్వచ్ఛందంగా నిర్వహించటానికి అంగీకరించారు.

ఆ వరుసలో... ఈ కథారమణీయం–2లో – 8 అధ్యాయాల్లో 45 కథలను చేర్చటం జరిగింది. వీటిని గుదిగుచ్చటంలో పాటించిన తీరుతెన్నులను వివరిస్తూ సంపాదకులు ఎమ్బీయస్ ప్రసాద్‌గారు చక్కని 'ముందుమాట' రాశారు. అందుకు వారికి కృతజ్ఞులం. బాలరమణీయం – బుడుగు 3వ సంపుటమైనా ఇంతకు ముందే దాన్ని ప్రచురించాం.

ఈ సంపుటం – రమణీయాష్టక సంపృక్తం ప్రాతస్మరణ సంస్తుతం – లా రూపొందింది. ఇందులో ప్రధాన భాగం చూస్తే రమణగారి ఊహాచాతుర్యం, కథన కౌశలం, పాత్రలస్వైర విహారం పాఠకుల నాశ్చర్యపరుస్తుంది.

ప్రపంచ ద్రవ్యనిధి పాలిటి జలగలా, వర్ధమాన దేశాల పాలక బాబుల ఋణస్వామ్య సిద్ధాంత ప్రతిరూపంగా ఉండే ఓ అప్పారావు మనకు తారసపడేలా సృష్టించి తెలుగు రాజకీయ రంగంపై బాణంలా వదిలిన సవ్యసాచి రమణగారు అభినందనీయులు.

వీరి పద క్రీడావిన్యాసానికి జోహార్లనని తెలుగు పాఠకుడుండడు. అదే రమణగారి రచనలకు ఆభరణం.

తమ రచనలను సంపుటాలుగా వెలువరించటానికి ఆమోదిస్తూ ఈ అవకాశం మాకు కల్గించిన శ్రీ ముళ్లపూడి వెంకటరమణగారికి ధన్యవాదాలు. వీరి పేరు తలవగానే వెంటనే స్ఫురించే వేరొకరు ప్రఖ్యాత చిత్రకారులు బాపు. ఒకరు పదాలతో భావాలు పలికిస్తే, మరొకరు వాటిని చిత్రాలతో చిలకరిస్తారు. ఇద్దరూ "సాహిత్య కవలలు." ఇందులోని బొమ్మలన్నీ ముఖచిత్రంతోసహా బాపూగారివే. వాటిని వినియోగించుకోడానికి అంగీకరించినందుకు బాపూగారికీ మా ధన్యవాదాలు. మిగిలిన సంపుటాలను కూడా క్రమంగా ప్రచురిస్తాం.

తెలుగు పాఠకలోకం మా యీ పథకాన్ని ఆదరిస్తూ, మరిన్ని సరికొత్త పథకాల అమలులో మాకు చేయూతనివ్వగలదని మా నమ్మకం.

ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తూ తెలుగు పాఠకలోకానికి సేవ చెయ్యటం మా ప్రచురణాలయం ఆశయం.

హైదరాబాదు–1.
తేది: 12–11–2002.

**డా॥ ఏటుకూరి ప్రసాద్,**
సంపాదకుడు,
విశాలాంధ్ర ప్రచురణాలయం.

# ముందుమాట

కథకుడిగా రమణ విశ్వరూపాన్ని చూపడానికి కథారమణీయం-1 లో ప్రయత్నం జరిగింది. అదే ఒరవడిలో, అదే వర్గీకరణతో రమణ తక్కిన కథలు దీనిలో చోటు చేసుకున్నాయి. భావపరంగా గానీ, భాష పరంగా గానీ, ప్రయోగాల పరంగా గానీ, ఆయన కథల్లో ఎన్నో డైమన్షన్స్ ఉంటాయి. హడావుడి యుగంలో పైపైన చదువుకుపోతే ఎన్నో అందాలు మిస్ అయ్యే ప్రమాదం ఉంది కాబట్టే ఈ కరదీపిక అందించే ప్రయత్నం.

## రస రమణీయం

కథకుడిగా రమణ ఉత్కృష్టస్థానాన్ని అందుకున్న కథ "కానుక". (రచనాకాలం ఆగస్టు 1963). పర్‌ఫెక్షన్‌కై తపించే ఒక కళాకారుడి ఆరాటాన్ని వర్ణించిన ఈ కథ సృష్టిలో పనికిమాలినది ఏదీ లేదని తెలియజెబుతుంది. కొన్నేళ్ళపాటు నిర్విరామంగా సాగిన వేణునిర్మాణం గురించి ఆర్తిగా చెప్పే ఈ కథకు వేణుగానలోలుడయిన కృష్ణుడిని కేంద్రంగా చేసుకోవడంతో ఒక పౌరాణిక స్థాయిని సంతరించుకుని, కుచేలోపాఖ్యానంతోబాటు పఠించవలసిన ఉపాఖ్యానం అనిపిస్తుంది.

అన్నీ కుదిరాయనుకున్న వేణువును పిల్లవాడు అటకమీద తక్కినవాటితో కలిపివేయడం, సమయంతో పోటీపడరావలసిరావడం కథకు అద్భుతమైన డ్రమటిక్ ఎలిమెంటును సమకూర్చింది. క్లయిమాక్స్ మరీ చిత్రం. కృష్ణుడు వాయిస్తే శబ్దమే రాదు! కథలో భాష, చెప్పిన తీరు గురించి ముచ్చటించబోతే ప్రతివాక్యం, ప్రతిపదం స్మరణీయం అనడం అతిశయోక్తి కాదు. "ఊహ కందే సంగీతంలో పాట కందేది శతసహస్రం ఉండదు." అన్న ఒక్క వాక్యం చాలు. ఇక వర్ణనలు, మాట విరుపులు, చమత్కారాలు ('చీకటి చిక్కదనాన్ని మంటలు వెలుగెత్తి చాటుతాయి.' 'ఎవరికి వారే యమునాతీరే' వంటివి కోకొల్లలు) ఎమ్వీయల్ మాటల్లో చెప్పాలంటే – "రమణ రాసిన ఈ కథ మల్లాది రామకృష్ణశాస్త్రి గారి భాషకే కాక భావానికే కాక, అనుభూతికే కాక, అనుభవానికే కాక పరిణతికి కూడా సరిపోల్చదగినదనటం అతిశయోక్తి యంత మాత్రం కాదు. స్వభావోక్తే!"

ఈ కథను బాపు ఎన్నో మార్లు, మనోహరమైన చిత్రాలతో అలంకరించారు. ఈ పుస్తకంలో కనబడేవి "శ్రీకృష్ణలీలలు" పుస్తకంలో 'కానుక'గా ఇచ్చిన కథకై వేసినవి. 'సాహిత్య ఎకాడెమీ వారు ఇతరభాషలలోకి అనువదించడానికి తెలుగు

కథలను ఎంపిక చేసే బాధ్యతను పురాణం సుబ్రహ్మణ్యశర్మ, వాకాటి పాండురంగరావు గార్లకు అప్పగించారు. ఆ సంకలనంలో ముళ్లపూడి హాస్యకథలను కాకుండా "కానుకో"ను ఎందుకు ఎంచుకున్నారన్న ప్రశ్నకు సమాధానమిస్తూ వాకాటి "ఇది యూనివర్సల్ సబ్జక్ట్. ప్రపంచంలోని ఏ భాషవారినైనా కదిలించగల సబ్జక్ట్." అన్నారు. కృష్ణభక్తులైన వి.ఎ.కె.రంగారావు గారికి ఈ కథను అంకితమిచ్చి వారిని కూడా ధన్యులను చేశారు రమణ.

ఈ కథలోనే కాదు రమణ భావుకత్వం ఈ సంకలనంలో అన్ని కథల్లోనూ కనబడుతుంది. 'అరబైటవేసిన తెల్లటి పక్కల మీద వెన్నెల విరగబడి నవ్వుతూ పొర్లాడడం' (కృతజ్ఞత), కామేశ్వరి వర్ణన (ప్రయోజకుడు). "సాక్షి"లో 'నిశ్శబ్దం తీవ్రంగా ఉపన్యసించిందన'డం. 'జోరీగల జోడు ఊరుని జూకొడుతోంది' (జోకొట్టడం కాదు), – కొన్ని ఉదాహరణలు మాత్రమే.

## సరస రమణీయం

ముందుగా కనబడేది "రాధాగోపాలం". బ్రహ్మచారిగా ఉండగానే కుటుంబ జీవితంలోని సొగసులు రమ్యంగా గ్రంథస్థం చేసే సాహసం చేశారు రమణ. కొత్త దంపతులు, ప్రణయకలహాలు, పుత్రోదయం, చుట్టాలరాక – ఇలా రకరకాల విషయాలను ప్రస్తావించడం జరిగింది. సాధారణంగా జూలియట్లకై రోమియోలు చేసే కసరత్తులపైన అందరూ కథలు రాస్తారు. "రాధమ్మబాకీ" కథలో అటునుంచి ఉండే అవస్థల గురించి రాశారు రమణ. రాధాగోపాలాల కథ over a period సాగుతుంది కాబట్టి, కొడుకురావడం, భార్యప్రేమను పంచుకోబోవడం వంటి సైకో అనాలిసిస్‌ను అలా అనిపించకుండా తమాషాగా చెప్పారు. "చుట్టాలొచ్చేరు"లో చిట్టెమ్మగారు వంటి పెద్దతరం వాళ్ల ఆప్యాయతతో బాటు, లౌక్యం కూడా చిత్రీకరించబడింది. 1954-55లలో రాసిన ఈ కథల సరసన కనబడే "శ్రీగోపాళోపనిషత్తు అను ప్రమాదో ధీమతామపి" మార్చి 1996లో ఆంధ్రాబ్యాంకు వారి కోరికపై రాయడం జరిగింది. "తిమింగిలగిలం" (జనవరి 1956 రచన) అనే కథ "రాధాగోపాలం" సీరీస్‌లోదే అయినా సబ్జక్ట్‌ని బట్టి "ఋణరమణీయం"లో చేర్చడం జరిగింది. ఇక రమణ భాషా ప్రయోగాల కొస్తే స్పూనరిజమ్‌కి ఉదాహరణలు – 'బ్రూసు యేడుసార్లు సాలెగూడు కట్టాడు.' 'నేనేమో హోల్లో ఆడుకుంటున్నాను..' (రాధ అంటుంది). వచ్చిన చుట్టాలెవరని అడిగేటప్పుడు గోపాలం, రాధల సంభాషణ కెమెరాభాష అనవచ్చు. అలాగే 'రాధమ్మబాకీ'లో స్కూలుకి వెళుతూ రాధ వ్యూలో కొచ్చే లైటు స్తంభం, పోస్టుబాక్స్.. కూడా కెమెరాభాషలోకే వస్తాయి. ఋణానందలహరిలో మునసబు, అప్పారావుల మధ్య చూపుల భాష కూడా కెమెరాభాషే!

దాంపత్యజీవితంలో రమణ ఒకవైపు మాత్రమే చూశారనుకుంటే పొరబాటే! "కృతజ్ఞత"లో చచ్చిచెడి ఇంటికి చేరిన దీక్షితులికి అతని భార్య ఉపచర్య చేసి,

చెడామడా తిట్టింది. తనని యిలా రాసి రంపాన పెడుతున్నందుకు! "సాక్షి"లో సవతుల పోరు చూడండి. 'జలప్రళయం'లో పెళ్ళి అంటే భయపడుతూ వచ్చినవారు ఎలాగూ ప్రళయం వస్తోంది కదాని తెగించి పెళ్ళి చేసుకున్నారట! సంసారం సజావుగా సాగాలంటే భార్యావిధేయులై ఉండాలని ఏకంగా 'చండీదాసు హితోపదేశం' (డిసెంబరు 1955) కథే రాసేశారు.

తరువాత కనబడే "తాంబూలాలిచ్చేశారు" (ఫిబ్రవరి 1956)లో టపటపా ప్రేమలో పడిపోయి. నాన్న బెదిరింపుతో అదే స్పీడులో ప్రేమలోంచి బయటపడిపోయే ఉత్తుత్తి ప్రేమికుడి కథ. "భగ్నవీణలు, బాష్పకణాలు' (కథారమణీయం-1)లోని 'లవర్స్‌డెన్' ఇక్కడా కనబడుతుంది. విరహాలు, సిగరెట్ల కోసం ఘోష, అమ్మాయిల నిక్‌నేమ్స్, ఆదరాబాదరాగా లవర్స్‌ని మార్చడాలు, వాళ్లకు నచ్చేలా తయారవడానికి అవస్థలూ, విజ్ఞానసముపార్జనకు పడేపాట్లు (వజ్రాయుధం వజ్రంతోనే చేశారేమోనన్న అనుమానం) - ఇవన్నీ హాయిగా నవ్విస్తాయి.

ఇలాటి వారికి భిన్నంగా ఉండే లవర్ గురించిన కథ "ఏకలవ్యుడు" (మే 1957) టైటిల్‌లో పన్‌యే కాదు, "డిప్యూటీ దేశసేవ" లాటి మాటలు కాయిన్ చేయడం కూడా జరిగింది. పెద్దవాళ్ల మధ్య విసుర్లు చమత్కారానికి పరాకాష్టలు. (దంగైపోయినవాడి అవస్థ గురించి - "రాగాలాపనలో పై షడ్జమం దాటిపోయి అక్కడేం చెయ్యాలో తోచక, దిగలేక నిలవలేక అవస్థపడే జూనియర్ గాయకుడిలా గింజుకోసాగాడు") టెలిపతిరావు (అతనికి చెముడు ఉండడం ఓ తమాషా) పాత్రకల్పన చిత్రంగా ఉంటుంది. రమణ ఆ కేరెక్టరును వేరెక్కడా ఉపయోగించుకోలే దెందుకో! తుకారాం మనకు తెలుసున్న పాత్రే! అప్పారావు ఓ అతిథి పాత్రలో మెరుస్తాడు.

వ్రతం ముగిసేలోగానే ఫలం దక్కితే వచ్చే ఇబ్బంది చూపే "వరలక్ష్మీవ్రతం" కథ (జనవరి 1956) కూడా లైట్ రొమాంటిక్ కథే. ('ఇరుగుపొరుగులను ప్రేమించడం మధ్య ఇంట్లో కాపురం ఉన్న వారి విద్యుక్తధర్మం'). ప్రేయసితల్లి ప్రాపుకై పాట్లుపడడం ఓ వెరైటీ. చివరిలో ఓ బుల్లి యాంటీక్లైమాక్స్. (తలుపు మూసి ఉందనుకుని దూసుకుపోతే బోర్లపడినట్టు!) మధ్యలో ఆఫీసుకు సెలవుపెట్టే కారణాలపై విసుర్లు. రమణగారబ్బాయి వరాముళ్లపూడి 1995లో బుల్లితెర కెక్కించిన కథల్లో ఇది కూడా ఒకటి.

ఇవన్నీ యువతీయువకుల ప్రేమకథలనుకుంటే మధ్యవయస్కుల మధ్య అనురాగం చూపే కథ. - 'లోకయాత్ర'.

## ఋణ రమణీయం

ఇది రమణ ట్రేడ్‌మార్క్. అప్పుల గురించి రమణ వెలువరించిన విస్తృత పరిశోధన, వేసిన "పన్"లు అంతకు ముందుగానీ, తర్వాత గానీ ఎవరూ చేయలేదు.

అప్పారావు పాత్రను సృష్టించి ఆంధ్రదేశానికి కానుకగా ఇచ్చేశారు. రమణ ధర్మమాని "అప్పారావు", 'హలో కులాసా' అనే మాటలకు కొత్త అర్థాలు వచ్చి చేరాయి.

'తిమింగిలగిలం' లోని తుకారాం అప్పారావు అంశయే. (రాముడు, పరశురాముడు లా తుకారాం, అప్పారావు ఇద్దరూ 'ఏకలవ్యుడు'లో కనబడతారు). 'కుమారసంభవం'లో కనబడే తుకారాం, మీసాలం అని పిలవబడే జీకేమూర్తి సుబ్బలక్ష్మిని పెళ్లాడితే, ఇక్కడ తుకారాం సీతను పెళ్లాడతాడు. విశేషమేమిటంటే ఈ కథలో అప్పారావు అనే తుకారాంకి సరైన ప్రత్యర్థి ఎదురవుతాడు. చివరికి 'స్థానబలమే జయించి, ఋణధృవమే సార్థకమవుతుంది.'

రమణ రచనల్లో శాశ్వతత్వం ఉన్న వాటిల్లో 'ఋణానందలహరి' (1959) ఒకటి. ఒక్కరోజు జరిగిన కథని ఫ్లాష్‌బ్యాక్‌లతో, ఉదంతాలతో పెద్దది చేసి చెప్పడం జరిగింది. పాత్రలకు పేరు పెట్టడంలో కూడా నేర్పు చూపించాడు రచయిత. కాకుల్లో తండ్రి కాకి, తల్లి కాకి అన్నా, చీమల్లో చీమంతుడు, చీమంతి అనవలసివచ్చినా పాముల దగ్గరకి వచ్చేసరికి మనం పెట్టుకునే నాగలక్ష్మి, సుబ్బన్న పేర్లు చక్కగా అమిరాయి. జంతువుల మీద పెట్టి మనుషులకు నీతులు నేర్పిన పంచతంత్రం మోడల్లో రమణ తన ఋణవాదాన్ని చీమలద్వారా, పాములద్వారా వినిపించాడు.

కథనం అద్భుతం - కొన్ని ఉదాహరణలు - మునసబు గారి ద్వారా story narration (తాతబ్బాయి కథ లాటివాటిల్లో flow చూడండి), అప్పులనర్సయ్య మాటతీరు, ఒడుపూ, ఋణహృదయం కథలో అప్పులివ్వకపోతే జరిగే అనర్థాలు చెబుతూ గుర్నాథం, భానుమతి కథ (తర్వాత వస్తుంది)కు పునాది వేయడం, అప్పారావు చొక్కాల స్కీము, సినిమా హాలు దగ్గర కన్‌ఫ్యూజన్, బాతు కథ మీద పారడీ, పాతకథల పారడీగా పేరాపేరా వాక్యాలు రాయడం, నడికారు చీమ తప్పుడు కథ చెప్పడం (పంచతంత్రంలో ప్రతీ చీమా, దోమా కథ చెప్పగలగడం మీద ప్యారడీ)

తను రాసిన కొన్ని కథల్లోలా రచయిత కథలోకి చొరబడే ప్రయోగం ఇక్కడా చేశాడు. 'చెబుదును గానీ పేజీలు పెరుగుతాయి. పబ్లిషరేమంటాడో', "ఈ కథలాగే గుర్నాథమూ అంగుళంకూడా కదల్లేదు.' 'నమ్మరా? మనమంతా ఓ కథలో వాళ్లం, ఆపాటి నమ్మకపోతే ఎలా? నీ దగ్గర ఎంతడబ్బున్నా ఖర్చు పెట్టేందుకు వీల్లేకుండా చేయిస్తానుండు ఆథరుతో చెప్పి హుం' 'మునసబుగారు 'ఋణానందలహరి'ని చాటుకి తోసేశారు,' 'ఆనక కథయ్యేటప్పుడు అంతా కలిసి ఫోటోగ్రాపు దిగుదురుగానీ ముందర వాళ్లని లేవగొట్టు.'

ఇక అప్పుల థియరీ గురించి చెప్పవలసివస్తే హీరో అప్పారావు గురించి ఎన్ని వర్ణనలు, విశేషణాలు వాడినా అతని కారెక్టరు పట్టిచ్చే కన్‌ఫెషన్ ఒక్కటి చాలు - "బాకీ తీరితే గుండె మీద రాయి దిగినట్టుంటుంది. అదేమిటో ఆ రాయి లేకపోతే నాకు నిద్రపట్టదండి". అప్పుల గురించి కొన్ని అబ్జర్వేషన్లు - 'అప్పంటూ ఇచ్చాక ఇహ కజ్జాలు రావడం ఎంతసేపుటా', 'పుచ్చుకునేవాడికి అప్పు అయినదే యిచ్చుకునేవాడి

ప్రాణానికి బాకీలా కనిపిస్తుంది.' 'రాకరాక పెద్దమొత్తం చేతికొస్తే అది గాస్తా, అప్పులాడి యెదాన గొట్టడానికి ప్రాణం ఒప్పదు.' 'అప్పిస్తానని ఒప్పించాక వాడివ్వబోయే అప్పు మన దృష్టిలో వాడివ్వవలసిన బాకీగా తయారయిపోతుంది.' 'అప్పు అడగడం అంత అకార్యం ఇవ్వడమే'. అప్పు ఆశీర్వాదాలు - 'అడగ్గానే అప్పు దొరకా'. అప్పు తిట్లు - 'నీ దగ్గర అడ్డమైనవాడు అప్పు చేసి ఎగ్గొట్టా,' 'అవసరం తీరాక అప్పు దొరకా' 'వీడికి అడ్డమైనవాడూ అప్పులివ్వా'. అప్పు ఉపమానాలు - 'అప్పు చేసినవాడి డబ్బులా హడావుడిగా ఖర్చయిపోయింది.' 'ఐపీ పెడుతున్నవాడికి ఆ క్రితం రోజే ఆస్తిమీద అరవైవేలు అప్పిచ్చినవాణ్ని చూసి తోటివాళ్ళు నవ్వినట్టు.' 'చాలాకాలం తరువాత రావలసిన డబ్బు చేతికి రాగానే అప్పులవాళ్ల మొహాన విసిరికొట్టేవాడిలా, దూకుడుగా...' 'అప్పులు తీర్చేసినవాడి మనసులా లోకం ప్రశాంతంగా ఉంది,' 'బడిపంతులు చేబదుళ్లులా చిందరవందరగా ఉండే జుట్టూ, అప్పు తెచ్చిన విచ్చురూపాయిలా మెరిసే కళ్లూ, బాకీలవాళ్ళకి కోపిష్టివాడి జవాబులా పొట్టిగా, టూకీగా, అప్పారావు ఉంటాడు.' 'అప్పారావు అప్పు వసూలుచేసినంత చురుగ్గా,' 'దివాలా ఎత్తిన వాడి పరువులా సినిమాక్యూ చిటికి చెల్లాచెదరైపోయింది.' 'లోభి జేబులో డబ్బులా స్థిరంగా అక్కడే ఉన్నాయి.' 'తొలిసారిచ్చిన చేబదులు డబ్బులా వెంటనే ఠంగున తిరిగి వచ్చేశాడు,' 'నిన్న సాయంత్రం దాకా వదలకుండా అప్పులవాడిలా తగులుకున్న పాటను పరాగ్గా ఉండగా విప్పిపారేసి, కొత్తపాట తొడుక్కుంటున్నాడు.' 'అప్పుల వాళ్లకు అందకుండా వాన చినుకుల మధ్య నకులుడు గుర్రం తోలినట్టు చేతిలో డబ్బు పట్టుకెళ్ళడం.'

"ఋణానందలహరి" చూస్తే ఇతర విషయాలతోబాటు తెలుగు భాషపై రమణకున్న పట్టు ఎటువంటిదో, భాషతో ఆయన చేసిన ప్రయోగాలు ఎటువంటివో, మాటలతో ఆయన ఎలా ఆటలాడుకున్నాడో తెలుస్తుంది. తెలిసున్న పదాలలోనే ఒక్క అక్షరం కాస్త మార్చి దాఋణం, అఋణకిరణుడు, కఋణ అంటూ అప్పు జార్గన్ తయారుచేశాడు. తిరుగుటపా-మరుగుటపా, ధనస్వామి-ఇంధనస్వామి, (ఏకలవ్యుడు లో ధనర్థారి అనే చక్కని కాయినింగ్ ఉంది) బిర్లా-షిర్లా అంటూ పదాలు కాయిన్ చేశాడు. ఇతర జంతుజాలానికి కూడా భాష సృష్టించి ఇచ్చాడు. కాకిభాష - కావులించి, కావుకేకలు, రెక్కలో బాణం, కావురుబావురుమంటూ ఏడవడం, రెక్కాడితే గానీ డొక్కాడనివాళ్లం, కాకమ్మ కబుర్లు (ఇవి మనకంటే కాకులకు బాగా అతుకుతాయి కదూ); అలాగే పాముభాష - తుసాబుసామంటూ, నాలికలు కొరుక్కుని, కోటికి పడగెత్తి, దోబుసలాడుకోవడం, కడుపారా గాలి భోంచేసి బుస్సున తేన్పడం, గాలిపుట్టలు కట్టడం; మరి చీమలకు కూడా భాష ఉంది - చిమచిమ నవ్వు, పుట్టతీసి, పుట్టమునగడం (మనం కొంపదీసి, కొంపమునగడం అన్నట్టు), తానెరిగిన తాళపత్రగ్రంథంలో కథ చెప్తుంది చీమ.

చివర్లో కనబడే ఋణదాశరథీ కఋణా.. సెప్టెంబరు 1961లో రాసినది.

## జన రమణీయం

రమణ గొప్పకథల్లో ఒకటైన "ఆకలీ-ఆనందరావూ" ఆయన రెండో కథ. 'బాల' రచనలు వదిలేస్తే ఆంధ్రప్రభ వీక్లీ 1953 జనవరి 7 సంచికలో రమణ పేర వెలువడిన "లక్ష్మి" కథ బాపు ఆయనకు ఘోస్ట్ రైటింగ్ చేసిపెట్టినది. తొలిరచనే ఘోస్ట్‌రచన కావడమేమిటి? అని రమణగార్ని అడిగితే "కథలు రాస్తానని బెదిరించడమే కానీ నేను కాగితం మీద కలం పెట్టకపోవడంతో నాకు ధైర్యం చెప్పడానికి నా పేర బాపూయే కథ రాసి, బొమ్మ వేసి పెట్టాడు. ఇడ్లీ కన్నా పచ్చడే బాగుందంటూ సంపాదకులు వేసుకున్నారు." అని సమాధానం ఇచ్చారు. దీని వెనువెంటనే రమణ మొదటికథ "ఛాయలు" మార్చి 1953 లోను, "ఆకలీ-ఆనందరావూ" జూలై 1953లోనూ వచ్చేశాయి. ఇంతలో ఆంధ్రపత్రికలో ఉద్యోగం రావడంతో ఆ పై కథలన్నీ ఆంధ్రపత్రిక వీక్లీలో వచ్చాయి.

ఆకలేసి కేకలేసానన్నాడు శ్రీశ్రీ, రమణకు ఆకలేస్తే జోకులేశాడు. అందుకే ఆకలి అనే 'ఎటర్నల్ ట్రూత్'కు ఓ రూపాన్నిచ్చి, తెలుగు జాతీయమైన కడుపులో కాముడని పేరుపెట్టి, అతనితో డ్రామా నడిపిన ఈ సర్రియలిస్టిక్ కథకు కూడా చమత్కారాలు తొడిగాడు. ఆకలి మనిషి చేత వేయించే వేషాలన్నీ (సిగరెట్లు, పుస్తకాలు చదవడం, సినిమాలు చూడడం వంటి పై వేషాలకు మాత్రం లోటు చెయ్యం) సరదాపరదాల మాటున స్పష్టంగా చూపాడు.

కన్నీటిపాట (జూలై 1990) - ఆనందరావుకి పెళ్లయి, పిల్లలు పుట్టుకొచ్చిన గాథ. మొదటికథ వచ్చిన దాదాపు నాలుగు దశాబ్దాల తర్వాత ఆంధ్రజ్యోతి వీక్లీలో వచ్చింది. కానీ అదే ఫ్లో. అదే భావపరంపర. సినిమారచనను, పత్రికారచనను కలగలపకుండా ముళ్లపూడి జాగ్రత్తగా కాపాడుకున్నారనిపిస్తుంది. తరచిచూస్తే ఏ కారణానికైనా సరే ఏడ్చి మొత్తుకోవలసిన అవసరం లేదని చక్కని సందేశం ఇచ్చే కథ ఇది. అరసున్నాల గురించి అంత చర్చ ఎందుకనిపిస్తుంది - అప్పటి పాఠ్యపుస్తకాలలో చేస్తున్న మార్పు గురించి తెలియకపోతే! గిరీశంది శబ్దాశ్రయహాస్యం అన్నందుకు కూడా రమణ "గిరీశం లెక్చర్లు"లో విరుచుకుపడిన ఘట్టాలు గుర్తుచేసుకోండి, ఆయన కొన్నిటికి ఎంత తీవ్రంగా స్పందిస్తారో తెలుస్తుంది.

లోకరీతి పట్ల ఆయన ఆలోచనా ధోరణి, విమర్శనాత్మక శైలి తెలుసుకోవడానికి ఈ సంకలనంలోని కథలనుండి చాలా ఉదాహరణలు దొరుకుతాయి. సుశిక్షితుడైన జ్యోతిష్కుని శిష్యుడు సకాలంలో తుమ్మాడనడం (ఏకలవ్యుడు), 'చిట్టి శక్తి స్వరూపం అని అంటారనడం, చిట్టి బాలికా, బాలుడా అన్న విషయంపై పరిశోధకులు విభేదించారనడం (జలప్రళయం), పకీరును వదిలేసారనగానే కరణం ఇంటి దగ్గర జనాల ముచ్చట్లు (సాక్షి). 'మనుష్యుల బతుకులు సూత్రాల మీద నడవ్వు' అంటూ 'కృతజ్ఞత'లో చెప్పిన మాటలు, ఎదటి వాడిలో కృతజ్ఞత ఆశించవద్దంటూ చెప్పిన కఠోరసత్యాలు.

## లోకాభి రమణీయం

కృతజ్ఞత (మే 1954) – కరుణ, హాస్యం కలబోసిన చాప్లినిస్టిక్ కథ. దీక్షితులు పడ్డ అవస్థకు నవ్వాలో, చివరకు అన్నీ పోగొట్టుకుని అవస్థలపాలయినందుకు ఏడవాలో అర్థం కాదు. కథ చివరిలో వచ్చే వివాదానికి చిన్నప్పుడే ఒక విత్తనం వేశాడు కథకుడు. 'జీడిపెట్టాను కాబట్టి గోళీ తన్నినా దీక్షితులు కృతజ్ఞతాభారంతో ఊరుకోవాలి' అనుకుంటాడు సింగారం. పెద్దయ్యాకా అదే అంటాడు – 'పాలిచ్చిన ఎదు(రొమ్ము గుద్దావని'. చిలకమర్తి వారి "చారు తులసీదళ.."కి అర్థం చెప్పినట్టు "పరివారమున్ జీరదు" పై కువ్యాఖ్య పిచ్చివాడి ద్వారా చెప్పించాడు. దానికీ (కథలో దీక్షితులు కూడా సింగారం పరివారజనం లాటివాడే కదా) కథకూ లింకు ఉంది. కథలో కుక్క ఆగడాలు గొప్ప విజువల్ డ్రామా.

లోకయాత్ర – నాలుగు పాత్రలు నాలుగు రకాల ఆలోచనలు చేయడం, తాము చేసిన పనులు పిన్నలు కూడా చేస్తారేమోనని పెద్దలు భయపడడం (తన దాకా వస్తే గానీ తెలియదు అన్నట్లు) – అత్యంత సహజంగా చిత్రీకరించడం జరిగింది. అప్పట్లో రైల్లో మూడవతరగతి, ఆ పైన ఇంటర్, ఆ పై సెకండ్‌క్లాసు, దాని కంటె ఎక్కువగా ఫస్ట్‌క్లాస్ ఉండేవి.

జలప్రళయం (1961) – 2000 సంవత్సరం నాటికి ప్రళయం వచ్చేస్తుందని అందర్నీ కంగారు పెట్టేసిన డూమ్స్‌డే ప్రాఫెట్స్ గురించి రమణ ఎప్పుడో రాసేశారు అనిపిస్తుంది కదూ! చీమల మీద నడిచిన కథ కాబట్టి, చీమల జార్గన్ సృష్టించి రమణ హాస్యపరంగా చెప్పిన కథ కాబట్టి మనం నవ్వుకున్నా విశాలవిశ్వంలో చూడబోతే మన భూలోకవాసులమూ పిపీలకమాత్రులమే! చెంబు నీళ్లు ఒలికితే చీమలప్రపంచం అల్లకల్లోలమయినట్టు ఓ రెండు గేలక్సీలు గుద్దుకుంటే మనమూ అంతే! ఈ లోపునే మన హడావుడి, జోస్యాలు, భేషజాలు.

సెరిబ్రల్ సినేమియా (మే 1956) సినిమాపిచ్చి వాళ్ల గురించి సినేమియా అనే మాట కాయిన్ చేసి రాసిన ఈ కథ "విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు" (సినీరమణీయం సంపుటంలో వస్తుంది) కు పరిచయం లాటిది. దానిలో కనబడే వరహాలరాజు పెద్దగా చదువుకున్నవాడుకాదు. నటుడు కావాలనుకుంటాడు. కానీ దీనిలో ఆనందరావు మేధావి. సినేరియోలు రాస్తానంటాడు. అయినా సినీబగ్ అందరినీ ఒకేలా కుదుతుంది. సినిమా ఫీల్డులో కనబడే స్వార్థం, లింకులు ఈ కథలో కూడా కనబడుతుంది. మంచివాడైన ఆనందరావు కూడా తనను నమ్ముకున్న వరహాల్ని తన స్వప్రయోజనానికి ఉపయోగించుకోవడం, తనూ కుట్రకు బలికావడం, అన్నీ తెలిసి మళ్లీ సినీఫీల్డు ఆకర్షణలో చిక్కుకుపోవడం – ఇదీ వాస్తవిక చిత్రీకరణ. సినిమా జార్గన్ పుష్కలంగా కనబడుతుంది. ఇంటాయన కూడా "డిస్టెంట్ లాంగ్‌షాట్‌లో కాబోలు

వెళ్లాడ'ంటాడు. "ఛాయలు" కథలోలాగానే హీరో కలల్లోకి పారిపోతూ ఉంటాడు. అక్కడ కంటె ఇక్కడ బాగా అమిరింది. ఎందుకంటే ఆనందరావు రాసేది సినేరియోలేగా.

## సరదా రమణీయం

కథ చెప్పడానికి ఒక్కొక్కరిదీ ఒక్కో స్టయిల్. సూతుడికి నైమిశారణ్యంలా, డబ్ల్యు, డబ్ల్యు. జాకబ్ నైట్‌వాచ్‌మన్‌కి ఓడ డెక్‌లా, ఉడ్‌హవుస్‌కి మ్యులినర్ బార్‌లా రమణ కథకుడు సుబ్రహ్మణ్యం గారికి ఓ వేదిక – అరుగు ఉంది. చెప్పేందుకు స్టయిల్ ఉంది. ఈ సంకలనంలో ఇదే కాదు, ప్రయోజకుడు, కృతజ్ఞత కథలు కూడా ఆయనచేతే చెప్పిస్తాడు రమణ.

ఆ చెప్పేటప్పుడు కూడా పాత్రోచిత సంభాషణలకు తోడు ఎలా మాట్లాడతారో అలాగే అక్షరబద్ధం చేస్తాడు. ఇడ్లీ నవులుతూ "ఏవిడోళంల్డి" (ప్రాప్తి), అలాగే ఆవలింతల భాష "పాపం...ఎవళ్ళో..బదిగి చెళిళవాళయియుళ్లాదు.." 'కృతజ్ఞత'లో పంతులు. ఏకలవ్యుడులో గురునాథరావు, ఋణానందలహరిలో డాక్యుమెంటు భాష ధారాళంగా వాడబడింది – త్మ కుమార్డు, జ్మ కావలెను. జన్మ ఫిరాయించడం, కోరట్లు ఇలా.

సంస్కృతంలో పలువిశేషణాలు వాడే పద్ధతిని వెక్కిరిస్తూ "పెళ్లికూతురు అత్తయ్య కాఫీ తెస్తూ, సుబ్రహ్మణ్యం గారి సూక్తులు విన్నదై, ఓపిక తెచ్చుకున్నదై ఈ విధంగా అన్నదైనది" అని రాశాడు.

సరదాగా పన్ చేయడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య, నిర్ఘాంత'పోయాడు', మళ్లీ రాలేదు. (జలప్రళయం)

ప్రాప్తి (జూన్ 1953) – రెండోప్రపంచయుద్ధకాలం నాటి కంట్రోల్సు, రేషన్లు నాటి కథ. దొరకని వస్తువుకై జనం ఎంతలా మొహం వాస్తారో అటువంటి అవస్థలు పడిన వారికే అర్థమవుతుంది. కాస్తయినా తిండిచాపల్యం ఉన్నవారికి కథలో స్వారస్యం తెలుస్తుంది.

## కౌటిల్య రమణీయం

ప్రయోజకుడు (ఫిబ్రవరి 1954) – పల్లెటూరి లౌక్యాలను, వారి తీరుతెన్నులను తెలుసుకోవడానికి ఈ కథ ఒక్కటి చాలు. తెలుగుజాతీయాలపై రమణకున్న పట్టు సంకలనమంతా కనబడుతుంది. కొన్నిటిని ఎంతో చక్కగా మార్చి వాడుకున్నాడు. పూలు అమ్మినచోట కట్టెలమ్మడం అనే సామెతను రివర్స్ చేసినప్పుడు పువ్వులమ్మాడనడు, పువ్వులు విరజిమ్మేడంటాడు, (కృతజ్ఞత) మనకు కళ్లు నెత్తికెక్కాయి అన్నట్టు చీమలకు (కళ్లు ఉండవు కాబట్టి) మీసాలు నెత్తికెక్కాయి అంటాడు (జలప్రళయం). మనకు నూకలు చెల్లినట్టు గుర్రానికి గడ్డిపరకలు చెల్లాయి అంటాడు.

('ఋణానందలహరి') బతికుంటే ఎలాగైనా చావచ్చనుకున్నాయట చిమాభా (జలప్రళయం). కుక్క మాటవరసకి మొరిగింది (కృతజ్ఞత) గుర్నాథం గుండె గుభేలుమంది. అని ఓ సారి ఆగింది. (ఋణానందలహరి). ఆర్నెల్లు స్నేహం చేస్తే వారు వీరవుతారు అన్న సామెతను ఋణానందలహరి క్లైమాక్స్ ట్విస్టుకి చక్కగా ఉపయోగించుకున్నాడు. దాంట్లోనే ఓ చోట రాస్తాడు - నోటిమాటనే తప్ప నోటుమాట రాకుండా అప్పుపుచ్చుకుంటాడట. వర్డ్ ప్లే అంటే ఇదీ అనేట్టు!

సాక్షి (అక్టోబరు 1959) - "సాక్షి" కథకు ఇన్స్పిరేషన్ 'హైనూన్' (1952) చిత్రం అనుకోవడం కష్టం. ఆ సినిమా కథ ప్రకారం షెరీఫ్‌గా రిటైరవుతున్న గేరీకూపర్ పై పగ తీర్చుకోవడానికి అతని పెళ్లిరోజున ఒక గన్‌ఫైటర్ ఆ ఊరికి మిట్టమధ్యాహ్నం వస్తాడు. ఊరి ప్రజలంతా కలిసిరాకపోయినా గేరీ కూపర్ ఒంటరిగా అతడితో పోట్లాడతాడు.

రమణ కథలో మెయిన్ కారెక్టరు ఉత్తముడేమీ కాదు. కథ మొదట్లో మగతలో ఉన్న మునసబుగారికి చింతాలు కేసులో తలుపుల్ని ఉరిదీయబోతున్నట్టు కల వస్తుంది. సాధారణంగా కలలో జరిగే గందరగోళం అనుకుంటాం. ముగింపుకు వస్తే తప్ప దాని అంతరార్థం బోధపడదు. ఈ మిస్టరీ కథలో ట్విస్టు ఊహించలేం. బాపు, రమణలు నిర్మాతలు కాగానే తీసిన మొదటి సినిమా "సాక్షి" (1967)లో తలుపులు కారెక్టరు పాజిటివ్‌గా మారిపోయింది. అతడు ఇద్దరు పెళ్లాల మొగుడు కాదు. ఒకతే భార్య. "హైనూన్"లోలా పెళ్ళిరోజునే విలన్‌తో పోరాటం. ఎవరివద్దా అసిస్టెంటుగా పనిచేయకుండానే బాపు తొలిసారి దర్శకత్వం వహించిన ఈ సినిమా 1968 తాష్కెంట్ ఫిలిం ఫెస్టివల్‌కి ఎన్నికయింది.

కథ చెప్పిన తీరు అద్భుతం. వడివడిగా సాగుతూనే పల్లెటూరి పాలిటిక్స్‌ని పూర్తిగా చూపిస్తుంది. క్లైమాక్స్‌లో హాస్యం పెట్టడం గొప్ప సాహసం. ('మళ్లీ వస్తే సిగపాయి దీసి తంతానన్నాడు. మళ్లీ ఏమనుకున్నాడో వెనక్కి పిలిచి అంతపనీ చేసి పొమ్మన్నాడు') కానీ రమణ అదీ సాధించాడు.

## బాల రమణీయం

బాలపాత్రలను సృష్టించడమంటే రమణకు మహా ఇష్టం. 'కృతజ్ఞత'లో సింగారం, దీక్షితుల చిన్ననాటి ముచ్చట్లు, 'కానుక'లో కూడా పిల్లవాడిలోనే గోపన్న కృష్ణుడిని దర్శించడం, లోకయాత్రలో చిన్నకుర్రాడి ఆలోచనలు - చూడండి. 'ప్రాప్తి' కథలో నరసు పాత్రకు పెద్ద ప్రాధాన్యం లేదు. అయినా చిన్నపిల్లల మీద మక్కువ కొద్దీ, వారి భాషను కథలో తీసుకురావడానికే రమణ ఆ పాత్రను కథలోకి లాక్కొచ్చాడనుకోవాలి.

విమానం కథ (1959) - రమణ రాసిన వైజ్ఞానిక గాథ. ఆయన యేం చెప్పినా హృద్యంగా. మనసుకు హత్తుకునేట్లు చెప్తారన్నది మళ్లీ ఇంకోసారి

అనుకోవడానికి ఇది చదవాలి. గాలి కంటె బరువైనది ఎగరగలగడం అనే కాన్సెప్ట్ ఎస్టాబ్లిష్ చేయడానికి పిల్లల చేత 'సైంటిఫిక్‌గా ఆలోచించేట్లా సరదాగా రాశాడు. "న్యూటన్ నెత్తిమీద ఒక ఆపిల్ పడింది. సుబ్బరంగా తినేసి పోవచ్చుగా...కానీ.." సైంటిఫిక్ రీజనింగ్ అలవాటు చేయడానికి "ఇప్పుడు ఈ విమానాలూ, బాంబులూ అవన్నీ మనకి ఎప్పుడో (పురాణకాలంలో) తెలుసునని కొందరు గొప్ప చెబుతారులే." అని చెప్తాడు. చివరిలో నీతి కూడా చెప్తాడు – "నువ్వేదేనా పని చేసేటపుడు అది మంచిదని, నీకు చేతనవునని నువ్వు అనుకున్నప్పుడు మిగతావాళ్లు నవ్వినా వెక్కిరించినా అది పోలీసువాళ్లు కూడా చెయ్యలేరన్నా, నువ్వు మాత్రం ప్రయత్నం చెయ్యి. ఓ సారి సరిగారాకపోతే మళ్లీ చెయ్యి మళ్లీ చెయ్యి."

ఈ సైన్సు చెప్పిన తీరు చూడండి. "అమ్మ కిందకి వెళ్లిపోయింది కామోసు. ఇంక ఎలాగా వినబడదు ఏడ్చినా. అందుకని నాగరాజు ఏడుపు మానేశాడు." "బండరాముడి చేతిలో పకోడిల పొట్లం ఎదురింటి గెద్ద తన్నుకుపోవాలమ్మా, అలా చేస్తే 70 వేల 2 వందల 19 కొబ్బరికాయలు కొడతానమ్మా అని మొక్కుకున్నాడు నాగరాజు" ఇలా సరదాగా చెప్పినా మధ్యలో కొన్ని సైంటిఫిక్ విషయాలు చెప్పవలసివచ్చినప్పుడు "ఇవన్నీ కంఠతా పట్టాలి కాబోలని కంగారుపడకు. ఏం?" అని ధైర్యం చెబుతాడు. ఇలా చెబితే చదువుకూడా సరదా అయిపోతుంది. అందుకే బాపు రమణలు రూపొందించిన వీడియోపాఠాలు అంత పేరు తెచ్చుకున్నాయి.

తొలిసారిగా పుస్తకరూపంలో లభ్యమవుతున్న ఈ రచనను రమణ పి.దక్షిణామూర్తి అనే కలంపేరుతో రాశారు. ఆయన ఉపయోగించిన కలంపేర్లు చాలా ఉన్నాయి. – రవణ, రమణ, ఎస్.పార్థసారథి, సి.వి.విజయలక్ష్మి, సి.వి.వి.లక్ష్మి, ఏసుదాసు. ఒక్కో పేరుతో కనీసం రెండు, మూడు రచనలయినా చేశారు. కానీ విమానం కథకు ఉపయోగించిన పి.దక్షిణామూర్తి పేరును మాత్రం మళ్లీ ఎక్కడా ఉపయోగించలేదు.

ఈ సంపుటిపై తమ అభిప్రాయాలు తెలుపదలచేవారు రచయిత (అడ్రసు– No.4, Greenways Road Extn., Raja Annamalaipuram, Chennai-600 028, Ph: 044-4937109) లేదా సంపాదకుడు (అడ్రసు–502, Siri Enclave, 8-3-960, Srinagar Colony, Hyderabad - 500 073, Ph: 3743567 / 6632764) కు వ్రాయగోర్తాను.

- ఎమ్బీయస్ ప్రసాద్

# ఇదీ వరస....

# రస రమణీయం




ప్రొద్దు వాటారినప్పటి నుంచి మర్రిచెట్ల లోంచి ఊడలు ఊడలుగా దిగజారుతున్న చీకటి, చలమై చెరువై చెలరేగిన యమునై సముద్రమై భూమినంతా ముంచివేసింది. ఆకాశమెత్తున ముంచేసింది. రాధ కంటి కాటుకలా – కృష్ణుడి వంటి నలుపులా – నందుడి ఇంట చల్లలా చిక్కబడింది.

చెట్టుకింద చీకటి మధ్య చితుకులమంటలు కృష్ణుడి మీద ఎర్రపట్టు కండువాలా కదలాడుతున్నాయి. చీకటి చిక్కదనాన్ని, చక్కదనాన్ని వెలుగెత్తి చాటుతున్నాయి.

మంటలో ఊచ కాలుస్తున్న గోపన్న ముఖం మీద – అతని పక్కన చెల్లాచెదురుగా పడివున్న వేణువుల మీద, కొంచెం అవతలగా బొత్తి కట్టివున్న వెదుళ్ళమీద వెలుగునీడల భాషతో కావ్యాలు రాస్తున్నాయి.

ఇంక మూడు ఝాములు పోతే సప్తమి తెల్లవారుతుంది. కృష్ణుడి పుట్టినరోజు వచ్చేస్తుంది. పాతిక పండగలనాడు గోపన్న అరంభించిన వేణు నిర్మాణం ఇంకా తెమలలేదు. రేపటికైనా సాధించి, తన వేణువును అయనకు సమర్పించాలి. రేపివ్వలేకపోతే ఇంక ఈ జన్మకివ్వలేడు. వేళయిపోయింది.

'నాయనా, బువ్వదినవే' అన్నాడు చిన్నగోపన్న వచ్చి. గోపన్నకీమాట వినపడలేదు. అతని హృదయం బృందావనిలో ఉంది. అక్కడకు కృష్ణుడు వస్తాడు. వచ్చే వేళయింది. అప్పుడే గోపికల అందెల రవళి వినిపిస్తోంది. గాజుల గలగలలు, నవ్వుల కిలకిలలు వినిపిస్తున్నాయి. ఇవతల వెదురు పొదలు సన్నగా ఈల వేస్తున్నాయి. ఈ ఉపశ్రుతులన్నిటినీ కలుపుకొని కొద్ది క్షణాలలో మోహనమురళి రవళి వినవస్తుంది.

గోపన్న ఎన్ని యుగాలుగా అక్కడ చెట్లమాటున కూర్చున్నాడో అతనికే తెలియదు. ఆకులలో ఆకై, పువ్వుల్లో పువ్వయి, ఇసుకలో రేణువై, యమునలో బిందువై స్తబ్దంగా కూర్చుని కృష్ణ వంశీనాదాన్ని హృదయంలో పోసుకున్నాడు. పరిశుద్ధమైన స్వరాలలో ఒక్కొక్క స్వరాన్ని మనసులో నిలుపుకొని దాని విశ్వరూపం దర్శించడానికి తపస్సు చేశాడు. అదే మనసులో పదిలంగా దాచుకుని పరుగున తన కుటీరానికి వచ్చాడు. కొత్తవెదురు కోసి స్వరద్వారాలు వేసి, మనసులో స్వరాన్ని ఇందులో పలికించబోయాడు. ఆ స్వరం తన ఈ వేణువులో పలికితే ఇది కృష్ణయ్యకు కానుక ఇవ్వాలి. కాని అది పలకలేదు. పలికించాలని అతను ఎన్నివేల వేణువులో చేశాడు. తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలన్నీ వేణువును శ్రుతి చేయడానికే ఉపయోగించాడు. జీవితకాలమే తక్కువ. ఒక జీవితానికి లెక్కదేలే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కొన్ని కోట్లు ఉంటాయి. వాటిని వృథా చేస్తే ఎలా? యమున ఒడ్డున పొదలమాటున దాగి కూర్చుని కృష్ణుడి మురళి విన్నప్పుడు అతను వూపిరి బిగపట్టుకునే కాలం గడిపేవాడు. అక్కడ పొదుపు చేసిన దానిని తన కొత్తవేణువును పూరించడానికి ఉపయోగించేవాడు.

తీరా పూరించేసరికి అది శ్రుతిశుద్ధంగా వినబడేది కాదు. పైగా జీరబోయేది. లోపలేవన్నా ఈనెలు లేచాయేమోనని గోపన్న ఎంతో శ్రద్ధగా లోపల కూడా నునుపు చేసేవాడు. ఇక పట్టుకు వెళదాం అని లేచేసరికి దాని గొంతుక జీరపోయేది.

గోపన్న పూర్వం ఎన్నో వేణువులు చేశాడు. తృప్తిగా వాయించాడు. బాగానే ఉందనుకున్నాడు. కాని ఒక స్థాయి వచ్చాక అతనికొక ఊహ పోయింది. వేణువును కిందపెట్టి, సంగీతాన్ని ఊహించబోయాడు. ఊహించిన సంగీతాన్ని భావన చేసి, భావించిన దానిని అనుభవించి దర్శించేసరికి అతనికొక సత్యం తోచింది. సంగీతాన్ని అనుభూతికి తెచ్చుకోవడానికి జంత్రగాత్రాలను ఉపయోగించబోవడం అవివేకం. జలపాతాన్ని వెదురుగొట్టంలో ఇమడ్చడం పొరపాటు. సముద్రాన్ని పాల కడవలో ఇమడ్చడం తెలివితక్కువ... ఊహాకందే సంగీతంలో పాట కందేది శత సహస్రాంశం వుండదు.

ఊహ సాగిన కొద్దీ స్వరలత దిగంతాల వరకు వ్యాపించసాగింది. ఆకాశం వరకు వ్యాపించసాగింది. రోదసి అంతా నిండిపోసాగింది. క్రమంగా, ఓంకార జనితమైన స్వరార్ణవం తిరిగి ఓంకారమై భువన సమ్మోహనంగా భీకరంగా అద్భుతంగా ఎరుకపడసాగింది. శృత సంగీతంలా ఇందులో అపశ్రుతులు లేవు. అపశబ్దాలు లేవు. అన్ని వేదాంతాలు, అన్నిసత్యాలూ అర్ధసత్యాలేనంటూ, తనలో భాగాలేనంటూ నిలచే అద్వైత సత్యంలా ఈ సంగీతంలో అపస్వరాలు కూడా అర్ధస్వరాల, పూర్ణస్వరాల పక్కన నిలిచి, అందాలు సంతరించుకొని, అందంగా భాసించసాగాయి. ప్రతి అణువునా భగవంతుడున్నాడు, ప్రతి శబ్దంలోను సంగీతం ఉంది అన్న వాక్యాల తాత్పర్యం అతనికి ఎరుకపడింది. గోపన్న అర్భక దేహాని కిది దుర్భరమైపోయింది. అతను ఊహించిన సంగీతాన్ని అనుభవించడానికి శక్తి చాలలేదు... అవయవాలన్నీ విలవిలలాడేవి. హృదయం బద్దలయిపోయే స్థితికి వచ్చింది. అందం ఆనందం దగ్గరగా వస్తే ఇంత దుర్నిరీక్ష్యాలై దుర్భరాలై ఉంటాయని అతను ఊహించుకోలేదు. ఇప్పుడు గ్రహించి కూడా తప్పించుకోలేదు.

అతన్ని ఆ స్థితి నుంచి ఐహిక స్థితికి తెచ్చి కాపాడినది. – కృష్ణుడి మురళి... అది విన్న క్షణాన అతను ముగ్ధుడైపోయాడు. ఆ స్థితిలోనే మేలుకున్నాడు. తన ఊహకు అందినదానికన్న గొప్పదీ, ఆకళింపుచేసుకుని అనుభవించడానికి సులువైనదీ అతనికి ఆనాడే వినిపించింది. నాటి నుంచి ప్రతి నిత్యం కృష్ణుడు ఎక్కడికి వెళ్తే అక్కడికి వెళ్ళి మురళి వినేవాడు. కొత్తల్లో కొన్నాళ్ళు గోపకాంతలు కంగారు పడ్డారు. తరువాత అతన్ని ఒక గోవుగా, చెట్టుగా జమ కట్టేశారు.

ఇంత మోహనమైన సంగీతాన్ని కృష్ణుడు ఒక వెదురుముక్కలో ఎలా ఇమిడ్చాడో అని గోపన్న ఆలోచించాడు. ఒకసారి అతని ఇంటికివెళ్ళి ఆ మురళిని ఎత్తుకు వచ్చాడు. చెంగు చాటు నుంచి మురళి తీసి వాయించాలనుకునేసరికి అది కనబడలేదు.

మాయదారి కృష్ణుడు; గజదొంగదగ్గర నేను దొంగతనమేమిటి అనుకున్నాడు గోపన్న.

కాని గజదొంగ ఆ సాయంత్రం కనబడి, "గోపన్నా, నా మురళి తీసుకుపోయావు కదూ..పోనీ ఇంకొకటి చేసి పెట్టు" అన్నాడు నవ్వి.

గోపన్న తెల్లబోయాడు.

ఆ మర్నాటి నుంచి వేణునిర్మాణం ఆరంభించాడు గోపన్న. ఆరంభించిన నాటి నుంచి అతనిలో కొత్త శక్తి, కొత్త చైతన్యం మేల్కొన్నాయి. తన చేతులతో రూపుదిద్దుకుంటున్న మురళి రేపు మాపటివేళ కృష్ణుడి హస్తాలను అలంకరిస్తుందని, ఆయన అందులోకి జీవాన్ని ప్రతిపాదిస్తాడనీ అనుదినం ఆశపడుతూ ఆనందిస్తూ మురళిని రూపొందించాడు. ఆయన పెదిమలూనే చోట, వేళ్ళు ఆనేచోట మురళి కఠినంగా ఉండి నొప్పించకుండా ఉండేందుకు ఆయా ప్రాంతాలను తన చేతులతో అరగదీశాడు.

మురళి సిద్ధం కాగానే శ్రుతి చూశాడు. గుండె బద్దలయినంత పనయింది. అది శ్రుతిబద్ధంగా లేదు. పైగా జీర. రెండు మూడు వేణువులు పలికినట్టుంది. కృష్ణుడు ఊదుతాడన్న ఆనందంతో దానికీ ఒళ్ళు పులకరించిందా? గోపన్న అది పడేసి

మరోటి చేశాడు. అదీ అంతే. మర్నాడు వెదురు చాలా తెప్పించాడు. పది పన్నెండు చేశాడు. ఒక్కొక్కటీ ఊది చూడడం, నచ్చక పారవెయ్యడం...

'నీకు వేణువు ఇవ్వనిదే నా ముఖం చూపను కృష్ణయ్యా' అనుకున్నాడు. నాటి నుంచి ఇదేపని పెట్టుకున్నాడు. సాయంకాలం బృందావని వేపు వెళ్ళి వేణుగానం వినడం, ఉదయాస్తమానం కొత్త వేణువులు చెయ్యడం.

ఊళ్ళో వాళ్ళంతా ఇది వింతగా చెప్పుకున్నారు. కొత్తలో మెచ్చుకున్నారు. తరువాత ఆ సంగీతం పిచ్చి వదిలిందనుకుంటే, మళ్ళీ ఆ పిల్లంగోవి పిచ్చి పట్టిందిగావాల అని నవ్వుకున్నారు. తరువాత నవ్వారు.

గోపన్న పనికిరావని పడేసిన వందలాది వేణువులను కొత్తలో గొల్లపిల్లలు తీసుకుపోయేవారు. తరువాత అతనికి భయం వేసింది – వాటిలో ఏదన్నా కృష్ణయ్య దగ్గరకు పోతుందేమోనని. అందుకని చేసిన వేణువులన్నీ పాకలో అటక మీద పడేసేవాడు.

యమున ఒడ్డున గోపన్నపాక. పాక ప్రక్కన పందిరి కింద వెదుళ్ళు, చెట్టుకింద కొలిమి చూసి ఊళ్ళో జనం హేళనచేశారు. 'గోపన్నా! ఏకంగా పెద్ద కలప దుకాణం పెట్టరాదూ... వ్యాపారం చేసినట్టు ఉంటుందీ' అని...

గోపన్నకు నవ్వడానికి, నవ్వుకోడానికి కూడా తీరికా, కోరికా, ఓపికా లేవు.

☆ ☆ ☆

పాతికేళ్ళు గడిచిపోయాయి. కృష్ణయ్య పెద్దవాడయ్యాడు. బృందావనికి రావడంలేదు. పట్నవాసం మనిషైపోయాడు. రాజకీయాల్లో తిరుగుతున్నాడు. అయినా కృష్ణాష్టమి వెళ్ళిన ప్రతి నవమినాడు గోపన్న కొత్త ఉత్సాహంతో కొత్తవేణువు ఆరంభిస్తూ – 'పైసారి పుట్టిన రోజుకేనా పంపాలి...' అనుకునేవాడు.

పుట్టినరోజు వచ్చేది – వెళ్ళేది... వేణువు మాత్రం కుదిరేది కాదు. ఏమిటో ఆ జీర... ఎవరో వెక్కిరిస్తున్నట్టు... ఏదో శాపం వున్నట్టు...

☆ ☆ ☆

'నాయనా బువ్వదినవే...' అన్నాడు చిన్నగోపన్న.

తండ్రి వాడివంక చూశాడు. జాలి వేసింది. తల్లి లేని బిడ్డ. తండ్రి వుండీ లేని బిడ్డ. ఆ వయసుకే వాడే రోజూ ఇంతగంజికాచి పెడుతున్నాడు. వాడే అచ్చటా ముచ్చటా చూసుకుంటున్నాడు. అదీ మంచిదే అయింది. రేపు అష్టమి వెళ్ళిన నవమినాటి నుంచి, నాయన లేడని బెంగటెలుతాడన్న బెంగలేదు. ఎవరికి వారే యమునాతీరే...

'బువ్వదింటాలే గాని రేపు కిష్టయ్య పుట్టిన రోజు... నువ్వు నందయ్యాగారి లోగిలికెళ్ళి ఎవరూ చూడకుండా ఇది కిష్టయ్యకిచ్చి... మా నాయనిచ్చి రమ్మన్నాడని చెప్పి రావాల' అన్నాడు గోపన్న.

'బువ్వదిను మరి' అన్నాడు బిడ్డ.

గోపన్నకి ఎందుకో వాణ్ణి చూడగానే బాలకిష్టయ్య గుర్తుకొచ్చాడు. అటూ ఇటూ బెరుగ్గా చూసి గబుక్కున వాణ్ణి దగ్గరకు లాక్కుని గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు.

బుల్లాడికిది కొత్త. వాడు తెల్లబోయి చూసి బుగ్గ తుడుచుకున్నాడు. 'బువ్వదినుమరి' అన్నాడు.

'మురళి పట్టికెళ్తావా?'

'నువ్వలాగే అంటావు. పొద్దుటేలేమో ఇది బాగులేదు ఒద్దులే అంటావు'

'అనను. ఈసారి చేసేది బాగుంటదిలే. అయినా సూడనుగా' అన్నాడు గోపన్న నీరసంగా నవ్వి.

'బువ్వదిను మరి' అన్నాడు చిన్నగోపన్న.

☆ ☆ ☆

మర్నాడు ఉదయమే గోపన్న కొడుక్కి తలంటి నీళ్ళు పోశాడు. సాంబ్రాణి ధూపమేసి జుట్టు ఆరబెట్టాడు. చిక్కుదీశాడు. వదులుగా కొప్పు ముడేసి పూలు తురిమాడు. పట్టుకండువా తీసి పంచె కట్టాడు. మరోటి తీసి ధట్టీచుట్టాడు. కస్తూరి తిలకం దిద్దాడు. కాటుక దిద్ది, దిష్టి తగలకుండా బుగ్గన చుక్క పెట్టాడు. నెమిలీకల వీవనలోంచి ఒక కన్ను తీసి కొప్పునబెట్టాడు.

చినగోపన్నకీ వరస బొత్తిగా నచ్చలేదు. ఎన్నడూ లేని పనులు చేస్తున్నాడు అయ్య. వాడికెందుకో గుబులేసింది. కంటనీరు తిరిగింది. జాలిగా నాయన వంక చూశాడు. ముస్తాబు ముగించిన గోపన్న తృప్తిగా ఒకసారి కొడుకును చూశాడు.

క్షణంలో నిర్విణ్ణుడైపోయాడు. ఇదేమిటి బాలకృష్ణుడు... గోపాలకృష్ణుడు ఇక్కడికి ఎందుకొచ్చాడు? తాను ఏనాడో ఎత్తుకొచ్చిన వేణువు కోసమా?

గోపన్న తేరిపార చూశాడు. సందేహం లేదు – కృష్ణుడే. అప్రయత్నంగా చేతులు జోడించి దండం పెట్టాడు. ఒక్కసారిగా కన్నీరు కట్టలు తెంచుకుంది. అది దుఃఖమో, ఆనందమో.

'ఏందే అయ్యా' అంటూ బారున వచ్చి కౌగిలించుకున్నాడు కొడుకు. తండ్రి దండం పెట్టేసరికి వాడికి ప్రాణం కంగారు పెట్టేసింది.

గోపన్న ఉలికిపడి కళ్ళు తుడుచుకున్నాడు. 'దేవుడికి దండం పెట్టానురా' అన్నాడు. 'ఏదీ మురళేదీ' అంటూ అటూ ఇటూ చూశాడు. కనబడలేదు.

'అటక మీదెట్టాను. రాతిరి ఎలకలొస్తే...' అన్నాడు చినగోపన్న భయపడుతూ.

'అఁ ఎంత పన్జేశావురా బాబూ...' అన్నాడు గోపన్న. ఎలకలుండేదే అటక మీద అని తెలిసి అక్కడ పెట్టటమేమిటని కేకలెయ్యబోయాడు. కాని మనస్కరించలేదు. అటకమీదకెక్కి చూశాడు. అక్కడ తను పనికిరావని పడేసిన వేణువులు గుట్టలుగా ఉన్నాయి. అందులో ఏది కొత్తది? ఏది మంచిది?

గోపన్న ఆ వేణువులన్నీ కిందకు దించాడు.

ఒక్కొక్కటీ తీసి వూది చూడసాగాడు.

'ఇది కాదు'

'ఇదీ కాదు...'

ఇటువేపు గుట్ట తరుగుతోంది. అటువేపుది పెరుగుతోంది. కాలం తరుగుతోంది.



మధ్యాహ్నం భోజనం వేళ వచ్చింది. వెళ్ళింది. గోపన్న 'నేతి నేతి' అనుకొంటూ వేణుపరీక్ష సాగిస్తూనే ఉన్నాడు.

చిన్న గోపన్నకి తండ్రిని పలుకరించేందుకు సాహసం చాలలేదు. వాడూ అలాగే కూర్చున్నాడు. చెమటకి కస్తూరి బొట్టు కరిగిపోయింది. కాటుక చెరిగిపోయింది. పూలు వాడిపోయాయి. వాడి సంతోషం, ఉత్సాహం వెన్నుదరిగాయి. అన్నం తిననందువల్ల నీరసం కూడా కలిగింది. కాని, గోపన్న ఇవేమీ గమనించేస్థితిలో లేదు.

ఇది కాదు.

ఇదీ కాదు.

ఇన్ని వేణువుల గుట్టలో ఎక్కడో సత్యమైన కొత్త వేణువు దాగి ఉంది. అది సత్యమైనదేనా?

... ఏమో... గోపన్నకి తెలియదు. పరీక్షించి చూడలేదు. అయి ఉంటుందని, అయి తీరాలనీ...

☆ ☆ ☆

పొద్దు వాటారింది. చీకటి చిక్కబడింది. చిన్న గోపన్న దీపం వెలిగించాడు.

'నాయనా, చీకటి పడిపోతోందే. పుట్టింరోజు పండుగయిపోతుంది' అన్నాడు జంకుతూ. గోపన్న తల ఊపాడు. ఇక రెండే రెండు వేణువులు మిగిలాయి. ఒకటి చూశాడు. ఇదీ కాదు.

ఇంక ఒక్కటి మిగిలింది. ఇదేనా... ఏమో... తను ఉదయం నుండి వెతుకుతున్నది మంచిదికాక, కానందువల్ల ఈ గుట్టలో పడిపోయిందేమో, ఇప్పుడు మిగిలింది – ఒకప్పుడు పనికిరాదని తను పడవేసిందేమో... చివరి మురళిని పరీక్షించడానికి గోపన్నకి ధైర్యం చాలలేదు. సత్యం తెలుసుకొని చనిపోగల శక్తి లేదు. మళ్ళీ ఇంకో ప్రయత్నం చేసే ఓపిక లేదు. వ్యవధిలేదు.

'ఇదే' అన్నాడు ధీమాగా.

'ఊదవా?' అన్నాడు కుర్రాడు.

'ఒద్దు..లగెత్తు... కిష్టయ్య చేతికియ్యి. ఆయనే చూస్తాడు. ఆయనే చెబుతాడు' అన్నాడు గోపన్న.

కుర్రాడు ఇంక ఆగలేదు. మళ్ళీ తండ్రి మనసు మారేలోపల పారిపోవాలనుకున్నాడు. చీకట్లోకి పరుగెత్తాడు.

☆ ☆ ☆

పాతిక సంవత్సరాల గాలివాన వెలసింది. గోపన్న నీరసంగా మేను వాల్చాడు. పూర్వం ఊహా సంగీత ప్రపంచంలోకి తొంగి చూసినపుడు కూడా ఇలాటి నిస్త్రాణే కలిగేది. ఇవాళా అదే...

తాను పని ముగించాడా... భగవంతుడికి సరియైన శ్రుతి శుద్ధమైన వేణువును పంపాడా... ఇన్ని సంవత్సరాలు కృషి చేసి ఇన్ని వేల పరీక్షలు జరిపి, చివరికి పంపిన వేణువును పరీక్షించుకోలేదు. అది కిష్టయ్యకే వదిలేశాడు. శ్రుతి సరిలేకపోతే ఆయన సరిచేసుకుంటాడు.

అయినా శృతిశుద్ధంగా ఉందో లేదో నిర్ణయించే జ్ఞానం తనకు ఉందా... సరిచేసే శక్తి ఆయనకు లేదని తను అనుకొన్నాడా? గోపన్నకు నవ్వు వచ్చింది.

ఎంత పొరబాటు. పాతికేళ్ళ పొరబాటు... ఒక జీవితం పొరబాటు.

ఆయన అలుగుతాడా... అలగడు. నవ్వుకుంటాడు. వెర్రిగోపన్న అనుకొంటాడు. అనుకొని మురళిని తన పెదిమల దగ్గర ఉంచుకుంటాడు. శ్రుతులన్నీ దాచుకున్న బొజ్జలోంచి ఓంకారానికి మూలస్థానమైన నాభిలోంచి మంగళగళంలోంచి... మధు రాధరాలలోంచి... వెన్నా పాలూ ఆరగించిన మధురాధరాలలోంచి, రాధాధరాలను పవిత్రం చేసిన మధురాధరాలలోంచి జీవం వచ్చి తన వేణువులో ప్రవేశిస్తుంది...

తన పక్కనున్న వేణువులోంచి సన్నటి చక్కటి స్వరం నెమ్మదిగా ఇవతలికి రావడం, వచ్చి తన చెంప నిమరడం గమనించాడు గోపన్న.

ఇదేమిటి? తను పనికిరాదనుకొన్న మురళి...

ఇంకో క్షణానికి ఆ పక్క మురళి, ఉత్తరార్థానికి ఇటుపక్క మురళి మేలుకున్నాయి. మరికొద్ది క్షణాలలో ఆ కుటీరంలోని సహస్ర వేణువులూ భువనమోహనంగా గానం చేయసాగాయి. గోపన్నలేచి కూర్చున్నాడు. భ్రమరాన్ని చూస్తున్న కీటకంలా దశదిశలా పరిభ్రమించాడు. అన్ని వేణువులూ పాడుతున్నాయి. అన్నిటిలోనూ అలనాటి బృందావన కృష్ణుడి మోహనగానమే. అన్నీ శ్రుతిశుద్ధంగా ఉన్నాయి. అసత్యమైన వేణువు లేనే లేదు. భగవంతుడికి ఉపయోగపడని వేణువే లేదు...

గోపన్న విభ్రాంతుడై పోయాడు. నీరసంగా ఆనందంగా మేను వాల్చాడు. సహస్ర వేణునాద స్వరార్ణవంలో – సాక్షాన్మహావిష్ణువై తేలుతున్నాడు.

వేణుగానం ముగిసిన కొద్ది క్షణాలకు అంతకన్న మధురమైన అడుగుల సవ్వడి వినబడింది. చిన్నగోపన్న వచ్చి ఉండాలి. తను పంపిన మురళి మంచిదో కాదో చెప్తాడు. ఈ సత్యం ఇక తెలిసినా మానినా ఒకటే. అంతకన్న గొప్పసత్యాన్ని దర్శించాడు తాను.

గోపన్న నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. గుమ్మంలో బాలకృష్ణుడు! పట్టుపంచ, పట్టుధట్టీ, కస్తూరిబొట్టు, బుగ్గన చుక్క, సిగలో పింఛం....

'నువ్వే వచ్చావా కిష్టయ్యా...' అంటూ లేచి కూర్చుని చేతులు జోడించాడు గోపన్న.

'అయ్యా అయ్యా! కిష్టయ్య నీ మురళి వాయించాడే. నాకు బువ్వపెట్టాడు. ఇక్కడ ముద్దెట్టుకున్నాడు. అయ్యా మరేం... కిష్టయ్య నీ మురళి వాయించేవాడే. కానీ... మరే...ఎంత వాయించినా ఏమీ వినబడలే. అస్సలు పాట రాలేదే... కాని కిష్టయ్య మంచోడు. నన్నిక్కడ ముద్దెట్టు...'

గోపన్న తల పక్కకుతిప్పి గదినిండా పడివున్న వేణువులను చూశాడు. ఇంతసేపూ గానం చేసి అలసిపోయిన వేణువుల వంక ఆప్యాయంగా సగర్వంగా చూసి ఒకటి తీసి ముద్దు పెట్టుకున్నాడు గోపన్న.



# సరస రమణీయం

## రాధాగోపాలం

బాపు

కల పూర్తిగా చూసి కళ్ళు తెరిచాడు గోపాలం.

అలసిపోయిన అప్సరసవలె రాధ పక్క బెర్తు మీద నిద్రపోతోంది.

దాదాపు ఇరవైఏళ్ల క్రితం ఒక రోజు పొద్దున్నే బ్రహ్మదేవుడు ఒక ముక్కు తయారుచేశాడు. చాలా చక్కగా వచ్చిందా ముక్కు. సన్నగా, పొడుగ్గా, నాజూకుగా తయారయింది. చివర సూదిగా కొన తేలింది. ఆ కొన పైకి చూడ్డం మొదలెట్టింది.

ఎంత బావుందీ ముక్కు? అనుకున్నాడు బ్రహ్మదేవుడు.

చాలా బావుందని మీ తాత్పర్యం– అంటూ మొహం ముడుచుకుని టీక చెప్పింది పక్కనే కూర్చుని వీణ వాయించుకుంటున్న సరస్వతీదేవి.

ఆ ముక్కుకోసం ఒక చక్కని అమ్మాయిని సృష్టించదలచాడు బ్రహ్మదేవుడు. దేవుడు కొత్తల్లో మొగాళ్ళకి నీలకాంతి, ఆడవాళ్ళకి పసిమి మిసిమి ఏర్పరచాడు. ఆ దరిమేనా చామంతి చాయకో చాయ తక్కువ చేసి చామనచాయ అనేది కనిపెట్టాడు. దాన్ని ప్రచారంలోకి తీసుకురావడానికి అందమైన బొమ్మ రాధమ్మని ఆ చాయన తీర్చాడు.

దీపకళిక వంటి సింధూరతిలకం ఉంచడానికి అనువుగా ఆమె కోలముఖంలో బహుళపక్షపు నవమిచంద్రుడివంటి నుదురు తీర్చి దిద్దాడు. దుఃఖం అనేది ఉందా? అలాగా! నాకు తెలీదే ఎక్కడుంది?– అన్నధోరణిలో సూటిగా ప్రశ్నించే నిమిత్తం, సన్నగా ముడుచుకుని కాటుక రేఖవలె కనిపించే చక్కని కళ్ళు రెండు అమర్చాడు.

చిన్నవంపుతో సన్నగా ఉండే అరుణాధరం హాసించినపుడు అటూ ఇటూ నున్నని మెత్తని చెంపలమీద రెండు చిన్న సొట్టలు లీలగా గోచరించే ఏర్పాటుచేశాడు.

ఇంతవరకూ బావుంది.

జీవితంలో ఒకానొక చిన్నదాని చక్కదనం యావత్తు ఒకే ఒక ముక్కలో చెప్పగలిగేంత అందంగానూ సన్నగా పొడుగ్గా నాజూగ్గా ఉండి, నీలెక్క నాకేమిటిలే అన్నంత నిర్లక్ష్యంగా ధీమాగా లోకాన్ని చూడగలిగేటంత పొగరుగానూ తను చెక్కిన ముక్కుని, ఈ రాధమ్మ వదనాన అమర్చాడు.

ఇది కూడా గొప్ప విషయమే.

పోతే, ఆమె ముఖద్యుతులు మరీ ప్రస్ఫుటంగా– ఆ మాటకొస్తే ద్విగుణీకృతంగా భాసించడం కోసం అమవసనిసి కన్న, దీపపు మసికన్న నల్లగా ఉండే వేణీభరాన్ని ప్రసాదించాడు.

☆ ☆ ☆

దేవుడి కెలాగేనా మంచి ఈస్తటిక్ సెన్సు వుంది అనుకున్నాడు. గోపాలం నిద్రాముద్రితయైన రాధమ్మని శ్రద్ధగా చూస్తూ.

ఆమె కంఠాన్ని ఆలింగనం చేసుకున్న నల్లని కుత్తి కంటె వల్ల ఆమె మెడ సౌకుమార్యం ఇనుమడించింది.

ఆమె ధరించిన నల్లని ఆర్గండి రవిక ఆమె చర్మప్రభని మెఱుగుపరచబోయి మెఱుగుపెడుతూన్నదని గోపాలం గమనించాడు.

ఆనందించాడు.

హఠాత్తుగా అతని మనస్సు చివుక్కుమంది. ఈ రాధమ్మకి ఇంత సౌందర్యం ఇచ్చినదేవుడు, అవివేకం అంటకట్టాడనిపించింది.

శ్రుతిపేయమైన మధుర మంజుల వీణారసం మధ్య గాడిద ఓంద్ర పెట్టినట్టనిపించింది.

హృద్యంగా అమరిన ఈ మహత్తర సౌందర్య వర్ణార్ణవాన, ఆమె కట్టుకున్న ఎర్రరంగు చీర మహా వికృతంగానూ అసహజంగానూ కనిపించింది, వెక్కిరించినట్టనిపించింది.

ఛా! నల్ల రవికకు ఎర్రచీర ఏడిసినట్టుంది. భయంకరంగా వుంది అనుకున్నాడు గోపాలం.

అతనికి రాధమ్మమీద కోపం వచ్చింది.

ఇంత వికారాన్ని ఇందాకటినించీ తను గమనించనందుకు తన్ను తాను నిందించుకుని పశ్చాత్తప్తుడయ్యాడు.

ఉత్తర క్షణాన రాధను లేపాడు.

బద్దకంగా ఒళ్ళు విరుకొని కొద్దిగా కళ్ళు తెరిచింది రాధ. ఏం? అంది– మత్తుగా మెత్తగా నవ్వుతూ.

లేచి కూచో– అన్నాడు గోపాలం.

గంభీరంగా ప్రశ్నార్థకంగా చూసి లేచి కూర్చుంది రాధ.

ఈ నల్ల రవికమీద ఎర్రచీర బావులేదు. వెంటనే నువ్వు తెల్లచీర కట్టుకో రాధా.

రాధకి అర్థం కాలేదు.

నిజంగా రాధా! పైగా ఆ ఎర్రచీర బాధ కల్గిస్తోంది. నీ వంటి ఛాయకి నల్లరవికమీద తెల్లచీర బాగుంటుంది. చాలా బాగుంటావు. దేవతలా ఉంటావు అన్నాడు గోపాలం.

భర్తలో ప్రకోపిస్తున్న కవిత్వధోరణి గమనించి మందహాసం చేసింది రాధ. తలా, ముక్కూ తాటిస్తూ, బాగుంది పనిమల్లే నిద్రలేపి ఇదా చెప్పొచ్చారు. మంచినిద్ర పాడుచేశారు– అంది.

గోపాలం ప్రాధేయపడ్డాడు. బంగారు తల్లివి అంటాను కాని, నా మాట విను. ఇది బాగులేదు. తెల్ల చీర కట్టుకో.

అనండే.

బంగారు తల్లి బాచాల కొండ అన్నాడు గోపాలం. కళ్ళు చిట్లించింది రాధ. బాగుందండీ పేచీ. ఇప్పుడు ఈ అర్ధ రాత్రి నా అందానికి తక్కువొచ్చిందేవిటి! రైలుదిగాక రేపు కట్టుకుంటానులెండి అంది.



కాదు ఇప్పుడే కట్టుకోవాలి అన్నాడు గోపాలం చిరాకుగా.

రాధ తత్ క్షణం పరాకు అభినయించి, కిటికీలోంచి, బయట పరుగెడుతున్న ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించడానికి ఉపక్రమించింది.

కాదు. ఇప్పుడే తెల్లచీర కట్టుకోవాలి అన్నాడు గోపాలం మళ్ళా.

రాధమ్మకి పట్టుదల ఎక్కువైంది. కొంచెం ఆశ్చర్యం కూడా కలిగింది ఆ అబ్బాయి పద్ధతి చూసి.

ఇతగాడు తనని పెళ్ళిచేసుకుని మూడు మాసాలు అయింది. ఇంత డబాయింపు చెలాయించడం రాధకి ఏమంతనచ్చలేదు. ఎంత మొగుడయితే మాత్రం మరీ ఇంత ఇదైతే ఎలా! తనేం చీర కట్టుకోవాలో తనకి తెలీదా?

ఇవాళ చీరగురించి డబాయిస్తున్నాడు. రేపు–ఏయ్ అమ్మాయ్ నీ ముక్కు మరీ అంత పొగరుగా, అంత సూదిగా ఉండి అలా పైకి చూడటం నాకేం నచ్చలేదు. ఆ ముక్కుని కాస్తవంచి, సంపెంగ పువ్వులా చేసుకో– అనొచ్చు.

ఇప్పటినుంచీ జాగ్రత్తపడి అదుపులో వుంచాలనుకుంది రాధమ్మ. అందుకని గోపాలం వేపు ఒక్క క్షణం జాలిగా చూసి నిర్లక్ష్యంగా నవ్వి, పడుకుని కళ్ళు మూసుకుంది.

గోపాలానికి ఒళ్ళు మండిపోయింది. హా! నా అర్ధాంగి, కళత్రం, 'భావిజీవిత' భాగస్వామిని అయిన ఈ పిల్లకి నా పట్ల యింత నిర్లక్ష్యమా అనుకున్నాడు. కుడికాలుతో ఆ యొక్క సెకండుక్లాసు రైలుపెట్టె కఱ్ఱ నేలమీద గట్టిగా కొట్టాడు. నాసాపుటాలు ఎగరేశాడు. కళ్ళు పెద్దవిచేశాడు. చెవులు రిక్కించాడు. పెదిమలు బిగించి గట్టిగా నిశ్వాసించాడు, పైగా 'హాఁ' అన్నాడు.

రాధ మళ్ళీ ఒక్కసారి కళ్ళు తెరిచి ప్రేమా, లాలింపు, ప్రణయ కోపం, ప్రాధేయపూర్వకమైన వినతి, మొదలుగాగల, అమలులోవున్న వివిధ రకాల సరంజామా యావత్తు సరియైన పాళ్ళలో మేళవించి ఒకే చూపు చూసి, తిరిగి కళ్ళు మూసుకుంది– పడుకోండి బాబూ, పొద్దున్న మార్చుకుంటాలెండి– అంటూ.

చామనచాయకు ఇంకోచాయ తక్కువఉండే గోపాలం తాలూకు ముఖం దాదాపు ఎఱ్ఱబడి, అతనికి ఉక్రోషం వేసినట్లు వెల్లడించింది.

ఆఖరిమాటు హెచ్చరించాడు.

ముత్యం మూడోసారి అడుగుతున్నా. నువ్వు వెంటనే లేచి ఎఱ్ఱచీర మార్చి, తెల్లచీర కట్టుకుంటావా లేదా?– అన్నాడు.

రాధమ్మ పట్టుదల పదిబాఉలు సాగింది. నిరసన సూచకంగా వెంటనే ఒత్తిగిలి మూడంకె వేసి చెంగు పైకి లాగి కప్పుకుంది.

రైలు ఏదో చిన్న స్టేషనులో ఆగింది.

ఓడిపోయిన గోపాలం తుదిసారి ప్రయత్నించాడు. రాధా! ఆఖరుసారి అడుగుతున్నా, చెప్పు. లేకపోతే నేను రైలు దిగిపోతాను అన్నాడు– ఏడుపు గొంతుని కోపంగా వినిపిస్తూ.

రాధ గాఢనిద్ర అభినయించింది.

అయితే దిగిపోనా? అన్నాడు గోపాలం.

రాధ పెదిమలు బిగించి చిరునవ్వు అదిమిపట్టింది.

సిగరెట్టు పెట్టే, లైటరూ చేతిలో తీసుకున్నాడు గోపాలం. తెల్లచీర కట్టుకోమని ఆఖరుసారి ప్రార్థన, లేకపోతే రైలు దిగిపోతానని బెదిరింపు, ఈ చెప్పే మాటలు నిజం అని హామీ– అన్నాడు జనాంతికంగా.

రైలు కదిలింది, రాధ మెదలలేదు.

గోపాలానికి వీరభద్రుడు పూనాడు. నాసాపుటాలు అదిరాయి. పెదిమలు వణికాయి. హాఁ అన్నాడు.

ఒక్క క్షణం తేరిచూసి, తలుపుతీసి, తటాలున ప్లాటుఫారంమీదికి దూకేశాడు. నాలుగు పెట్టెలు పోనిచ్చి ఒక మూడవతరగతి పెట్టెలోకి ఎక్కి మహాకోపంతో కూలబడ్డాడు. కొంచెం సేపటివరకూ ధింకర్సు లైబ్రరీవారి ట్రేడ్‌మార్కు ఆసామీ పోజులో నుదుట పిడికిలి ఆనించి కూర్చున్నాడు. దరిమిలాను చెయ్యి నొప్పిపెట్టి, సక్రమంగా కూర్చుని, కిటికీలోంచి బయటికి చూసి, తెల్లటి చల్లగాలి పీల్చేసరికి ఆవేశించిన వీరభద్రుడు దిగిపోయాడు.

☆ ☆ ☆

నల్ల రవికమీద ఎఱ్ఱచీర బాగుండదని మొగుడు అభిప్రాయపడినప్పుడు అతనాడి మాటను గౌరవించి పాటించాలన్న సద్బుద్ధిని ఆ చిన్న దానికిగాని– లేదా దాని చీర గొడవ నా కెందుకులే, అయినా రేపు చూడవచ్చులే, అనే వివేకమూ ఓర్పూ ఆ చిన్నవాడికిగాని నువ్వు ఎందుకు ఇవ్వలేదూ అని నేను నిన్ను అడుగుతున్నాను సరస్వతీ! నువ్వు చేసిన పని తప్పు అని బ్రహ్మదేవుడు సరస్వతిని చీవాట్లు పెట్టాడు.

తప్పు నాదో, మీదో, రైల్లో ఏడుస్తున్న ఆ చిన్న వాడివంక చూడండి తెలుస్తుంది– అంది సరస్వతి వీణపాట ఆపకుండానే.

బ్రహ్మదేవుడు కిందకి చూశాడు.

నా యీ చేతా– విధాత రాతా అనే పాట పాడుతున్నాడు– పరుగెడుతున్న పూరీ పాసెంజరు బండీ మూడవ తరగతి పెట్టెలో కూర్చున్న గోపాలం.

నేనెంత తొందరపడ్డాను! అనవసరంగా, నా ప్రాణప్రియుని సెకండ్ క్లాస్ పెట్టెలో ఒంటరిగా వదిలిపెట్టి ఇలా వచ్చేశానే? హా! ఇదంతా బ్రహ్మరాత! అనే భావాన్ని వ్యక్తపరుస్తున్నది గోపాలం పాడుతున్న పాట. అతని హృదయం పశ్చాత్తాపం చెందింది. వదనం పరిదీనమయింది. పాట పూర్తి అయేసరికి అతని బాధ ద్విగుణీకృతమైంది. పైగా భయం ఆవరించింది. తను నిజంగానే రైలు దిగిపోయాడని తెలుసుకోగానే రాధ హడలెత్తి పోతుంది, పాపం- అనుకున్నాడు.

గుండె గతుక్కుమంటుంది కాబోలు.

రాధమ్మ భయపడ్డప్పుడు ఆమె ముఖం ఎలా వుంటుందో గోపాలం ఇంకా చూడలేదు... కొత్త అందం వస్తుందేమో... ఇక్కడ గోపాలానికి సందేహం వచ్చింది. చదువుకున్న పిల్ల, రాధ అసలు భయపడుతుందా- అని. భయపడకేంచేస్తుంది- భయం వస్తే?

అసహ్యించు కుంటుందేమో!

ఛా. తనంటే రాధకి ఎంతో ఇష్టం, గౌరవం, ఆదరణ, భక్తి, ఆపేక్ష, తన తెలివితేటలనీ, బహుశా అందాన్నీ ఆరాధిస్తుంది.

నవ్వుకున్నాడు- బాధపడుతూ.

తను అందంగా ఉండడనీ, నల్లగా ఉంటాడనీ చిన్నప్పుడు స్నేహితులు వెక్కిరించేవారు. అమ్మ వేళాకోళం చేసేది. చుట్టాలందరూ, నల్ల మనుషులమాట వచ్చినపుడల్లా తనపేరు ఎత్తేవారు. వాళ్ళందరికీ ఇంత లోకువ అయిన తనమీద -రాధకి ఎందుకు అంత ఇష్టం? పెళ్లాం కాబట్టా? ఆమాటకొస్తే ఇష్టంలేందే అసలు పెళ్లెలా ఆడింది?

అప్రయత్నంగా అతని చెయ్యి జేబులోంచి ఒక నలిగిన ఉత్తరం తీసింది. నిజంగా రాధకి తనమీద గౌరవం, ప్రేమా, ఉన్నాయనడానికి ఇదే నిదర్శనం.

రాధ తన స్నేహితురాలికి రాసుకున్న ఈ ఉత్తరం మూడురోజుల క్రితం ఆమె పెట్టెలో దొరికింది. చదివి ఆశ్చర్యంతో గుండెలు బాదుకుని, ఆ ఉత్తరం తీసి దాచేసుకున్నాడు....

ఉత్తరం మడత విప్పి మళ్ళీ చదువుకోవటం ప్రారంభించాడు....

మాలతీ! మావారు చాలా మంచివారు. నిన్ను గురించి బోలెడు చెప్పాను నిన్న. నీకు ఎట్టు మొగుడిమీద ఆపేక్ష ఉందని చెప్తే పకపక నవ్వారు. వాడిని కొరుక్కుతింటుందా ఏం? అన్నారు. అలా అని ఆయనకి ఎర్రవాళ్ళ మీద అసూయ అనుకునేవు. ఆయన నల్లగా ఉంటారు కాబట్టే నా కిష్టం. ఆయనకీ అందుకే ఇష్టం. నల్లగా సన్నగా ఉంటారు. ఆయన దగ్గర నుంచుంటే, అయిదడుగుల రెండంగుళాల పొడుగున్న నేను ఆయన చెవులదాకా వస్తాను. పెద్ద నుదురు. బట్టతల అనుకునేవు! కనుబొమ్మలు ఈ చివరి నుంచి ఆ చివరిదాకా ఉంటాయి. కళ్ళు సన్నటి నల్లటి గీతలా ఉంటాయి. బలంగా ఆరోగ్యంగా ఉండే ముక్కు, ఎక్కుపెట్టిన విల్లులా అందంగా వంపు తిరిగిన పై పెదిమా, చూస్తే మనిషికి మొండితనం ఎక్కువ అనిపిస్తుంది. మావారు కాబట్టే పట్టుదల అనాలి కాబోలు. మాలతీ, నా మొగుణ్ణే

నేను నీ దగ్గర పొగడటం వల్ల నాకు ఒరిగేదేం లేదు. అన్నట్టు మర్చిపోయాను, ఆయనగారు నించున్నప్పుడు చిత్రంగా అజంతా బొమ్మలా నించుంటారు. ఒసేయ్ మాలతీ, మా ఆయన అందరిలాగా ఉండరు. మొగాడిలా ఉంటారు. ఇంకా......

అరోమాటు ఆ ఉత్తరం చదువుకున్న గోపాలానికీ, ఆనందం పెల్లుబుకి స్వచ్ఛమైన నవ్వొచ్చింది.

రాధకి తనంటే ఇష్టం. తను రాధని ఇపుడు ఒంటరిగా రైలుపెట్టెలో వదిలేసి వచ్చాడు. రాధ భయపడొచ్చు. తరువాత అసహ్యపడవచ్చు.

బటాణీలండి బటాణీలు కాలక్షేపం బటాణీలు అంటూ ఓ పెద్ద గిరజాల మనిషి పెట్టెలో కొచ్చాడు. ఎవరూ కొనలేదు. వాడు తిరిగి బయట కెళ్ళి రైలు మెట్లంబటా, మెట్లు లేనప్పుడు, పెట్టెలకింద కడ్డీలమీద నడుస్తూ ముందు పెట్టెలకు వెళ్ళిపోతున్నాడు– బఠాణీ బుట్టా గిరజాలతో సహా. హఠాత్తుగా గోపాలానికి భయంకరమైన ఆలోచన వచ్చింది. ఈ బఠాణీలవాడు ఇలా ప్రతి పెట్టీ చూచుకుంటూ రాధ ఉన్న పెట్లోకి వెడితే!

అమ్మో! అనుకున్నాడు.

ఇంకేమన్నా ఉందా! ఒంటరిగా ఉన్న రాధ వీణ్ణి చూసి హడలిపోతుంది.

ఒంటరిగా ఉండి నగలతోటీ హడలుతోటీ ఉన్న అందమైన రాధనిచూసి ఈ బఠాణీల తాలూకు గిరజాలవెధవ అను గిరజాలతాలూకు బఠాణీలవెధవ లేక వెధవాయిల తాలూకు గిరజాలబఠాణీగాడు త్రికరణశుద్ధిగా పాడుపనికి పూనుకోవచ్చు.

గుండె ఆగిపోయింది గోపాలానికి.

ఇదివరలో ఇలాంటి సంఘటనల గురించి పేపర్లలో ఎన్నో చదివాడు, మొదటి తరగతి పెట్టెలో ఒంటరిగా ఉన్న స్త్రీ నగల అపహరణ– కత్తితో బెదిరించి నగలులాక్కున్న వైనం మొదలైన హెడ్డింగులతో ఎన్నో వార్తలు చదివాడు. అపుడయితే నవ్వుకున్నాడు. కానీ ఇపుడు తన రాధకీ........,

గోపాలం లేచి నుంచున్నాడు గొలుసు లాగుదామని. కానీ ఇంతకీ ఈ బఠాణీల భగవాన్లు ఆ పెట్లో కెళ్ళకపోతే.... చేతి చమురు యాభై రూపాయలూ పైగా రాధముందు తను వెంగళాయ అవడం సంభవిస్తాయి.

సరేలే – అంతగావస్తే తనే లాగుతుంది గొలుసు అనుకున్నాడు.

కాని, మనస్సులో ఆరాటం తగ్గలేదు. కిటికీలోంచి నిశ్చలంగా బయటికి చూడసాగాడు. బైట వెన్నెల విపరీతంగా కాస్తోంది. అంతా వృధా అయిపోతోంది. చల్లని గాలి పుష్కలంగా వీస్తోంది. అంతా వృధా! రైలింజను నీటి తుంపర్లు చల్లగా బుగ్గమీద తాకాయి. అంతా వృధా.

తనిక్కడ; రాధ అక్కడ.

ఒక చక్కని దృశ్యం యాదృచ్ఛికంగా కొద్దిక్షణాలసేపు కనబడింది. రైలు కట్టదగ్గరగా ఒక నాయుడు బావా, అతని తాలూకు నారాయణమ్మా నుంచుని విలాసంగా రైలుని చూస్తున్నారు. వెన్నెలంతా వాళ్ల మీదే పడుతోంది. వాళ్ళ వెనకాల ఆకుపచ్చని వరిచేలు, గాలి కెరటాలకు రూపానువాదంలా మెత్తగా నిశ్శబ్దంగా

వూగుతున్నాయి. గాలి వాళ్ళని దూసుకు పోతోంది. నారాయణమ్మ నాయుడు బావని ఆనుకుని అతని మెడచుట్టూ చేతులు వేసి, తల బుజం మీద ఆన్చి మహోవిలా సంగా కులుకుతూ నిర్లక్ష్యంగా రైలువంక చూస్తోంది. నాయుడు బావ నారాయణమ్మ నడుంచుట్టూ చెయ్యివేసి పొదివిపట్టుకొని గంభీరంగా నుంచున్నాడు.



పొలాల్లో చుట్టుపక్క లెవరూలేరు. రైల్లో పోయేవాళ్లు దిగి వాళ్ళనేం చెయ్య లేరు. బహుశా అంచేతే వాళ్ళిద్దరూ అంత అందంగా ఆనందంగా నించున్నారు అనుకున్నాడు గోపాలం.

ఈ పొలాల్లో రాత్రిపూట పురుగూ పుట్రా, దొంగా దొరా వస్తే నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు. నిన్ను కాపాడేది నేను అను అభయం ఇస్తున్నట్టుగా నించున్నాడు నాయడుబావ.

గోపాలం సిగ్గుపడిపోయాడు; తను రాధని దొంగల పాలుచేసి ఇలా తొందరపడి వచ్చేసినందుకు.

నాయుడుబావ రీవి నారాయణమ్మ హోయలు అతనిలో పురకలెత్తించాయి. సరిగ్గా మూడురోజులక్రితం, తనూ రాధా ఇలాటి సమయంలోనే ఒకళ్ళనొకళ్ళు అను కుని మైమరచి కూర్చున్నారు వాళ్ళ ఇంటి తోటలోనే.... దిగుడు బావికి ఇవతలగా వేపచెట్టుకింద తడిసిన పచ్చ గడ్డిమీద కూర్చున్నారు. కొత్తమూలాన రాధ బోలెడు సిగ్గుపడిపోయింది. తల వంచుకుని, ఎడంకాలి వేళ్ళతో గడ్డి పరకలని తుంపుతోంది. ఆవేళ శుక్ర వారం. తలంటి పోసుకుంది. ముఖాన పసుపు ఛాయలు ఇంకాపోలేదు.



అగి అగి వీస్తున్న గాలికి నుదుటిమీదా, చెంపలమీదా కంగారుగా ఊగుతున్న మెత్తని పట్టుకుచ్చువంటి శిరోజాల వెనుక, రాధ పచ్చని ముఖాన దిద్దుకున్న కుంకుమబొట్టు మబ్బుల వెనకనించి ఉదయించే పూర్ణచంద్రుడివలె గోపాలానికి గోచరించింది.

...ఎగిరెగిరి పడుతున్న సముద్ర ఉపరితలాన ముహూర్మహాశ్చాలితమయే పచ్చని మెత్తని చంద్రకాంతి జ్ఞాపకం వచ్చింది... తొలిసారిగా గోపాలంలో కవిత్వం తలెత్తిన సందర్భం అదే.

రాధ తలవంచుకుని తడిసిన గడ్డిపరకలని త్రుంచడంలో నిమగ్నురాలై పోయింది.

వెన్నెల బాగా వచ్చింది. గడ్డిపరకల చివర నిలిచిన నీటిబొట్లు మంచి ముత్యాలవలె మెరిశాయి. ఆ కాంతిలో రాధ ముఖం కలకలా వెలిగిందని తను రెండోసారి అనుకున్నాడు.... ఈ పిల్ల శాపంవల్ల ఈ భూలోకానికివచ్చిన దేవత కాదుకదా! తనకి దూరమైపోతేనో! అమ్మో!.... భయంవేసింది. రాధచుట్టూ చెయ్యివేసి దగ్గిరకు తీసుకున్నాడు. తల భుజాన ఆనించి ఆకాశంవంక చూస్తున్న రాధ చిన్న పిల్లలా కనిపించింది.

ఉండుండి పాట మొదలెట్టాడు తను. కూనిరాగంతో రాధకూడా పాట మొదలెట్టింది.

పాటలుకూడా వచ్చన్నమాట! చెప్పావుకాదు! అన్నాడు తను పాట ఆపేసి.

రాధ తలెత్తి తనవంక చూసి మీ పాటకంటె ఏం తీసిపోదులెండి అంది సన్నటి చిన్న పెదిమలను ముడుచుకుంటూ.

మరి నువ్వలా మూతి ముడుచుకుంటే– ఉన్న ఆ కాస్తనోరూ మాయమైపోతుందేమో జాగ్రత్త అన్నాడు అతను.

రాధ తలవంచుకుని మెత్తగా నవ్వింది.

చల్లటి నీడల్లో నీలపు సెలయేటి ప్రవాహం, గోదావరి మీద చంద్రకాంతీ స్ఫురించాయి.

గొప్ప! ఎలాగయితేనేం! వేళాకోళం అంటూ తలతాటించింది. వదులుగా వున్న జుట్టు మెడకి తగిలింది.

అబ్బ చక్కిలిగింతలు– అన్నాడు తను.

రాధ పకాలున నవ్వింది. ఇంకా గిలిగింతలు పెట్టింది.

గాలి జోరుగా వీచింది. చెట్టుమీద ఆకుల్లో అణిగివున్న నీటిచినుకులు టపటప రాలాయి. ఒక బిందువు రాధ నుదుటిమీద నిలిచింది. ఆ నీటిబొట్టు వెన్నెల కాంతిలో తళుక్కున మెరసింది. రాద ఒకమారు జలదరించింది.

చలా? అన్నాడు.

అందంగా మెల్లిగా తల ఊపింది. చూపుడు వేల్తో ఆ నీటిబొట్టుని అద్దాడు తను.

రాధ మెల్లిగా తలెత్తిచూసింది. తేలిగ్గా రాధ బుగ్గని పెదిమల్తో స్పృశించాడు.

కొంతసేపుతర్వాత రాధ పెదిమలు తన మెడకి చల్లగా తగిలాయి.

క్షీరసాగరోద్భూతమైన అమృతంవలె, గోపాలం అంతరంగంలో, ఆనందలహరి ఆవిర్భవించింది. అతని జీవిత దిగంతాలపర్యంతం వ్యాపించింది. అంతటా నిండిపోయింది. ఆ సంతోషం, ఆ సౌఖ్యం అతను భరించలేక పోయాడు.

తను భరించలేని ఈ మహాసౌందర్య ప్రపంచంనుంచి పారిపోవాలి.

☆ ☆ ☆

నెమ్మదిగా రాధనిలేపి లోపలకు పోదామా అన్నాడు.

రాధకళ్ళు మూసుకునే జవాబిచ్చింది. అబ్బ అప్పుడేనాండీ, ఇక్కడే హాయిగా ఉంది. ఇదివరకు పొద్దువాలితే ఇటురాడానికి భయపడేదాన్ని. ఇన్నాళ్ళకి వచ్చి....

పెరట్లోకి రావడానికే అంత భయమా! అన్నాడు తను వెక్కిరింపుగా.

ఇంక లేదులెండి. మీరు దగ్గిరుంటే నాకేం భయం? ఆఖరికి జలుబు చేస్తుందనికూడా బెంగలేదు!

ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు.

☆ ☆ ☆

గోపాలం పూర్తిగా పశ్చాత్తాపపడ్డాడు. తనమీద రాధ కెంతో విశ్వాసం ఉంది. ఛా, తనింత చవట అని రాధ కల్లోకూడా అనుకుని వుండదు. ఎంత భయపడుతోందో, ఎంత ఏడుస్తోందో. ఏవగించుకుంటూoదేమో!

నాయుడు బావనీ నారాయణమ్మనీ ఇందాక రైల్లోంచి రాధకూడా చూసి వుంటుంది. తనకికూడా అన్నీ జ్ఞాపకమొచ్చి వుంటాయి.

ఆ క్షణాన తను రాధతో వుండి ఉంటే!

ఇపుడు తెలిసొచ్చింది గోపాలానికి– ఆ క్షణంకోసం తను సర్వస్వం ధారపోయ డానికికూడా వెనుదీసి ఉండేవాడు కాదని– ఆఖరికి రాధ తెల్లచీర విషయంలో కూడా పట్టుదల వదులుకుని వుండేవాడు.

ఆమాటకొస్తే రాధకి ఎర్రచీరే బావుంటుంది. అంతే... పచ్చని రాధ వంటిమీద ఎర్రని చీరా నల్లని రవికా ఎంతో బావుంటాయి. తెల్లచీర కట్టుకోమని తను పేచీపెట్టాడు కాని. తెల్లచీర ఏం బావుండదు. తనదే తప్పు.

గోపాలానికి మనస్సు తేలికపడింది, ఆత్మసాక్షాత్కారంతో. ఈసారి రైలు ఆగగానే తను పరుగెత్తుకుని రాధ దగ్గర కెడతాడు. క్షమార్పణ కోరుతాడు.

ఇద్దరికీ స్నేహం కలిశాక రాధ నవ్వుతుంది. తనపుడు రాధ సన్నటి కళ్ళవంక సూటిగా చూస్తాడు.

☆ ☆ ☆

సరస్వతి మహోద్రేకంతో అహిరి రాగాన్ని ఆలాపిస్తోంది.

నాదే తప్పులే సరస్వతీ! నువ్వింక వాళ్ళమీద కోపంమాని, మలయమారుతం ఆలాపించు– అన్నాడు బ్రహ్మదేవుడు. సరస్వతి అందంగా నవ్వి మలయమారుతం ప్రారంభించింది. బ్రహ్మదేవుడు తృప్తిగా చిరునవ్వుకి ఉపక్రమించాడు.

నిద్రపోతున్న స్టేషన్లో రైలు ఆగీ ఆగకుండానే గోపాలం ప్లాట్ఫారం మీదికి దూకి ముందు పెట్టెకి పరుగెత్తాడు రాధకోసం.

తలుపు బార్లా తీసి వుంది.

నువ్వే రైటు రాధా! ఎర్రచీరే మంచిది. నేను చవటపని చేశాను. కోపం పెట్టుకోకేం అంటూ కంగారుగా మాట్లాడుతూ పెట్లోకెక్కాడు గోపాలం. రెండంగుళాల వెడల్పుగల నల్లటి అంచుతో కూడిన తెల్లటి రవిక తొడిగి జడలో తెల్లటిపూలు తురుముకొని, కళ్ళకి నల్లటి కాటుక పెట్టుకొని, నుదుట ఎర్రని బొట్టు పెట్టుకొని, బుగ్గలకి యెర్రని కాంతులు తెచ్చుకుని, పొగరుబోతు ముక్కుకి వినయం నేర్చి పెదమలు బిగించి చిరునవ్వు నదుపుచేస్తూ, ముఖద్యుతులకు కొంచెం సిగ్గురంగు కలిపి, రాధమ్మవలె ఎదురుగా నుంచుంది రాధమ్మ.



గోపాలం నిర్విణ్ణుడైపోయాడు. ఆనందంతో కంటనీరు తిరిగింది. గొంతు ముడివడింది. మాట తడబడింది. నెమ్మదిగా రాధను సమీపించాడు.

రాధ మెల్లిగా తలెత్తి ఇంకా మెల్లిగా కళ్ళు తెరిచి చూసింది గోపాలాన్ని.

రెండు చిన్న బాష్పాలు ఆమె కనుకొలకుల్లో, చెదిరిన కాటుక మధ్య తళుక్కు_మన్నాయి.

రాధా! నాదే తప్పు– నన్నుకోప్పడు. కానీ ఏవగించుకోకేం; అంటూ రాధమ్మ గడ్డం పట్టుకున్నాడు గోపాలం.

గోపాలం చెంపలమీద తన రెండు అరచేతులూ ఆనించి ఊహూఁఅంటూ తల అడ్డంగా తాటించింది. రాధ.

రైలు కదిలింది.

★ ★ ★




కథ చెబుతా వింటావా రాధా అన్నాడు గోపాలం, కాఫీగ్లాసు కిందపెట్టి సిగరెట్టు జేబులోంచి తీస్తూ.

అక్కడికి పేపరు చదవడం అయింది. ఇంక కథలు మొదలుకాబోలు అంది రాధ కత్తిపీటా కూరలబుట్టా ముందరేసుకుని కూర్చుంటూ.

పేపరు తరువాత విందుగానిలే. కథ టూకీగా చెప్పేస్తా విను. కథపేరు శశిరేఖా స్వయంవరం. శశి హీరోయిన్. దృశ్యం వానరోజు రాత్రి. సమయం ఆరు గంటల బైస్కోపు వదలిన తొమ్మిది గంటల వేళ. రంగం నిద్రబోతున్న పెంకుటింటి అరుగు– సిగరెట్టు ముట్టించాడు గోపాలం.

ఊఁకొట్టూ, అన్నాడు పొగ వదుల్తూ.

చెక్కుతీసిన అరటికాయని నీళ్ళలో పడేసి– ఊఁ చెప్పండి అంది రాధమ్మ.

సరే మొదట హీరో మోహన్‌వస్తాడు రంగంమీదికి. వానలో తడవటానికి ఇష్టంలేక అరుగెక్కి నించున్నాడు. రెండు నిమిషాల తేడాలో హీరోయిన్ శశికూడా రానే వచ్చింది. అరుగుమీదికి ఇంకెవ్వరు రారు అనుకో... రెండే పాత్రలు.

మీరు పేపరు చదువుకోండి బాబూ కవిత్వం కట్టేసి అంది రాధ.

లేదే కథ అయిపోవచ్చిందిగా అ కుఱ్ఱాడు యెదురుగా ఉన్న వేపచెట్టూ, పచ్చమేడా, పెంకుటిల్లూ, నల్లమబ్బూ, పచ్చని చందమామా పక్కనున్న భామా మొదలైన వాటివంక చూడడంమానేసి కేవలం శూన్యంలోకి చూడసాగాడు.

ఏం పాపం? అంది రాధ తల ఎత్తకుండానే.

అరుగుమీద భామ సుధకూడా ఈ ముక్కే అనుకుంది. ఇదివరకే హీరోని అక్కడక్కడ చూసినట్టు గుర్తుకురాగానే ఈ ముక్కే అడిగేసింది.

ఆ కుర్రాడు ఈపిల్లవంక ఓసారి చూసి మళ్ళా శూన్యంలోకి దృష్టి సారించి ఆపైన అటూఇటూ ఊగుతున్న ముంగురులు చూసుకోవడం మొదలెట్టాడు– బాధగా.

ఏం పాపం? అంది రాధ చిరునవ్వుతో.

అరుగుమీది భామ సుధకూడా అదే అడిగింది మళ్ళీ– అప్పుడే తను చూసివచ్చిన సినిమాలో హీరోయిన్ తాలూకు హృదయ కాఠిన్యానికి బలిఅయిన హీరోకి చెందిన హృదయం శతచ్ఛిద్రా లయిపోవడం కళ్ళారా చూసినమీదట తనకి స్త్రీజాతిపై గౌరవం, విశ్వాసం నశించి అంతకుమునుపే ప్రేమతో, కన్నీళ్ళతో నిండి, స్థానిక కన్య మోసానికి గురియైన తన హృదయకుండ పగిలిపోయిందని–

కుండేమిటండీ నా తలకాయ– భాండం.

– ఆ కుర్రవాడు గబగబ చెప్పేసి మళ్ళీ ముంగురులు చూసుకోవడం మొదలెట్టాడు– వేడిగా బరువుగా రొప్పుతూ. అవటాన ఆ పిల్లకి ఆ పిల్లవాడి జుట్టు సవరించాలనిపించిందట.

రాధ నవ్వింది. అవునుగానండి, ఆ పిల్లకి అదేం బుద్ధండి అలా, అరుగులమీద కనిపించిన మొగాళ్ళజుట్లు సవరించడ మేమిటండీ అందులోనూ పెంకుటింటి అరుగాయె.

ఏమో. ఆడవాళ్ళ హృదయం లోతని షేక్స్పియరుగామోసన్నాడు. నాకు బాగా తెలీదు. కథ విందూ. ఆ పళంగా ఆ అమ్మాయి యేమందో తెలుసా? సరే నబ్బాయ్, జరిగిందేదో జరిగిందీ, ఆ ముక్కలిలా పారేస్తే అవి అతికి నేను దాన్ని జీవంతో నింపుతానూ, నీ కిష్టమేనా అందిట– గోపాలం విరగబడి నవ్వసాగాడు తన చమత్కారానికి.

రాధ ముక్కుమీద వేలేసుకుంది.

అయ్యో! ముక్కూ మొహం ఎరుగని పరాయివాడితో అవేం మాటలండీ అంది సాగదీస్తూ.

ముక్కు మొహం తెలియడానికి ఆపిల్లముక్కు నీకుమల్లె కొట్టొచ్చినట్టు కనబడుతుందనుకున్నావా? ఆ పిల్లది మామూలు ముక్కే.

బావుంది. మధ్య నా ముక్కు గొడవెందుకు లెండి. కథకానీండి.

కథ కేముంది అయిపోయినట్టే, ముందరా కుర్రాడు ససేమిరా స్త్రీని నమ్మనన్నాడు. ఆ పిల్ల, కాదు కూడదంటూనే అటు తిరిగి ఏడుపు లంకించుకుంది. అప్పుడు కుర్రాడు ఆ పిల్లవంక తిరిగి నీ పేరేమిటన్నాడు. 'సుధ' అని చెప్పి, నీపేరో అంది. మోహన్ అన్నాడు. అంటూనే సు...ధా! అన్నాడు గాఢంగా, హృదయం చీల్చుకొచ్చిందిలే ఆ మాట. వెంటనే సుధకూడా...మో...హ....న్! అంది! ఇదికూడా హృదయం చీల్చుకు వచ్చిందేలే.

రెండూ హృదయం చీల్చుకువచ్చినవే నన్నమాట. బావుంది. తరువాత? అంది లెక్కల్లో రెండాకు లెక్కువ చదివిన రాధమ్మ.

తరువాత నీకు తెలియందేముంది?

రాధ కోపం ప్రకటించింది.

నాకేం తెలుస్తాయిలెండి. ఓ హృదయమా! వో ప్రేమా! అనడమూ మీకే చెల్లింది. అదీ ఇదీ అంటూ వెక్కిరించడమూ మీకే చెల్లింది. ఓడ దాటాక బోడి మల్లయ్యా అన్నాట్ట ఎవరో–

కోప్పడకు రాధా! నే ననేది అదికాదు.

ఏదయినా అనండి. నాకేం– అన్నీ మీకే చెల్లాయి, అంది రాధ మూతి ముడుచుకుని.

గోపాలం విరగబడి ఇంగ్లీషులో నవ్వాడు. ఆల్ రైట్ వాల్ రైట్ అమ్మాయ్? నేను ఓడదాటాలేదూ, బోడిమల్లయ్య అనాలేదులే. మాది కాశీ మీది రామేశ్వరం మా నాన్నా మీ నాన్నా విశాఖపట్నంలో కలుసుకుని నన్నూనిన్నూ ఓ ఇంటివాళ్ళని చెయ్యాలనుకున్నారు; చేశారు. పెద్దలు ఆశీర్వదించి తదర్పిత చందన తాంబూలాది సత్కారాలు స్వీకరించారు! మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ నువ్వూ నేనూ మొగుడూ పెళ్ళాం అంతకుముందు నేను నిన్ను చూడలేదు. ప్రేమించలేదు. అంతేనా? అమ్మయ్య! అంటూనే గోపాలం పేపరు చాటేసుకుని చెడా మడా చదవసాగాడు.

ఆఁ అంతే అంతే – మీరలా వెక్కిరించారు గాబట్టే అంతే అంది రాధ బుట్టలో ఉల్లిపాయలు బయటకు తీస్తూ.

గోపాలం పేపరు వెనుకనుంచి తొంగిచూసి, ఉల్లిపాయలు నాకు సయించవు. అవి మానెయ్... తరువాత నాకు హృదయం లేదన్నావు గాబట్టి నాబాకీ యిచ్చెయ్యి అన్నాడు దబాయింపుగా.

మీ బాకీ ఏమిటి! అంది రాధ కళ్ళు చిట్లించి.

మన పెళ్ళికి ముందరి ఎస్టాబ్లిష్‌మెంటు చార్జీలు అన్నాడు గోపాలం.

ఎస్టాబ్లిష్‌మెంటు చార్జీ లేమిటీ–

ఎరగనట్టే పెద్ద– నువ్వే అంటూ వుంటావుగా బోలెడు ఉత్తరాలు నీకు రాశానని! వాటికీ వాటికీ అయిన ఖర్చులు ఇచ్చుకో.

బావుంది. నేను మిమ్మల్ని ఉత్తరాలు రాయమని పిలిచి బొట్టెట్టి అడిగానా– నాకేం తెలీదు బాబూ.

నేను ఎన్నడూ బొట్టెట్టుకోలేదు... అది సరేగాని అదేం కుదరదమ్మాయ్ మర్యాదగా బాకీ తీర్చు. లేకపోతే మీ నాన్నమీద కేసుపెడతా.

ఇది మరీ బావుందండీ. మా నాన్న మిమ్మల్ని పిల్చి నాకు లౌ లెటర్సు రాయమని చెప్పాడా? అంది రాధ నుదురు మీదనుంచి ముఖానికి అడ్డంగా వేళ్ళాడుతున్న మెత్తని కురులను పైకెగతోసుకుంటూ.

గోపాలం కంగారుపడ్డాడు. ఆహాహాఁ! అవలా ఉంచు, తీసెయ్యకు. అవలా ఉంటేనే నాకు బావుంటుంది......

అది సరే మీ నాన్నమీద వైకేరియస్ లయబిలిటీ ప్రకారం కేసుపెడతాను. అమాయకుడినైన నా హృదయాన్ని ఆకర్షించి, – శాస్త్రం చెప్పినట్టు– నాచేత ఉత్తరాలూ అవీ రాసేటట్టు చేశావు. నువ్వు అప్పటికి మైనరువి కాబట్టే, ఇందుతో మీ

నాన్నకి ప్రత్యక్ష సంబంధం లేకపోయినా ఆయనదే బాధ్యత. ఇదంతా ఎందుకంటావూ— హాయిగా పేపరు చదువుతా వినెయ్.

రాధ తల పైకెత్తి పకపక నవ్వింది. నా మొహంలా వుంది మీ ప్రతిపాదన అంటూ.

ఏదో నీ అభిమానం కొద్దీ అలా మెచ్చుకొంటావు అన్నాడు గోపాలం వినమ్రుడై.

తదుపరి అనిమిషుడై ఆమెవంక చూసి ముగ్ధుడైపోయాడు.

రాధా! దేవుడు నీకింత అందం, ఇన్ని గుణాలూ, చక్కని మనస్సూ ఇచ్చి పేపరు చదవాలన్న ఉత్సాహం ఇవ్వనందుకు విచారిస్తున్నాను. పోతే పోయిందిలే. పేపరు వినవద్దు. అంతేకాదు ఉల్లిపాయలుకూడా తరుగు. నేను మెల్లిగా పాడుతూ వుంటాను.

రాధ తుళ్ళిపడింది. "ఏవండి! ఇలా చూడండి. పోనీ ఆ పేపరేదో చదవండి. మీ మాట కాదనడం నా కిష్టంలేదు."

గోపాలం చదివాడు—"అని ఉద్ఘాటించి ఆయన ఇంకా ఇలా అన్నారు..."

ఏవండీ! ఇలా చూడండి—

ఏం? ఏం'వొచ్చింది?

మీకు అరిటికాయి ఆవపెట్టి వండితే ఇష్టమా, లేకపోతే కమ్మగా పోపులో వేస్తే బావుంటుందా చెప్పండి. పుల్లగా పులుపు వుండనే వుంటుంది.

గోపాలం పెదిమలు బిగించాడు. అలవాటు ప్రకారం నాసాపుటాలు ఎగరేశాడు. కాని, హుంకరించడానికి భయపడ్డాడు. గుటక మింగాడు రాధా? నువ్వు నా బాకీ దీర్చవు. పాటవినవు. పేపరుకూడా వినవు. నేను కోర్టుకి వెళ్ళితీరతాను. ఆc, అన్నాడు.



ఏమోబాబూ కోర్టుకే వెళ్తారో గోలుకొండ కెళ్తారో, కోటిపల్లి కెళ్తారో మీ ఇష్టం. మళ్ళీ వంట ఆలీశ్యమైందని నా మీద ఎగరక్కరలేదు.

నా బాకీ తీర్చవా అయితే?

"ఇదెక్కడి గోలండీ! పెళ్ళాందగ్గిర బాకీ వసూలు చేస్తానంటారు...నాకేం తెలీదు...అదుగో ఎవరో వస్తున్నారు. చూడండి."

ఆ వచ్చిన ఎవరో మహోదూకుడుగా వచ్చి వంటింటి గుమ్మంమీద ఆగాడు. అతగాడి పేరు జి.వి.మూర్తి.

గోపాలానికి ఈ క్షణంలో జి.వి.మూర్తి రావడం పూర్తిగా నచ్చలేదు; అంటే కొంత నచ్చిందని కాదు.

మొగుళ్ళూ పెళ్ళాలూ పొద్దుటిపూటల్లో కాఫీలుతాగి సరదాగా సరసా లాడు కుంటూంటే, జి.వి.మూర్తులూ, ఎస్.కె. రావులూ కొంపంటుకుపోతున్నట్టు ఇలా క్యూలో వచ్చేయడం బావులేదనుకున్నాడు గోపాలం.

జి.వి. మూర్తి మాత్రం ఈ దంపతుల చిరచిరలూ కొరకొరలూ చూసి, బోలెడు ముచ్చటపడి, వాళ్ళ నాయనమ్మ అనే"చిలకా గోరింక"అనే మాట జ్ఞాపకం చేసుకొని ఎంతో ఇదైపోయాడు.

"ఏరా ఎల్.కె.గోపాలం!ఏవమ్మా ఎల్.కె.రాధాగోపాలం! కులాసా? ఆఁ? కాఫీలయ్యాయా?" అన్నాడు టైము చూసుకుంటూ.

గోపాలానికి ఒళ్ళు మండిపోతోంది ఇకిలిస్తూనే "ఏరా. జి.వి.మూర్తి?"అన్నాడు. 'ఆఁ. ఏవుందిరా?'అన్నాడు. మళ్ళీ జి.వి.మూర్తి 'ఊఁ ఇంకే మిత్రా!'అన్నాడు టైము చూసుకుంటూ. ఎళ్కే గోపాలం పేపరు చాటేసుకుని 'హఁ ఏముందిరా?'అన్నాడు.

రాధ పకాలున నవ్వింది."బావుంద్రా మొత్తానికి ఈ ప్రభాతవేళ మీ సంభాషణ తాత్పర్యం 'ఏముందిరా'అంటే 'ఏం లేదురా' అనేదని నాకు సులభంగా అర్ధమైపోయింది. సరేకాని మూర్తిగారూ, మా ఆయన్ని ఒక్కసారి అలా అలా తిప్పి, అవీ ఇవీ చూపించి తీసుకురండి బాబూ. చిటికెలో వంటచేసేస్తాను. పొద్దుటినించీ ఒక్కటే అల్లరి"అంది.

గోపాలం పేపరు చాటునించి తొంగిచూసి, "హాఁ అల్లరి. మరే అల్లరి. నేను కదూ?– సరేలే నీకూ నాకూ పేచీ ఎందుకు, నువ్వు పేపరు వినొద్దు బాగుపడొద్దు. నా బాకీ ఇచ్చెయ్యి"అన్నాడు.

"చూశారండి మూర్తిగారూ పొద్దుట్నించీ ఒక్కలా వేధిస్తున్నారు బాకీ బాకీ అనీ. నేను బాకీ ఏమిటండీ!"

గోపాలం పేపరు కింద పడేశాడు. "సరే ఆ మాటమీద నిలు. మొదటినించీ వీడికి మనసంగతి తెలుసుగద! వీడు మనకి సాక్షి. అందులోనూ బొత్తిగా నిజం చెప్పేరకం–చెప్పరా సింగినాదం ఈ అమ్మాయి నా కెంత బాకీమో–"

సింగినాదం టైము చూసుకున్నాడు. "ఒరేయ్! అష్టమిత్రుడూ! నువ్వు ఈ ఆదివారం పొద్దున్నే నన్ను సింగినాదం అన్నందుకూ, నేను నిజం చెప్తానని ఆరోపించినందుకూ– కాసుకో నిజంగా నిజం చెప్పేస్తాను. ఏది శాశ్వతం– అమ్మాయీ! రాధా–"అంటూ రొప్పసాగాడు.

"ఉండండి. కొంచెం ఆగండి."అంటూనే రాధమ్మ లేచి ఫ్లాస్కు లోంచి కొంచెం కాఫీ తెచ్చియిచ్చింది. జి.వి.మూర్తి సిగ్గుపడ్డాడు. హాఁ అన్నాడు. కాఫీయా అన్నాడు కాఫీవంక చూసి. హాఁ కాఫీ అన్నాడు చిరునవ్వుతో రాధని చూసి. కాఫీరా గోపాలం అన్నాడు గోపాలాన్ని చూసి, కాఫీ ఎందుకండీ అన్నాడు. ఓ గుటక తాగి, కాఫీ అని నిర్ధారణగా చెప్పి నవ్వాడు. తరువాత గడగడ తాగేశాడు. గుడ్లు మిటకరించి చూశాడు. తక్షణం గోపాలం సిగరెట్టు అందిచ్చాడు. "జాగ్రత్త రోయ్! నిజం చెప్పాలి. నిజం ఏది నిజం తెలుసుగా నిజం"అన్నాడు.

"ఓ తెలియకేం బోల్డు తెలుసు–యిది అసలు నిజంలేరా అప్పలసామీ! రాధమ్మా వీడికి అనగా నీ భర్తృదేవుడికి–అనగా ఎల్కే గోపాలంగాడికి నువ్వు యెనభైరూపాయలు బాకీ వున్నావు. ఇది నిజం. నిన్ను వీడుగాంచిన శుభముహూర్తంనించి, నిన్ను పెళ్ళాడిన శుభదినానికి పదిహేను రోజులముందరిరోజు సాయంత్రం ఎనిమిది ఘంటలవరకూ వివిధ పద్దుల క్రింద వీడు నీ నిమిత్తం ఎనభై రూపాయలు ఖర్చుచేశాడు. అందులో నా దగ్గిర అప్పుగా తీసుకోబడి ఇంకా ఇవ్వబడకుండా ఉన్న మొత్తం ఇరవై రూ.లు అనే వాక్యాన్ని బ్రాకెట్లలో వేసుకోవాలనుకో– నిజానికి నిజం ఇది."అని ఆగి టైము చూసుకున్నాడు.

గోపాలం మూర్తి భుజం తట్టాడు. "ఒరేయ్ సింగినాధం ప్రేమనాధం రామనాధం! నువ్వురా నిజమైన స్నేహితుడివి!" అన్నాడు.

"ఇవ్వాళ వూళ్లో కొత్త సినిమా యేవిటండి?"అంది రాధమ్మ అదోలా చూస్తూ.

మూర్తి గడపమీద కూర్చున్నాడు. "రాధమ్మా ఇది నిజమమ్మా నను నమ్మ సుమా"అన్నాడు నవ్వుతూ.

గోపాలానికి హుషారు హెచ్చింది. "జానే రాణే అలివేణే"అన్నాడు ఊతగా.

"బావుందండీ మేజువాణీ! మీరిద్దరూ ఇక్కణ్ణించి దయచెయ్యండి. నేను వంట చేసుకోవాలి"అంది రాధ గబగబా అరటికాయ తరుగుతూ.



గోపాలం నయోపాయాని కొచ్చాడు. "సరేలే రాధా లెక్కచెబుతాను విను. నీకు నేను పంపిన గ్రీటింగు కార్డులు పాతికేనా ఉంటాయికదా?– పాతికా పాతిక

రూపాయలనుకో. పోతే, ఉత్తరాలు—స్పెషల్ కవర్లో రాశాను. అవో పది పన్నెండు రూపాయలవుతాయి గదా! ఇంకేం ఇప్పటికే బోలెడయింది."

"మిమ్మల్ని నేనేం పంపమని అడిగానా?"అంది రాధ.

"పెద్ద. ఇంకో ఇంకోళ్ళైతే అడిగినట్టు, నువ్వు అడిగేదేమిటి. నీ ధోరణే తెలిసిపోయింది. ఎప్పుడు ఎక్కడ కనపడ్డా నన్ను చూసి నవ్వి వెళ్లేదానివి. దాన్ని పట్టి మొగకుంక ఏమనుకోవాలి?"

"నవ్వకపోతే యేడవనా? లేకపోతే వెక్కిరించనా? రోజూ స్కూలు దారిలో కనపడుతూనే వుంటిరి. అదలా ఉంచండి, మిగతా యేభై రూపాయలకి యేం లెక్క చెబుతారు?"

"నే చెప్తా" "నే చెప్తా" అన్నాడు మూర్తి "నువ్వు రోజూ కనపడేదానివికదూ! అప్పుడూ—"

రాధ అందుకుంది. "ఇది మరీ బాగుందండోయ్ నేను కనపడటమేమిటి. నేను నా దారిన స్కూలు కెళ్ళేదాన్ని. ఈయనేమో రోజూ కిళ్ళీ కొట్టుదగ్గర హాజరుగా ఉండేవారు. ఎలక్ట్రిక్ స్తంభాలూ, పోస్టుడబ్బా, గంట స్తంభం,. నల్లపిల్లవాడూ వరసగా కనపడేవారు. రోజూ పందెం నాకు మా ఫ్రెండ్సుతో. ఇవాళా ఈ నల్లబ్బాయి వస్తాడని నేనూ, రాడని వాళ్ళూ – నేనే నెగ్గేదాన్ని."

"నాన్సెన్స్...నువ్వు చాలా పొరపాటు పడుతున్నావు రాధా. నేనేం నీకోసం రాలేదు రోజూ. ఏదో తోచక తొమ్మిదిన్నరకి అలా షికారుగా వచ్చేవాణ్ణి కదరా సాయిబూ!" అన్నాడు గోపాలం.

"అవునవును. వెనకెవడో విలాసార్థం ఎండలో షికారు వెళ్లేవాడని" అన్నాడు మూర్తి–గోపాలం వంక చూడకుండా.

రాధ పకపక నవ్వింది. "అంతేనండి. మీకూ తోచకే, ఈయన వెంట షికారుకి సాయం వచ్చేవారు కాబోలు."

"అంతేలేగాని, చెప్పేది వినవమ్మా. సరిగ్గా తొమ్మిదింబావుకి స్నానంచేసి పగటివేషం ప్రారంభించేవాడు. తొమ్మిదీ నలభైకి ఆఖరి పౌడరు కోటింగూ, ఆఖరిసారి క్రాపూ మాలీసూ పూర్తిచేసి బీటుకి తయారయ్యేవాడు."

"పగటివేషమేలెండి. స్నేహితురాళ్ళనేవారు. 'ఆ నల్ల పిల్లవాడి మొహం తెల్లపౌడరుమయం కదే రాధా' అని. నాకు నవ్వొచ్చేది."

"అదిగో ఆ నవ్వే కొంపముంచింది. అది చూసే వీడు తలక్రిందులైపోయేవాడు. నాకు రెండు కాప్స్టన్ సిగరెట్లు కొనిచ్చేవాడు."

జి. వి. మూర్తి ఆగి గోపాలంవంక చూశాడు.

అతగాడి ముఖం పేపరు వెనుక ఎర్రగా వెలిగిపోతోంది. కళ్ళూ ఎర్రబడ్డాయి.

మూర్తికి వుషారు హెచ్చింది.



"ఇంక చూడమ్మా! నువ్వువెళ్ళిపోయాక మా ఇంటివసారాలో కూర్చుని, బరువుగా పొగ నిట్టూరుస్తూ—ఆ అమ్మాయి కళ్ళలో ఏదో ఏదో ఏదో వింతవెలుగుందిరా! నా హృదయం అర్థంకాని ఆవేదనతో నిండిపోతోందిరా అంటూ బోలెడు చదివేవాడు. నేను పేపరు చదువుకుంటూ వుండే వాణ్ణనుకో—"

గోపాలం తొంగిచూసి, తూచి తూచి కోపంగా అడిగాడు "అయితే నువ్వు అప్పుడు సానుభూతితో వినలేదా?"

మూర్తి ఓదార్పుగా నవ్వాడు. "పూర్తిగా అంత ఇది కాదులేరా...అన్నట్టు రాధా! ప్రతిరోజు నువ్వు వస్తావూ రావూ అనో, వస్తే వీణ్ణి చూస్తావూ చూడవూ అనో, చూస్తే నవ్వుతావూ నవ్వవూ అనో సందేహం పెట్టుకొని అంతసేపూ నాకు సిగరెట్లూ వక్కపొట్లాలు కొనిచ్చేవాడు. ఆ కెళ్ళీ కొట్టు నాయరు ఆ రోజుల్లో ఓ సెకండుహేండు కారుకూడా కొన్నాడు. ఇంక నువ్వు సాయంత్రం కనబడితే, మా మురాకి కాఫీ, కాష్టాలూ కొనిచ్చేవాడు."

గోపాలం ఛర్రుమన్నాడు. "ఏడిశావులేవోయ్ కవిత్వాలు చదవకు. ఏదో ఫ్రెండ్సు కదా అని ఖర్చుపెట్టాగాని, ఈవిడకోసం కాదు" అన్నాడు.

మూర్తికి వుత్సాహం మరింత పుంజుకుంది.

"అంతేకాదు. నువ్వు తెల్లచీరా నల్లరవికా కట్టుకొస్తే మాకు సినిమా. నువ్వు గ్రీటింగ్సు కార్డు అందుకొన్నట్టుగా నవ్వితే సినిమా ప్లస్ కాఫీహౌస్, శ్రావణమాసంలో నువ్వు నాగరం పెట్టుకొని కనపడిన మర్నాడు వాళ్ళ తమ్ముడికీ నౌకరుకీ చొక్కాలు కుట్టించాడు."

రాధమ్మ విరగబడి నవ్వింది.

"ఆఖరి కథ చెబుతా విను రాధమ్మా! ఊర్మిళ పెళ్ళి జ్ఞాపకం ఉందా? అప్పుడు మే మిద్దరం వచ్చాం నువ్వు అక్కడికి వస్తావుగదా అని. తీరా నువ్వు వచ్చాక యేంచేశాడో తెలుసా? నా మొహం జిడ్డుపారిందిరా మూర్తీ నువిక్కడే వుండూ అవటాని వద్దు మొర్రో అని నేను గోలచేసినా వినకుండా బస్సెక్కి మూడుమైళ్ళు వెళ్ళి మొహం రుద్దుకొని పౌడరు కొట్టుకుని వచ్చాడు. సరే తీరా వీడు ఇలావచ్చాడు. రెండు నిముషాలలో నువ్వా వెళ్ళిపోయావు. భలే కోపం వచ్చిందిలే వీడికి. అదీ సంగతి. అంచేత వీడికి నువ్వు వందరూపాయలు బాకీ అన్నా ఆశ్చర్యంలేదు."

గోపాలానికి కోపం యేడుపూ ముంచెత్తుకొచ్చాయి. "సరేలేరా మూర్తీ నేనే చవటనిలే. నువ్వు అడగొచ్చిన రూపాయి అక్కడ చొక్కా జేబులో ఉంది. తీసుకుపారిపో. పదింటికి యిక్కడికి భోజనానికేడు. ఏయ్! రాధా! నువ్వు అరటికాయ కూరలో ఉల్లిపాయ వెయ్యడం మానెయ్యి. వీడిక్కూడా అన్నంవండు. నా బాకీ తీర్చకు. ఆ!" అన్నాడు గబగబా.

జి. వి. మూర్తి యీలపాట పాడుతూ వెళ్ళిపోయాడు.

గోపాలానికి కోపం యింకా తగ్గలేదు. ఎక్కువైంది. అటుతిరిగి కూర్చుని పేపరు చదవసాగాడు– "అని వుద్ఘాటించి ఆయన ఇంకా ఇలా అన్నారు."

రాధలో వాత్సల్యం పెల్లుబికింది. చిరునవ్వుతో, కత్తిపీట పక్కకితోసి, అతని దగ్గరచేరింది. "ఏవండీ, ఇలా చూడండి. మిమ్మల్నే–" అంది అతని మెడని మునివేళ్ళతో తాకుతూ. గోపాలం కోపంగా చదవసాగాడు.

"టింకు అబ్దుల్ రహమాన్ ఇలా అన్నారు.... అబ్బ కళ్ళు ముయ్యకు రాధా! నాజోలికి రాకు."

ఆ టింకు అబ్దుల్ రహమాన్ గారి భార్యపేరుకూడా రాధేనా ఏమిటి. ఆమె ఆయనజోలికి రావడం ఆయనకి ఇష్టం లేదా ఏమిటీ! అంది రాధ.

అబ్బ వదులు అన్నాడు గోపాలం.

"కోపం లేదంటే కాని–" అంది నవ్వుతూ.

"ఊఁ కోపంలేదు లే."

"అయితే ఆ పేపరు అలాపారేసి ఇటు తిరగండి మరి."

"ఏం" అన్నాడు గోపాలం యిటు తిరుగుతూ, రాధ మళ్ళీ కత్తిపీట దగ్గరకు చేరింది.

"నేను మీ కెంతబాకీ అన్నారు?" అంది ఉల్లిపాయలు వలవడం సాగిస్తూ.

"ఉల్లిపాయలు వద్దని చెప్పలే?" అన్నాడు గోపాలం.

"అబ్బే మీక్కాదులెండి– కాకికి–సరే చెప్పండి బాకీ ఎంతన్నారు?"

"ఎంతోకొంతలే.... ఎనభై. ఏం?"

"కోప్పడకండీ మరీ, కొంచం ఆగండి." అంటూనే అరిటికాయ ముచ్చికతో గచ్చుమీద లెక్కలు వేసింది రాధ.

గోపాలం మూడుసార్లు స్వల్ప విరామాలతో నిట్టూర్చాడు. రాధ లెక్క పూర్తిచేసి తల తృప్తిగా తాటించింది.

"ఊఁ సరే నాగోల వినండి కాస్త. లెక్కప్రకారం, మీరు నాకు బాకీ ఉన్న మొత్తంలో నుంచి నేను మీకు బాకీ వున్న మొత్తం తీసేస్తే మీరే నాకు డెభ్భై రూపాయలు బాకీ. ఇలా పడెయ్యండి. సాయంత్రం చీరలు కొనుక్కుంటాను."

గోపాలం అనుమానంతో చూశాడు. "నువ్వుచెప్పేది నేను నీకు ఎదురివ్వాలనా" అన్నాడు.

"ఔను. మీరు నాకు ఎదురివ్వాలి."

"నేను నీకు–అంటే నీకు నేను బాకీ వుంటానా?" అంటూ చప్పగా జాలిగా నవ్వాడు గోపాలం.

"మహారాజులా, పాపం మీ కొక్కరికే హృదయాలూ అవీ వుంటాయి. మీరే మనుషులు మేమంతా రాక్షసులం అనుకున్నారా!"

"అబ్బే దేవత లనుకునేవాడిని."

"మీకు పచ్చజార్జెటు చీర యిష్టమని మీరు ఉత్తరం రాసినప్పుడు– వన్ వే ట్రాఫిక్కే అనుకోండి– నేను, మా అత్తయ్యనడిగి ముప్ఫయి రూపాయలు అప్పుచేసి మూడో నాటికి అది కట్టుకుని కనపడలేదూ–? మీకు సంతోషమని తెలిసి, ఆదివారం తలంటు మానుకుని సోమవారంనాడు– బడికి టైమైపోతున్నా– తలంటు పోసుకుని వచ్చేదాన్ని కాదూ? మీ కిష్టమని కాటికె పెట్టుకునేదాన్ని. కాళ్ళకి పట్టా చేయించుకున్నా. అన్నట్టు నాగరం కొన్నా! ఆఁ. ఇవన్నిటికీ అయినడబ్బు యిచ్చుకోండి."

గోపాలానికి లోపల సంతోషం వేసింది. చివరిసారి పెంకితనం చేశాడు.

"ఇవన్నిటికీ అనకూడదు. వీటన్నిటికీ అనాలి" అన్నాడు నిర్వికార స్వరంతో.

"బావుంది. మధ్యలో వ్యాకరణంమీద యింకో పోట్లాటా?"

"మీద అనకూడదు–గురించి అనాలి."

రాధ చెప్పకుపోయింది.

"ఆదివారం సాయంత్రాలలో మీరు బీచికివస్తే మా ఫ్రెండ్సుకి పకోడీలు కొనేదాన్ని. మీరు గ్రీటింగ్సు కార్డులు పంపితే మా చెల్లాయికి, సీతకి చాక్లెట్లు కొనిచ్చేదాన్ని. ఇలాగ నాకు బోలెడు ఎష్టాబ్లిష్‌మెంటు అయింది. ఆ అన్నట్టు, అసలుకథ. పెద్ద మీరేవిటమ్మా డబాయించారు? నేను తప్పుచేసినట్టూ. అవాళ ఊర్మిళ పెళ్ళికి మీరొస్తారు గదా అని మా ఫ్రెండ్సుని, మాట్నీ సినిమా మానిపించి అరుగంట లాటకి వాయిదా వేయించి, పెళ్ళిపార్టీకి నాతో తీసుకొచ్చాను. వాళ్ళందరికీ బస్సు ఛార్జీలు, కాఫీలు ఇప్పించుకోవాల్సివచ్చింది. తీరా వచ్చాక మీరు ఇట్టే కనబడి అట్టే మాయమైపోయారు. గంటసేపు చూసి, మా ఫ్రెండ్సుపోరుపడలేక సినిమాకి బయల్దేరుతూంటే మీరు అప్పుడు పౌడరు కొట్టుకొని వచ్చారు. నేను వెళ్ళిపోతే నాదా తప్పు? గంటసేపు మీరు నన్ను విడిపిస్తే అవన్నీ కృష్ణలీలలు కాబోలు. మీకే హృదయంవుంది. మేం రాక్షసులం."

గోపాలం నిర్విణ్ణుడైపోయాడు. తరువాత ఒకనిమిషంపాటు అలాగే తలవంచుకు కూర్చున్నాడు.

'ఇంత ప్రగాఢ ప్రేమ ఉందా రాధా నీకూ' అని తెలుగు వాక్యాలలో అనుకున్నాడు.

"రాధా!" అన్నాడు బరువుగా బాధగా అందంగా ఆనందంగా ఇంకా రకరకాలుగా.

రాధ ఉల్లిపాయలు వదిలేసి తేరిచూసింది గోపాలంవంక.

"ఇదికూడా హృదయం చీల్చుకువచ్చిన మాటేకదూ ఇందాక మీరు కథలో చెప్పినట్టు" అంది సూటిగా.

"హృదయాంతరాంతరాంతరాంతరాంతరాలలోంచి వెడలిన మాట రాధా!"

"అయితే ఉల్లిపాయలు తరగొచ్చుగా?"

"వద్దు."

☆ ☆ ☆

అంతలో జీవీ మూర్తి గావుకేక వినిపించింది సావిట్లోంచి.

"బ్రదర్! ఈ రూపాయి సత్తుదిట. చెల్లదుటా....."

"జేబులో ఇంకోరూపాయుంది తీసుకో. లేకపోతే జేబే తీసుకో. పో!" అన్నాడు గోపాలం కంగారుగా.

★ ★ ★




అనగనగా ఒక రాధమ్మ. అంతకుముందో గోపాలం.

☆ ☆ ☆

గోపాలరావు పుట్టిన తరువాత వచ్చిన పద్దెనిమిదవ దీపావళినాడు – అతగాడు వీధివెంట పోతూవుండగా సరోజని అనే ఓ పిల్ల అతని హృదయంలో ఒక చిన్నదీపం వెలిగించింది.

"భలే ఉందీ పిల్ల" అనుకున్నాడు. దరిమిలాను ఆ సంగతి మెల్లిగా వాళ్ళమ్మకి చెప్పాడు. అమ్మ ఆ మర్నాడు నాన్నతో నవ్వుతూ చెప్పింది– కొడుకు ప్రయోజకుడు అవుతున్నాడని.

ఏడిశాడు. వెధవ్వేషాలు వెయ్యద్దని చెప్పు డొక్క చీరేస్తా అన్నాడు ఆయన.

ఈ ముక్క గదిలోంచి విన్న గోపాలరావు తలుపుచాటుకి వెళ్ళి వాళ్ళ నాన్నమీద బోలెడు కోప్పడిపోయాడు.

ఇది ఇలాఉండగా గోపాలం బామ్మకీ పొరుగింటి సుబ్బలక్ష్మి అనేపిల్ల బామ్మకీ ఓరోజు మాటా మాటా వచ్చింది. వారిలో మునిమనవడిని ముందు ఎవరెత్తుకుంటారనే మాటమీద పోటీపడ్డారు. పోటీ, పందెం వరకూ వెళ్ళింది. ఓడినవాళ్ళు రెండోవాళ్ళకి ఓ లక్షవత్తుల నోముఫలం ధారపోసి, పైగా కాశీయాత్రకి తీసుకెళ్ళి మళ్ళీ తీసుకురావాలి. గోపాలం బామ్మ మర్నాటినుండి గోపాలం పెళ్ళికోసం ఇంట్లో పోరు మొదలెట్టింది. ఈ పోరుపడలేక 'అలాగే, సంబంధాలు చూస్తాలే' అన్నాడు గోపాలం తండ్రి భీమశంకరంగారు.

ఈ ముక్క ఆనోటా ఆనోటా ఊరంతా పాకింది. గోపాలం బామ్మకి ఆస్తి బొత్తిగా ఎక్కువైనందువల్ల, ఊళ్ళోని ఉపధనికులు గోపాలం హృదయంలో హరికెన్ దీపాలూ, పెట్రొమాక్సులైట్లూ వెలిగించెయ్యబోయారు. వాళ్ళ వాళ్ల కూతుళ్ళు ఎంతబావున్నా గోపాలం చలించలేదు. తన తాలూకు హృదయ కవాటానికి గడియపెట్టి

విడాయించుకుని, ససేమిరా ఇంకో కన్య ఇందులో దీపం వెలిగించ వల్ల కాదన్నాడు.

పందొమ్మిదవ దీపావళి నాటికి గోపాలరావు హృదయం 'టులెట్'– ఆ సరోజిని అనే పిల్ల ఎవడో దొరటోపీ మనిషిని పెళ్ళాడేసి గోపాలం హృదయంలో దీపం కాస్తా తీసుక చక్కాపోయింది అత్తారింటికి. 'ఏడిసిందిలే' అనుకున్నాడు, గోపాలం కొద్దిగా ఏడుస్తూ.

అంచేత పందొమ్మిదవ దీపావళినాడు వసుంధర అనే ఇంకో పిల్ల దీపం వెలిగించవలసి వచ్చింది.

గోపాలం నల్లగా ఉన్నందువల్ల లోకల్ జూలియట్‌లు ఎవరూ అతనివంక చూసేవారు కారు. వసుంధర కూడా అంతపనిచేసి చీదరించుకుంటుందేమోనని గోపాలం ఎన్నడూ ఆ పిల్లకి దగ్గరగా వెళ్ళేవాడు కాదు. చాలాదూరం నుండి చూసి తృప్తిపడి ఆ తాయిలం గురించి ఇంట్లోకూచుని ఆలోచించుకునేవాడు. అప్పుడప్పుడు చిన్నచిన్న పాటలు రాయడం చిట్టి చిట్టి బొమ్మలు వేయడం ఇత్యాది ప్రేమకాండ సాగించేవాడు.

☆ ☆ ☆

ఇరవై ఒకటవ దీపావళి నాటికి గోపాలరావు చెన్నాపట్టంలో ఒక వీధమ్మట నడుస్తున్నాడు. అతని ప్రక్కన ఇంకో మీసాలరావు నడుస్తున్నాడు. పండుగనాటికి ఇంటినుంచి డబ్బు రానందువల్ల గోపాలరావూ మీసాలరావూ వేటకి బయలుదేరారు.

మీసాలరావు ఘాటుగా ఆలోచిస్తున్నాడు. మీసాలు దువ్వుకుంటూ, వాటిని ఓదార్చుతున్నాడు – మీ కోసమేగా ఇప్పుడు తిరుగుతున్నది సాయంకాలానికి ఎలాగేనా సంపెంగ నూనె రాస్తాను అంటూ.

ఎందుకంటే– మీసాలరావుకి ఉద్యోగంలేదు. సద్యోగం ఎక్కడా చూపుమేరలో కంటికి ఆనటంలేదు. ఐనా అతనికి ఈ ఐహిక విషయాల గురించి అట్టే ఆలోచించగల స్తోమత లేదు. సినిమా ఎలా చూడడం, సిగరెట్టెలా తేవడం అనేవి మినహా మిగతావి అతను ఆలోచించడు. మిగతావి లేకపోయినా అట్టే ఏడవడు కాబట్టే అతనికి తరచు ఏడవవలసిన అగత్యం లేకుండానే రోజులు వెళ్ళిపోతున్నాయి.

మీసాలరావు ఆలోచిస్తున్నది సాయంత్రం సినిమాకి అప్పు సంపాయించడం ఎలాగని. 'మా వాడి మనియార్డరు రేపు రాగానే మీకిస్తాం. అయిదు రూ.లు ఇవ్వండి' అనాలా, లేక 'మనియార్డరు రేపు రాగానే మీకిస్తా, అనాలా' అనే వాక్యస్వరూపం గురించి ఆలోచిస్తున్నాడు. గోపాలరావు ఎవరినీ అప్పు అడగడు. మీసాలరావే అడిగి తెస్తే గోపాలరావు తీర్చేస్తాడు. మీసాలరావుకి సినిమా అప్పటి సమస్య. దానికోసం అప్పుకీ గోపాలం తాకట్టు.

హఠాత్తుగా గోపాలం మీసాలం తాలూకు భుజం తట్టాడు. ఒరేయ్ పంతులూ! ఆ అమ్మాయి చాలా బావుందిరా అని.

మీసాలరావు పరాకుగా, యధాలాపంగా, దానికేం అప్లికేషన్ పడెయ్ అన్నాడు. ఆ దీపావళినాడు ఆ "చాలాబావున్న అమ్మాయి" గోపాలం హృదయంలో దీపం వెలిగించింది.



దరిమిలాను గోపాలం ఆ రోడ్డుని మెయిన్‌రోడ్డుగా చేసుకున్నాడు. పది రోజుల తరువాత ప్రేమతో ఖాయిలాపడ్డాడు.

ఇంటినుండి డబ్బు వచ్చినా గోపాలం కోలుకోలేదు. ఆ 'ఛాలా బావున్న' అమ్మాయికోసం తపస్సు మొదలెట్టి కాలేజీ ఎగేశాడు.... తను చాలా బావుండడు. ఆ అమ్మాయి ఛాలా బావుంటుంది.....ఎలాగ? గోపాలం గడ్డం పెంచాడు. మంచం పట్టాడు అంటే లేవలేడని కాదు, లేవదలచలేదని. ఆ పిల్ల తనవంక కన్నెత్తి చూడదు. చిరునవ్వు విసరదు. వ్యవహారం స్తంభించిపోయింది ఇంకెలా? "ఇంకెలా.... బ్రతుకిలా....." అని విరహగీతి మొదలుపెట్టాడు గోపాలం. ఒకరోజు ఊరుకుని మీసాలరావు నిష్కర్షగా చెప్పాడు– వెధవ సినిమా వేషాలేస్తే తంతా జాగర్త అని. అతనికి గోపాలం బాధ చూసి బాధ పుట్టింది. ఆ బెంగతోనే గోపాలం సిగరెట్లు అదేపనిగా కాల్చేస్తున్నాడు.

హఠాత్తుగా ఒకరోజున గోపాలం రూముకి తుకారాం అనేవాడు వచ్చాడు ఐదు రూపాయలు అప్పుకోసం. అతను హఠాత్తుగా వచ్చేస్తాడు. అప్పిచ్చెయ్యి అంటాడు.'ఆ తరవాత ఇస్తాలే' అని కూడా అంటాడు. రెండో మూడో సలహాలు పారేసి, బోలెడు నవ్వేసి పిచికలా పారిపోతాడు. ఈ తుకారాం కేవలం కార్యవాది. లవ్వూ గివ్వూ హృదయం గిదయం తెలియవు. దృక్పథం బోలెడు విశాలం చెన్నపట్నం బీచి రోడ్డులా!



ఆ అమ్మాయి బావుందోయ్! అప్లికేషన్ పడెయ్యి. హోర్ హూర్ అంటే వాళ్ళ నాన్నతోనూ, మీ నాన్నతోనూ మాట్లాడేయ్. ఆ పైన హాయిగా ఉండెయి; అవునుగాని నాకో పావలా అప్పిచ్చెయ్ మళ్ళా ఇస్తాలే అంటాడు గబగబా.

ఈసారి రూములోకి వస్తూనే గోపాలాన్ని చూశాడు. ఏరా అలా వున్నావ్ లవ్వా?...... అన్నాడు.

గోపాలం మాట్లాడలేదు. మీసాలరావు నిట్టూర్చాడు.

నువ్వు చెప్పవయ్యా సెక్రటరీ.

ఔను.

ఎవర్తి?

ఛఛ్ అన్నాడు గోపాలం.

ఓహో....ఎవరా పిల్ల? ఎప్పుడూ ఎలా వచ్చిందీ ఉపద్రవం?

ఓ అమ్మాయి, మొన్న దీపావళినాడు, ఏముంది.... ఈ ఫేసా ఫేసున్నూసింది. మనవాడు మంచం పట్టాడు అన్నాడు మీసాలరావు.

చెవలాయూ లే వాడెవరో బ్రూసుకామోసు యేడుసార్లు సాలెగూడు కట్టాడు. వాడి ఓపిక చూసి బుద్ధి తెచ్చుకో. నీటుగా తయారయి రోజూ కనబడు. చూడు, నా సలహా అడిగితే, ఝూంమని మీ వూరెళ్ళి మీనాన్నని పిల్చుకొచ్చి మాట్లాడించు. పెళ్ళాడు. ఎందుకీ వెధవ గోల. నన్నడిగితే నా సలహా పాటించడం మంచిదంటాను. అవునుగాని ఓ నాలుగో ఐదో ఉంటే ఇవ్వరా. నెలాఖరున ఇస్తా.

గోపాలానికి ఈ సలహా నచ్చింది. ఐదు రూపాయలు యిస్తూ మెచ్చుకోబోయేలోగానే తుకారం వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

ఈ పిల్లని నేను పెళ్ళాడి తీరతా అని మర్నాడు శపథం పట్టాడు గోపాలరావు. ఆ పిల్లపేరు రాధాసుందరి. రాధాసుందరి చాలా బావుంటుందని గోపాలం అంటాడు. అంటే రాధ నాజూగ్గా పొడుగ్గా వుంటుంది. చామనచాయన వుంటుంది. కళ్ళు సన్నగా నల్లగా వుంటాయి. పెదిమలు పల్చగా వుంటాయి. నుదురు కోలగా వుంటుంది. జుట్టు నల్లగా సాఫీగా ఉంటుంది ఒక్క ఉంగరంకూడా లేకుండా. నుదుట దోసగింజ ఆకారంలో ఉండే తిలకం దీపకళికలా వెలుగుతుంది. చెంపలు విశాలంగా ఉంటాయి. నవ్వినప్పుడు రెండు సొట్టలు కనపడతాయి. ముక్కు సన్నగా పొడుగ్గా ఉండి చివర కొనదేలి...చాలా బావుంటుంది.

నేను బావుండను అంటాడు గోపాలం. గోపాలం సన్నగా నల్లగా ఉంటాడు. ముక్కు చాలా బలంగా ఉంటుంది. పెదిమలు కొంచెం లావుగా, చెక్కినట్లు ఉంటాయి. కళ్ళు–కాటుక రేఖలవలె ముడుచుకుని ఉంటాయి.

గోపాలం చాలా బావుండడు.

అందుకే ఆ పిల్ల నీకు దొరుకుతుందిరా. ఆ పిల్ల చూపులే చెప్పాయి నాకు. పూర్వ జన్మ సుకృతంవల్లే నువు చూశావు. చూసీచూడటంతోటే తలక్రిందులై పోయావు. వే నయ్యానా? లేదు. అదే– అదే– అదే నిదర్శనం అనేవాడు మీసాలరావు.

ఏడిశావులే మరి వాగుడు మానేయి. పూర్వజన్మం కాదు ఏంకాదు అనేవాడు గోపాలం.

ఒకరోజు మీసాలరావు వేదాంతిలా మొహం పెట్టి అబ్బీ యిప్పుడప్పుడే ఎక్కువులేరా నీకు. రేపొద్దున ఓ కొడుకుని కని వాడు ఉద్ధరిస్తే 'పుత్రోత్సాహము తండ్రికి సుమతీ' అని చదివేసి పూర్వజన్మ సుకృతఫలం అనుకుంటావు. నీ పెళ్లాం సుఖపెట్టినప్పుడు ఓహో 'ఎన్నో నోములు నోచినగాని' అని పాడుకుంటావులే అన్నాడు.

పరిగేట్టు కెళ్ళిపోయి సిగరెట్లు కొనుక్కురా అన్నాడు గోపాలం.

'తొలి నే జేసిన పూజఫలము' అంటూ పరిగెత్తాడు మీసాలరావు.

గోపాలం తరహా చూసి చూసి ఒకరోజున మీసాలు భోరుమని యేడిచాడు. కళ్ళు తుడుచుకున్నాక అబ్బీ ప్రేమ అంటే యేమిటనుకున్నావు. చూట్టానికి బాగానేవుంటుంది గాని అదంతా లిటిగేషన్. అనక పెళ్ళిచేసుకోవలసొస్తుంది. తెలుసా? తరవాత కొన్నాళ్ళకి కుటుంబరావువైపోతావు. ఆవాలూ జీలకర్రా, వుడ్వర్డ్ గ్రైపువాటరూ, జండూవారి బాలామృతమూ అవీ కొనాలి. నన్ను సిగరెట్లకి తోలినట్టు కాదు. అసలు నన్నడిగితే ఈ పెళ్ళిమీద ఓ లావుపాటి ఫిలాసఫీ రాసి బియ్యేకి డిటేలు పెట్టించవచ్చు అన్నాడు.

ఏడిశావులే రేపు మావూరు వెళ్తున్నాం మనిద్దరం. నీకూ పెళ్ళి సంబంధం చూశాను అన్నాడు గోపాలం.

మీసాలరావు తుళ్ళిపడ్డాడు. నాకు పెళ్ళేమిట్రా నీ బొంద. మూడెకరాల మాగాణి మినహా చుట్టపక్కా లెవ్వరూ లేరు. ఉద్యోగం లేదు– సద్యోగం లేదు.

సిగరెట్లు కొనుక్కురా పోయి అన్నాడు గోపాలం చిరాగ్గా.

డబ్బుల్లేవు!

అరువు తేరా

వాడివ్వ నన్నాడు.

ఒరేయ్ మీసాలూ! శుభవాం అని పెళ్ళి గొడవ మాట్లాడుతున్నపుడు కూడా యీ ఏడుపేమిట్రా. పేపర్లమ్మేసేనా పట్టుకొచ్చెయి. మనసు బాగులేదు.

మనసుకు మళ్లా కొత్తగా ఏమొచ్చిందోయ్!

"మానాన్న ఓ దేశవాళి పిల్లని నాకు పెళ్ళి చెయ్యాలని మోజుపడుతున్నాడు. అందుకని నన్ను మావూరు రమ్మన్నాడు. మా బామ్మ....ఒరేయ్ ఈ సిగరెట్టు పీకల్లో నేను కాల్చిపారేసిన వేవో నువ్వు తగలేసిన వేవో గుర్తుపట్టగలవురా. టెంపరరీగా అదైనా ఏడుస్తా. మనసు బావులేదు" అన్నాడు గోపాలం.

ఏడిశావులేవోయ్, మనసు మనకెప్పుడు బావుందిలే. ఏదో ఓ పీక అంటించు, ఇందులో మళ్ళా నీదీ నాదీ ఏమిటి, మహా మడికట్టుకు కాల్చినట్లు.

నట్లూలేదు స్క్రూడ్రైవరూలేదు. అగ్గిపెట్టె ఇలా పారెయ్......అసలు సంగతి చెప్తా.

ఒరేయ్. విట్టు! విట్టు జ్ఞాపకం వచ్చిందిరోయ్. తుకారాం చెప్పాడు మధ్యాహ్నం. తెలుసా? అన్నాడు మీసాలం హుషారుగా.

తెలీదు; నువ్వు చెప్పొద్దు. తుకారాంగాడి విట్టు అయితే అంతకన్నా ఒద్దు. అయినా వాడెక్కడ దొరికాడురా నీకు?

వాడు నాకు దొరకలేదు, మనం వాడికి దొరికాం..... అదిసరే. విట్టు యేమిటంటే ఓ నరుడు తన తాలూకు కారు డ్రైవర్ని పిలిచి స్క్రూడ్రైవరు తేవోయ్ అన్నాట్ట. ఆ డ్రైవరు కంగారుపడి....ఏవిట్రా గోపాలం పెద్దపోజా నువ్వూను అష్టకష్టాలు పడిపోతున్న వాడిలా నెత్తిన చేతులేమిట్రా! తీసెయ్‌– ఏం. ఆ డ్రైవ రేమన్నాడంటే.....

ఒరేయ్ మీసాలం. నీకు దండం పెడతా. హాస్యాలకేం– రేపు రైల్లో చెప్పుకుందాం కాని. అగ్గిపెట్టె యిచ్చి చెప్పేదివిను. నిజంగా పెద్ద చిక్కు వచ్చిపడిందిరా.....

అలాగట్రా? అంటూ మీసాలరావు లేచి, అగ్గిపెట్టే, కొత్త సిగరెట్టూ ఇచ్చాడు. గోపాలం విస్తుపోయాడు.

ఎక్కడిదిరా ఇది!

ఎమర్జన్సీ స్టాకులే.

ఒరేయ్ నీది సిసలైన మంచి హృదయంరా.

బ్రదర్ నీ వెధవతైరు నాకు తెలిసుండి కూడా తలకిందులై పోతున్నానురా. చేతిలో డబ్బుంటే భోజరాజులా గౌరవిద్దును సుమీ!

"సరేలేకాని... పంతులూ... మీసాలం... ఇవాళ బలే ప్లాను వేశాను విను. మా నాన్న మోజుపడే సంబంధాన్ని నీకు అంటకట్టి, నేను తప్పించుకుని రాధని పెళ్ళాడాలని....ఏది .....చూశావూ?"

ఇంత వెధవప్లాను యెపుడు వేశావురా నా కళ్ళెదరే తిరుగుతూ.

గోపాలం గట్టిగా నాలుగు దమ్ములు లాగి, సిగరెట్టు వంక చూసి ఐదారు గజాల పొడుగు నిట్టూర్పు విడిచాడు. అబ్బాయ్ మీసాలం బుద్ధిగా కూర్చుని వినెయ్. అంతా చెప్తా... ఇవాళ మా నాన్న ఉత్తరం రాశాడు. ఘాటైన ఉత్తరువులు వేస్తూ.... ఊహూ.... అలా కాదు.... మొదట్నించీ చెప్తా– అనగనగా మా యింట్లో మా బామ్మ... చాలా మంచిదిలే. అయితేనేం, కోపిష్టి. పైగా తిక్క, మా నాన్న కూడా అవిడ గీసిన గీటు దాటడు, యేం వినగా వినగా మా పక్కింటి సుబ్బలక్ష్మికి యింకో బామ్మ, మా బామ్మ పేరు సూరమ్మ. సుబ్బలక్ష్మి బామ్మ పేరు సుబ్బమ్మ. సుబ్బలక్ష్మి బావుంటుంది. కాని నాకు నచ్చదు. పోట్లాట వచ్చిందిలే నాకూ దానికీని. అదలా ఉంచు. తరవాత చెప్తా. సరే రెండు బామ్మలకీ మాంచి స్నేహం. ఇద్దరూ రోజూ మధ్యాహ్నంపూట వత్తులు చేసుకుంటూ, కృష్ణా రామా అనుకుంటూ, కోడళ్ళని ఆడిపోసుకుంటూ సుఖంగా ఉండేవారు. నా కర్మంకాలి వాళ్ళకి యేదో పోట్లాట వచ్చిందట. ఆఁవటా మునిమనవణ్ణి ఎవరు ముందు ఎత్తుతారూ అని పోటీ పడ్డారట. మా బామ్మకి చెట్టంత మనవణ్ణి నేను, ఆ బామ్మకి గుజ్జుమంత మనవరాలు సుబ్బలక్ష్మి ఇద్దరికీ పెళ్ళికాలేదు. పెళ్ళిళ్ళయాక, ఎవరు ముందు పిల్లాణ్ణికంటే వాడి బామ్మ గెల్చినట్టుట. గెల్చిన బామ్మ ఓడిన బామ్మకి ఒక లక్షవత్తుల నోముఫలం ధారపోయడం కాకుండా, గెల్చిన బామ్మ కాశీయాత్ర చేయించాలని పందెంట. ఇదంతా నిక్షేపంలా ఉంది. వచ్చిన చిక్కు యెక్కడంటే మా నాన్నకి బ్రహ్మాండమైన ఐడియా వచ్చెయ్యటందగ్గిర. బామ్మలతగవు యేమంత అమోఘంగా లేదని ఆయనకి

అనిపించిందట. ఇపుడు ఆ సుబ్బలక్ష్మిని నాకు కట్టపెట్టేస్తే బామ్మల పోటీ యెలా జరగగలదు? ఇదీ మా నాన్న ఆలోచన. సుబ్బలక్ష్మికి తండ్రి లేడులే, మా అమ్మ వాళ్ళమ్మతో మాట్లాడి ఒప్పించిందట. ఇక నేనే తరువాయి. రేపు నేను వెళ్ళగానే యీ అరణ్యమెంటు యావత్తూ బామ్మలకి బోధపరచి వాళ్ళను ఒప్పిస్తారట ఏం, ఇప్పుడూ.....

మీసాలరావు గట్టిగా నిట్టూర్చాడు. పంతులూ ఆపరా ఆపు నాకు మతిపోయింది. సిగరెట్టూ, టీ తెస్తా ఉండు అన్నాడు.

బాబ్బాబు. నీమీద చాలా ఆశలు పెట్టుకున్నా. నీ యిష్టం. యేదైనా చెయ్యి కాని మతి మాత్రం పోగొట్టుకోకు. ఉంటే గింటే యెందుకేనా పనికొస్తుంది అన్నాడు గోపాలం.

పాత పేపర్లకట్ట చంక నెట్టుకు యెగిరిపోయాడు మీసాలరావు. ఏడు నిమిషాలలో సిగరెట్టు పట్టుకునీ, టీ పట్టించుకునీ వచ్చేశాడు. ఇద్దరూ టీ తాగి సిగరెట్టు ముట్టించారు.

హటాత్తుగా తుకారాం దుమారంలా వచ్చిపడ్డాడు.

ఏరా గోపాలం! కులాసా అఁ? లవ్వెంత దూరం వచ్చింది?

ఎంత కావాలి? అన్నాడు హుషారుగా గోపాలం.

మూడు.

లేదు.

అర్జెంటురా.

రేపు రా.

సరే సిగరెట్టేనా పారెయ్ అంటూనే తుకారాం ముందుకు వాలి, ఓ సిగరెట్టు అంటించి, ఇంకోటి జేబులో వేసుకుని లేచి చక్కాపోయాడు.

హారినీ! అన్నాడు కొయ్యబారిన మీసాలం తేరుకుని, ఎంతలో యెంతపని జరిగిపోయిందిరా. క్షణం క్రితం ఐదు సిగరెట్లు తెచ్చాం. 'ఇవి మనవేనే మనసా' అనుకున్నాం. సంతోషించాం. ఇంతలో ఈ సన్యాసి తుకారాంగాడు ఇలా డేగలా వాలి రెండు పట్టుకుపోతాడూ!....కప్పుకీ లిప్పుకీ దూరం అన్నారు దొరలు.... గోపాలం! ఒకటే సిగరెట్టు మిగిలింది. మనకీ మళ్ళీ చెరిసగం ఏడుపు తప్పలేదు.

గోపాలం విసుక్కున్నాడు– హుందాగా–యేడుపు ఆపరా. ఎంతకని యీ వెధవ గొడవ. చెరిసగం యెందులకు? అది నాకిచ్చెయ్. లేకపోతే నువ్వు మానెయ్. జీవితాలకు సంబంధించిన సమస్యలు చర్చిస్తున్నప్పుడు యీ పిడకలవేటమిత్రా అన్నాడు.

సరే అయితే నేనే తీసుకుంటాలే కథ చెప్పు. కాని పత్రికల అడుగున రాసుకునే కొటేషన్లలా జీవితం గట్రా అనకు. నాకు చిరాకు. చెప్పేస్తా విను. ఏంలేదు. నువ్వూ నేనూ రేపు మా వూరు వెళదాం. నేను మా నాన్న కాళ్ళావేళ్ళా పడి, ఆ సుబ్బలక్ష్మి సంబంధం నాకు బదులు నీకు కుదిర్చేలా చేస్తా. కట్నాలూ కానుకలూ యిస్తారు. నోరు మూసుకు అవి తీసుకు, దాన్ని చేసుకు బాగుపడు. మెల్లిగా యిక్కడ ఉద్యోగమో వ్యాపారమో ఏదో ఒకటి చూసుకోవచ్చు. ఈ వంకన రాధ సంగతి చెప్తా మా బామ్మకీ అమ్మకీ. హాయిగా మా వూళ్ళోనే మనిద్దరం పెళ్ళాడేద్దాం.

మరి రాధో?

రాధని నేచేసుకుంటున్నాగా.

మనిద్దరం అన్నావు—?

ఒరేయి చవటజోక్కు పూర్తిగా మానెయ్. చిరాకేస్తుంది....ఏం సరేనా? సుబ్బలక్ష్మిని పెళ్లాడతావా?

చూడకుండా ఎలాగరా అంటూ నసిగాడు మీసాలరావు.

నేను చూశానురా నాకు నచ్చిందిగా.

ఔనుగాని గోపాలం! చెట్టంత మొగాడివి నువ్వు పట్టిగ్గా నచ్చిందని ఒప్పేసుకుంటున్న పిల్లని నే నెలా చేసుకోనురా?

గోపాలం విసుక్కుంటూ ఐదో సిగరెట్టు తీశాడు.

ఆ! అ. అ! అది నాదిరోయి. వెధవ్వేషాలెయ్యకు.

రెండు దమ్ములు లాగిస్తాలేరా. గావుకేకలు పెట్టకు. చెప్పేది విను. సుబ్బలక్ష్మి నీకు కాబోయే పెళ్ళాంగా నాకు నచ్చింది. నాకంటే నాకు కాదు. చిన్నప్పటేనుంచీ నాకూ దానికీ పచ్చగడ్డివేస్తే భగ్గుమనేది. మూడేళ్లక్రితం కాబోలు ఓసారి తెలీక 'నన్ను పెళ్ళాడుతావా?' అని మా అమ్మా నాన్నా అంతా వుండగా అడిగేశా. ఛీ అని చక్కాపోయింది. అప్పటినుంచీ ఊరందరికీ నేను రౌడీ రాలుగాయి వెధవననీ, బీడీలు కాలుస్తాననీ, మా బామ్మ వత్తులపెట్టిలో డబ్బులు కాజేస్తాననీ చాటించింది. అంచేత ఆ రోజుల్లో లోకల్ జూలియట్లంతా, లోగడ వెలిగించినదీపాలు ఆరిపేశారు. ఇదంతా పూర్వకథలేగాని, ఇప్పుడు సుబ్బలక్ష్మి చక్కటిపిల్ల. పదహారణాల తెలుగుతనం వుంది. నీలాటి వెధవన్ని చక్కదిద్ది గొప్పవాళ్ళని చేస్తుంది. నే నెలాగా గొప్పవాణ్ణే కాబట్టి నాకు అనవసరం అనుకో. పైగా నాకు రాధ కావాలి. చూశావ్గా, రాధ కావాలి. రాధని తప్ప ఎవర్నీ పెళ్లాడను. రాధ లేకపోతే బ్రతుకంతా చీకటి. అంతా.......

హోల్డాన్ అన్నాడు మీసాలరావు.

☆ ☆ ☆

గోపాలరావు తండ్రి భీమశంకరంగారు కచ్చేరీకి బయలుదేరుతూ గోపాలం మీసాలం గుమ్మంలో బండిదిగడంచూసి ఆగారు. మాటా మంతీ అయ్యాక గోపాలం మీసాలాన్ని స్నానానికిపంపి, చావట్లోకి వచ్చేసరికి తండ్రి ధుమ ధుమలాడిపోతున్నాడు.



వా డెవడోయ్! ఆ మీసాలవాడు? కాపో యినా అంతలేసి మీసాలేమిటోయ్ ఢంకాఫలాసు ఆడేవాడిలాగ? మంచీ చెడ్డా లేదు.

గోపాలం సవినయంగా చెప్పాడు. అతని పేరు జి. వి. మీసాలరావు నాన్నా.

మీసాలరావేమిట్రా! మీసాలరావ్వూ పీపాలరావ్వూనూ. కులం గోత్రం ఊరూ పేరూ లేవా ఏమిటి?

ఉంటాయి నాన్నా. పేరూ అదీ గుర్తులేదు. సాయంత్రం చెబుతా.

భీమశంకరంగారు గయ్‌మన్నారు – అట్టే ఎందుకూ ఆఫీసుకి సెలవుపెట్టి అరుగుమీద కూర్చుంటా. రాసియ్యి కంఠతా వేస్తా అంటూ.

అదికాదు నాన్నా, అతను చాలా మంచివాడు.

ఏడిశావ్. మధ్య నీ సర్టిఫికేటేమిటోయ్! వెధవ సర్టిఫికేటూ, బోడిసర్టిఫికేటూనూ. నేనేం లేచిపొమ్మనలేదుగా ఊఁ...... పరీక్షలు తగలేశావా లేదా?

లేదు అంటూ తన గదిలోకి పోయాడు గోపాలం.

భీమశంకరంగారు ఆఫీసుకి వెళ్ళిపోయారు నవ్వుకుంటూ.

తరువాత గోపాలం మీసాలరావును కేకేశాడు. ఏవిట్రా ఆ వెధవమీసాలూ నువ్వ్వాను– అక్బరు పాదుషాలాగ! తీసిపారేయ్.... కాకపోయినా పెళ్ళికాని వాడివి నీకు అంతలా బుగ్గమీసా లెందుకురా....అవును గానీ, నీ అసలు పేరేమిట్రా?

జీ. వి. మూర్తి అన్నాడు మీసాలరావు బిక్కచచ్చిపోయి.

భోజనాలయ్యాక మీసాలరావుని ఊరిమీదకి తోలేసి, బామ్మదగ్గరకు చేరాడు గోపాలం. వాళ్ళమ్మ సీతమ్మగారు ఎదురింట వైకుంఠపాళీ ఆడబోయింది.

బామ్మా అన్నాడు గోపాలం గారాబుగా.

రా నాన్నా– కూర్చో అంది బామ్మ లాలనగా.

చిక్కిపోయావు బామ్మా.

లేకపోతే బలుస్తానుట్రా పిచ్చి తండ్రీ, ఏమిటో పోయే రోజులే కాని, వచ్చేరోజులు కావుగదరా.

అవేం మాటలే బామ్మా. నువ్వు కాబట్టి ఇంతకాలం ఇంత ఇదిగా ఉన్నావు. ఇదే మేమయితేనా...

చాల్లే నా సంగతే చెప్పావు. మీ తాతగార్ని చూశావో లేదో– నువ్వు బాగా చిన్నవాడివిలే అప్పుడు.... అఁవటా... ఆయనేం ఒక్క బిగిని–

గోపాలం కంగారుపడ్డాడు. తాతగారి పురాణం మొదలు పెట్టనిస్తే తెల్లారిందే. వెంటనే జాగ్రత్తపడ్డాడు. ఔను గాని బామ్మా లక్షవత్తుల నోముకి లక్షవత్తులూ నువ్వే చెయ్యాలటకదూ?.... ఎన్నయ్యాయి? అన్నాడు.

పది నిముషాలకీ, తాతగారి ప్రసక్తినుండి లక్షవత్తుల వ్రత ప్రసక్తికి వచ్చింది బామ్మ. ఆకాడనించి నోములూ, స్త్రీల వ్రతకథలూ, రాములవారి గొప్పతనం మొదలైన పురాణ గాథలన్నీ గోపాలం ఓపిగ్గా ఆలకించాడు. కుశలాయకం పాట విన్నాడు. రాములవారిని చూసి దశరథుడు ఉప్పొంగిపోవడం మళ్ళా ఆ యొక్క రాములవారు తమ కొమాళ్ళయిన కుశలవులను చూసి సంబరపడిపోవడం చెప్పింది బామ్మ.... పుత్రుడు పున్నామ నరకంనుండి రక్షిస్తాడని చెప్పింది.

గోడ గడియారం రెండు వేసింది. రొండు అంది బామ్మ ఆవలిస్తూ.

మరే ఓ కునుకుతియ్యి బామ్మా అన్నాడు గోపాలం.

ఏం కునుకు నాయనా, ఒకటే పెద్దనిద్రలే... నీ కడుపున ఒఖ కాయి కాస్తే అది కాస్తాచూసి, నిశ్చింతగా మీ తాతగారి దగ్గిరకు పోతాను- ఏ లోకానున్నాడో మారాజు. అంది బామ్మ.

తెలీదు బామ్మా తప్పకుండా కనుక్కుంటూ.

ఏవిటే?

అటు ఇటుచూసి ఎవరు లేరు గదా అని సిగ్గు అభినయం చేశాడు గోపాలం. ఏమిటో బామ్మా నువ్వు మరీని అంటూ.

అవునురా వచ్చే దీపావళి పండక్కి నువ్వు పండంటి పాపాయిని కనాలి.

నేనా?

సుబ్బమ్మ నాతో పోటీ వేసిందిలే, తన మనవరాలే ముందర కంటుందని. చూద్దాంగా అన్నా అంది బామ్మ.

ఏడిసిందిలే అనేశాడు గోపాలం. బామ్మ ఊహూ ముచ్చట పడిపోయింది. నా తండ్రే అంటూ మెటికలు విరుచుకుంది. నా మాట నిలబెట్టు బాబూ చప్పున పెళ్లాడి అంది.

బామ్మా! అయితే విను. నాన్నేం.... నాన్నేం.... ఆ సుబ్బలక్ష్మిని నాకే అంటకట్టేద్దామని పన్నాగం వేస్తున్నాడు. బామ్మ కోప్పడుతుంది నాన్నా అని నేను అక్కడికీ చెప్పిచూశా. బామ్మ సుబ్బలక్ష్మి బామ్మతో పోటీవేసింది అనికూడా చెప్పాను. ఆc. నే చెప్తాలేవోయ్ వెధవాయీ అని నన్ను కోప్పడ్డాడు. బామ్మా బామ్మా! సుబ్బలక్ష్మిని నాకు చెయ్యొద్దని నువ్వు గట్టిగా చెప్పు బామ్మా. ముఖ్యంగా నీపోటీ ఏమవుతుందో చూసుకో. మధ్య నాకేం! ఆ సుబ్బమ్మ నిన్ను ఇంక రోజా వెక్కిరిస్తుంది.

నిజమేస్మీ, అంది బామ్మ సాలోచనగా ముక్కుమీద వేలేసుకుని.



పావుగంటలో చకచకా మీసాలరావు గొప్పతనం, రాధమ్మ చక్కదనం, పెద్దలయెడల – బామ్మలయెడల తనలాగే రాధకి ఉండే భక్తి, తాతగారు తనకి కలలో దర్శనమిచ్చి సుబ్బలక్ష్మిని వద్దురా, రాధనే పెళ్ళాడు అని చెప్పడం, అన్నీ బామ్మకి నూరిపోశాడు గోపాలరావు.

బామ్మా ఇదంతా నీకు చెప్పినట్లు మూడో ప్రాణి చెవిన పడరాదు. నామీద ఒట్టు అనేశాడు చివర.

బామ్మ ఒప్పుకుంది. మీ నాన్నకి నేను గట్టిగా చెప్తానులేరా... ఔను గాని ఆ రాధ మన శాఖ పిల్లేనా?

హయ్యో బామ్మా! నువ్వెంత అమాయకురాలివే! చూస్తూ చూస్తూ ఇంకో కులం వాళ్ళని నేను చేసుకుంటానా... వాళ్ళు మన కన్న నిష్ఠకలవాళ్ళు తెలుసా? – నీఅంత కాదనుకో – రాధ అమ్మమ్మకూడా లక్ష వత్తుల నోము నోచింది. నిన్నుగురించి నేను చెపితే, ఊహు ఇదైపోయి, ఎప్పుడూ అక్కగారు అవటాంటూ నీమాటే అంటూ వుండేదనుకో. దూరం ఆలోచించి ఇంకోసంగతి కూడా వెల్లడించాడు గోపాలం. అయితేనే, పాపం మొన్ననే పోయిందిలే.

అయ్యోపాపం! మంచివాళ్ళకి రోజులు కావురా నాయనా. అంది బామ్మ.

మరే, మరే – అంతేకాదు. రాధనీ నన్నూ చూసి చిలకా గోరువంకా అంటూ వుండేది. నువ్వు చూస్తేకూడా మెచ్చుకుంటావని అవిడే చెప్పేదిస్మీ బామ్మా.

కాదు మరీ అంది బామ్మ. ఒరేయ్ గోపన్నా రాత్రి మీ నాన్నతో అమ్మతో నే మాట్లాడతా. నీకు ఆ రాధమ్మనీ, ఆ మీసాల పిల్లాడికి సుబ్బలక్ష్మినీ యిమ్మని చెప్తా. చూస్తే ఆ పిల్లాడూ బుద్ధిమంతుడల్లేనే ఉన్నాడు. యిందాక నన్ను పలకరించి బామ్మగారూ కులాసానా అండీ అవటా అన్నాడు. వినయం వందనం ఉన్నట్టే ఉన్నాడులే. ఒరే అబ్బీ చూస్తాగా. ఏ జంట ముందు కొడుకుని కంటుందో.

సరే బామ్మా పడుకో కాస్సేపు. అవును కాని... అన్నట్టు బామ్మా! అర్జంటుగా ఓ పదిరూపాయల పావలా అర్ధణా కావాలి. పాఠాల పుస్తకం పెద్దది అమ్మొచ్చింది. అది చదివెయ్యాలి.

పదిరూపాయలే! అంది బామ్మ.

కారు చౌక అన్నమాట. ఆ పైన పావలా అర్ధణా ఉంది చూశావూ? అది టాక్సు. అంటే పన్ను అన్నమాట. సర్కారువాళ్ళు ఒడేసి పుచ్చుకుంటారులే.... నాన్ననే అడుగుదును కాని, చూశావు బామ్మా ఈ పెళ్ళి పేచీ ఒకటొచ్చి పడిందికదూ...

అవున్నాయనా... అవును.... నే యిస్తానుండు అంటూ బామ్మలేచి పదిరూపాయల పావలా అర్ధణా యిచ్చేసింది. బామ్మా బటాణీలు కొనుక్కుంటా నాకో అర్ధణా ఇయ్యవూ అన్నాడు గోపాలం – నిజాయితీ బుజువుకి. ముసిముసి నవ్వులతో బామ్మ అణా ఇచ్చేసింది.

మళ్ళీ వచ్చే దీపావళికి మునిమనవణ్ణెత్తాలి అంది బామ్మ నమస్కరించిన గోపాలాన్ని ఆశీర్వదిస్తూ.

ఏడిశావులే బామ్మా అనేశాడు గోపాలం గబుక్కున మీసాలరావు దగ్గిర అలవాటు కొద్దీ.

ఔరా! హౌరా ఎంతపొగరు! అంది బామ్మ. గోపాలం నాలిక్కరచుకున్నాడు. అటు చూస్తే అమ్మవచ్చేస్తోంది గోపన్నా అంటూ. టైములేదు.

హౌరా లేదు కలకత్తా లేదూ పొరపాటైంది. కోప్పడకు బామ్మా! అంటూ తుర్రుమన్నాడు గోపాలరావు.

☆ ☆ ☆

ఎల్. కె. గోపాలరావుకి రాధమ్మనీ, జీవీ మీసాలరావుకి సుబ్బలక్ష్మిని యిచ్చి చెయ్యాలని బామ్మలిద్దరూ గట్టిగా నిశ్చయించారు. అందువల్ల పెద్దలు నిశ్చయించారు. ఫెళ్ళుమంటూ పెళ్ళిళ్ళు జరిగిపోయాయి. గోపాలరావుకి తపీమని చెన్నపట్నంలో గుమాస్తాగిరీ వచ్చేసింది. మీసాలరావు వచ్చిన కట్నంతో చెన్నపట్నంలోనే చిన్న వ్యాపారం పెట్టాడు. వారూ వీరూ ఓ యింటిలోనే కాపరం ఉన్నారు. యిల సాటిలేని జంటా అంటూ. దేశమధ్యంలో బామ్మలిద్దరూ మాంచి హుషారుమీద ఉన్నారు. ఇద్దరూ కలసిపోయి లక్షవత్తులూ చేస్తున్నారు. ఊరూ వాడా కులాసాగా వుంది.

☆ ☆ ☆

గోపాలం పట్టపగ్గాలు లేకుండా వున్నాడు. రాధతో రోజులు గోపాలానికి కవిత్వం నేర్పాయి. పెరుగుమీద తొరక కోసం రాధ పెట్టే రభస అతనికి హృదయమంతటి తోనూ నవ్వడం నేర్పింది. కొనతేలిన రాధమ్మ నాసిక అతనికి దేముడి శిల్పచాతురిని బోధపరచింది. రాధమ్మ నిద్రించినపుడు ఆమె నయనాలు అందానికి అర్థాలు చెప్పాయి. రాధమ్మ చూపులు అతనికి ఏం చెప్పేవో చెప్పడం అతనికి తరం కాదు. రాధమ్మ తరం కాదు.

జీవీ మీసాలరావు జీవితభాగస్వామిని సుబ్బలక్ష్మి ముద్దబంతి రథమల్లె బొద్దుగా వుండేది. ఆమె వచ్చాక అతని జీవితం, లోకం నిండుతనంతో నిండిపోయాయి.

☆ ☆ ☆

ఒక శ్రావణ శుక్రవారం సాయంత్రం పేరంటానికి వెళ్ళి యింటికొస్తున్న రాధనీ, సుబ్బలక్ష్మినీ డాబామీద నించున్న గోపాలం, మీసాలం వరుసక్రమంలో చూసి ముగ్ధులై పోయారు.

మన పెళ్ళాలు యెంత బాగున్నాయిరా అన్నాడు మీసాలరావు.

నీ వాక్యం ఏడిసినట్టుంది.

మా ఆవిడ బాగుందనే అందామనుకున్నా నువ్వు దుఃఖపడతావనే బహువచనం...

ఆపేయ్.

నిజంగా వెనక నువ్వన్నట్టు రాధ నా పూర్వజన్మ పుణ్య ఫలంరా అబ్బీ అన్నాడు గోపాలం ఓ నిముషం ఆగి.

నా పెళ్ళాం మాత్రం ఈమధ్య బ్రాటోవరు బాధగా తయారైందిరా. చిన్నప్పుడు నువు సతాయించావు ఇప్పుడిది చెలాయిస్తోంది. స్వతంత్రించి ఓ కూరముక్క కొని ఎరగను ఈనాటివరకూ అన్నాడు మీసాలం.

రాధ, సుబ్బలక్ష్మి గుమ్మంలోకి వచ్చేశారు. గోపాలం క్రిందికి పరుగెత్తాడు. ఒరేయ్ నన్నింక మీసాలూ గీసాలూ అనకురోయ్! మూర్తి అను అంటూ కేక పెట్టాడు మీసాలరావు అనే జీవీమూర్తి.

. గోపాలంగారూ అన్నాయి రెండు గొంతుకలు.

త్రుళ్ళిపడ్డాడు గోపాలరావు... అప్పులవాళ్ళు....పొయిట్రీ ప్రోజుగా మారిపోయింది. అక్కడికీ గోపాలరావుగారు బాధపడతాడని, హడలిపోతాడని తెలుసు కాబట్టే, అప్పులవాళ్లు యిద్దరే వచ్చారు. వాళ్ళంతా ఉదయం సాయంత్రం షిఫ్టు పద్ధతిలో వచ్చి అడిగిపోతూ ఉంటారు. గోపాలరావు హృదయం మంచిదే. అప్పు తీర్చిపారెయ్యాలనే సత్సంకల్పం వుందికాని – ఏమిటో, దేనికైనా రోజు రావాలి ఘటన వుండాలి. గోపాలానికి పెళ్ళయిన ఆరునెల్లలోనూ యెక్కడ లేని రాబడీ చాలక, పలుకుబడి పెట్టుబడిగా అప్పులు కుప్పతిప్పలుగా చేసిపారేశాడు......

కష్టంమీద వాయిదావేసి పంపేశాడు ఋణదాతలని.

చూశావా నీ ధర్మమా అని వీళ్ళు నా ప్రాణాలు తీసేస్తున్నారు? అన్నాడు రాధవంక తిరిగి బాధగా.

బాగుందండి. మధ్య నన్నంటూ రెందుకండి?. నేనేం మిమ్మల్ని అప్పు చెయ్యమన్నానా, చేస్తే తీర్చొద్దన్నానా

అబ్బే నువ్వేమి అనలేదు. పీపాల కొద్ది స్నోలూ, బస్తాలకొద్ది పౌడర్లూ, బేళ్ళకొద్ది చీరెలూ....

ఔనౌను టన్నులకొద్ది సిగరెట్లూ –

ఏదేనా అంటే చీటికీ మాటికీ అదుగో సిగరెట్లంటావు.....

పోన్లెండి నేనేమీ అనను. ఇంట్లోకి పోనివ్వండి వంట చేసుకోవాలి.

వెళ్ళు. నేనేం కట్టేశానా?

రాధమ్మ బయలుదేరింది.

ఏయ్...పిల్లా?

నన్ను పిల్లా అని పిలవకండి.

రాధ చరచర నడిచింది. గోపాలం వెంటబండి, వంటింటి గుమ్మంలో ఆపాడు.

చూడురాధా! బంగారుతల్లీ అంటాను కాని చెప్పేది కొంచెం విను. అప్పులవాళ్లు నన్ను తినేస్తున్నారు. అందుకని నేను నిన్ను తినేస్తున్నాను. దీనికి ఒకటే దారి. నువ్వు తక్షణం – కనీసం దీపావళీలోగా ఒక్క కొడుకుని కనెయ్యాలి.

రాధ చురచుర చూసింది. ఏవిటండీ యీ గోల! మతిపోయిందేవిటి అంది నవ్వు ఆపుకుంటూ.

మా బామ్మకథ తెలుసుగా. బామ్మ మూలాన్నే నిన్ను నేను సంపాదించుకున్నాను. లేకపోతే సుబ్బలక్ష్మి దాపురించేది. దీపావళినాటికల్లా, వాళ్ళకన్నా ముందుగా నువ్వు

మునిమనవణ్ణి అందిస్తే వెయ్యిరూపాయలు లోపాయికారీగా బహుమానం యిస్తానని బామ్మ నాకు చెప్పింది. ఒట్టువేయించుకున్నా. ఆవిడగాని పందెం ఓడిపోతే ఆ తరువాత ఒకడు కాదు వందమంది కొడుకుల్ని కన్నా ఆ డబ్బు యివ్వదు. మా బామ్మ సంగతి నీకు తెలీదు తెలుసా?

నాకు తెలీదని తెలుసునని కూడా తెలుసు లెండి, తప్పుకోండి. ఆకలేస్తోంది వంటచేసుకోవాలి చప్పున అంది రాధ.

రాధమ్మకి బద్ధకం యెక్కువైపోయిందనీ ఒకరోజు పొద్దున్నే గోపాలరావు ఉద్ఘాటించాడు, మీసాలరావూ సుబ్బలక్ష్మి ఉండగా. నిజంగా అబ్బీ. ఆ పూట అన్నం యీ పూటకి బ్రాటోవరు. కూర బ్రాటోవరు. పచ్చడీ పులుసూ బ్రాటోవరు. చప్పగా చల్లారినవి తినలేక చస్తున్నా అని వివరించాడు.

బ్రతుకే బ్రాటోవరు బ్రదరూ అన్నాడు మీసాలరావు గంభీరంగా. మా ఇంటిదీ అలాగే తయారైంది. దానికి కోపం వచ్చినా సరే. ఎదటే చెప్తున్నా. అయ్యో మొగుడు వెధవ తిరిగి తిరిగి వచ్చాడు వేడి వేడి కాఫీ ఇద్దామనికూడా లేదురా. కూచుంటే లేవదు అన్నాడు.

సుబ్బలక్ష్మి, రాధమ్మాకూడా అమాంతం తిరగబడి గంయ్‌మనలేదు. తలలు వంచుకున్నారు. పురుషపుంగవులిద్దరూ యీ విషయం చూసీ చూడనట్లుగా వూరుకున్నారు.

☆ ☆ ☆

ఊరుకోలేదు. బోలెడుసిగ్గుపడుతూ ఇంటికే ఉత్తరాలు రాశారు. తక్షణం యేదో ఒక బామ్మనో, అమ్మనో పంపడం మంచిదని సూచిస్తూ.

☆ ☆ ☆

నెల్లాళ్ళ తరవాత గోపాలానికే, రాధమ్మ గర్భవతి అన్న విషయం అధికారరీత్యా ధ్రువీకరించబడి ప్రకటించబడగానే, ఏనుగంత బలం వచ్చేసింది. అప్పులవాళ్ళకి దీపావళి గడువుపెట్టేశాడు నిర్భయంగా. కొత్త అప్పులుకూడా చేశాడు. కావాలిస్తే బామ్మని బయానాగా రెండొందలు అడగవచ్చునని కూడా అనుకున్నాడు. వెంటనే 'పుత్రోత్సాహము తండ్రికి' అనే పద్యం చదివెయ్యబోయి యిప్పుడుకాదు కాబోలు అనుకుని మానేశాడు.

గోపాలరావు పుట్టినతరువాత ఇరవై ఆరవదీపావళి నాటికి కులదీపకుడు వెలిశాడు. బామ్మ సంతోషం అవధులు దాటిపోయింది. గుమ్మడిపండంత పాపాయిని చూసిన గోపాలం మళ్ళా పుత్రోత్సాహము తండ్రికి ...... సుమతీ అనే పద్యం చదివెయ్యబోయి, ఇంకా ఇప్పుడప్పుడేగాదులే అనుకుని మళ్ళీ మానేశాడు.

గోపాలం కొడుకు బాలసారెరోజున సుబ్బలక్ష్మి ఎర్రతేలువంటి ఆడపిల్లను ప్రసవించింది. పందెం ఓడినా పరవాలేదులే అంది సుబ్బలక్ష్మి బామ్మ పాపనిచూసిన మీద.

గోపాలం కొడుక్కి శంకరం అని పేరు పెట్టించారు పెద్దలు. ఆ రోజున అన్నప్రకారం బామ్మ గోపాలానికి వెయ్యి రూపాయిల ముడుపు చెల్లించింది. తక్షణం గోపాలం 'పుత్రోత్సాహము తండ్రికి' అనే పద్యం చదివేశాడు. ఆ రాత్రి రాధమ్మకి ఆ పద్యం నేర్పాడు. రాధా నువ్వు నిజంగా నా పూర్వజన్మ సుకృతఫలానివి. బ్రాటోవరు బాధవి కాదు, అంట అనేశాడు. రాధ నవ్వింది. ఏంపాపం! మీ బామ్మ ఇవాళ వెయ్యిరూపాయిలు ఇచ్చినందుకా? అంది

కాదుమరీ! నువ్వెంత గొప్పదానివని! సుబ్బలక్ష్మి కన్నా ముందుగా కొడుకుని కన్నావు – నువ్వెంత గొప్పదానివని! అన్నాడు గోపాలరావు

☆ ☆ ☆

నువ్వెంత గొప్పదానివి! అన్నాడు గోపాలరావు కాశీవెళ్ళే రైల్లో బామ్మ పక్కని కూర్చుని.

గోపాలం బామ్మ పందెం గెలిచిన తరువాత సుబ్బలక్ష్మి బామ్మ సుబ్బమ్మగారు లక్షవత్తుల నోమునోచి ఫలం ధారపోసింది. ఇదంతా జరిగేసరికి గోపాలరావు కొడుకు రెండు దీపావళి పండుగలు చూశాడు. సుబ్బమ్మగారు పందెం ప్రకారం గోపాలం బామ్మ సూరమ్మగారిని కాశీ ప్రయాణం చేయించవలసి ఉంది. సూరమ్మగారు బోలెడు ఔదార్యం ప్రదర్శించింది. ఎందుకు వదినా, లక్షవత్తుల నోముఫలం యిచ్చావు అంతేచాలుకాని, కాశీ ప్రయాణానికి ఎవరి ఖర్చు వాళ్ళు పెట్టుకుందాంలే. ఎటొచ్చీ మా గోపన్న మనకి తోడువస్తాడు కాబట్టి వాడిఖర్చు చెరిసగం పెట్టుకుందాం అంది.

సుబ్బమ్మగారు చాలా ఇదైపోయింది. ఏవిటో వదినా డబ్బు శాశ్వతమా యేమిటి. అయినా నువ్వెప్పుడూ యింతే లెద్దూ....సరే నీమాట ఎందుకు కాదనాలి? అలాగే కానియ్ అంది.

అంచేత, రాధమ్మనీ పిల్లాడినీ పుట్టింటికి తోలేసి, గోపాలరావు బామ్మ లిద్దరిని వెంటేసుకుని కాశీయాత్ర బయలుదేరాడు.

సుబ్బమ్మగారికి కాస్త కునుకుపట్టనిచ్చి, తన తాలూకు బామ్మని యెడా పెడా పొగిడేశాడు గోపాలం. నువ్వెంత గొప్పదానివని బామ్మా! అన్నాడు.

కాశీ చేరినప్పటినుంచీ గోపాలం మనస్సు రాధమ్మ వైపు పరుగులెత్త సాగింది. బామ్మల సరదాలకి అంతూ పొంతూ కనపడటంలేదు. రాత్రింబవళ్లు గోపాలానికి కులదీపకుడు కళ్ళముందు ఆడుతున్నాడు.

గోపాలం మనస్సు ఐహికవిషయాలకై పరుగులెడితే బామ్మల ఆశలు ఆముష్మికచింతనతో పరమాత్ముడికోసం అర్రులు చాచాయి. యిద్దరూ కూడా కాశీతో తృప్తిపడక ఉత్తరాదికి పదవోయ్ అన్నారు. మూడుమాసాలు గడిచిపోయాయి.

హఠాత్తుగా గోపాలం బామ్మ జబ్బుపడింది. గోపన్నా! ఇంతదూరంవచ్చాం, కైలాసం దగ్గిరేట. మళ్ళా ఇంటికెళ్ళినా యిక్కడికే రావాలని సాధువులు చెప్పారు. ఇట్నించి యిటే వెళ్తా అంటూ బెదిరించింది.

మీకేం పిచ్చా యేమిటి వదినా, అలా మాట్లాడకండి. కుర్రాడు ఝడుసుకుంటాడు. అంది సుబ్బమ్మగారు గుడ్లనీరు కుక్కుకుంటూ.

నాకు మాత్రం పిచ్చెక్కడం నిజం అనుకున్నాడు గోపాలం రాధనీ కొడుకునీ తలుచుకుని. సగం విచారంతోటి, సగం సరదాకీ గడ్డాలూమీసాలూ పెంచాడు గోపాలం, చేసేదేమీ లేక.

గోపాలం బామ్మ పనీపాటూ లేకుండా మంచానపడి శివుడు, కైలాసం, వినాయకుడూ, నందీ అంటోంది. తీసుకుపోదాం అంటే కదిలే స్థితిలో లేదు. గోపాలం ఇంటికి ఉత్తరం రాశాడు సంగతి వివరిస్తూ.

ఉత్తరం సరిగ్గా అందుతుందో అందదో నేనే స్వయంగా వెళ్ళి మీ నాన్నని పంపుతా బెంగెట్టుకోకు బాబూ అంది సుబ్బమ్మగారు. ఒకరోజు పొద్దున్నే ఆవిడ మూటాముల్లె సర్దేసుకుంది. నన్నిలా వదిలేస్తారా బామ్మగారూ అన్నాడు గోపాలం దీనుడై.

ఎబ్బే. ఎందు కొదిలేస్తా! పిచ్చితండ్రీ! మీ నాన్నని టెలిగరాపుమీద పంపనూ! అంది సుబ్బమ్మగారు - ఆంధ్రదేశపు త్రైర్థికుల తండా ఆసరా చూసుకుని.

నన్నిలా వదిలేస్తావా బామ్మా అన్నాడు గోపాలం మర్నాడు పొద్దున.... బామ్మకి చాలా ఎక్కువైంది.

నాలుగురోజులకి భీమశంకరంగారు వచ్చేశారు ధుమధుమలాడుతూ.

ఆయన్ని చూడగానే సూరమ్మగారికి పోయిన ప్రాణం లేచివచ్చింది. సుబ్బమ్మ అర్థాంతరంగా వదిలిపోయినందుకు కోపం తెచ్చుకుంది. ఇప్పుడు కాదు కొంచెం పనుంది. మళ్ళారండి అని చెప్పి యములాళ్ళని పంపేసింది. సుబ్బమ్మగార్ని నలుగురిలోనూ పెట్టి దులిపెయ్యాలని తీర్మానించుకుని, పదరా నాన్నా ఇంటికి అంది.

అంతా ఝూంమని కొంపచేరారు.

☆ ☆ ☆

గోపాలం చెన్నపట్నం బయలుదేరుతుండగా బామ్మ చాటుకి పిలిచి రెండొందల రూపాయలు చేతిలోపెట్టి మునిమనవడికి బట్టలు కుట్టించమంది. జేబులో పెట్టుకుని ఎందుకు బామ్మా ఒద్దు అనేశాడు గోపాలం.

ఏదోనాయనా. నీ కొడుకు పుణ్యమా అని కాశీచూసి రాగల్గాను. ఈ పందేలూ పోట్లాటలూ లేకపోతే నా జన్మలో వెళ్ళేదాన్నిరా? నీ కొడుకే నా పాలిటి దేవుడు. వాడే నా పాపాలు నాశనం చేసిన కుమారస్వామి.... కుమారస్వామి తెలుసుగా తారకాసురుడిని.....

తెమలవోయ్ చెవలాయీ మంతనాలు చాలించి అని భీమశంకరంగారు గావు కేక పెట్టారు వీధిలోంచి.

వస్తా బామ్మా. నా కొడుకు నీ పాపాలు కడిగేసి నట్టే నా అప్పులూ కడిగేశాడు, వస్తా అన్నాడు గోపాలం.

☆ ☆ ☆

పట్టపగ్గాలు లేనంత హుషారుగా చెన్నపట్నంలో తన యింటి గుమ్మం ముందు నిల్చుని తలుపు దబదబ గొట్టాడు. గోపాలరావు, రాధా రారా దాదా రాధా అంటూ.

వచ్చే వచ్చే అని సన్నగా దూరంనుండి తియ్యని స్వరం వినిపించింది.

నాలుగుక్షణాలలో తలుపులు తెరుచుకున్నాయి. వారూళ్ళోలేరు మళ్ళీ రండి అంది రాధ.

గోపాలం నవ్వాడు.

హయ్యో! ఆ మీసాలేమిటీ – ఆ గడ్డాలేమిటీ – అంటూ తేరుకుని పకపక నవ్వసాగింది రాధ.

గోపాలానికి అరికాలి మంట నెత్తి కెక్కింది.

నాలుగు నెలలపాటు దేశాంతరాలు తిరిగి అష్టకష్టాలు పడి గడ్డాలూ మీసాలూ పెంచి కొంప చేరితే ఆలుబిడ్డలిచ్చే స్వాగతం ఇదేనా! బావుందే యెంతో బావుంది. ఆ చాలా బావుంది. రాధా! చాలా బావుంది ఇదీ య్యేన్‌తో బావుంది ఆ....చాలా.

రాధ కంగారు పడింది. ఏవండోయ్. ఆగండి. ఆగండి... ఆగడం చేతకాదా యేమిటి?.... ఇదెక్కడ ఖర్మమ్మా అంది.

గోపాలం ఆగలేకపోయాడు. నిర్విరామంగా, బాగుంది పాట సాగించాడు. రాధ చెంగున ఓ అంగ ముందుకు వేసి తన కరకమలాలతో గోపాలం వదనారవిందాన్ని సముదాయించింది. గోపాలం చల్లబడ్డాడు. రెండు క్షణాల నిశ్శబ్దం. హఠాత్తుగా గోపాలం గావుకేకపెట్టి కిందికి చూశాడు. మూడున్నర అడుగుల క్రింద ఒక చిన్న మానవశాల్తీ ఉంది. దాని చేతిలో పోపుగరిటె ఉంది. ఆ గరిటెతో ఆ శాల్తీ తన మోకాటి చిప్ప విరిగేలా కొట్టిందని గోపాలం చటుక్కున గ్రహించేశాడు.

ఎవడే ఈ వెధవ అని గర్జించాడు.

వాణ్ణే అడగండి అది రాధ కొంచెం చిన్నబుచ్చుకుని.

ఎవడ్రా నువ్వూ.

రాడీని.

ఆ.



నేను రాడీని, నువ్వు బూచివి.... వెధవా అన్నాడు.

గోపాలం తుళ్ళిపడ్డాడు. ఆ! అన్నాడు. ఆ! ఆ! అన్నాడు. అక్కడనించి ఆగకుండా ఆ అలు ప్రారంభించాడు.

ఐదెక్కడ గోలండీ అంటూ రాధ మళ్ళీ ముందడుగు వేసింది.

రెండు క్షణాలలో గోపాలం మోకాటి చిప్పకి మళ్ళీ దెబ్బతగిలింది. కెవ్వుమన్నాడు గోపాలం ఆ అలు మానేసి.

ష్. ఏవిటండీ ఆ గావుకేకలు? యెవరన్నా వింటే ఖూనీలు జరుగుతున్నా యనుకుంటారు అంది రాధ చిరాగ్గా.

మాటా మంతీ మానేసి యీ బాగోతం బావుంది అంటూ విసుక్కుంది.

గోపాలం మోకాలు తడుముకుంటూ, కుర్రాణ్ణి తేరి చూశాడు. హోరినీ! నువ్వురా! శంకరంగాడివా! ఒరి! హోరి! అడుగేస్తేపడే వెధవాయవి యింతవాడయ్యావురా. ఓరీ! అరి అంటూ అమాంతం కొడుకుని గుర్తుపట్టేసి యెత్తుకున్నాడు. రాధ దూరం ఆలోచించి శంకరంచేతిలోని గరిటె లాగేసింది.

గడ్డాలూ మీసాలతోఉన్న గోపాలరావు మొహాన్ని దగ్గరనుంచి చూడగానే శంకరం హడలిపోయి బావురుమన్నాడు. అవటా గోపాలం ముఖాన రెండుమూడు దెబ్బలు కొట్టాడు. లాభంలేదనుకుని మీసాలు పట్టుకు లాగేశాడు.

గోపాలానికి ప్రాణం జిలార్చుకుపోయింది. అమాంతం కుర్రాణ్ణి కిందపడేశాడు. రాధమ్మ వెంటనే వాణ్ణి యెత్తుకు సముదాయించసాగింది.

ఉండండి వస్తా అంటూ పెరట్లోకివెళ్ళి కొడుకుని సుబ్బలక్ష్మికి ఒప్పగించి వచ్చింది. గోపాలం దిగులుపడి కూర్చున్నాడు. పావుగంటసేపు రాధమ్మ లాలించాక మామూలు మనిషి అయ్యాడు.

నిన్ను ముట్టుకున్నప్పుడల్లా వాడిలాగ కొడితే ఎలాగా మరి?

కొత్తకదండీ మిమ్మల్ని మర్చిపోయాడు. పైగా మీ గడ్డాలు మీసాలూ చూసి, బూచాడొచ్చి నన్నెత్తుకుపోతున్నాడని భయపడ్డాడు అంది రాధ.

రక్షించావు అన్నాడు గోపాలం.

ఛా. ఏమిటండీ ఆ మాటలు అసహ్యంగా.

వాడికి ఈ రాడీ గివుడీమాటలు ఎలా పట్టుబడ్డాయంట.

మా తమ్ముడి తరిఫీదు మూడొంతులూ, మీ మూర్తిగారి శిక్షణ ఒక వంతూనూ, అది సరే మీరు మీసాలూ గడ్డాలూ తీయించెయ్యండి బాబూ వాడి జడుపు సగం పోతుంది... అంది రాధ.

మర్నాడే గోపాలం మీసాలూ గడ్డాలూ తీయించేశాడు. కొడుకుని మంచిచేసుకోడానికి నానా తిప్పలూ పడటం మొదలెట్టాడు. లేకపోతే వాడు దారికిరాడు.

జీవీ మీసాలరావు, సుబ్బలక్ష్మి, పాపా రాజమండ్రి వెళ్ళారు.

ఆ రోజున ఆఫీసుకి బయలుదేరుతూ డ్రెస్ చేసుకున్నాడు గోపాలం. సాక్సు తొడుక్కుంటూ కూర్చున్నవాడు కాస్తా హఠాత్తుగా లేచి, రాధ దగ్గరకువెళ్ళి చెవులు

మెలేసి వెక్కిరించి మళ్ళా వచ్చి కుర్చీలో కూర్చోబోయాడు. దబేల్న కిందపడ్డాడు. రాధమ్మ పకాల్న నవ్వింది. కుర్చీ పక్కకులాగేసిన సుపుత్రుడు నిర్లక్ష్యంగా చూస్తున్నాడు గోపాలం కేసి.

రౌడీ! రాస్కిల్ వెధవా! అన్నాడు గోపాలం, బలం అంతా వుపయోగించి.

నువ్వే రౌడీ బూచాడు వెతవ. రాస్తైల్ అంటూ శంకరం తుర్రునపరుగెత్తి రాధ చెంగుచాటుకి చేరాడు.



బడవా అన్నాడు గోపాలం.

ఎదవా అన్నాడు శంకరం.

ఛప్

చప్

ఏవిటండి మీరు మరీని వాడితో సమానంగా అంది రాధ విసుగ్గా.

గోపాలం మండిపడ్డాడు. ఎప్పుడూ ఆ వెధవని వెనకేసుకొస్తావేం. నేనేదో ద్రోహం చేసినట్లు... తప్పు నాదో వాడిదో తెలియటంలే?

రాధమ్మ విరగబడి నవ్వింది. బావుందండీ నా కిద్దరు పిల్లలన్నమాట? అంది.

రాధ మాటలు గోపాలానికి ముళ్ళలా గుచ్చుకున్నాయి. ఓ మూల చట్ట నొప్పి పెడుతోంది. ఉక్రోషం పట్టలేకపోయాడు. మతి స్థిరం తప్పింది. నవ్వు నవ్వు... అలాగే నవ్వు... నేను నిన్ను యేరికోరి వరించినందుకు మంచి శాస్తిలే, ఛీ... అంటూ చరచర ఆఫీసుకి వెళ్ళిపోయాడు. రాధ నివ్వెరబోయింది, కనీ వినీ యెరగని యీ ధోరణికి...

సాయంత్రం గోపాలం ఇంటికొచ్చేసరికి రాధ అలిగి అటు తిరిగి పడుకుంది. వంటింట్లో కెళ్ళాడు. మధ్యాహ్నం వంటఅంతా అలాగే పడిఉంది. రాధ కదల్లేదు. పక్కనే కుర్రాడు పడుకున్నాడు. ఏయ్! అన్నాడు గోపాలం. రాధ పలకలేదు. సరే మాట్లాడకులే అన్నాడు. రాధ మాట్టాడలేదు.

హాల్లో చాపవేసుకు పడుకున్నాడు గోపాలం. ఏడు గంటలయింది. శంకరం నిద్రలేచాడు. అమ్మని పిలిచాడు. పలుకలేదు. మెల్లిగా హాల్లోకి వచ్చాడు. వాడికి భయం పుట్టింది. గోపాలం దగ్గరగా వెళ్ళి ఎదుట నిలుచున్నాడు దిక్కు మొహంతో. గోపాలం ఒక్కక్షణం తేరి చూశాడు, సందేహిస్తూనే చేతులు జాచాడు. శంకరం దగ్గరకు చేరాడు. అక్కున చేర్చుకుని ముద్దుపెట్టుకున్నాడు గోపాలం. ఒక్కసారి ఆనందం పెల్లుబికింది.

ఆకలేత్తోంది అన్నాడు శంకరం.

లోపలికి తీసుకెళ్ళి అన్నం తినిపించాడు. భుజంమీద వేసుకొని జోకొట్టాడు.

ఇద్దరూ హాల్లోనే నిద్రపోయారు.

తెల్లవారింది. రాధ కాఫీచేసి అక్కడపెట్టి, వెళ్ళి పడుకుంది. మాటామంతీ లేదు. గోపాలం ఆఫీసుకి సెలవు పెట్టాడు. దీపావళి మూడు రోజులుంది.

చాలా భయంకరంగా ఉంటుంది ఈసారి దీపావళి అనుకున్నాడు. కుర్రాణ్ణి బజారుకు తీసుకుపోయి ఇడ్రెస్లు పెట్టించాడు. టపాకాయలు గంపెడు కొనేశాడు. అనుకోకుండా కుర్రాడికి తనదగ్గిర చనువైనందుకు ఎంతో సంతోషించాడు. రాధమ్మతో పోట్లాడినందుకు విచారించాడు. తనెంత తొందరపడ్డా సముదాయించే రాధమ్మకి ఈసారి ఇంతకోపం వచ్చింది. రాధకి కోపం రాదు. వస్తే తగ్గడం అతికష్టం అని ఇదివరలో రెండుసార్లు అనుభవంవల్ల తెలుసుకున్నాడు.

మధ్యాహ్నం ఉత్తరం వచ్చింది ఇంటిదగ్గరనుంచి. నువ్వూ, చి॥సౌ॥ రాధమ్మా. చి॥ శంకరం రేపే బయలుదేరి రావలెను– బామ్మ చూడాలని ఆరాటపడుతున్నది.

కాబట్టి, నీ అత్తవారు పిలిచినా ఈ సంగతి చెప్పి ఇక్కడికే రావలెను అని భీమశంకరంగారు వ్రాశారు.

ఉత్తరం శంకరం చేతికిచ్చి రాధగదిలోకి పంపాడు గోపాలం. తను వంటింట్లో కెళ్ళి కాఫీ కుంపటి రాజేశాడు. పదినిముషాల తరువాత రాధమ్మ వచ్చి గుమ్మంమీద నిల్చుంది. చేతిలోని చిన్న సంచిలోనుంచి చీరలు తొంగి చూశాయి. గోపాలం లేచి నుంచున్నాడు మసిబారిన చేతులు పంట్లాంకి రుద్దుకుంటూ.

రాధ చూపులు నేలకి వాల్చింది. మీరు వెళ్ళండి కావలిస్తే నేనూ పిల్లవాడూ మా ఇంటికి వెళ్తాం అంది.

ఐతే నాతో ఎందుకు చెప్పడం అన్నాడు గోపాలం గోడని చూస్తూ.

ఉత్తరం కుర్రాడు తెచ్చి ఇచ్చాడని. మాకూ అభిమానం వుంది అంది రాధ వెనక్కి తిరగబోతూ.

హఠాత్తుగా గోడలు దద్దరిల్లి కప్పు ఎగిరిపోయేటంత శబ్దమైంది. రాధ బావురుమంది. శంకరం కెవ్వుమన్నాడు. గోపాలం తుళ్ళిపడ్డాడు. అటు రాధ ఇటు శంకరం ఒక్కసారిగా గోపాలాన్ని పెనవేసుకున్నారు. రెండు క్షణాలపాటు ముగ్గురూ రాతిబొమ్మలకిమల్లే ఉండిపోయారు.

గోపాలం మెల్లిగా కళ్ళు తెరిచి చుట్టూ చూశాడు. పడిపోయిన కుంపటీ, దూరాన పడిఉన్న కాఫీ గిన్నీ ఆటంబాంబుచేత్తొ చాలా కథ చెప్పాయి గోపాలానికి.

రాధ కళ్ళలోకి సూటిగా చూశాడు గోపాలం.

నవ్వుతూ ఏయ్ పిల్లా నన్నెందుకు ముట్టుకున్నావ్? అన్నాడు.

వాణ్ణే అడగండి.

ఎవణ్ణి?

ఇంకెవరు? మీ సుపుత్రుణ్ణి.

అనగనగా ఒక రాధమ్మ

అంతకుముందో గోపాలం.

ఆ తరవాతో పాపాయి.

* * *



# చుట్టాలొచ్చారు

రాధా! త్వరగా టీ చెయ్యి. సినిమా కెళ్దాం అన్నాడు గోపాలం కోటెప్పుతూ; కథల్లో గోరువంకను చిలక  పలకరించవలసిన పద్ధతిలో.

సావడికి కుడివైపు ఉన్న నట్టింటి కిటికీగుండా వంటింట్లోకి శ్రద్ధగా చూస్తోంది రాధ.

అదేవిటా సరసం అన్నాడు గోపాలం పడకకుర్చీలో కూర్చుని బూటెప్పుతూ.

ష్ అంది రాధ వంటింటిమీద దృష్టి మళ్ళించకుండానే.

గోపాలం రాధవంక తలతిప్పి చూశాడు. రాధ గోపాలంవైపు చూడకుండానే చెయ్యి మాత్రం సారించి, రమ్మన్నట్టు  వేళ్ళు ఆడించింది.

అందమైన అమ్మాయి చెయ్యి ఊపినట్టుంది అనుకున్నాడు గోపాలం.

రాధ అమ్మాయి, రాధ అందంగా ఉంటుంది.

రాధ చెయ్యి వూపి పిలిచింది కూడా.

ఏమిటి సంగతి? అన్నాడు గోపాలం లేవకుండానే.

ఈసారి ఇద్దరు 'ష్' అని అతన్ని మందలించారు.

ఏదో ఉంది విశేషం అని చటుక్కున నిర్ధారణ చేసుకుని వంటింట్లోకి నడిచాడు గోపాలం. కిటికీలోంచి శ్రద్ధగా, వూపిరి  బిగబట్టి చూస్తున్న రాధ కొంచెం జరిగింది. గోపాలం వంటింట్లోకి తొంగిచూసి కెవ్వుమన్నాడు నిశ్శబ్దంగానే. అయినా రాధ కంగారు పడి, ఇందాకటి అందమైన వేళ్ళతో గోపాలం పెదిమలను అదిమి కేరింతలు వారించింది.



నిజానికి గోపాలం కేరింతకాని, రాధమ్మ 'ఇష్' అనడంకాని వంటింట్లో యెవరికీ వినబడలేదు. లోపల నానా హడావుడిగా ఉంది. గుడ్లప్పచెప్పి చూచిన గోపాలరావుకి కంటికి నిండుగా మనుషులు కనపడ్డారు. చెవినిండా గోల వినబడింది. వేపడం ఘాటుతో ముక్కుకి మతిపోయింది.

లోపల వేపడాల టూర్నమెంటు జరిగిపోతోంది. ఒక పెద్ద సోంపేట దొడ్డమ్మగారు భారీయెత్తున దుక్కల్లాటి కందముక్కలు వేయించేస్తున్నారు. పెద్ద బూరెలమూకుడూ దాన్ని మోయతగిన సైజులో పెద్ద ఇనపపొయ్యా ఉన్నాయి. ఆదివారాలలో తలంట్లు పోసుకునే రోజునే గోపాలం తాలూకు సంసారంవారు ఆ పొయ్యిని వాడకంలోకి తెస్తారు. రాధమ్మ దృష్టిలో గోపాలంచేసే అవకతవక ఖర్చుల్లా ఆ పొయ్యిలో కర్రలు తగలబడిపోతున్నాయి.



దొడ్డమ్మగారి పక్కనే ఒక చిన్నసైజు బుచ్చి కక్కిగారు ఒక పెద్ద కుంపటిమీద చిన్నమూకుడుంచి ఓ మాదిరిసైజు బంగాళదుంప ముక్కలు వేయించేస్తున్నారు.

ఆ కుంపట్లో కణకణమండే చింత బొగ్గులు గోపాలం దృష్టిలో రాధమ్మ ఖర్చులా వెలిగిపోయాయి. ఆ పొయ్యికీ, ఈ కుంపటికీ మధ్య పడివున్న నూనెగిన్నె, మూడో తారీఖు పొద్దున్న మూలపడి ఉండే గోపాలరావు మనీపర్సులా దిగాలు మొహం పెట్టి ఓ యజమానీ! నిస్సహాయురాలను సుమా! అంది.

ఈ ఆర్తనాదం విన్న గోపాలరావు, వంటింట్లో జరుగుతున్న టూర్నమెంటు రంగంమీదికి ఉరకడానికి ఉద్యుక్తుడయ్యాడు. కాని మూకుట్లో వేగుతున్న దుక్కల్లాంటి కందముక్కలకే దిక్కుమొక్కూ లేక నానా అల్లకల్లోలంగా ఎగిరెగిరిపడుతూ ఉంటే తను వెళ్ళినా అక్కడి జనం కంటికి ఆనకపోవచ్చునని తోచి విరమించుకున్నాడు.

వంటింటికి అవతలగా చిన్న మెట్రోపాలిటన్ పెరడు ఉంది.

ఆ పెరట్లో ఒక పెద్దాయన అంగోస్త్రం కట్టుకుని పిట్టగోడకి చేరబడి విలాసంగా కాలుమీద కాలువేసుకొని, అర్ధనిమీలితనేత్రుడై బట్టతలని ఓదార్చుకుంటున్నాడు.

ఆయన బొడ్డుమీద ఓ దిట్టమైన పాప అట్టముక్క ఒక్కటి పెట్టి మసిబొగ్గుతో బొమ్మవేసుకుంటూ పాడుతోంది.

ఆ చిన్న పెరడులో ఇంకా మిగిలిన కొద్దిపాటి చోటులోనూ బుద్ధిమంతుడివలె కనపడే ఒక అబ్బాయి అతి పొదుపుగా మఠం వేసుకు కూర్చుని పెద్దాయనచెప్పే దారిఖర్చులు చిన్నసైజు పద్దు పుస్తకంలో రాస్తున్నాడు.

ఇంకా మిగిలిన కొద్ది చోటులోనూ కొంచెం బొద్దుగా బంగారు బొమ్మలా ఉన్న ఒక ముద్దరాలు మోకాళ్ళపై గడ్డం ఆనించి, పచ్చని పాదాలను ప్రేమతో కౌగలించుకున్న వెండిపట్టీలను మునివేళ్ళతో నిమురుతూ, పద్దులు రాస్తున్న అబ్బాయివంక ఎంతో ఆపేక్షతో, అంతకుమించిన గౌరవంతో, ఇంకెంతో భక్తితో రెప్పవాల్చకుండా చూస్తోంది.

ప్రశాంతత అని ఆ దృశ్యాన్ని పిలవాలి అని తట్టని వాళ్ళకోసం ప్రకృతి అంతా ప్రశాంతంగా ప్రవర్తిల్లుతోంది. వాళ్ళ మనసులలో ఆలోచనలలా గాలి చల్లగా నెమ్మదిగా వీస్తోంది. ఆ అమ్మాయి పచ్చటి నుదురుమీద ముంగురులను అటూ ఇటూ జరుపుతూ ఆ నీలరేఖలతో క్షణానికో కొత్త అందాన్ని చందాన్ని చూపిస్తోంది. ఒక్క సన్నటి నల్లగీత ఒక్క కదలికతో యెంతలేసి అద్భుతాలు చేయగలదో తెలియచెబుతోంది.

ఈ కమనీయ దృశ్యాన్ని రెండుక్షణాలు చూసిన గోపాలం అరక్షణంపాటు పెరట్లోని అమ్మాయి సోయగాన్ని మెచ్చుకొని మూడోక్షణంనుండి రాధవంక ప్రశ్నార్థకంగా చూడడం ప్రారంభించాడు.



ఏమో! అన్నాయి రాధకళ్ళు. ఆమె నల్లటి కనుబొమలు చిత్రంగా పైకితేలి చిన్నవంపు తిరిగాయి.

బాణం వెయ్యనా నాన్నా వాళ్ళమీద? అన్నాడు రాధ చెంగు చాటున ధనుర్ధారుడై దాగిఉన్న శంకరం.

ఛప్ అన్నాడు గోపాలం.

ఉష్ అంది రాధ మళ్ళీ గోపాలం పెదిమలను యిందాకటి అందమైన మునివేళ్ళతో అదుపుచేస్తూ.

హూఁ అని గోపాలం విసుక్కోబోయాడు. అస్తమానం నన్నే గసుర్తావు వాణ్ణి తిట్టవేం? అన్నాడు.

వంటింటో యెవరో ఫెళఫెళ నవ్వారు. గోడ, కిటికీ, దాన్ని పట్టుకున్న గోపాలరావు, అర్ధాంగి రాధ, తనూజుడు శంకరం, వాడి విల్లమ్ముల్లూ అదిరిపోవడం జరిగింది.

పూర్వం రాజులు ద్వంద్వ యుద్ధాలు చేస్తూవుండేవారు. కథలు అయిపోవస్తూండగా విజయసింహుడికి ద్రోహంచేసిన దుర్జయుడు లేక దుర్ముఖుడికి పోరాటం జరిగేది. అప్పుడు వాళ్ళు సరాసరి నోరుమూసుకు తన్నుకోవడం, పొడుచుకోవడం ద్వారా సంగతి సందర్భాలు ఓ పట్టాన తేల్చుకునేవారు కారు.

ఓరీ! దుర్మతీ! సింగంబుముందు జింక చెలగాటమా! నా ముందు నీ వేడ! ఇదే వధించితి అని విజయుడు అనేవాడు. ఓరీ కబుర్ల కేమిలెమ్ము. ఇదే వధింతు సుమ్ము అని దుర్ముఖుడు బదులు చెప్పేవాడు. ఈ ధోరణిలో మంచీ చెడ్డా మాట్లాడుకుంటూ పోట్లాడుకునేవారు.

కందముక్కలు భారీయెత్తున వేయించేస్తున్న దొడ్డమ్మగారు, బంగాళాదుంపలు వేయిస్తున్న బుచ్చికక్కిగారిని హేళనచేస్తూ ఫెళ్ళున నవ్వింది.

ఏవండో ఒదినా! యెందుకమ్మా ఆ వేపడం? కూరొండుతున్నానని ఒప్పేసుకో రాదూ? వేపడం అంటే మజాకా కాదు– ఎవరికి పడితే వాళ్ళకి ఒళుపొచ్చేసేడానికి అంటూ యింకో గిన్నెడు నూనె కందముక్కలమీద పోసింది.

బుచ్చికక్కిగారు విలాసంగా నవ్వుతూ, అరమోడ్పు కన్నులతో బంగాళదుంపల వంకచూసింది. పోదురూ మీరు బొత్తిగా ఇది...ఏదో శాస్త్రం చెప్పినట్టుంది... కాపోయినా అలా నూనె దిమ్మరించేసుకుంటే కడుపులో వికారపెట్టేదూ? పైగా ఉడకేసివార్చి పుల్లపెట్టి మరీ వేయిస్తున్నారాయె....వేపడం అంటే ఇది. నేవళీకం ఉండద్దమ్మా అంటూ పెంకుముక్కలతో మూకుడిని పైకెత్తి ఒక్కసారి కుదపాయించింది. బంగాళదుంప ముక్కలన్నీ పాలోమంటూ పైకెగిరి గాలోమంటూ మళ్ళీ మూకుట్లో పడ్డాయి.

గోపాలరావు భరించలేకపోయాడు యీ ధోరణి. కాస్త భయస్తుడవడంవల్ల పెళ్ళాంచెయ్యి. కుర్రాడిరెక్కా పట్టుకుని, సరాసరి హాలులోకి వచ్చేశాడు.

ఎవరు వాళ్ళు అన్నాడు కోపంగా.

రాధ నవ్వింది. వెళ్ళి అడగండి. ఎవరో మీ వాళ్లేట.

నాకు తెలీదు అన్నాడు గోపాలం.

మీ కొడుకు నడగండి. వాడే లోపలికి పిలిచాడు.

గోపాలం ఆలోచించాడు. ఈ విషయం ఇక్కడకాదు మాట్లాడవలసింది. మూడిళ్ళ అవతల మీసాలరావు ఇల్లుంది. వాడు ఊళ్ళోలేడు. తాళంచెవులు తనదగ్గరేవున్నాయి. అక్కడికి పోయి ధైర్యంగా మంచీ చెడ్డా మాట్లాడుకోవటం మంచిదనుకున్నాడు. నిర్భయంగా.

మీసాలం ఇంటికి పద అన్నాడు.

ఎందుకండీ. మీరే పలకరించి అడగరాదూ? అంది రాధ.

కాదు నీకు తెలీదు, ముందక్కడికి పద. స్థిమితంగా మాట్లాడుకుందాం... పద పద అన్నాడు గోపాలం.

పదండి అంది రాధ అలమారులోంచి తాళంచెవులు పట్టుకొస్తూ.

ఇల్లెలాగ? ఇక్కడ దొంగతనములు చేయరాదు అని బోర్డు కడదామా. అన్నాడు గోపాలం హడావుడిగా నడుస్తూనే నవ్వుతూ.

మరే యజమాని త్వరలోనే తిరిగి రాగలడు జాగ్రత్త అని షరా కూడా రాయండి అంది రాధ.

☆ ☆ ☆

మీసాలరావు యింట్లో చతిగిలబడ్డాక గబగబ చెప్పండి అన్నాడు గోపాలం.

నువ్వు చెప్పరా అంది రాధ కొడుకుని మోచేత్తో పొడుస్తూ.

నువ్వే చెప్పు నేను ఊ కొడతాను అన్నాడు శంకర్రావు.

ఉద్ధరిస్తావు....అదికాదండీ నేనేమో హాల్లో ఆడుకుంటున్నాను. వీడు వంటింటిలో కుంపటి రాజేస్తున్నాడు, అంతలో యెవళ్లో గబగబ మాట్లాడేస్తున్నారు. తీరా వచ్చి చూస్తే వీళ్ళు. వాళ్ళెవళ్ళో ఎలావచ్చారో. మీ బుల్లిబాబునే అడగండి అంది రాధ.



నువ్వు చెప్పరా అన్నాడు గోపాలం.

అదీకాదు నాన్నా... మరేమో...

ఒరేయ్ చిన్నా నీకు సినిమా ఇష్టమేనా?

హిందీ తెలుగూ ఇష్టంలేవు...ఇంగ్లీషు

రైట్–ఇంగ్లీషు సినిమాకి తీసుకెళ్తాను కాని...

అదేమిటండీ? బొత్తిగా మతిపోయిందేమిటి? వాళ్ళనింట్లో వదిలేసి ఇంగ్లీషు సినిమా కెళ్తారా? అంది రాధ.

గోపాలం విసుక్కున్నాడు. చెప్పు బాబూ! వాళ్ళెవరో గబుక్కున చెప్పెయ్ చూద్దాం.

శంకరం చెప్పేశాడు చకచక. అదికాదు నాన్నా...మరేమో నేను ఆడుకుంటున్నా, బండొచ్చింది–వాళ్ళు దిగి లోపలకొచ్చారు. మీ నాన్నేడీ అన్నారు. గోపాలరావుగారి ఇల్లేనా అన్నారు. అవునండి లోపలికి రండి, కూర్చోండి మంచి నీళ్ళు కావాలండి మా నాన్న లేడండి. ఇప్పుడే వస్తాడండి అని చెప్పాను. ఓ పెద్దవిడా లేదు...? ఆవిడేం, నన్నెత్తేసుకుని నా తండ్రే అని ముద్దుపెట్టేసుకుంది నాన్నా. మళ్ళీనేమో దింపాక ఏవండీ మీకు కాఫీ కావాలా ఓల్టీనా ఆర్లిక్సా అని అడిగాను. అప్పుడేమో....

చాలు బాబు చాలు...ఎవరు రాధా! చెప్పరాదూ అన్నాడు గోపాలం.

అయ్యో కర్మ! నాకు తెలీదండీ! మీరు మప్పిపెట్టారుగా బుద్ధులు. అందుకని వీడే లోపలికి పిల్చి మర్యాద చేశాడు. నేను వంటింటిలోంచి వచ్చేసరికే వాళ్ళు నట్టింట్లో సామాను సర్దేసుకున్నారు.

అదేం మాట! ఆ మాట చెరిపెయ్. కుర్రాడికి మంచి బుద్ధులు నేర్పడం తప్పా? ఇంటికొచ్చినవాళ్ళని పొండని తిట్టమని నేర్పమంటావా? వాడికి తోచింది వాడు బాగానే చేశాడు. వాడికన్న, ఆఖరికి నాకన్నా తెలివైనదానివనుకునే నువ్వేం చేశావంట? ముక్కూ, మొహం యెరగని పరాయివాళ్ళని వంటింటో ముక్కలు వేపడాలు చేసుకోమని విచ్చలవిడిగా వదిలిపెట్టేసి పైగా కిటికీలోంచి తొంగి చూస్తున్నావా? మీ రెవరండీ? ఏ వూరూ? దొంగలా? దొరలా? మీకు నేను తెలుసా మా ఆయన తెలుసా? లేకపోతే మా అబ్బాయితో పరిచయం మాత్రమేనా? అవటాని మంచీ చెడ్డా అడగద్దూ? అన్నాడు గోపాలరావు.

రాధ మొహం ముడుచుకుంది. ఇదిగో చూడండి. వాళ్ళెవరో పెద్దమనుష్యులు. ఇంటికొచ్చారు. మర్యాదచేశాను. పెద్దవాళ్ళున్నారు కాబట్టి నలుగురికి వాళ్ళే ఉడకేసి పడేస్తామన్నారు. మీ వాళ్ళుకదా అనీ, వాళ్ళమాట కాదనలేకా సరే అన్నాను. మీకూ తెలియకపోతే వెళ్ళిపోతారులెండి. అంతేకాని, వాళ్ళు దొంగలనడం తప్పకాదండీ.... మనుష్యులమీద బొత్తిగా యింత అపనమ్మకం ఐతే ఎలాగ?

గోపాలం జాలిగా, కొంచెం హేళనగా మందహాసం చేశాడు. హుఁ అన్నాడు.

చూడు రాధా! అందుకే ఆడవాళ్ళని ఆడవాళ్ళూ మొగవాళ్లని మొగాళ్ళూ అన్నారు. నువ్వు నిజంగా చిన్నపిల్లవి సుమీ! నీకు తెలీదుగాని, ఇలా మొగుళ్లకి తెలిసినవాళ్లనుకుని పెళ్ళాలూ, పెళ్ళాలచుట్టాలు కాబోలని మొగుళ్ళూ ఊహించుకుని, అమాంతంగా వచ్చే చుట్టాలకు ఇల్లు వదిలిపెట్టి గుల్లచేసుకున్న సంఘటనలు భారతావనిలో యెన్నో ఉన్నాయి. హుఁ నీకేం తెలుసు చిన్నదానివి. లోకంలో ఈ మధ్య అధర్మం, అసత్యం, వంచన, మోసం, టోకరా యెంతగా పేట్రేగి పోయాయో నీకేం తెలుసు? పేపరు చదివితేగా?... కనీసం కథలేనా చదవవాయె; ఇలాంటివాళ్ళని చూస్తూ చూస్తూ ఎలా నమ్మను?

తన గంభీరోపన్యాసానికి మురిసిపోయాడు గోపాలరావు.

రాధ గంయిమంది. ఇంతకీ వాళ్ళు టోకరామనుషులంటారు. ఎలా అన బుద్ధేసిందండి ఆ మాట!

గోపాలం జాలిగా నవ్వాడు మళ్ళా. నాకు తెలుసుగా! నువ్వలా అంటావని, దొంగలంటే గళ్ళ లుంగీ, నల్ల బనీనూ వేసుకునీ కోరమీసాలు మెలేసుకుంటూ విజిటింగు కార్డు పట్టుకు మరీ వస్తారని నీ ఊహ కాబోలు! ఇప్పుడు మనింటికొచ్చారు చూడు. వీళ్ళొక రకం ఘరానా లన్నమాట! నేను లేనపుడు వచ్చేశారా! నవ్వుతూ పేలుతూ నాలుగు రోజులుండి సుష్టుగా వండుకు తినేస్తారు! ఉప్పూ, పప్పూ అయిపోయాక ఏ చెంబో, చేంతాడో పట్టుకు చక్కాపోతారు, అంతే! చూడు కావలిస్తే!

మీకేం ఆ బెంగవద్దులెండి. ఉప్పూ పప్పూ ఆఖరికి ఆ కూర ముక్కలు కూడా వాళ్ళే తెచ్చుకున్నారు. మీ చెంబూ చేంతాడూ అంతకన్నా వాళ్లకక్కర్లేదు అంది రాధ.

నీకు తెలీదు రాధా లోకంపోకడ.

మీ కంతకన్నా తెలీదు. తెలిస్తే కనపడ్డవాళ్ళనందరినీ దొంగా దొరా అని బేరీజు వేసుకుంటూ కూర్చోరు, వెళ్ళి మంచీ చెడ్డా మాట్లాడి మర్యాద చేస్తారు. మీ నాన్నగారు వింటే ఎంత కోప్పడతారో అంది రాధ.

ఏయి రాధా నాకన్న తెలిసినట్టు మాట్లాడేవులే కాని నీకేం తెలీదు. వాళ్లెవరో కాస్తోకూస్తో మావాళ్ళ ఎరుగుదురేమో నాకు తెలీదు కానీ, వాళ్ళు రేపోమాపో వెళ్ళాక నా మాట నిజమవుతుందని నేను ఘంటాపథంగా చెబుతున్నా. కాదంటే పందెం.

సరే పందెం ....ఇంటికి పదండి. వాళ్ళని కాస్త పలకరిద్దురుగాని.

గోపాలం నిట్టూర్చాడు. మళ్ళీ మొదటికొచ్చాం. వాళ్ళెవరో ఎలా విచ్చేశారో చెప్పావుకాదు.

ఎవరేమిటి? దొంగలని మీరే తేల్చేశారుగా!

అదిగో అదేవద్దు. ఎత్తిపొడుపులు యెందుకు మధ్యన. నువ్వు నా కళ్ళముందు స్కూలు ఫైనలు ఫెయిలయినదానివి. నామాట విను. ఇలాటి ఘరానా గోల నేను బాగా యెరుగుదును...కావాలంటే ఈసారి ఓ పాఠం నేర్చుకుందుగాని ముందు వాళ్ళెవరో చెప్పు. వెళ్ళి పలకరించకపోతే బాగుండదు అన్నాడు గోపాలం కొంచెం ప్రాధేయపడుతూ.

రాధ చెప్పింది. కందముక్కలు వేయిస్తున్నావిడ పేరు దొడ్డమ్మగారు. ఆవిడ కందముక్కలు బాగా వేయిస్తారుట, రెండో ఆవిడ బుచ్చికక్కిగారుట. వేపడాలు చేతకాని మనిషని దొడ్డమ్మగారన్నారు. పెరట్లో కూర్చున్నాయన బుచ్చికక్కిగారి భర్త. ఆయన పక్కనున్న అబ్బాయి ఆయన కొడుకు. ఆ పక్కనున్న పిల్ల కోడలు. ఈ దొడ్డమ్మగారికి కూతురన్నమాట.

మరే చూశా చాలా బావుంది. అన్నాడు గోపాలం.

కామెంటరీ ఒద్దు కథ వినండి...ఎవరో వచ్చిన సందడి విని నేను సావిట్లోకి వచ్చేసరికి గోపాలం పెళ్ళానివా అమ్మా అన్నారు. అప్పుడు మీ వాళ్లనుకున్నాను. పెద్దవాడయ్యాడన్నమాట గోపాలం అన్నారు దొడ్డమ్మగారు.

మరే యెప్పుడో రెండు పుష్కరాల క్రితం చూశాం. బొత్తిగా గుంటడనుకో అన్నారు బుచ్చికక్కిగారు. మరే. నల్లగా చింతపండు ముద్దలా ఎప్పుడూ ఏదో మూల చూసుకుని చీకట్లో కూచునేవాడు అన్నారు ఆ పెరట్లో కూచున్నాయన, నలుపైతేనేమీ, గుమ్మడిపండంత వుండేవాడనీ—

చాలు నీ వర్ణన లెందుకులే అవి తీసేసి చెప్పు. నేనేం నలుపు కాదనలేదుగా...అన్నాడు గోపాలం.

రాధ చెప్పింది: యింతలో వీడు మళ్ళీ కాఫీయా, ఓల్టినా అన్నాడు, నేను మంచినీళ్ళు కావాలా అంటూంటే.

మీ సామ్మేం పోయింది గ్లూకోసు కొని వజ్రాలు పొదిగిన వెండిగ్లాసులో పోసివ్వనా అని కూడా అడుగుతారు హాఁ.

అదే చేశాం చివరికి అంది రాధ. వాళ్ళ పిల్లకి ఓవల్టీన్ అరగదట. ఒంటో బాగులేదట. వెంటనే యీ వెధవాయి చడీ చప్పుడూ లేకుండా పరుగెత్తు కెళ్ళి పక్కవాళ్ళింట్లోంచి గ్లూకోజ్ అప్పు తెచ్చేశాడు.

ఒరేయ్ శంకరం. నువ్వు మీ తాతకి ఉత్తరం రాసి యీ నెలనుంచి నీకు కావాల్సిన ఓవల్టీనుకీ పరోపకారార్థం పంచదలచిన గ్లూకోజుకు డబ్బు తెప్పించుకో, నాకు జీతం మామూలుగా చాలేదేకాని....

అబ్బా వినండీ! వీడలా తెచ్చినందుకు ఆ దొడ్డమ్మగారు అమాంతం పై కెత్తేసి – నే చచ్చిపోనూ నా తండ్రే. ఇలాంటి మంచి గుణాలు అందరికీ వస్తాయీ. పెట్టిపుట్టాలమ్మా అంటూ బుగ్గలు నొక్కేసి ముద్దెట్టుకుంది. వీడు ఆవిడ జుట్టుపీకేసి ముక్కు గిల్లేసి కిందికి దూకేశాడు... సరే దానికేం గాని ఇంటికి పదండి... అంది.

బాణం వేసీ కొొట్టెద్దామా? అన్నాడు శంకరం.

తప్పమ్మా వాళ్ళెవరో. నే నిక్కడ ఉన్నానని నేను నేనే అనీ, అది నాయిల్లే అనీ నువ్వేమో....

మర్చిపోయా మరే వాళ్ళకి మీరెలా తెలుసు?..... సంగతేమిటంటే వాళ్ళు తిరపతి వెళుతూ యిక్కడ దిగారు. యిక్కడ ఇంజనీరు గారెవరో ఉన్నారట. ఆయన్ని బతిమాలి కుర్రాడికి ఉద్యోగం వేయించాలని వచ్చారట – మొన్ననే పెళ్ళయిందట లెండి. ఆ యింజనీరుగారు వీళ్ళకి తెలీదు. చిట్టెమ్మగారని యింకో బామ్మగారు ఉందిట లెండి. ఆవిడకి కొంచెం తెలుసుట. ఆవిడ సిఫార్సుచేసి ఉద్యోగం వేయిస్తుందిట. మన యిల్లు, మీ పేరు చెప్పి ఆవిడ వీళ్ళనిక్కడికి పంపి తను సరాసరి యింజనీరుగారింటి కెళ్ళిందిట. ఇంకాస్సేపట్లో వస్తుందన్నారు...

గోపాలం ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

అరెరె చిట్టెమ్మగారు! చిట్టెమ్మగారంటె యూ మీన్......

ఏమో. మీనో మానో నాకు తెలీదు. చిట్టెమ్మగారట. ధవిళేశ్వరంలో మిమ్మల్నెరుగునట. బుచ్చికక్కిగారు చెప్పింది.

చెప్పావు కాదేం. ముందర అది చెప్పవేం? ఎవరో పరాయివాళ్ళనుకున్నాను. చిట్టెమ్మగారంటే ఎవరో తెలీదూ? బామ్మగారు....భద్రాచలం బామ్మగారు – ధవిళేశ్వరం... ముప్పొంకాయకూర. పద పద పద అన్నాడు గోపాలం.

రాధ నవ్వింది. ఏం అంత తొందర? ఇప్పుడు మీరు చెప్పండి. ఎవరా చిట్టెమ్మగారు? మనింటి కెందుకు రావాలి? భద్రాచలం ఏమిటి, బామ్మగా రేమిటి అంది.

రాధా అందుకే నిన్ను చిన్నపిల్ల అన్నాను. చిట్టెమ్మ గారంటే– హాఁ, ఏం తెలుస్తుంది నీకు. చిట్టెమ్మగారు ధవిళేశ్వరంలో నా చిన్నప్పుడు మా యింటిపక్కవాటాలో వుండేవారు. ఎంత ధాటీ మనిషో తెలుసా? ఇంజనీరు కాదు. జవహర్లాల్ నెహ్రూతో అయినా సరే టకటక మాట్లాడేస్తుంది తెలుగులో. నెహ్రూ యేమిటీ ఆ మధ్య నా చిన్నప్పుడు గాంధీగారు వచ్చినప్పుడు యెందర్నో తోసుకుని వెళ్ళిపోయి

అయిదురూపాయలు యిచ్చి దండం పెట్టింది. గాంధీబాబూ! నువ్వు చాలా గొప్పవాడివిసుమీ! అని చెప్పింది ఆయనతో.

రాధ ఆసక్తి ప్రదర్శించింది.

ఏయ్ రాధా గోదారి వరదలు రావాలి చూసుకోమరి. చిట్టెమ్మగారు గోదారికన్న యెక్కువగా పరవళ్ళు తొక్కేసేది. వీధరుగుమీద కూర్చుని పడవలవాళ్ళని వెళ్ళి గోదారిలో కొట్టుకొచ్చే దుంగలు తెమ్మనేది. ఐదారుగురు తెప్పలు వేసుకెళ్ళి పుట్టెడు పుల్లు తెచ్చి పడేసేవారు పెరట్లో. ఆవటా వేడివేడి అన్నం, ఆవకాయ, పప్పుపులుసూ వేసి వాళ్ళకి సుష్టుగా భోజనం పెట్టేసేది. కానీ పుచ్చుకునేవారు కాదనుకో.... యింక రాధా – ముప్పొంకాయ ఆవిడే వండాలనుకో. అమృతం. వీసెల లెక్కనే! కాయక్కాయలు వండేది. వస్తుందిగా రేపు, వండమని అడుగుతా. నీకు తెలీదు రాధా. తెలిస్తే అలా హేళనగా చూడవు. ఆవిడే తీసుకొచ్చిందన్నమాట ఈ తండాని! ఇంతకీ వీళ్ళంతా యెందు కొచ్చారన్నావు?

ఉద్యోగం వేయిస్తుందిట యీ కుర్రాడికి. వరసకి మనవడుటలెండి అంది రాధ కొంచెం హేళన ధ్వనిస్తూ.

ఉద్యోగం కాదు పట్టాభిషేకం కూడా చేయించగల తాహతుంది తెలుసా ఆవిడకి?

పోనీలెండి. ఎలాగో అలా నమ్మకం కుదిరింది వీళ్ళ మీద. రక్షించారు. ఇంటికి పదండి.

చిట్టెమ్మగారొచ్చింది కాబట్టి కాని, వీళ్ళ సంగతేమో నాకేం నచ్చలేదు. కాపోయినా అంత గొడవ ఏమిటి? పైగా ఆ వేపడాల పోటీలేమిటి!

బావుంది. ఆయన కంద తినడట. అందుకని బంగాళాదుంపలు వేయిస్తున్నారు. అయినా కాపోయినా యెందుకండీ వాళ్ళనలా ఆడిపోస్తారు. చిట్టెమ్మగారు గట్టిగా చెప్పివుండబట్టి వాళ్ళు చనువుగా వచ్చివుంటారు. కాపోతే మీరు బొట్టెట్టి పిలిచినా విలువెత్తు ధనం పోసినా వస్తారేమిటి? అంది రాధ.

అదే రాధా! అక్కడే నీకూ నాకూ తేడా! నేను మనుషుల్ని ట్టే చదివేస్తా...ఆవలిస్తే....

మరే మరే పేగులు లెక్కెట్టేస్తారు. మీరు చాలా గొప్పవారు..... పదండి అంది రాధ.

అలాగే అంటూవుండు. వాళ్ళు వెళ్ళాక ఏదో పాఠం నేర్చుకుంటావు. అప్పుడు మీరు చెప్పింది నిజం సుమండీ అంటావు అప్పుడు చెప్తా నీ పని అన్నాడు గోపాలరావు వెక్కిరిస్తూ.

ముగ్గురూ లేచారు స్వంత ఇంటికి వెళ్ళడానికి.

శంకరం రాధ చెంగుపట్టుకు లాగాడు నవ్వాపుకుంటూ. ఏవిట్రా, నీ గోలేమిటి? అంది రాధ.

పకాపక నవ్వేస్తూ వాళ్ళ నాన్న కాళ్ళు చూపించాడు శంకరం. రాధకూడా కొడుకుతో కలిసి నవ్వసాగింది.

ఏమిటా నవ్వులు అంటూ వెనక్కితిరిగాడు గోపాలం. భార్యా బిడ్డల దృష్టి తన పాదాలపై కేంద్రీకరింపబడి ఉండటం గమనించి తక్షణం తనూ అదేపనిచేసి కెవ్వుమన్నాడు.



ఓ కాలికే బూటువుంది. రెండోకాలికి లేదు. తను అంతసేపూ కూర్చున్నచోట చూశాడు. లేదు.

నేనిలా ఒంటికాలి బూటుతోనే మనింటిదగ్గర్నించి వచ్చానా? అని అతిమెల్లగా అడిగాడు.

అయితే అప్పుడెందుకు చెప్పలేదు? ఇప్పుడింటికెళ్ళడం ఎలాగా? అన్నాడు గట్టిగా, గబగబా, కోపంగా.

రాధ నవ్వడం మానేసింది. కళ్ళు నేలకి వాల్చింది. మీరు మాట తోచనిస్తేగా. కొంప మునిగినట్టు ఇక్కడికి పరిగెత్తించారు. అయినా అంత తెలీకపోవడం ఏమిటి? అంటూనే మళ్ళీ పకపక నవ్వడం ప్రారంభించింది– గోపాలం బూటుకాలు చూసి.

ఇప్పుడింటికెళ్ళడం ఎలాగ? అన్నాడు గోపాలం.

బావుంది. ఇప్పేయ్యండి.

ఇప్పేసి నెత్తిన పెట్టుకుని యింటికి మోసుకురానా?

ఎందుకండీ. ఇది ఇక్కడ పడేసి. అక్కడదాన్ని ఇక్కడకు తెచ్చి, రెండూ తొడుక్కుని ఇంటికి నడవండి.

గోపాలం కోపానలం ఇంకా చల్లారలేదు. అది మాత్రం ఎలా తెస్తాం? అన్నాడు రాధ తెలివితక్కువతనాన్ని చటుక్కున నిరూపిస్తూ.

రిక్షా పిలవనా నాన్నా అన్నాడు గోపాలరావు కొడుకు చిరంజీవి శంకరం సమయస్ఫూర్తితో.

కాదు, పల్లకీ మాట్లాడు– మా నాన్న బూటు ఒకటి మోద్దురుగాని రండి అని.

అది కాదు నాన్నా, నీ బూటొక్కటే కాదుగా. అమ్మజోళ్ళు రెండు మొయ్యొద్దూ.

ఎందుకు? అన్నాడు గోపాలం. రాధ కాళ్ళవంక చూడాలని తట్టనందువల్ల కొడుకు కళ్ళల్లోకి పరీక్షగా చూస్తూ.

అమ్మయెఱ్ఱ ముకమల్ జోడు ఓ కాలికి నీ టైరు జోడు ఓ కాలికి తొడుక్కుందిగా అన్నాడు శంకరం వినయంగా.

గోపాలం కసితీరా నవ్వేసి కొడుకుని అమాంతం ఎత్తుకున్నాడు. ఈలోగా ఆశ్చర్యపడడం, కెవ్వుమనడం, కోపం తెచ్చుకోవడం వరుసక్రమంలో పూర్తిచేసి రాధపొట్టిగా ఉన్న కొడుకు నెత్తిన మొట్టికాయ వేయడానికి కొంచెం వంగబోయింది. ఆక్షణానికే గోపాలరావు కొడుకుని మెచ్చుకోడానికి పైకెత్తినందువల్ల రాధ శ్రమలేకుండా శంకరానికి తేలికగా మొట్టికాయ వేయబోయింది.

శివుడాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదంటారు. అలాగే మొట్టికాయలు – తేలిక రకం అయినా సరే– పడవని కూడా అనొచ్చు. ఎందుకంటే, ఉప్పొంగే వాత్సల్యంకొద్దీ కొడుకుని అక్కున అదుముకున్న గోపాలం తల కొడుకు భుజంమీద, కొడుకు తల గోపాలం భుజంమీద అన్నబడడం జరిగింది. అందువల్ల సంకల్పం, పర్యవసానం వేరయ్యాయి. రాధ ఒకటి తలచగా అలవాటు ప్రకారం దైవం యింకోటి తలచాడు. కొడుకు నెత్తిమీదకి ఉద్దేశించబడిన రాధమ్మచేతి మొట్టికాయని పైన వివరించిన కారణాలవల్ల గోపాలరావు శిరసావహించడం సంభవించింది.

తన్మయానందంలో వున్న గోపాలరావు కళ్ళు తెరచి రాధవంక చూశాడు. రాధ నాలుక్కరుచుకుని క్షమాపణ కోరుతున్నట్లుగా ప్రాథేయపూర్వకంగా, తప్పు గ్రహించినదానిలా చూసి, వెలిసిపోయిన రంగుచీరవంటి మందహాసం చేసింది.

అందమైన చేతివేళ్ళ మొట్టికాయలుకూడా గట్టిగానే తగులుతాయి అన్నాడు గోపాలం.

☆ ☆ ☆

మీసాలరావు యింటినుంచి స్వంత యింటికి వచ్చి మెల్లిగా లోపలికి ప్రవేశించాడు గోపాలరావు సతీసుతసమేతుడై.

సావిటిలో ఓ పిల్ల మామిడిపండు తింటున్నట్లు అభినయిస్తూ రసం గుజ్జూ తన వంటికీ గోపాలం యింటికీ పులిమేస్తోంది.

గోపాలం ఆగి ఆ పిల్లవంక కొరకొర చూశాడు. బావుంది అన్నాడు గంభీరంగా.

ఏమ్మే అని ఒక్క కేకపెట్టి ఆ పిల్ల పెరటిలోకి పారిపోయింది. పోతూపోతూ మామిడి టెంకని గోపాలం తెల్లపాంటుమీద విసిరి చక్కాపోయింది.

పాంటుకన్న ముందుగా రాధవేపు చూశాడు గోపాలం. రాధ నవ్వు ఆపుకుంటు న్నట్టు అతనికి బాగా అనుమానం వేసింది. హుఁ అంటూ రాధ వంక చూస్తూ తరువాత అడుగు ఆ టెంకమీదే వేసి జారిపడబోయిన గోపాలం పడకుండా రాధ భుజాలే ఆదుకున్నాయి.

బాగుంది అన్నాడు గోపాలం కోపంగా, ఇల్లంతా నాశనం అయిపోతోందని నిర్ధారణ చేసుకున్నాడు. బొమ్మల పుస్తకాలూ, బొమ్మలూ, తలగడాలూ, మామిడి టెంకా, దాని తొక్కా చెల్లాచెదురుగా పడివున్నాయి. నట్టింట్లో చుట్టాల పెట్టే బేడా అడ్డదిడ్డంగా సర్దబడివున్నాయి.

హు అన్నాడు గోపాలం నట్టింటిలో ప్రవేశిస్తూ.

ఏమిటా హూహూలు... వాళ్లు వింటే బాగుండదు అంది వెనకాలే వస్తున్న రాధ.

హూ అన్నాడు రాధ చెంగు పట్టుకువస్తున్న గార్దు శంకరం.

నువ్వేమిట్రా మధ్య అంది రాధ.

అవి డెవరు? ఆ బామ్మగారు? ఈవిడసంగతి చెప్పలేదేం అన్నాడు గోపాలం కొంచెం వెనక్కి తిరిగి.

ఇంకే బామ్మగారండీ?

అదుగో, ఆ గోడవార చెముడు కాబోలు. ఉలక్కుండా, పలక్కుండా చీకటిలో కూర్చుంది. నిద్రకాబోలు సౌలభ్యం.

ఈసారి రాధ నువ్వు ఆపుకోలేకపోయింది. పొట్టచేత్తో పట్టుకుని విరగబడి నవ్వసాగింది.

ఇంకో సందర్భంలో అయితే రాధ నవ్వినపుడు ఆమె సన్నటి పెదిమలనీ, తెల్లటి పలువరస తీరునీ, బుగ్గలమీద లీలగా కనపడే సొట్టనీ, నుదురుమీద ముంగురులు సర్దుకునే సన్నటి చక్కటి వేళ్ళనీ, కళ్ళుకాటుకన్ని వెక్కిరించే బొట్టునీ, నున్నటి సన్నటి మెడని కౌగలించుకునే నల్లపూసల దండప్రక్కన తెల్లగా మెరిసే ముత్యాలదండనీ గోపాలం వళ్ళంతా కళ్ళు చేసుకుని చూసి ఆనందించేవాడు.

ప్రస్తుతం అతను ఉక్రోషం పట్టలేకుండా వున్నాడు.



నేను హు అని విసుక్కుంటే తప్పొచ్చింది. నువ్వు అవి డెవరో ఆ బామ్మగారిని చూసి నవ్వితే ఫరవాలేదు కదూ? అన్నాడు గోపాలం.

బామ్మగా రెవరండీ అంది రాధ నవ్వాపు కుంటూ.

అదేం కనబడటంలేదూ.... ముసుగేసుకుని ముంగిలా కూచుంది. కిటికీ తియ్యి కనపడుతుంది.

అది బామ్మగారు కాదండీ– ఆవకాయకుండ. పెద్దవాసినకట్టిన బాన.... మీ చిట్టెమ్మగారి తాలూకు.

చాల్లే నవ్వక్కర్లేదు.... పొరపాటు అని డబాయించబోయిన గోపాలానికి కూడా నవ్వాగలేదు, చిరంజీవి శంకర్రావుకి వాళ్ళధోరణే నచ్చలేదు. ఇంటినిండా చుట్టాలుండగా యిలా విరగబడి నవ్వడం బాగులేదు. ఎంతకీ వీళ్ళ నవ్వులు ఆవవేం అనుకున్నాడు.

☆ ☆ ☆

నా తండ్రే! నే చచ్చిపోను. ఎన్నాళ్ళకి చూశాను గోపన్నా.... చిలకాగోరింకల్లా ఉన్నారు బాబూ... నీ పెళ్ళామా యేవిటుది? బాగుంది. మాలక్ష్మిలావుంది అంది, అపుడే బండి దిగి సావిటిలో కొచ్చిన చిట్టెమ్మగారు, మనసులో ఆనందం అంతా మాటల్లో నింపి యిల్లంతా వెదజల్లుతూ.

రండి బామ్మగారు, రండి రండి రండి. ఏయ్ రాధా. ఒరేయ్ శంకరం. ఇలా రండి బామ్మగారు చూస్తారు అన్నాడు గోపాలం.

ఏదమ్మాయీ యిలా వెలుగులోకి రామ్మా.... నా తల్లీ. మాలక్ష్మి నీకు దొరికిందిరా గోపన్నా.... వీడా నీ కొడుకు.... అచ్చు నువ్విలాగే వుండేవాడివి చిన్నప్పుడు. ఎటొచ్చీ నలుపనుకో.

దానికేంలెండి పరవాలేదు. చిన్నప్పుడేదో....తెలీక... గోపాలం ఠపీమని ఆగిపోయాడు రాధవంక చూసి.

అవునుగాని బామ్మగారు అదేంపనండి. సరాసరి ముందు ఇంటికి రాకుండా? అన్నాడు.

వెర్రినాగన్నా.... ఇక్కడికి రాకేంచేస్తానురా. మీ నాన్న యెడ్రేసు రాసిచ్చాడు. నేను వచ్చినపని వేరేవుంది. సరే ముందు అది చక్కపెట్టుకు మరీ వద్దామని అటు వెళ్ళాను మా వాళ్ళ నిటుపంపి. తీరాచూస్తే ఆ పెద్దమనిషి లేడనుకో.

ఏమిటో, మీరు ముందిక్కడకొచ్చి తరవాత వెళ్ళాల్సింది సుమండీ అన్నాడు గోపాలం.

నిజమే. యేదో వచ్చినపని చూసుకొచ్చేద్దామని అలా వెళ్ళా అంది బామ్మగారు.... శంకరం జుట్టు నిమురుతూ.

అయినా రైలుదిగుతూనే పనేమిటండీ. ముందు ఇంటి కొస్తారనుకున్నా అన్నాడు గోపాలం.

మరే. నేనూ అదే అనుకున్నా బాబూ. కాని వచ్చినపనిచూడు.... అందుకని అక్కడకే వెళ్లొచ్చేద్దామని....

ఏమో ఊళ్ళోదిగితే ముందిక్కడికే వస్తారనుకున్నా సుమండీ.

ఎందుకురా నాయనా. నీకన్నా నాకెవరు ముఖ్యం. అయితే ఒచ్చిన పనిమూలాన.....

అయినా కాపోయినా యెంత కానికార్యం అయినా ముందు ఇంటికొచ్చి కాస్త ఎంగిలి పడొద్దండీ.

నిజంబాబూ. అయితేనేం. పనిచూశావూ.

అవుననుకోండి... అయినా....

అవ్వా మనవళ్ళ సంవాదానికి అంతెక్కడో తెలియలేదు రాధకి. చెడిపోయిన గ్రామఫోనుప్లేటులా ఒక్కచరణమే తిరిగితిరిగి వల్లిస్తున్నారు ఇద్దరూ.

మీరు రానందువల్ల వీళ్ళెవరో తెలీక కొంచెం... అంది రాధ తెగించి కలుగ చేసుకుని.

విషయం అప్పటికి మారింది.

వాళ్లు తెలీకపోడం ఏమిటి గోపన్నా. నీకు జ్ఞాపకం లేదేమో కాని కేందటి పుష్కరంకాక, ఆ కేందటి పుష్కరాలకి గామోసు. ధవిళేశ్వరం ఒచ్చారు. నువ్వప్పుడు యేణ్ణర్థం వాడివనుకో. అమ్మ, మీ బామ్మ, నాన్నా, అంతా బాగా తెలుసు వాళ్ళకీ. ఆ పెద్దావిడ మా అక్కకూతురు. శారద దాని కూతురు. దాన్ని బుచ్చికక్కిగారి కొడుక్కిచ్చిందన్న మాట అంది బామ్మగారు.

రాధ చెప్పిందిలెండి – రండి నించున్నా రేమిటి, లోపలికి రండి..... నా కసలు మతి ఉండదు – అన్నాడు గోపాలం.

అమ్మలూ దుక్కగిన్నెలో పాలుకాచీ ఒచ్చునా అని వంటింటిలోంచి కేక వినబడింది.
శంకరం ఝుడుసుకున్నాడు. రాధ వాడి వీపు చరిచింది.

☆ ☆ ☆

రాత్రి గోపాలాన్ని ఓపక్కనా శంకరాన్ని ఓపక్కనా కూర్చోబెట్టుకుని బామ్మగారు కీలుగుర్రం కథ చెప్పింది.

రాధమ్మ శారదని దగ్గరికి తీసింది. ఇద్దరూ పెరట్లో పడుకున్నారు.

కొత్తగా పెళ్ళయిన శారద తెల్లటి వెన్నెల్లో వెల్లకిలా పడుకుని, తన తొలిరోజుల అనుభవాలు మెల్లిగా మెత్తగా చెబుతూంటే, రాధ అనిమిషనేత్రాలతో తన అనుభూతుల తెరలగుండా తెల్లటి చల్లటి వెన్నెలనీ, ఆ వెన్నెల అవతల వెలిగే నీలిమాకాశాన్నీ. తన్మయురాలై చూస్తూ, మెల్లిగా నవ్వుకుంటూ, శారద అనుభవాలు కబుర్లు ఉపశ్రుతిగా వింటూ నిద్రపోయింది.

పొద్దున్నే యిల్లు హడావుడితో నిండిపోయింది. శారద అత్తగారు, మామగారు, దొడ్డమ్మగారు విసిరిన చెణుకులకి, ఆడిన పరాచకాలకీ రాధమ్మ కొత్త పెళ్ళికూతురికి మల్లే సిగ్గుపడిపోయింది. మొగుడివంక ధైర్యంగా చూడడానికి కూడా సాహసించలేక పోయింది. గోపాలం అంతకన్న కొత్త పెళ్ళికొడుకై పోయాడు. వచ్చిన వాళ్ళందరికీ యెడతెగని మర్యాద చేస్తున్నాడు – ఆఫీసుకు సెలవుకూడా పెట్టేశాడు. బద్దకాన్ని తరిమేసి, కూరలసంచీ పట్టుకుని బామ్మగారిని వెంటపెట్టుకుని బజారెళ్ళి సంభారాలు తెచ్చేశాడు. హోటల్నించి యిడ్డెన్లు, కాఫీ తెప్పించేసి శారదకీ, ఆ పిల్ల మొగుడికీ, పిల్లలకీ ఆ పెద్దాయనకీ స్వయంగా అందిచ్చాడు. పెద్దాయనకి చుట్టలు కూడా తెచ్చిచ్చాడు.

పదిగంటలయేసరికి తెర్లుతున్న పప్పుపులుసు ఘాటుకు పొరుగిల్లూ ఇరుగిల్లూ కూడా ఘుమఘుమలాడి పోయాయి. భోజన కస్తూరి పరిమళం పేట్రేగి పోయింది.

చిట్టెమ్మగారు పొత్తుపంచ కట్టుకుని అడ్డెడు బియ్యపుగిన్ని అవలీలగా దించి అక్కడ పెట్టేసింది. నవనవలాడే వంకాయలు రెండువీశెలు కారంకూరి ముప్పోంకాయకూర చేసేసింది. ఆ ముందు సాయంత్రం తన వేపుడుసామర్థ్యం గురించి పొగుడుకుని, బుచ్చికక్కగారి అసామర్థ్యాన్ని హేళనచేసిన దొడ్డమ్మగారికి చిట్టెమ్మగారి సామర్థ్యం తెలుసు కాబట్టి ఆవిడ మామూలుగా వుందికాని మిగతా జనాభా అంతా ముక్కుమీద వేలేసుకుని హారా బామ్మగారూ! అని ఆశ్చర్యపోయారు.

వంటింటిలోంచి గోపాలం సావిటిలోకి వచ్చాడు. శారద మావగారు (ఆయనపేరు గోపాలం అడిగి తెలుసుకోలేదు) గోపాలం పుస్తకాల బీరువాని అల్లకల్లోలం చేసేస్తున్నాడు ఒకపక్క. ఇంకోపక్క ఆయన కుమారరత్నం గోపాలం టై కట్టుకుని కోటు తొడుక్కుని అద్దంలో చూసుకుంటున్నాడు. నిన్న తనమీద మామిడిటెంక విసిరిపోయిన తాటకి ఒక మూల కూర్చుని గోపాలంకొడుకు శంకర్రావు బొమ్మల్ని విరగ్గొట్టడానికి ప్రయత్నిస్తోంది. శ్రద్ధగా శంకరం విలాసంగా చూస్తున్నాడు. మా నాన్న మళ్ళీ కొంటాడులే అన్న ధీమా వాడి చిరునవ్వులో గోపాలానికి కనపడింది.

లాభంలేదు. జాగ్రత్తపడాలి మనసా అనుకున్నాడు గోపాలం పెదవి విరచి.

అతను అదివరకు పుస్తకాల్లో చదివిన ఘరానాదోపిడీ కథలు, అక్కడక్కడా విన్న దోపిడీ సందర్భాలూ మననం చేసుకున్నాడు.

నిశ్శబ్దంగా వెనక్కెళ్ళిపోయి రాధని పిలుచుకొచ్చి చూపించాడు. హుఁ అన్నాడు. చూసుకో, నేను చెప్పింది నిజమవునో కాదో చూసుకో అన్న ధోరణిలో.

రాధ నిర్లక్ష్యంగా నవ్వింది. ఈమాత్రానికే వాళ్ళని దొంగలంటారా. అయ్యో తెలివా? అన్న అర్థం స్ఫురించేవిధంగా.

ఇంతకన్న యేంకావాలి. కనబడటంలేదు? ఆయన పుస్తకాలు కొన్ని ఓపక్కన తీసి జాగ్రత్తపడడం – ఆ కుర్రాడు నా సూటు పైన వేసుకుని కులకడం – ఆ తాటకి మనపిల్లాడి బొమ్మలూ పుస్తకాలూ పనిగట్టుకు నాశనం చేయడం, కనబడటం లేదూ? అన్నాయి గోపాలం కళ్లు.

పోదురూ మీరన్నిటికీ ఇంతే. నాకేం అందులో తప్పు కనబడలేదు. ఇందులో భయానికేం ఆస్కారం లేదు అన్నాయి రాధమ్మ అరమోడ్పు కళ్ళూ, కొనతేలి నిర్లక్ష్యాన్ని ద్యోతకపరచే ముక్కూ కలిసి.

చెబితే వినకపోతే చెడితే చూడమన్నారు. ఇంతకన్న నేనేం చేస్తాను? అన్నాయి గోపాలం పెదిమవిరుపూ, ఎగరేసిన భుజద్వయమూ.

శారద మామగారు యీ దంపతులను చూశాడు. రావోయ్ గోపాలం రా. నుంచుంటావేం కూర్చో అన్నాడు.

అబ్బే పనుందండి. అలా వెళ్ళొస్తా ఇప్పుడే అనేశాడు గోపాలం ఏం తోచక.

ఎక్కడికీ అని రాధమ్మ కళ్ళు ఆశ్చర్యంతో ప్రశ్నించాయి.

నా యిష్టం వచ్చిన చోటుకి. ఈ యింట్లో నా మాట విననివాళ్ళకి నేను చెప్పడం ఎందుకు? అంది చరచరవెళ్ళి గుమ్మం దాటుతున్న గోపాలరావు కోటు.

సరాసరి కాఫీహోటలికి కెళ్ళిపోయాడు, ఎక్కడి కెళ్ళాలో ఆలోచించ దలచుకున్న గోపాలరావు.

పనిలేకపోతే నాతో రారాదుటోయ్! గోపాలం! చిన్న రాచకార్యం చక్కపెట్టాలి అన్నాడు కిళ్ళీకొట్టు దగ్గిర కనబడిన స్నేహితుడు. అతనిపేరు రావు. వయసు 28, వృత్తి సిగరెట్లు కాల్చడం. ఆస్తి బోలెడు ప్లస్ ఒక కారు. సరదాలు అమ్మాయిలను ప్రేమించటం. సద్గుణాలు పుష్కలం. దుర్గుణాలు. చూడుడు అభిప్రాయములు. అభిరుచులు; ఆత్మస్తుతి, పరుల ప్రశంసలందుకోవడం, అభిప్రాయాలు; లోకంలో సర్వజ్ఞులు ఐదారుగురు. అందులో తను వొకడో, ఇద్దరో. దుర్గుణాలు మచ్చుకోసం వెతికినా కనపడే అవకాశంలేదు. సైడు హాబీలు: ఉద్యోగాలు లేనివాళ్ళకి వేయించడం. వున్నవాళ్ళని తీసేయించడం. దైనందనీయం పోట్లాటలు తేవటం, పరిష్కరించడం. మాటల రవాణా.

ఎక్కడికి? అన్నాడు గోపాలరావు.

ఇక్కడే – వో యింజనీరుగాడింటికి. మావాడొకడికి ఉద్యోగం వేయిద్దామని అన్నాడు రావు.

అయితే నేనెందుకు మధ్య.

చూద్దువుగాని నా తడాఖా. ఇదివరకటి ఇంజనీరుగాడు నా చేతుల్లో కీలుబొమ్మలే. వీడు కొత్తవాడు– కుర్రాడుట. లంచాలు పుచ్చుకోడని విన్నాను. పాతవాడైతే వందరూపాయల ఉద్యోగం ఇస్తే మామూలుగా మూడునెలలపాటు, ఆశ్రయించినవాడి

జీతం తీసుకునేవాడు... వీడికి మాత్రం ఆశ్రయించేవాడికి చదువురావడం, బుద్ధిమంతుడుగా వుండడం ముఖ్యంట. సిఫార్సు లేకపోయినా చాలామందికి ఉద్యోగాలు వేశాడుట. మావాడు అడ్డగాడిద అనుకో. అయితేనేం నేను మాటాడి వేయిస్తా.

నీకు తెలుసా?

కొద్దిగా... అన్నాడు రావు కారు డ్రైవుచేస్తూ. శారద మొగుడికి చిట్టెమ్మగారు ఉద్యోగం వేయించేదికూడా యీ ఇంజనీరు దగ్గిరే కాదుకదా కొంపతీసి! అనుకున్నాడు గోపాలం.

పన్నెండు గంటలయింది. ఇంజనీరుగారి యింట్లో గోపాలం సమక్షాన రావు శతవిధాల పలుకుబడి వినియోగిస్తున్నాడు. ఇంజనీరుగారికి 35 ఏళ్ళకన్న ఉండవు. పచ్చగా పుష్టిగా వున్నాడు. కళైన ముఖం. పొడగరి.

అయినా అడ్డగాడిదలకి ఉద్యోగం ఎలా ఇవ్వనండి! మీరే చెబుతూంటిరి మీవాడు అడ్డగాడిద అని అన్నాడాయన, రావు సోది విని విని విసుగెత్తి.

నిజమేననుకోండి అన్నాడు రావు.

ముమ్మాటికీ... నిజం... నాకు సెలవిప్పించండి. భోంచెయ్యాలి అన్నాడాయన కాస్త చిరాకుగా.

గోపాలానికి మనసు చివుక్కుమంది, ఆయన యెంత మంచివాడైనా ఇంటికొచ్చిన వాళ్ళని వెళ్ళమంటున్నందుకు.

ఇంజనీరు బాబూ! ఉన్నారా?

ఎవరండీ అంటూ ఇంజనీరుగారు ఆఫీసుగదిలోంచి లేచి సావిట్లోకి వెళ్ళాడు.



గోపాలం కొంచెం వంగిచూశాడు.

చిట్టెమ్మగారు నెత్తిమీద ఆవకాయకుండ, కుడి చేతిలో టిఫినుకేరేజి పట్టుకుని నిండుగా నవ్వుతూ నించుంది.

ఎవరమ్మా అన్నాడు ఇంజనీరుగారు.

నేను బాబూ చిట్టెమ్మని. నువ్వెరగవు కాని మీనాన్నవాళ్ళు మా పొరిగింట్లో ఉండేవారు ఇదివరకు. ఏం గొప్పహృదయమని ఆయనది అందావిడ.

అయ్యో నెత్తిమీద బరువుతో నించున్నారే, ఉండండి సాయంపడతా. దింపండి అంటూ నెత్తిమీద బాన దించారు ఇంజనీరుగారు.

ఇదంతా ఏమిటంటే మీ అమ్మ సోంపేటనించి ఉత్తరం రాసింది బాబూ, నీకు ఆవకాయంటే యిష్టమని. ఏదో కొద్దిగా పెట్టి తిరపతి వెళ్తూ, ఇక్కడ దిగి తెచ్చాను. చూడుబాబూ, ఇదుగో ముద్వంకాయ కూర కూడాను. లోపలికి పద భోంచేద్దుగాని ముందు. మనవరాలేదీ? – మా లక్ష్మి!

ఇంక మాటలు వినబడలేదు ఇరవై నిముషాలదాకా. రావు వెళ్ళిపోయినా గోపాలం కూర్చున్నాడు చిట్టెమ్మగారి కోసం అని.

భోజనాలై సావిట్లో కొచ్చారు. చిట్టెమ్మగారూ! జన్మలో ఇంత రుచి అయిన కూర నేనెరగను సుమండి. ఆవకాయ అమోఘంగా వుంది లెండి. మా అమ్మ చెప్పడం, మీరు తేవడం. కాకపోయినా కబురంపక పోయారటండీ బంట్రోతును పంపుదును అన్నాడు ఇంజనీరుగారు.

అయ్యో, మడిగట్టుకు వేసిన ఆవకాయ బంట్రోతు చేత ఎలా మోయిస్తాం బాబూ. అయినా తప్పేముందిలే అంది బామ్మగారు.

సరే. ఇంత మిట్టమధ్యాహ్నం ఎండలో మా యింటికొచ్చి భోంచేయకుండా వెళ్ళడం భావ్యంకాదు బామ్మగారూ అంది ఇంజనీరుగారి సన్నటిభార్య సన్నని గొంతుతో.

బామ్మగారూ, ఇవాళ మీరు మా ఇంట్లో ఎంగిలి పడకపోతే నామీద ఒట్టే.

కావలిస్తే మళ్ళీ మడిగట్టుకు ఒండుతాను. మీలాంటి వారు మా యింటికి రమ్మంటే వస్తారా మళ్ళామళ్ళా అంది ఇంజనీరుగారి భార్య.

గోపాలానికి ఆనందంతో ఒళ్ళు పులకరించింది, చిట్టెమ్మగారికి జరుగుతున్న గౌరవానికి.

మీరు భోంచెయ్యక తప్పదు అన్నాడు ఇంజనీరుగారు.

ఇంజనీరుబాబూ.... అంది చిట్టెమ్మగారు గంభీరంగా. అవతల గదిలో గోపాలం చెవులు రిక్కించుకు వింటున్నాడు. ఇంజనీరుబాబూ! నేను నిన్ను అడిగేది ఈపూటకి భిక్షకాదు, శాశ్వతభిక్ష నా చెల్లెలు అల్లుడికి సర్కారులో ఉద్యోగం వేయించు. నా ఘటం మహారాజులా వెళ్ళిపోతుంది. నాకేం బెంగలేదు, కాని నా చెల్లెలికున్నదల్లా ఒక్కగానొక్క బిడ్డ. దాన్ని ఆ అయ్య చేతులో పెట్టింది. అతగాడే వాళ్ళని గట్టెక్కించాలి. వాడైనా బుద్ధిమంతుడు, యోగ్యుడు, మెట్రిక్ లేషన్ పరీక్ష యిచ్చాడు. మావూళ్ళోనే ఉద్యోగం ఖాళీ అయిందట, నువ్వే ఇవ్వాలిట, అందుకని ఆ ఉద్యోగ భిక్షపెట్టు ఇంజనీరు బాబూ అంది చెంగుబట్టి.

రెండు క్షణాలు నిశ్శబ్దం ప్రవర్తిల్లింది. గోపాలం నరాలుగ్గబట్టి కూర్చున్నాడు.

అలాగే చిట్టెమ్మగారూ, ఆనక అబ్బాయి నోసారి పంపించండి, మాట్లాడి....

నీ యిల్లు వెయ్యిళ్ళు మొదలై...నా తండ్రి, నా తండ్రి... ఒస్తా బాబూ అంది చిట్టెమ్మగారు.

☆ ☆ ☆

ఆ సాయంకాలమే చిట్టెమ్మగారూ, చెల్లెలూ, పిల్లలూ అంతా తిరుపతి బయలుదేరి వెళ్ళిపోయారు, గోపాలాన్నీ, రాధనీ, శంకరాన్నీ శతవిధాల ఆశీర్వదించి.

రాధా నువ్వు చాలా తెలివైనదానివి. మనుషులశక్తీ, మంచితనంలో గొప్పతనం కొద్దిగా చిట్టెమ్మగారు చూపించింది. నాకు అంచనాలు కట్టడం ఆటే బాగారాదు అన్నాడు ఆ రాత్రి నిద్ర కుపక్రమించిన గోపాలం.

రాధ మెత్తగా నవ్వింది. చిట్టెమ్మగారేవిటి....వాళ్ళు కూడా ఎంత మంచివాళ్ళని.... అంది.

గోపాలానికి పూర్తిగా నమ్మకం కుదరలేదు శారద మావగారిమీద. మరేమరే అన్నాడు ముక్తసరిగా.

మర్నాడు పొద్దున్నే కాఫీపొడుండబ్బా కాళీఐనప్పైనం గుర్తించబడింది. అటుమొన్ననే తేవలసింది, నిన్న మొన్నటి హడావిడిలో మర్చిపోవటం జరిగిందన్న సంగతి కూడా గ్రహించబడింది.

మరచెంబు తే. హోటల్నించి కాఫీ తెస్తా అన్నాడు గోపాలం చొక్కా వేసుకుంటూ.

మరచెంబు ఎంత వెతికినా కనపడలేదు.

చూశావా... హుఁ నేను చెబుతే నమ్మేవా! నాకు తెలుసు అన్నాడు గోపాలం విజయగర్వంతో.

రాధ మాట్లాడలేదు. తలవంచుకుని జర్మన్ సిల్వర్‌గిన్నె యిచ్చింది కాఫీ తేవడానికి.

కాఫీ తాగి మళ్ళా ప్రస్తావించాడు.

పోనీలెండి. మా బామ్మ పెళ్ళినాటి చెంబది. సొట్టలు కూడా పడింది. పొరబాటున పట్టుకెళ్ళుంటారు అంది రాధ.

అదే నేనూ అనేది. ఘరానా పొరపాట్లంటే యివే అన్నాడు గోపాలం.

భోంచేసి, ఆఫీసుకు బయల్దేరేముందు సిగరెట్టు అంటించి పడకకుర్చీలో విశ్రమించాడు.

ఎదురుగుండా నట్టింట్లో కావడిపెట్టె కింద ఏదో మెరుస్తున్నట్టు కనబడింది. పక్కనే కూర్చుని తమలపాకులు వేసుకుంటున్న రాధకూడా అది గమనించింది. చటుక్కునవెళ్ళి మెరుస్తున్న సరుకుని బయటికి తీసింది.

ఏమిటేది? అన్నాడు గోపాలం– రాధ ఆ సరుకుని చెంగుచాటున దాచుకోడం చూసి

అబ్బే, ఏంలేదు, మరచెంబు. ఇత్తడిది కాదులెండి, కంచుది. పాతది కాదులెండి, కొత్తది. మనదికాదులెండి, మన చుట్టాలది. ఇది దొంగతనం కాదులెండి; పొరపాటు అంది రాధ.



★ ★ ★

# శ్రీ గోపాళోపనిషత్తు
## అను
# ప్రమాదో ధీమతామపి



అనగనగా ఒక రాధమ్మ అంతకుముందో గోపాళం అం--తకు ముందో చిన కథగాని కథ.

రాధమ్మ ఏ వంటలు ఎంత బాగా చేసినా ఓ వంక పొగుడుతూనే మరో వంక వంకలు పెట్టేవాడు గోపాళం.

“మీ ఆడాళ్లు వంటింటి కుందేళ్లు. వండినవే మళ్లీ వండుతారు. ఎక్స్పెరిమెంటేషన్ లేదు. కొత్తదనం కోసం ట్రై చెయ్యరు మా వంటివాళ్లు చెప్పినా – మాటవరసకి ‘గోంగూరా కందకూరా, కొతిమీరా కలిపి ఎందుకు వండరూ’ అని అడిగితే ‘ఏడిసినట్టుంటుంది’ అని పొగరుగా తల ఎగరేసి అందంగా నవ్వేస్తారు... ఆ రేగిన జుట్టు మెడ మీద జడో నవ్వో పువ్వో చూడడంలో పడి చీకటి కమ్మేసి ‘వండితేగదా ఏడిసినట్లుంటుందని తెల్తుందీ వండూ’ అని నిలదీసి అర్డర్లెయ్యడం మర్చిపోతాం” అన్నాడు గోపాలం.

ఆ తరవాత పంతం వచ్చి (మాలతీ చందూర్‌గారి) వంటలూ పిండి వంటలూ కొనేసి ఆఫీసులో పెట్టి సీక్రెట్‌గా చదివేసి వంటలశాస్త్రం బాపులా వంట పట్టించేసుకున్నాడు. ఒక ఆదివారంనాడు ‘నేడే నా వంట విడుదల’ అని రాధమ్మని ఒట్టేసి కుర్చీక్కట్టేసి, కాఫీ ఇచ్చి పేపరు చదువుకోమని వంటారంభించాడు.

అంతకుముందే వెలిగించిన స్టౌ మీద అంతకుముందే రెడీగా ఉండాల్సిన పోపులు వేయించి పడేశాడు. కూరలు తరగడానికి కూర్చున్నాడు.

"పేపరెందుకు చిరాకు. పద్దు పుస్తకం చూసుకుంటూ లేదా వారపత్రిక –" అంది రాధ.

"అబ్బే అదే మా స్టయిల్ కరెక్టుగా ఉండాలి. నువ్వు వంట చేస్తున్నప్పుడు నేనెలా పేపరు చూస్తుంటానో నువ్వు కూడా అలాగే ఉండాలి."

"అంటే కాఫీ తాగాక సిగరెట్టు కూడా కాల్చాలా?" అంది రాధ భయం నటిస్తూ.

"వద్దు రెండే ఉన్నాయి – బైటికెళ్లేదాకా" అంటూ విరగబడి నవ్వేసి అంతకుముందే నిలబెట్టిన కత్తిపీట పక్కన అంతకుముందే గుట్టలు పోసిన కూరగాయల్లోంచి బెండకాయలు తీసి నిలువుగా తరిగేశాడు. వేళ్లకంటుకున్న జిగురును రాధ చూసిందేమోనని చేతులు వెనక్కేసుకుని బనీనుకు తుడిచేస్తున్నాడు.

రాధ పకపక నవ్వింది.

"చూడు నేను వంటల్లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ కోర్సు చదివానుగాని ఎలిమెంటరీ చదువు గమనించలేదు. క్లిష్టమైన వంటలు నేర్చానుగాని కూరలు తరగడం స్టడీ చెయ్యలేదు. ఏదో బెండకాయని నిలువుగా తరిగాను – ప్రమాదో ధీమతామపి – గొప్పవాళ్లు కూడా తప్పులో కాలేస్తారు" అంటూ లేచి, చేటలో ఉండే కందిపప్పు మీద కాలేసి తొక్కి, కుళాయి దగ్గరకెళ్లి జిగురు చెయ్యి కడుక్కువచ్చాడు.

"కూరలు అడ్డంగా తరగాలని చెప్పడానికి అనుభవం గట్రా అక్కర్లేదు –కామన్ సెన్సు చాలు" అని పెడసరంగా చూస్తూ మామిడికాయని అడ్డంగా కత్తిపీటకేసి తరగబోయాడు. మధ్యలో టెంక ఒప్పుకోలేదు.

రాధ మళ్లీ నవ్వబోయి, చూపుడు వేలితో నోరును అదుపు చేసింది.

"ఓహో! కొన్ని అడ్డం నిలువూ కాదు అయి మూలగా తరగాలన్నమాట.... తెలుసు"

అంటూ కొత్తిమీర కట్టలు తీసి రాధకేసి గీరగా చూస్తూ చేతులు బాగా పైకెత్తి జోరుగా తరగబోయాడు.

రాధ కళ్లు పెద్దవి చేసి బెదిరి చూసి "చెయ్యి చెయ్యి" అంది. గోపాలం ఆ భంగిమలోనే ఆగాడు.

"రాధగారూ! ఏవిటా ఏకవచన ప్రయోగం" అంటూ కొత్తిమీర పట్టుకున్న చేతిని జోరుగా కత్తి మీదకు తెచ్చాడు 'అమ్మో' అన్నాడు.

రాధ పరుగున వచ్చి వాలింది.

వేలు తెగింది. నెత్తురుబొట్లు పడ్డాయి.

రాధ చేయందుకుని పైకెత్తింది. గోపాలం కంటిలోంచి రెండు కన్నీటి బొట్లు రాలాయి.

"హా! రక్తం –కన్నీరు!"

"రక్తకన్నీరు అని నాగభూషణంగారి డ్రామా"

"స్కూలుపిల్లల నాటకంలో జోకులా ఉంది" అంటూ రాధ గిన్నెలో నీళ్లు తీసి వేలిమీద పోసి తుడిచింది. వేలు నోట్లో పెట్టుకుంది – కళ్లు మూసుకుని.

గోపాలం వేలు లాక్కున్నాడు. లేచి నించుని రెచ్చిపోయాడు.

"అంటే నేను కుర్ర సన్నాసినంటావు నాకు వంట రాదంటావ్. కూర తరగడంలో ఒక్క చిన్న తప్పు చేసినందుకు మొత్తం డిస్క్వాలిఫై చేసి ఎందుకూ పనికిరానంటావ్. ప్రమాదో ధీమతామపి అనగా గొప్ప గొప్ప వాళ్లు కూడా ఒక్కోసారి తప్పులు చేస్తారు అని పెద్దలు చెప్పారు తెలీదా?

ఒకోసారి బస్సులో కండక్టరు మనం రూపాయిస్తే పది పైసలు చిల్లరిచ్చేస్తాడు. అతను కండక్టరుగా పనికిరాడంటావా? బ్యాంకులో క్యాష్ కీపర్ టోకెన్ తీసుకుని నవ్వుతూ క్యాష్ చేతికిస్తాడు. బ్యాంకు వాళ్లు అయన్ని బర్తరఫ్ చేస్తారా? ఆ?

ఒక్కోసారి పీవీగారు పైకి నవ్వేస్తారు. పాలసీ మారిపోయిందంటామా?

అప్పారావు అరగంట కబుర్లు చెప్పి కూడా అప్పు అడక్కుండా వెళ్లిపోతాడు. వయసు మళ్లిందంటామా?

బుడుగు అల్లరి చెయ్యడు. వయసు పెరిగిందంటామా?

"ఒక్కోసారి సిటీ బస్సులు సరిగ్గా స్టాపువద్ద రోడ్డు ప్రక్కన అగుతాయి. ఆ డ్రైవర్ని యూనియన్ వాళ్లు వెలివేస్తారా? బస్సంటే గుర్తొచ్చింది. ఒక్కోసారి బస్సుకి సడెన్ బ్రేకులు పడ్డా రోమియోలు జూలియట్ల మీదకు తూలిపడరు. వాళ్ల చేవ తరిగిందంటామా? ఆ?

ఒక్కోసారి గిరీశం కోతలు కొయ్యడు – సన్యాసైపోయాడంటావా?

ఒక్కోసారి దేశ్సేవకులు నిజంగానే దేశ్సేవ చేసేస్తారు. వాళ్లని ఎలక్షన్ కి డిబార్ చేస్తారా?

ఒక్కోసారి పొలిటీషియన్ ప్లేటు ఫిరాయించడు. అతనికి మెంటల్ అంటారా?

ఒక్కోసారి వినయం చాలా ఎక్కువగా ఉందని సన్మానం చేస్తారు. అయినా కొమ్ములు మొలవ్వు. ఇచ్చిన అవార్డు లాక్కుంటారా?

ఒక్కోసారి వెలిసిపోయిన పెళ్లాం వెన్నెల బొమ్మలా అందంగా కనిపిస్తుంది. కళ్లజోడు మార్చేసుకోమంటావా?

అంతెందుకు ఒక్కోసారి పెళ్లాం వేసిన జోకులక్కూడా నవ్వేస్తారు. వాళ్లు చండీదాసులంటావా?

గవర్నమెంటాఫీసులో ఒక గొప్పవాడు పది నుంచి అయిదైదాకా పనిచేస్తాడు. శుక్రవారం మధ్యాహ్నం కూడా పనిచేస్తాడు. 'యూనియన్ ద్రోహి' అంటామా!

ఒక్కోసారి ధర్మం జయిస్తుంది. అంతమాత్రాన రాక్షసులు ఆత్మహత్యలు చేసుకోవాలా?

ఒక్కో పోలీసు బీదవాళ్లతో కూడా పొలైట్ గా చిరునవ్వుతో మాట్లాడతాడు. అతనికి ప్రమోషన్ రద్దు చేస్తారా?

అందరూ తెలీక తప్పులు చెయ్యరు. కొందరు తెలిసీ చేస్తారు. వాళ్లనను –నన్ను కాదు. 'పంచ–దారకన్న పరదార తీపిరా' అని కృష్ణశాస్త్రిగారు అన్నారు. అది సందర్భానుకూలం. అవసరమైతే పెళ్లాన్ని ప్రేమించేవాళ్లూ ఉన్నారు. అవకాశముంటే ప్రియురాలిని పెళ్లాడే వాళ్లూ ఉన్నారు. నేను అలాటివాణ్ణి కాను సుమీ నువ్వు కంగారుపడకు. నేను ఆంధ్రా రాముడిని..."

"ఆంధ్రా రాముడంటే?" అంది రాధ.

"రావికొండల్రావునడగాలి. ఇప్పుడు వీల్లేదు కనక నేనే చెప్తాను. అసలు – రాముడు వేరే ఉన్నాడు కదా ఆయన యు.పి.వాడు గదా. అలాటి గొప్పవాళ్లు మనలో ఉన్నప్పుడు 'ఆంధ్ర–ఫలానా' అంటారు.

"వాల్మీకి రామాయణాన్ని తెలిగించిన వావిలికొలను సుబ్బారావుగారిని 'ఆంధ్ర వాల్మీకి' అంటారు. సైగల్‌లా పాడతాడని పేరు తెచ్చుకున్న ఎమ్మెస్ రామారావును 'ఆంధ్రా సైగల్' అంటారు. మహా నటుడు చిత్తూరు నాగయ్యగారిని 'ఆంధ్రా పాల్‌ముని' అనేవారు."

ఇంత దీర్ఘోపన్యాసం వినలేక వింటున్నట్లు నటిస్తూ వార్తాపత్రిక చూస్తున్న రాధమ్మ పేపరు పైకెత్తి చూపిస్తూ అడిగింది.

"ఏవండీ అయితే మరీ...?"

"అడుగూ...?"

"ఇందులో ఆంధ్రా బ్యాంకు వారి సంక్రాంతి సంబరాలు అని రాశారు. ఆంధ్రా బ్యాంకు ఇదైతే మరి అసలు బ్యాంకు ఏదండీ?"

* * *



# ఠింఛూలా విచ్చేశారు....

"నన్ను సినిమా కెవరు తీసుకెళ్తారో చటుక్కున చేతులెత్తండోయ్" అంటూ సుడిగాలిలా దూసుకువచ్చాడు. సుబ్బారావు 'లవర్స్‌డెన్'లోకి. 'లవర్స్‌డెన్' హాస్టల్‌లో మూడో నెంబరు గదికి ముద్దు పేరు. ఈ గది హాస్టల్ కట్టిన నాటి నుండి భగ్నవీణలకీ, ఛిద్రహృదయాలకీ నిలయంగా ఉంటూ వచ్చింది.

సుబ్బారావు దూకుడుగా వచ్చిన వేళకి, ఒక మజ్నూ భారీ ఎత్తున సిగరెట్టు కాలుస్తూ బాధపడుతున్నాడు. ఆ మజ్నూ ఇహలోక నామం రాజు. బాధపడుతున్న రాజుని చూస్తూ విచారపడుతున్న అప్పారావు మెల్లిగా తలెత్తి ఒక్క క్షణం చూసి, తలదించుకుని మళ్ళీ విచారపడడం మొదలుపెట్టాడు.

"కావలిస్తే నా డబ్బులు నేను పెట్టుకుంటా. మొత్తం ముప్పావలా ఉంది" అనేశాడు సుబ్బారావు తెగించి.

"ఏం సినిమారా! బతుకే సినిమాలా ఉంటే ఇంకా సినిమా ఏమిటి?" అన్నాడు రాజు తరపున అప్పారావు.

"ఏమా కథ? సినిమా అయితే మరి సీతా అమ్మవారెవరు? రాభణాసురు డెవడు? రేలంగి ఎక్కడ?"

"ఇంకా ఖరారుగా తెలీదుగదా, రాజు ఇవాళే ఊళ్ళో దిగాడు. దిగీ దిగుతూనే, ఆ పిల్లని చూశాడు."

"ఏ పిల్లని?"

"ఏమో ఎవడికి తెలుసు? ఇవాళ ఆదివారం కదా! రేపు కాలేజీ తెరిస్తే, వీడు రేపటిలోగా స్వర్గస్థుడయి పోకుండా కాలేజీకి వస్తే, అక్కడ ఆ పిల్ల ఎవరో

కనబడితే ఆపైన తరువాత కథ ఉంటుంది. ఆమెగాని ఏ థర్డుఫారం ఆనర్సో అయితే. రహదారి మీద పడిగాపులు పడాల్సిందే" అన్నాడు అప్పారావు.

"నేను సస్పెన్స్ భరించలేను. అసలే గుండె నీరసంవాణ్ణి. అందుకని నేను ఒక్కణ్ణే ఎలాగో అలా వెళ్ళి సినిమా చూసేస్తా, సాయంత్రం కథ చెపుతా లెండి. ఇంతకీ పేరులేకపోతే మానే, అసలా సీతమ్మలైలా స్వరూపం ఏమిటో కాస్త చెబుదూ రాజా" అన్నాడు సుబ్బారావు.

"అబ్బ! వాడసలే ఒఖలా మథనపడుతూ ఉంటే, నువ్వు మరింత రెచ్చగొడతా వెందుకూ? నే చెబుతా పట్టు. శాటిన్ దిళ్లూ, ముక్కుపుడకలూ, ఒంటిపేట గొలుసులూ, ముఖమల్ జోళ్లూ వీడు ఇవాళచూసిన పిల్ల కోసమే ఉత్పత్తి చేస్తూందిట ప్రపంచం. ఫియట్ కారు ఈ అమ్మాయి, ఆమె కాబోయే భర్త తిరగడానికి డిజైన్‌చేశారట. మామూలు మనుషులకి ఆమె కళ్ళు చింపిరి కళ్లలా కనబడతాయిగాని, సౌందర్యదృష్టి ఉన్న వీడివంటి వాళ్ళకి అందమైన కళ్ళనేవి ఉంటే అవే సుమా అని ప్రబోధిస్తుందట మనసు. ముక్కు పుడకలు పాత ఫ్యాషన్ అనుకునేవారంతా ఆ అమ్మాయి సన్నటి ముక్కుమీద చిన్న ఒంటిరాయి ముక్కుపుడకని చూశారంటే రపీమని అభిప్రాయాలు మార్చేసుకుంటారట. ఇది ప్రథమ తరంగం. రాజు దిగీ దిగగానే ఇచ్చిన ప్రారంభోపన్యాసం."

సుబ్బారావు ఈ తరంగం విన్నాడో లేదో కాని, కిందపడి వున్న సీమవెండి సిగరెట్‌కేసుని స్వాధీనపరచుకున్నాడు. తన జేబులో సిగరెట్లన్నీ ఒక్కొక్కటి అందులో అతి జాగ్రత్తగా అమర్చాడు, ఇంకా కాళీ మిగిలిపోయింది.

"నా దగ్గర అట్టే డబ్బులు లేవు. ఇక్కడి సిగరెట్లు కాసిని తీసుకుంటా" అని ఒక చిన్న జనాంతిక ప్రకటన చేసి అక్కడున్న రెండు పెట్టెలూ తెరిచి సీమవెండి డబ్బా నింపేశాడు.

"ఊఁ, రెండవ రంగం ఆనక వింటానుగాని టైమైంది. మళ్లా వస్తా" అన్నాడు లేవబోతూ.

"బొత్తిగా ఇంత స్వార్థం అయితే ఎలాగోయ్. ఇవతల వీడు మతిభ్రష్టుడై ఇలాఉంటే, దయాదాక్షిణ్యం లేకుండా సినిమాకి పోతాననడానికి మనసెలా ఒప్పిందంట? పైగా ఆ సిగరెట్లు ఊడ్చేసుకుపోతే మేం ఎలా ఏడవడం?" అంటూ చిరాకుపడ్డాడు అప్పారావు.

"అఖరికి సిగరెట్లు కూడా లేకపోయాయే అని ఏడవండి జమిలిగా. అయినా, మతీసుతీ లేకపోతే సరి. ఎవర్తెనో చూసీ చూడనట్లు చూసి, ఇలా బెంగెట్టుకోవడం సిల్లీగా లేదూ? మీ నాన్నకి ఉత్తరం రాస్తానుండు రాజా, అప్పుడు తెలుస్తుంది."

"ఏడిశావు లేవోయ్, బోడిపెద్దరికం నువ్వూను; వాళ్ళ నాన్నగారు మొన్ననే శాంక్షన్ చేసేశారుట – వీడు వరించిన అమ్మాయిని తెచ్చి పెళ్లి చెయ్యడానికి, ఎటొచ్చీ, అయనతో సి. పార్వతి (బి.ఏ. సెకండియర్ మూడో దండయాత్ర)ని పెళ్ళిచేసుకుంటానని చెప్పి వచ్చేశాడు. అయన సరే ననేశాడట" అన్నాడు అప్పారావు.

"మరింకేం? ఈ ఏడు పేమిటి?"

బాధపడుతున్న రాజు ఇంక సహించలేకపోయాడు.

"ఏడు పేముందిరా?... నేను మాత్రం కలకన్నానేమిటి ప్రపంచంలో ఇవాళ చూచిన అమ్మాయంత అందమైన వాళ్ళు... అసలు అందం కాదులే, అదేదో చెప్పలేం... ఒక విధమైన వెలుగు... జ్యోతి..."

రాజు చెలికాడు ఈ అవస్థ చూడలేక, అదుకున్నాడు, "అయినా ఎందుకు రాజా వీడికి చెబుతావు నీ బాధంతా? ఆర్చేవాడా తీర్చేవాడా?" అంటూ.

"నేను ఆర్చేదీ తీర్చేదీ ఏం లేదుకాని, ఇప్పుడేం చేస్తారని అడిగానంతే" అన్నాడు సుబ్బారావు చిన్నబుచ్చుకుంటూ.

"చెయ్యడాని కేముంది? రేపు ఈ కొత్త పిల్లపేరు, విలాసం తెలియగానే, వాళ్ల నాన్నకి టెలిగ్రాం ఇచ్చేస్తాడు. చిన్న సవరణ వుందనీ, మొన్న చెప్పిన పార్వతి బదులు ఇంకో సరస్వతిని పెళ్లాడ నిశ్చయించుకున్నాడనీని. ప్రమాదం ఏముంది? పేరు మార్చేగా?" అన్నాడు అప్పారావు.

"మరే! ప్రమాదం ఏముంది?" అన్నాడు సుబ్బారావు.

సోమవారం ఉదయం పది గంటలకి కథ చాలా ముందుకు వెళ్ళిపోయింది.

రాజు చూసిన లేమ పేరు సరోజినిట. ప్రొద్దున రాజా, అప్పారావు కాలేజికి వెళ్ళేసరికి ఆ పిల్ల కనబడింది.

"అదుగో ఆ అమ్మాయేరా" అన్నాడు రాజు ఎగిరి గంతేసి, తూలి కిందపడబోతూ.

"హోరినీ, ఆమె పేరు నైన్‌డాన్, ఈ ఏడే చేరింది. ఏదీ వచ్చి వారం రోజులైందోలేదో నలుగురైదుగురు రోమియోలు ఆదరా బాదరా వరించేసి, వరుసక్రమంలో దృక్పథాలు మార్చేసుకుని, చెంపలు వాయించేసుకున్నారు. కాలేజి తెరవగానే నువ్వూ వచ్చి ఉంటే; అందరితోపాటే..." అన్నాడు అప్పారావు.

"'ఛా. అలా అనకురా, నిన్న చూసినపుడే అనుకున్నాను' పార్వతి ఈ అమ్మాయి కాలిగోటికి సాటిరాదని. పేరేమిటన్నావు?"

"నైన్ డాన్ అని చెప్పాను. కలకత్తా మెయిలు మెద్రాసునించి వచ్చే వేళకి ఈవిడ కాలేజీరోడ్డులో నడుస్తూ ఉంటుంది. క్లాసులో నెంబరు 32 అనుకో. అసలు పేరు సరోజిని. ఇంట్లో 'సరూ' అంటారు. రేప్పొద్దున్న పెళ్లాడితే నువ్వూ...."

"ఛీ పో" అన్నాడు రాజు సిగ్గుపడుతూ.

క్లాసులోకి వెళ్ళారిద్దరూ.

మొదటి గంట పూర్తికాగానే వరండాలోకి వచ్చేసరికి సుబ్బారావు కనబడ్డాడు. రాజు పిలిచాడు. దగ్గరికి రాగానే రాజా, అప్పారావు ఎడపెడా నిల్చుని సుబ్బారావు తలకాయవంక చూడసాగారు. రాజు ఈర్ష్యతో చూశాడు. అప్పారావు జాలిగా చూశాడు.

"ఏం అలా చూస్తున్నారు?" అన్నాడు సుబ్బారావు దిక్కుమొహం పెట్టి.

'పరుగెట్టికెళ్ళిపోయి గుండు చేయించుకొచ్చెయ్. లేకపోతే సాయంత్రం హాస్టల్‌కి రాగానే చావగొడతా" అన్నాడు రాజు.

"నాకేం, నీ మంచికే చెబుతున్నాం. అయినా కాకపోయినా సినిమా హీరోల్లాగ నీకు ఉంగరాల జుట్టేమిటోయ్ భగవాన్లూ" అన్నాడు అప్పారావు.

"నా జుట్టు గోల నీకెందుకోయ్ హనుమాన్లూ! మా నాన్న, అమ్మ, బాబాయ్, పిన్ని, మావయ్య, అక్కయ్య, బామ్మ నీతో కలిసి ఎనమండుగురు నా క్రాపు గురించి సలహా ఇస్తారా? అయినా ఇప్పుడిది ఫ్యాషన్ కాదుగా" అన్నాడు సుబ్బారావు.

"కాకపోవడమేమిటి? నాకు తెలిసిన రహస్యం నలుగురికి తెలిస్తే. సాయంత్రం కల్లా ఉంగరాల క్రాఫింగే 1956 ఫ్యాషన్ అయి ఊరుకుంటుంది. సరోజకి నచ్చిందంటే మాటలతో పనికాదు" అన్నాడు అప్పారావు కాస్త గొంతు తగ్గించి.

"అయ్యబాబోయి, ఆ ఛాణీకి నా క్రాఫింగు నచ్చిందేమిటి కొంపతీసి? ఇప్పుడేందారి?"

"దారికేముంది? దారి గోదారి. గబగబ సెలూనికి వెళ్ళు. అంటకత్తెర సాధ్యమైనంత వికృతంగా చెయ్యమను. కావలిస్తే ఓ పావలా ఎక్కువిస్తానని ఆశపెట్టు. అక్కణ్ణించి గోదారికెళ్ళి నెత్తినిండా స్నానం చేసి దేవుడికో దణ్ణం పెట్టుకుని ఇంటికెళ్ళి పడుకో, లేకపోతే, ఛాణీ ప్రేమిస్తుంది. వరిస్తుంది. చూస్తూ వుండగానే పెళ్ళాడేస్తుంది. జాగర్త!" అని హెచ్చరించాడు అప్పారావు.

రింగుల క్రాఫింగు సుబ్బారావు వెంటనే సెలవు పెట్టేసి ఇంటికే వెళ్ళిపోయాడు.

ఇటు రాజు కూడా సెలవు పెట్టేసి, బజారుకెళ్ళి తిరిగి, జుట్టుని ఉంగరాలు తిప్పే క్లిప్పులు కొనుక్కొని, హాస్టలుకెళ్ళి అది పెట్టుకు తల కట్టుకు పడుకున్నాడు. సుబ్బారావును హడలుకొట్టడం అంతా బాగానే వుంది కాని, దానికోసం సరోజని ఛాణీ, గీణీ అంటూ అప్పారావు హేళనగా మాట్లాడడం నచ్చలేదు రాజుకి. చిరాకేసింది కూడా.

"నాలుగు రోజులలో కాస్త ఉంగరాలు తిరిగితే, సరోజ సంగతి నాన్నకు రాసెయ్యవచ్చు" అనుకున్నాడు.

హాస్టల్ కుర్రాణ్ణి పిలిచి సెలవు చీటి రాసి పంపేశాడు కాలేజీకి.

☆ ☆ ☆

మధ్యాహ్నం ఇంటర్‌వెల్ వేళకి అప్పారావు రొప్పుకుంటూ వచ్చాడు లవర్స్‌డెన్‌కి.

"నీ దుంపతెగా! నీకేం మతిగానీ పోయిందిట్రా? ఏమిట్రా ఈ సెలవు చీటీ? ఇది లెక్చరర్ కంటబడితే ఇంకేమేనా ఉందా? నౌకరు నా కంటబడి నా చేతికిచ్చాడు గాబట్టి సరిపోయింది" అంటూ గది అదిరేట్టు గావుకేకలు వేశాడు.

"పోరా, నీకేం తెలుసు నా ఆవేదన... సరూకి ఉంగరాల జుట్టంటే ఇష్టమని తెలిసి తెలిసి ఈ జూలుతో ఎలా రమ్మన్నావురా? మొహం చెల్లొద్దూ? నాలుగు రోజుల్లో రింగులొచ్చేస్తాయని షాపువాడు చెప్పాడు. అందుకని సెలవు పెట్టేశా" అన్నాడు రాజు క్లిప్పులు అదుముకుంటూ.

"అయితే ఆ గోలంతా అందులో రాసుకుంటార్రా? చదివి చూడు."

రాజు ఆ బాధతోనే విసుగ్గా తను రాసిన సెలవుచీటీ అందుకుని చదువుకుని ఐదంగుళాల ఎత్తుకి ఎగిరిపడ్డాడు.

ఉంగరాలు తిరగందే కాలేజీకి రావడానికి మనస్కరించడం లేదు కాబట్టి, దయతో తనకు ఐదురోజులు సెలవు ఇప్పించాలని ఆ సెలవుచీటీలో ఉంది.

"ఎవరూ చూడలేదుగదా కొంపతీసి... బుర్రెక్కడో పెట్టుకు రాసేశాను సుమీ... డామిట్... నయమే. నువు చూశావు గనక సరిపోయింది" అంటూ దాన్ని చింపేశాడు రాజు.

ఇంకో సెలవుచీటీ రాయించి పట్టుకుపోయాడు అప్పారావు.

మధ్యాహ్నం మొదటిగంట పూర్తి అయీఅవగానే అప్పారావు సైకిలెక్కి మళ్లా వచ్చాడు హాస్టలుకి.

"ఒరేయ్ రాజా! సుబ్బిగాడి జుట్టు నెరిసినా సరోజకి ఇష్టమేరోయ్. తెలివితేటలు అనగా విజ్ఞానం ఎక్కువ అయితేనే అసలు జుట్టు నెరుస్తుందని, అంచేత సుబ్బిగాడు పోతపోసిన విజ్ఞాని అని సరోజ అభిప్రాయం. ఇది తాజావార్త" అని చెప్పేసి చక్కాపోయాడు.

జుట్టు నెరవడం ఎలా అన్న సమస్య పట్టుకుంది. రాజుకి.

సబ్బుతో తల రుద్దుకొన్నా, ఓ పావలా తేనెకొని పులుముకొన్నా జుట్టు నెరుస్తుందని జ్ఞాపకం వచ్చింది. కొంపతీసి ముగ్గుబుట్ట అయి ఊరుకుంటే? పాయింటే, అందువల్ల అక్కడక్కడ అందంగా నెరవాలి. మానసికవేదన వల్ల, అప్పులు, ఇంట్లో అవాలు, మెంతులు నిండుకొనుట మొదలైన బెంగల వల్ల జుట్టు క్రమబద్ధంగా నెరుస్తుంది. విజ్ఞానం వల్ల కూడా నెరిసే మాట నిజమే గాని అదెక్కణ్ణించి వస్తుంది?

"జ్ఞానం లేదా గాడిదా?" అని నాన్నగారు తిట్టేవారు. జ్ఞానమే లేనివాడికి, 'విజ్ఞానం' ఎక్కణ్ణించి వస్తుంది?" ఈ పంథాలో సతమతం అవడం సాగించాడు రాజు.

☆ ☆ ☆

సాయంత్రం కాలేజీ వదలగానే రివ్వున వచ్చాడు అప్పారావు, ఇంకో బులెటిన్ పట్టుకుని. రాజు అడగబోతున్న ప్రశ్నే అప్పారావు అడిగేశాడు.

"ఏం బ్రదర్ నీకు జనరల్ నాలెడ్జి ఉందా? చాలా అర్జెంటు. బోలెడుంటే సరోజ నీది. లేకపోతే, సుబ్బిగాడు సరోజవాడు" అన్నాడు.

"నేనూ అదే చూస్తున్నాను. విజ్ఞానం ఉంటే జుట్టు నెరుస్తుంది. ఎలా చెప్పు సంపాదించడం?"

"అయినా చూద్దాం ఉండు. అంజలి, నాగేశ్వరరావూ నటించిన - ఐమీన్ విడివిడిగా - మొదటి సినిమాలు ఏవి? వారిద్దరు కలిసి నటించిన మొదటి చిత్రం ఏది?"

రాజు తడుముకోకుండా చెప్పేశాడు.

"మధుబాల, దిలీప్ కలిసి నటించిన లేటెస్ట్ పిక్చర్ ఏమిటి?"

ఇది గూడా ఠాప్‌మని చెప్పేశాడు రాజు.

'హారినీ ! ఇంత విజ్ఞానం ఉండికూడా ఇంకా జుట్టు నెరవక పోవడం ఏమిట్రా నీకు? ఇదేదో చిత్రంగా ఉందే!'

"పోదూ, నువ్వలా అంటావు కానీ, నీక్కూడా ఇవన్నీ తెలుసుకదా. నీకు మాత్రం నెరవడం లేదేం"

"ఇది కాదేమో విజ్ఞానం. పోనీ సైన్‌డౌన్, టెనప్, తర్టీటూ అంటే అర్థాలు చెప్పు."

"నైన్‌డౌన్ అంటే సరోజ. టెనప్ అంటే సీతాలక్ష్మి. సరే తర్టీటూ మన ప్రొఫెసరుగారమ్మాయి సుందరి" అన్నాడు రాజు.

అప్పారావు విరగబడి నవ్వాడు. "ఓరి అమాయకుడా! నైన్‌డౌన్ అంటే కలకత్తామెయిల్. టెనప్ అంటే ఇంకేదో రైలు. తర్టీటూ అంటే పూరీ పాసింజరూను. సరే ఏదో తిప్పలు పడు!"

"రైల్వేగైడు కొని చదివేస్తే?"

"నీ బొంద. రైలు సంగతులు మాత్రం తెలిస్తే ఏం లాభం? మిగతావో?"

"మరెలాగ?"

"ఏమో?"

☆ ☆ ☆

మర్నాడు ప్రొద్దున్న కాలేజీకి వెళ్లగానే ఒక న్యూస్ బులెటిన్ పంపించాడు అప్పారావు.

"రాజా, రాజా. సుబ్బిగాడు అంటకత్తెర మొహంతోనే కాలేజీకి వచ్చేశాడు. ఇంకా రింగ్‌లు పోలేదు కానీ, జుట్టంతా అరంగుళం మేకుల్లా ఉంది. అయితేనేం వెధవ బావున్నాడురా హాలీవుడ్ హీరోలా— దాదాపు క్లార్క్ గేబుల్‌లా తయారయ్యాడురా. అయినా, ఈ వెధవకి చదువంటే బొత్తిగా ఇంత శ్రద్ధాభక్తులు యెందుకో నాకు బోధపడలేదు. నీకు మళ్లే నాలుగురోజులు సెలవు పెట్టుండాల్సింది.

ఇట్లు
అప్పారావు."

పి.యస్:— సరోజ ఫస్ట్ పీరియడ్‌లో వాడివంక మూడుసార్లు సూటిగా చూసింది— సారీ. — అ.రావు."

రెండవ గంట కాగానే ఇంకో బులెటిన్ వచ్చింది.

"రాజా, ఇది నీకు తెలుసా? రైలు స్టేషనులో ఉత్త పుణ్యానికి ఇనపరేకులు తోరణాలలాటివి పట్టాలకడ్డంగా కట్టి ఉంటాయి. అవి ఎందుకో తెలుసా? — ఇట్లు అప్పారావు.

పి.యస్:— సరోజకి తెలుసట! — అ.రావు."

లంచ్ ఇంటర్‌వెల్‌లో అప్పారావు వచ్చీరాగానే అడిగాడు "ఏం రాజా. తెలిసిందా జవాబు?" అని.

"ఊహూ... నీకు?"

"నాకూ తెలీదు. పైగా సుబ్బిగాడికి తెలుసట. ఇదేకాదు, వాడికి చిల్లర విషయాలు కొల్లలుగా తెలుసుట. ఈ సంగతి సరూకి తెలుసుట."

"సాయంత్రం కేకేసుకురారా వాణ్ణి" అన్నాడు రాజు.

"ఎవర్ని? నన్నేనా?" అంటూ సుబ్బారావు ప్రవేశించాడు దూకుడుగా.

"వెదకబోయిన తీగా! వెయ్యేళ్ళు బతుకు. కానీ నీకీ అడ్డమైన సంగతులు ఎలా తెలుస్తాయిరా?" అన్నాడు రాజు.

"ఇప్పుడు మళ్లా ఏం జరిగింది? ఆ పిల్ల..."

"మరే ఆ పిల్లకి ఉంగరాల క్రాఫింగు, నెరిసిన జుట్టు అంటే ఇష్టం. పైగా నీకు లోకంలో తెలీని సంగతులు లేవనీ, నువు మహా మంచివాడివనీ ఆ పిల్ల నమ్మకం. నాకేం" అన్నాడు అప్పారావు.

"చిత్రంగా ఉందే. నా చరిత్ర అంతా ఎలా తెలుసుకుందో" అన్నాడు సుబ్బారావు.

"అదేవిటి? భయపడ్డం మానేశావా? ఆ పిల్ల నిన్ను పెళ్లాడుతుందని భయంలేదూ?"

"భయం ఎందుకు? అంతగా బెదిరిస్తే అక్కర్లేదని ఖచ్చితంగా చెప్పేస్తా... ఎటొచ్చి..."

"సరేగాని, నీ రహస్యం చెప్పు. నీకు చిన్న చిన్న విషయాలు, చిల్లర విషయాలు, అశోకుడేం చేశాడో, నీళ్లలో ఇనపముక్క మునిగి, కర్ర ఎందుకు తేల్తుందో, ఇండియా ఆఖరి గవర్నరు జనరలు ఎవడో – ఇలాంటివెలా తెలుసు?"

"ఆ, దానికేముంది? మా తమ్ముడికి రోజూ రెండుపూటలా పాఠం చెప్పకపోతే, మా నాన్నగారు డొక్క చీల్చేస్తానని చెప్పారు. అందుకని, పాఠం చెబుతూ ఉంటే, ఇవన్నీ తెలుస్తున్నాయి" అన్నాడు సుబ్బారావు.

"రైతో, నువు తక్షణం వెళ్లిపో," అన్నాడు రాజు.

☆ ☆ ☆

ఆ సాయంత్రమే, వాకబు చేసి ఫస్టుఫారం చదువుతున్న తమ్ముడు గల ఒక అన్నయ్యని మంచిచేసుకున్నారు. ఆ అబ్బాయి దగ్గర ట్యూషన్ చెప్పించుకుంటానన్నాడు రాజు.

"కుర్రవెధవ దగ్గిర ట్యూషన్ చెప్పించుకోవడమేమిటి, సిల్లీ" అన్నాడు మిత్రుడు.

రాజు గంభీరంగా నవ్వాడు. "ఇంద్రుడి వజ్రాయుధం దేంతో చేశారు?"

"వజ్రంతో."

"చూశావా, అది తప్పాట."

"నువ్వు చెప్పు చూదాం" అన్నాడు స్నేహితుడు.

"నాకు తెలీదు, మీ తమ్ముడిని అడుగుదాం."

ఎముకతో చేశారు అని తమ్ముడు చెప్పాడు. కాని రాజుకి కూడా నమ్మకం కుదరలేదు.

"ఎవరి ఎముకలు?" అని అడిగాడు.

"దధీచి అనేవాడు ఇచ్చాడు."

"కర్ణుడు కాదా?..." అన్నాడు రాజు.

"కాదురా, బలి అయి ఉండొచ్చు."

"అబ్బే దధీచే. మా వాచకంలో ఉంది" అని నొక్కి చెప్పాడు చిన్న కుర్రాడు.

రైతో అనేసి, ట్యూషన్ ఏర్పాటు చేసుకున్నాడు రాజు. రెండు పూటలూ ఆ కుర్రాణ్ణే కాఫీ హోటలుకి, అక్కణ్ణించి హాస్టలుకీ తీసుకెళ్లడం, పాఠాలు నేర్పినట్టు నేర్పుతూనే వాటిని తనే నేర్చుకోవడం సాగించాడు. బుధ, గురువారాలు హోరాహోరీగా చదువు సాగింది. మరోపక్క క్రాఫింగుకు రింగులు తిరుగుతున్న ఛాయలు కనబడ్డాయి.

కాలేజీలో అంతా రాజు గురించే, ఖాళీ ఉన్నపుడల్లా కబుర్లు చెప్పుకుంటున్నారు. రింగులు తిరుగుతాయా, తిరగవా అన్న విషయం మీద కొందరు పందెం అనుకుంటున్నారు. కొందరు హాస్టలుకి వెళ్లి రాజుని పరామర్శ చేస్తూ వచ్చారు.

☆ ☆ ☆

శుక్రవారం సాయంత్రం రాజు చిరాగ్గా పచార్లు చేస్తూ ఉండగా గురుతుల్యుడైన శిష్యపరమాణువు వచ్చాడు.

"నా తెలుగువాచకం దొరికిందండి. శిబి పాఠం చదివానండి. మరండి, నిన్న మీరు చెప్పింది తప్పండి. శిబి చక్రవర్తిని డేగ తినెయ్యలేదట. తినెయ్యి కావలిస్తే అని ఊరికినే అన్నాడు. అప్పుడేమో డేగ ఇంద్రుడై పోయి..."

"ఒద్దులేవోయ్ ఆపెయ్. నాకా కథ అక్కర్లేదు. నాదే తప్పులే" అన్నాడు రాజు విసుగ్గా.

"పోనీ తెలుగు ఒద్దులెండి... జాగర్ఫీ కూడా మీరు చెప్పింది తప్పండి... కాన్పూరు కందిపప్పుకి ప్రసిద్ధి కెక్కింది."

"ఇదిగో అబ్బాయ్, కాన్పూరు సంగతి నాకు తెలీదు కానీ, ఇండియన్ ఆర్చిపెలగోలో పేము బాగా పండుతుందని నాకు బాగా తెలుసు. పేకబెత్తాలు మన వూళ్లోకి దిగుమతి అయ్యాయి కూడా. నువ్వు వెంటనే ఇంటికెళ్లకపోతే పేకావారమ్మాయి నిచ్చి పెళ్లిచేస్తా..." అన్నాడు రాజు మహా కోపంగా. శిష్యుడు తెలుగువాచకం అక్కడే పడేసి ఇంటికి పరిగెత్తాడు.

అంతలోనే అప్పారావు రొప్పుతూ రోజుతూ వచ్చాడు.

"అబ్బాయ్ రాజూ, తాంబూలా లిచ్చేసుకున్నారట, తన్నుకు చావు. నాకు నిజంగా బాధగా ఉందనుకో. కథ అడ్డం తిరిగిపోయి పెడదారిన చాలా దూరం వెళ్లిపోయింది, సారీ" అన్నాడు ఒగరుస్తూ.

"ఎవరి గోల నువ్వు చెప్పేది?" అన్నాడు రాజు చాలా తాపీగా నిశ్చలంగా, నిబ్బరంగా.

"అదే, అదే నీ... ఐ మీన్ సరోజ... ఆ అమ్మాయికి సుబ్బిగాణ్ణిచ్చి పెళ్లి చేయడానికి వాళ వాళ్ల నాన్నగార్లు, పెద్దలూ నిశ్చయించేసి తాంబూలా లిచ్చేసుకున్నారు. వాళ్లూ, వాళ్లూ దూరపుచుట్టాలట. అసలు బంధుత్వం ఎలా ఏడిసినా, ఈ పిల్ల 'పెళ్లి చేస్తారా, చస్తారా' అని హఠం వేసుకుకూర్చుందిట. మన వెధవ ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. అయినా కాకపోయినా తండ్రి యెడల ఎంత భయభక్తులున్నా మరీ ఇంత..."

"ఎవరూ నువు చెప్పేది, సరోజ సంగతా? ఆ పిల్ల సుబ్బారావుని పెళ్లాడితే వచ్చిన ముప్పేమిటి?" అన్నాడు రాజు తాపీగా.

"హారీ పిడుగా, ఆదివారం పొద్దుట్నుంచి ఇవాళ మధ్యాహ్నం వరకూ నువ్వు ఆపసోపాలు పడి నా మతి పోగెట్టిందెవరికోసంరా?... నువ్వు ఆమెని ప్రేమించలేదూ?" అన్నాడు అప్పారావు ఆశ్చర్యంగా కుర్చీలో కూచుంటూ.

"నాన్సెన్స్! మా నాన్న నాకు వేరే సంబంధం చూశాడు. నేను చూడకపోతేనేం, ఆయన ఎన్నిక చేసిన పిల్ల బాగుంటుందని నాకు గట్టి నమ్మకం ఉంది."

కుర్చీలో కూచున్న అప్పారావుకి, పక్కనే ఉన్న బల్ల మీద ఓ ఉత్తరం లాంటిది కనబడింది. రాజు మాటలు వింటూనే చదివాడు...

"తాంబూలాలు ఇచ్చుకున్నాము... ఈ సంబంధం కనక... డొక్క వాలికలు చేసేస్తాను... వె... వేషాలు వెయ్యక...టనే రావలెను.

ఇట్లు
జగన్నాధము"

పచార్లు చేస్తున్న రాజు ఇంకా ఏదో చెప్పుకుపోతున్నాడు. "అసలు అదీ కాక..."

"మరే, మరే, నీ క్కావలిసిందేదో నీకే తెలీదనుకో... అసలదీ కాక సరూని నువ్వు చూసింది రెండు సార్లేగా, ఎడతెగని పితృభక్తితోటి..." అన్నాడు అప్పారావు హేళనగా.

* * *




"పది" అంది వకీలుగారింటి గడియారం.

"కాదుస్మీ" అంది పక్క వాటాలో మేష్టరుగారి గడియారం.

☆ ☆ ☆

ఆ రాత్రి పది గంటల వేళ ఈ విధంగా, పది అయిందని రైల్వే గడియారాలూ, కాలేదని రేడియో గడియారాలూ అభిప్రాయపడుతున్నాయి. పురోగమనం అంటే మరీ ఇదయ్యే చిల్లర గడియారాలు గంట క్రితమే పది కొట్టేసి, పన్నెండవడానికి సిద్ధంగా వున్నాయి.

షికారుకెళ్తానని చెప్పి రెండో ఆట సినిమా చూసి వచ్చిన పురుష పుంగవులు, కలత నిదురలో లేచి తలుపు తెరిచిన నెలతల మునులేత బుగ్గల పౌడరు పొరమీద తేలిగ్గా చిటికవేసి, 'ఏడున్నర'కే పడుకున్నావేం, తలనొప్పిగా ఉందా' అని కుశలం అడుగుతూ బుకాయించి తమకు ఆకలి లేని వైనాన్ని వెల్లడించి, పునరుద్ఘాటించి హడావుడిగా నిద్ర నటిస్తున్నారు.

గోదావరీ తీరాన సీరియల్ విరహగీతాలాపనతో సహా బాధ పడిపడి, మిగతాది బోంచేశాక అని స్థిమితపడి, ఆ వేళకే ఇల్లు చేరిన రోమియోలు పొంగి పొరలే వేదననీ, అమ్మ పెట్టే చివాట్లనీ, ఎదురుగుండా కంచంలో ఉన్న పొడి మెతుకుల్ని కలిపి దిగమింగుతున్నారు.

☆ ☆ ☆

'పది' అంది వకీలు సుబ్బారావుగారి గడియారం.

"సరిగ్గా ఈపాటికి సీత హైదరాబాద్‌లో పడుకోబోతూ వుంటుంది" అనుకున్నాడు – సీత దైనందినీయం కంఠతాపట్టేసిన గురునాధరావు.

"ఇందాక కాదు. ఇప్పుడే పది అయింది" అంది గురునాథరావు పడుకున్న గదిలో గడియారం, చేతనైనంత గంభీరంగా. 'హు' అనుకున్నాడు గురునాథరావు గట్టిగా.

పక్కవాటాలో ప్లీడరు సుబ్బారావుగారికి ఇక్కడ గురునాథం తండ్రి రామనాథం గారికి అభిప్రాయ భేదాలున్నాయి. కాబట్టి స్వామిభక్తిగల వారి వారి గడియారాలూ, రోజూ రాత్రి పదిగంటల వేళ లాంఛనానికి విభిన్నాభిప్రాయాలు ప్రకటిస్తాయి.

ఇలా విభిన్నాభిప్రాయాలు గలవారు ఇరుగూ పొరుగులుగా ఉంటూ శాంతియుతంగా సహజీవనం చేయవచ్చునని, అమాట కొస్తే చేసి తీరాలని నమ్మినవాడు గురునాథరావు. అందులోనూ, ప్రక్క వాటా వకీలుగారి కూతురు ఇవతలి వాటాలో పెళ్లికాని పిల్లాడి హృదయాన్ని అపహరించి అట్టే పెట్టుకున్నప్పుడు మార్గాంతరం లేదు.

అయితే, ఈ సహజీవనం ఏర్పాటుమీద గురునాథరావుకి ఎంత గురివున్నా ఆ క్షణాన, ఇరుగుపొరుగు గడియారాలు రెండూ చెరో అభిప్రాయం ప్రకటించడంతో కొంత ఒళ్లు మండిపోయింది.

ఏక్షణాన సీత హైదరాబాద్‌లో పడుకొని వుంటుందీ అన్న విషయం సందిగ్ధంగా ఉండి పోయింది. ఇంకోక్షణానికి, అది అతని పాలిట జీవన్మరణ సమస్య అయిపోయింది.

కాలేజీలో ఓ ప్రేయసి, గుడిప్రక్క మేడమీద ఓ జూలియట్, గోదావరొడ్డుకి షికారుకెళ్ళే దారిలో ఓ సుందరి ఇలా ప్రేయసీమణుల జాబితా వేసుకుని ఎవరేనా ఊరువెళితే తాత్కాలికంగా ఆ ఖాళీ భర్తీ చేయడానికి విడిగా 'స్టాండ్ బై' (ప్రత్యామ్నాయ ప్రేయసీమణులు)ల జాబితా హమేషా సిద్ధంగా ఉంచుకుని, ప్రొబేషనరీ జూలియట్ల లిస్టు వేరే తయారుచేసుకున్న వాళ్లకి ఈ "ఏకలవ్య"డి కష్టాలు బోధపడవు.

అవకాశవాది అభిప్రాయాలలా, క్షణానికో ప్రేయసిని మార్చుకునే వీళ్లకి ఈ సమస్య, బొత్తిగా అమావాస్యలా రూపరేఖా రహితంగానూ, పిరికివాడి అభిప్రాయంలా అయోమయంగానూ, ఎన్నికల వాగ్దానంలా అసంగతంగానూ కనబడుతుంది.

హైదరాబాద్‌లో ఒక సీత ఎన్నిగంటలకి నిద్రపోతే ఏమొచ్చె అని హేళన చేసి తేలిగ్గా కొట్టిపారేస్తారు వాళ్లు.

కాని గురునాథరావు నికార్సయిన "ఏకలవ్యుడు". సీతని చూశాడు, ప్రేమించాడు. ఇంకెవరినీ చూడలేదు. చూసినా ప్రేమించలేదు.

'సీతే నా జీవితం' అనుకున్నాడు.

'సీతా నా జీవిత గీతా' అని తరువాత ఓ ప్రేమ గీతం వ్రాశాడు. బాగుండలేదంది సీత. సరేనని చింపేశాడు గురునాథం.

ఆ తరువాత ఎన్నాళ్లయినా అతడు సీతనే ప్రేమించసాగాడు (పాటలు వ్రాయకుండా). కాలేజీలో చాలా మంది అతన్ని లోకువకట్టి, 'ఏకలవ్యుడు' (ఒకే ప్రేయసి గలవాడు) అని పేరు పెట్టారు.

అయినా గురునాథరావు ఈ వ్రతం ఉల్లంఘనకి వడికట్టలేదు. అందులో కొన్నాళ్లాయె, సీత, పక్కవాటా అమ్మాయి అయింది.

సీత కాఫీ తాగడం ఆలస్యం అయితే, ఆ సంగతి తెలియకపోయినా, ఇవతలి వాటాలో గురునాథరావుకి ఠకీమని తలనొప్పి వచ్చేది. అతనికి తలనొప్పి వచ్చిన తక్షణం సీత కాఫీ తాగేసేది, తెలియకుండానే.

అందువల్ల, సీత హైదరాబాద్‌లో ఆ రాత్రి ఏ పదిగంటలకి పడుకుని వుంటుందన్న విషయం తెగని సమస్య అయిపోయింది. ఇండియన్ స్టాండర్డ్ టైమ్ తెలిస్తే బాగుండుననిపించింది.

అందువల్ల ఆ రాత్రి పదిన్నర ప్రాంతాల్లో ఎవరో హఠాత్తుగా దబదబ తలుపు కొట్టడంతో "ఇంటియన్ స్టాండర్డ్ టైం ఎంతో నాకు తెలియజెప్పడానికి సీత పంపిన దూత కాబోలు" అన్న అభిప్రాయంతో గురునాథరావు చెంగున గంతువేసి పరుగెత్తి తలుపుతీసి, "ఎంత?" అన్నాడు అర్జెంటుగా. తలుపవతల నిలబడిన నల్లటి, సన్నపాటి చిన్న సైజు శాల్తీ బోల్డు సిగ్గుపడిపోయి, తలక్రిందులైపోయి, సంతోషం, ఆశ్చర్యం నటించి "మూడున్నరచాలు ఇప్పటికి" అంది టూకీగా.

మూడున్నరేమిటని గురునాథరావు త్రుళ్లిపడి కళ్లు విప్పార్చి చూశాడు, "టీ, సిగరెట్లూ కూడా లేకుండా, లేవన్న సంగతి తెలియకుండా ఇలా రాత్రి మూడున్నరదాకా సీత గురించి బెంగెట్టుకుంటున్నాను కాబోలు" అనుకుంటూ.

ఐతే ఉత్తర క్షణంలో ఎదుట కనబడ్డ శాల్తీకీ, సీత పంపతగు దేవదూతకీ పోలికలేం కనబడలేదు గురునాథానికి.

"హరి నువ్వట్రా!" అన్నాడు.

"కాదు మరీ, పూర్తిగా నేనే, కేవలం నేనే!" అన్నాడు తుకారాం వినమ్ర భావంతో, మందంగా హసిస్తూ.

గురునాథం గబుక్కున తలుపు గడియ వేసేయబోయాడు. కాని దూరదృష్టిగల తుకారాం అప్పటికే తలుపివతల ఓ కాలు పెట్టేశాడు.

"మూడున్నర కాకపోతే రెండున్నర చాలులే" అన్నాడు.

"అణాన్నర కూడా ఇవ్వను" అన్నాడు గురునాథం.

"నువ్వేగా, ఎంత కావాలని మహా భోజరాజు పోజులో అడిగావు! పోనీ అణాయేనా ఇయ్యి, టీ తాగిపోతాను" అన్నాడు తుకారాం, గురునాథరావు జేబులో సిగరెట్లు తీసుకుంటూ.

"దమ్మిడీ కూడా ఇవ్వను... నే నడిగింది టైమెంత అని."

"బ్రదర్! నీ ఎడం గుండెలో హార్టేమయింది? ఇంత కర్కశంగా మాట్లాడుతున్నావే! నీ హృదయం ఏమయిపోయిందీ అంట" అన్నాడు తుకారాం విస్తుపోయి.

"నా హార్టిక్కడ లేదోయ్. హైదరాబాద్ వెళ్లింది" అన్నాడు గురునాథం చిరాగ్గా.

"ఓస్ ఇంతే కదా! మళ్లా ఎల్లుండి సోమవారం పొద్దున్నే ఇక్కడ సిద్ధం అవుతుందిగా. అప్పుడు నచ్చచెబుదుగానిలే. ఇప్పుడు అడిన మాట తప్పకు. నా సత్యవంతుడివిగాదూ... నా హరిశ్చంద్రుడివిగాదూ!"

"అట్టె అట్టె... సీత పది రోజులదాకా రానంది గదా ఎల్లుండే వస్తుందని ఎవరు చెప్పారు?"

"తుకారాం న్యూస్ సర్వీసెస్ వారు సరియైన సమాచారాన్ని సరసమైన ధరలకే విక్రయించెదరు" అన్నాడు తుకారాం.

"అక్షర లక్షలిచ్చేస్తాను. త్వరగా చెప్పబాబూ."

"అబ్బే, మాట కణా, లేక ఆరు పైసాలు ఇస్తే చాలు. వెళ్లి దోసెడణాకాసులు పట్రా. ఒక్కోటీ వేద్దుగాని" అన్నాడు తుకారాం.

☆ ☆ ☆

పైవిధంగా పావల్తక్కువ మూడు రూపాయలు పెట్టి గురునాథరావు కొనుక్కున్న సమాచారం సారాంశం– మూడోనాటి కల్లా సీత హైదరాబాద్ నుండి తిరిగి రాబోతున్నదని.

"ఏం, ఢిల్లీ వెళ్లదా మరి? కొంపదీసి..." అన్నాడు గురునాథరావు.

"రైట్. సరి, కరెక్టండి. అక్షరాల నిజమండి. మీ కాబోయిన మామగారు అవాలనుకొన్న మినిస్టరు అవటం లేదండి."

గురునాథరావు ఉలిక్కిపడ్డాడు. "నీ వెనకాల చీకటినిండా వేలాది శ్రోతలు, క్యూలో నిల్చున్నారేవిట్రా? ఎవడువాడు?" అన్నాడు కంగారుగా.

"ష్! అప్పుడే కాదు, ఆగండి" అన్నాడు తుకారాం, చీకట్లోకి అభినయిస్తూ. ఆ అశరీరవాణి ఆగింది.

"మాటాడవేంరా" అన్నాడు గురునాథరావు ఉరుముతూ.

"... అదేనండి. మీరనుకున్నట్టే... మీ మామగారికి మినిస్టరు ఛాన్సు రాదుటండీ... అందుకేమో, ఢిల్లీ ఇంకెందుకని..."

"ఛస్, నోర్మూయ్యండి. మిమ్మల్ని కాదు, నన్నూ వాడు అడిగింది" అన్నాడు తుకారాం గట్టిగా. అశరీరవాణి మళ్లీ ఆగిపోయింది.

"ఎవరు వారు?" అన్నాడు గురునాథరావు.

"వారి పేరు టెలిపతిరావుగారులే. పొలిటికల్ ఎక్స్‌పర్ట్. తుకారాం న్యూస్ ఏజన్సీడైరెక్టరు... ఔనుగాని నేను అర్జంటుగా ఓ పనిమీద వచ్చాను, విను."

"నా దగ్గర ఇంక డబ్బు లేదు. ఉన్నా ఇవ్వను."

"పోనీ వద్దులే. నే వెళ్లేలోగా నీ మనసు కరిగి నీరై పోకపోతే ఇవ్వద్దులే. అవునుగానీ, నాక్కొంచెం షోగ్గా సంతకం పెట్టడం నేర్పగలవూ?" అన్నాడు తుకారాం.

"ఏం గిరాకీ, చెక్కు బుక్కు దొరికిందా?"

"ఇంకా లేదు. రేపట్నించి దారుణంగా డబ్బొచ్చేస్తోంది. న్యూస్సర్వీస్ పెట్టాం గదామరి... దాని కోసం అని చెక్కులమీద సంతకం నేర్చుకోవద్దూ?! అది మంచి దర్జాగా, ఎవరికీ అర్థం కాకుండా, మళ్లీ నేను ఎప్పుడూ ఒక్కలాగే పెట్టడానికి వీలుగా ఉండాలి."

"అబ్బ, ఊహ బావుర్ది కాని, లిద్దరొస్తార్లి, పోయి పడుకుల్దారా, నీ సల్లకాల బాట దేవుశెరుగు" అన్నాడు గురునాథరావు బద్ధకంగా ఆవులిస్తూ.

'పదమూడు' అంది తలుపవతలి అశరీరవాణి.

"అబ్బబ్బ! అవి పేగులుకావు సార్" అన్నాడు తుకారాం విసుగ్గా.

"ఎవర్రా అది? ఏమిట్రా కథ?... ఇట్రమ్మను."

తుకారాం కొంచెం సిగ్గు నటించి, చీకట్లో శాల్తీని వెలుగులోనికి లాగాడు.

"వీరి పేరు టెలిపతిరావుగారు. ఆవలిస్తే పేగుల్లెక్కెడతారు."

"ఎందుకూ? జబ్బా? హాబీనా?" అన్నాడు గురునాధరావు.

"కాదు, వృత్తి. పొలిటికల్ ఎక్స్‌పర్ట్ దగ్గిర వుండాల్సిన విద్య అదేగదా?"

"ఆ, ఐతే ఇప్పుడు నాకు పదమూడు పేగులున్నాయంటారా సార్?" అన్నాడు గురునాధరావు సగౌరవంగా.

"ఆయన బొంద! ఆయన అభిప్రాయాలకేంలే. అసలాయనికి తెలీదు. ఆవలిస్తే పేగుల్లెక్కెట్టొచ్చునని. ఎవరో చెప్పార్ట. ఈయనేమో రొమ్మెముకలు చూసి పేగులనుకుంటాడు. ఒరేయ్... మెడ మీద మిడత పడ్డట్టు అలా చూడకు. నేనేదో తన్ని తిడుతున్నాననుకుంటాడు. చెవుడులే..." అన్నాడు తుకారాం సాదాగా.

టెలిపతిరావు ఎలక్షన్స్‌లో గెలిచినవాడిలా వినమ్రభావంతో మందహాసం చేసి గురునాధరావుకి నమస్కరించాడు. "నామీద అభిమానం కొద్దీ వారలా నన్ను ఘనంగా ఎన్నిక చేస్తున్నారు, నమ్మండి. తుకారాం న్యూస్ సర్వీసు అయిడియా ఆయనదే; కంపెనీ నాదిలెండి. హిహీ" అన్నాడు.

గురునాధరావు వీధిలోకి దృష్టిసారించి, "ఎవరండి" అన్నాడు హారాత్తుగా. తుకారాం వెనక్కితిరిగాడు కుతూహలం కొద్దీ.

రాజకీయ హంతకుడు సాటి నాయకుడిని కూలద్రోసే ఒడుపుతో, సుతారంగా, సున్నితంగా, మృదువుగా గురునాధరావు తుకారాంని గుమ్మం అవతలకి నెట్టేసి గబుక్కున తలుపు వేసి గడియపెట్టి ఆవలించి "హారా" అనుకుని, మంచంమీద పడుకుని సీతగురించి బెంగెట్టుకుంటూ నిద్రపోయాడు.

గడియారం మళ్లీ గంటలు కొడుతూ ఉండగా, వీధి తలుపు చప్పుడైంది.

గురునాధరావుకి మెలకువ వచ్చింది కాని, తలుపు కొట్టేది తుకారాముడే నన్న నమ్మకంతో కళ్లుమూసుకు పడుకున్నాడు.

అందుకని వాళ్ల నాన్నగారు లేచివెళ్లి తలుపు తీస్తూనే, "అరె! మీరా? ఎప్పుడు రావడం?" అన్నారు.

"డిసెంబరు ఇరవయ్యో తారీఖు పొద్దున్న. నాలుగు నెల్లాయి గుమ్మంలో నించుని తలుపు కొడుతున్నాం" అన్నారు సుబ్బారావుగారు గంభీరంగా.

"ఒరి బాబో! మినిష్టరైపోయినట్టే మాటాడుతున్నారే, బావగారు!" అన్నారు రామనాధంగారు.

"ఏవిటి కథ? ఠకీమని జవాబిచ్చాశారే! ఇంక్రిమెంటుగినా తగిలిందా కొంపదీసి?" అని ఆశ్చర్యాన్ని అభినయించారు సుబ్బారావుగారు.

"ఇంకా అలాంటి ఉత్పాతం ఏదీ సంభవించలేదు గాని, మీరు పెద్దసైజు లీడరు అయేలోగానే మా టీచర్లకి జీతాలు పెరగడం మటుకు ఖాయం లెండి.... కావలిస్తే రాసిస్తా" అన్నారు రామనాధంగారు ఫెళఫెళ నవ్వుతూ.

"అలా జరిగితే నేను మంత్రి అయిన తక్షణం అవన్నీ రద్దు చేయించేస్తాను. ఆ యింక్రిమెంట్లేవో నా చేతిమీదగానే రావాలి."

"మరే, 'లేదు పొమ్మనడానికి కోడలెవర్తి' అందిట వెనకటికో అత్తగారు."

దానికి ఠకీమని జవాబేం చెప్పాలో లాయరుగారికి తట్టలేదు.

రాగాలాపనలో పైషడ్జమం దాటిపోయి అక్కడేం చెయ్యాలో తోచక, నిలవలేక అవస్థపడే జూనియర్ గాయకుడిలా గింజుకోసాగాడు.

అంతవరకూ మాటాడకుండా, అలా మరచెంబూ సంచీ పట్టుకుని నిలబడ్డ సీత తక్షణమే "నాన్నా, నిద్దరొస్తోంది, ఇంట్లోకెడదామా ఇంక" అంది.

"అయ్యో రాతా! నీ సంగతే మర్చిపోయాను! నా కబుర్లో నేనూను! పదమ్మ పద, తాళం తియ్యి" అన్నాడు లాయరుగారు మహా సంతోషపడిపోయి మళ్లీ లేచి.

క్లిష్టపరిస్థితులు వచ్చినప్పుడల్లా సీత అయన్ని ఇలాగే ఆదుకుంటుంది.

ఆయనకి కేసులు గెలవడం బోలెడు సరదా. కాని, గెలవడానికి కోర్టు కెళ్లినా కేసులు దొరకవు. ఇంకెందుకని వెళ్లడమూ అని మానేశాడు. అందుకని ఇంట్లోనే కూతురితోనూ, ఇరుగు పొరుగులతోనూ సూటిపోటి మాటల పోరాటాలు పెట్టుకుని, ఎదుటి మనిషి నోరు మూయించినప్పుడల్లా 'కేసు పోయింది' అని నవ్వేసి మురిసిపోయే అల్పసంతోషి. ఈ తరహా కేసులు ఆయన తరచు గెలుస్తూనే వుంటాడు. ఓడేది సాధారణంగా పక్కవాటాలో మేష్టారిగారి దగ్గరే. అసలు మేష్టర్లు ఈదురోమంటూ, దిగులుగా, ఎప్పుడు బతికావు అంటే ఏణ్నర్థం అయిందన్నట్టుగా వుండాలని ఆయన భావం. కథలు చదివి, చదివి అది మనసులో ఖరారు చేసుకున్నాడు. రామనాథంగారు టింగు రంగామంటూ ఉండటం, మాటకు మాట బదులు చెప్పగలగడం ఎలా సాధ్యమో ఆయనకి బోధపడలేదు.

అసలు లాయరు సుబ్బారావుగారు ఆ ఇంట్లో అద్దెకు దిగిన కొద్దిరోజులకే, చనువుపేరిట అలుసు తీసుకుని, ఓరోజు పొద్దుటే "హా టీచర్స్! పూర్ క్రీచర్స్" అనేశారు. ఆ తరువాత "మీ జీతాలు దారుణం. ఎలా బతుకుతున్నారోగాని" అన్నాడు.

"అదేనండి పెద్ద మిష్టరీ... అయితే ఒక్క విషయం గమనించారూ? మా జాతికి ఈనెల కాపోతే పై నెలైనా వంద కాబోతే యాభయ్యేనా చేతికందడం గారంటీ అండి" అన్నాడు, మేష్టరు రామనాథంగారు నవ్వుతూ.

దానికి ఠకీమని కాదుగదా, ఇంకో నిముషం తిరిగినా కూడా సుబ్బారావుగారికి జవాబు తోచలేదు.

'కేసు పోయింది', అని రామనాథంగారు అనబోతూ ఉండగా, "నాన్నోయ్, కాఫీ" అని కేకపెట్టింది సీత వంటింట్లోంచి.

ఒక్క అంగలో వంటింట్లో పడ్డాడు సుబ్బారావుగారు 'హమ్మయ్య!' అనుకొని.

'అబ్బ! ఎంత వేడి... నాన్నా! నీకిపుడు మేష్టరంటే బాగా ఒళ్లు మండుతూందికదూ' అంది సీత నవ్వుతూ.

"ఔనమ్మా, మరీ పొగరుగా మాటాడతాడు. అసలు మందే తప్పు. ఈ మధ్యతరగతి వాళ్లకి చనువిస్తే నెత్తికెక్కిపోతారు" అన్నాడు సుబ్బారావుగారు. అంటూనే ఆయనకి బ్రహ్మాండమైన ఊహ పోయింది. కూతురి మాటలు సాంతం వినకుండానే, మళ్లీ ఉమ్మడి సావిట్లోకి వెళ్లాడు.

"అప్పుడే కాఫీ తాగేశారాండీ" అన్నాడు రామనాథంగారు. ఆయన కొత్తలో కొన్నాళ్లు లాయరుగారి దొంగ దెబ్బలు తెలిసినా సహిస్తూ వచ్చాడు గానీ ఆయన తనని వాజమ్మకింద జమకడుతూన్నట్లు పసిగట్టి, పొట్టేలులా పుంజుకున్నాడు.

"ఏమి కాఫీలోనండీ! దండగ ఖర్చు! సామెత చెప్పినట్టుగా మనందరికీ తాహతు మించిన గుణాలు అబ్బాయి" అన్నాడు సుబ్బారావుగారు.

"కాఫీకే అలా అంటే ఎలాగండి? ఆ మాత్రం తాహతూ లేదనుకుంటే ఈ తాపత్రయాలెందుకంట?"

"దొరికింది ఛాన్సు" అనుకున్నాడు సుబ్బారావుగారు. అనుకుని దాడికి ఉపక్రమించాడు.

"ఏమిటండీ సార్, మన తాహతు ఏమిటంట? అసలు మన తల్లిదండ్రులకి పొరబాటున కాస్త దూరదృష్టి ఉండబట్టి ఏదో నాలుగక్షరమ్ముక్కలు నేర్పించారు. సరిపోయింది. ఇవాళ కాఫీ తాగుతున్నాం. లేకపోతే ఈనాడు మనం జెటకాబండి తోలుకు బతకాల్సినవాళ్లమేగా... అహఁ సంగతి చెబుతున్నా, ఔనంటారా కాదంటారా?" అన్నారు సుబ్బారావుగారు ధాటీగా. దెబ్బకి చచ్చాడు అనుకున్నాడాయన కుర్రాడి ఆనందంతో.

"ఖచ్చితంగా కాదంటానండి. మీ వాళ్ల సంగతేమో నాకు తెలీదుగాని, మా పెద్దలకి దూరదృష్టి లేకపోవడం ఎన్నడూ జరగదు. ఒకవేళ వాళ్లకి ఆ దృష్టిలేక, నేనివాళ జెటకా తోలుకోవలసివచ్చినా అందుకేం దిగులుపడను. ఝూంమని జెటకా తోలుకు బతుకుతాను. ఔనంటారా కాదంటారా?" అన్నారు రామనాథంగారు.

"నాన్నోయ్! కాఫీ చల్లారిపోతుంది. తొరగా రా" అంది తలుపవతలే ఉన్న సీత.

"వచ్చేనమ్మా వచ్చే" అని పరుగెత్తుకెళ్లిపోయాడు, జవాబు తోచని సుబ్బారావుగారు.

☆ ☆ ☆

"నువ్వు గొప్ప రాజకీయ నాయకుడివీ, పెద్ద మినిష్టరువీ అవబోతున్నావు" అని మర్నాడు ఓ జ్యోతిష్కుడు (ముందుగా తెచ్చి ఉంచుకున్న) ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పేవరకు ఆయన కోలుకోలేదు. ఆ తరువాత దినపత్రిక కొని చదివేసేవరకూ ఊరుకోలేదు. చదివేశాక అంతకన్నా ఊరుకోలేదు. రామనాథంగారిని ఊదరగొట్టేశాడు.

"పేపరు చదవడం చాలా అవసరమండీ" అన్నాడు, ఆయన్ని మరమ్మతు చేసే సత్సంకల్పంతో.

"మీరీ యింట దిగినప్పటినించి ఆ ముక్క నేను చెబుతూ వచ్చానుగదా! ఇన్నాళ్లకి గుర్తించారన్నమాట!" అన్నారు రామనాథంగారు నవ్వుతూ.

సుబ్బారావుగారు టిక్కమొహం పెట్టబోతూ ఉండగా "నాన్నా, ఒక్కసారిలా రా" అని గావుకేక పెట్టింది సీత.

"నా తల్లే, మా ఇందిరే" అని మురిసిపోతూ పారిపోయారు సుబ్బారావుగారు.

"ఏవండోయ్ బావగారూ, కేసు పోయిందనను లెండిగాని, ఇందిరెవరూ? మీ పిల్లపేరు సీతగాదూ" అన్నారు రామనాథంగారు.

సుబ్బారావుగారు జవహర్‌లాల్ నెహ్రూ అంత ఎత్తుసాగి, అక్కణ్ణించి రామనాథంగారిని 'క్రేన్ షాట్ వ్యూ'లో చూపి, మందహాసం చేసి, మాట్లాడకుండా వెళ్లిపోయారు; తరువాత కథ తెరమీద చూడండన్న తరహాలో.

నిజానికాయన అంతవాడూ కావడం ఖరారని ఢంకా పట్టుకొచ్చిన జ్యోతిష్కుడు దానిమీద అదేపనిగా బాదుతూ చెప్పాడు.

పోలికలు కూడా బోలెడున్నాయన్నాడు. జవహర్‌లాల్‌కి తోడునీడ కుమార్తె ఇందిర ఒక్కర్తే. సుబ్బారావుగారికి సీత... కేవలం అదొక్కటే కారణంగా, ఈయన అమాంతం రేపొద్దున్న ప్రైమ్మినిష్టరు రాష్ట్రంలో అవుతాడట. అలా అవాలని ఆయన చెప్పాడు.

"ఎక్కడో అక్కడ ఎలాగో అలా ఓసారి మినిష్టరు అయి ఊరుకోండి. ఇంక ఫరవాలేదు. వన్స్ ఎ మినిస్టర్..." అని జ్యోతిష్కుడు అనేసరికి

"ఆల్వేజ్ ఎ మినిస్టర్" అని సుబ్బారావుగారు అందుకున్నారు ఠకీమని.

సుశిక్షితుడైన జ్యోతిష్కుడి శిష్యుడు, సకాలంలో తుమ్మాడు.

సుబ్బారావుగారే తక్షణం జయం అన్నారు.

"మీరు ఇవాల్టినుంచే పేపరుకి చందా కట్టేసి రాజకీయాల గుట్టూ మట్టూ ఆకట్టుకోండి. ఈలోగా, అంతర్జాతీయ సమస్యలు – ప్రపంచ శాంతి లాంటివి – తేలికైనవి నాలుగైదు ఏరుకుని వాటి పరిష్కారానికి ప్లానులు ఆలోచించండి" అని నూరిపోసి, నూరు తీసుకు చక్కాపోయాడు జ్యోతిష్కుడు.

సుబ్బారావుగారు సమస్యల జాబితా ఓటి తయారుచేసి అట్టేపెట్టుకుని ఓరోజు పొద్దుటే హైదరాబాద్ బయల్దేరారు.

"అన్నట్లు మేష్టారూ, మీ జీతాలు పెంచే సమస్య ఓటుంది గదూ! అక్కడికెళ్తూనే చూస్తాలెండి" అన్నారు ఉద్ధరించే ఏర్పాటులో దర్జాగా.

"చిత్తం. మా సమస్య హైదరాబాదులో లేదండి. ఇందంబటే, మేష్టర్ల ఇళ్లల్లో వుంటుంది. ఏదో తీర్మానం గట్రా చేస్తున్నాం లెండి" అన్నారు రామనాథంగారు నవ్వుతూ.

"అమ్మమ్మమ్మ! అలాటి పిచ్చిపనులేం తొందరపడి చెయ్యకండి. వాళ్లు పుసుక్కుని లేదనేస్తారు. ఏదో నాలాటి వాడెల్లి నిల్దీసి గట్టిగా కనుక్కోవాలిగాని... కనుక్కోవడం ఏముంది, మినిస్టరంటూ అవుతూనే..."

"ఎంతమాట! ఎంతమంది మినిష్టర్లు కాందే మా కష్టాలు గట్టెక్కేను! మా సంఘంలో చెబుతాలెండి. 'సుబ్బారావుగారు మంత్రి అయేదాకా మా జీతాలు పెంచొద్దు. వీలైతే తగ్గించండి' అన్న తీర్మానం చేస్తాం. మీ ముద్దు చెల్లుగాత. శుభం, వెళ్లిరండి."

"మళ్లీ ఇప్పట్లో రావడం పడదేమోనండి. అట్నించలా ఢిల్లీ వెళ్లొచ్చు. పేపర్లో చూస్తారుగా. నా భోగట్టా తెలుస్తూనే వుంటుంది."

"ఏమిటీ! మీరు పేపరుకూడా పెట్టేస్తున్నారన్నమాట... భేష్" అన్నారు రామనాథంగారు.

రైలు ఓ మైలుదూరం వెళ్లాక రామనాథంగారు మాటల్లో హేళన బోధపడింది సుబ్బారావుగారికి.

'హారి నీ... ఇందుకే నాకు మంట. చూస్తాగా, మీ జీతాలెలా పెరుగుతాయో?' అన్నాడు కిటికీలోంచి బయటకు కసిగా చూస్తూ.

☆ ☆ ☆

...దేశసేవ చేసి తీరతానని సుబ్బారావుగారు ఎంత పట్టుబట్టినా కుదిరింది కాదు. కావలిస్తే దేశమధ్యంలోనే ఉండి కావల్సినంత సేవ చెయ్యండిగాని, ఇక్కణ్ణించి చెయ్యడానికి వీలుపడదని చెప్పారు అక్కడివారు. ఉన్న మినిస్టర్లకే ఇళ్లు దొరక్క ఇబ్బంది పడుతున్నారన్నా రాకాయన.

"అ, దాందేముందండి? మనం ఇక్కడ ఉంటామా పెడతామా? ఉహూ... టూరు చేస్తూ ఉండడమేగా! ఊళ్లోవున్న రెండ్రోజులూ కావలిస్తే హోటల్లో ఉంటాంలెండి" అనిచూశారు సుబ్బారావుగారు.

"నీకు మరీ మతిపోతోంది నాన్నా. వాళ్లంతా వేళాకోళం చేస్తున్నారు. అదీగాక ఎలెక్షన్‌లో గెలిస్తేగాని మినిష్టరుగిరీ ఇవ్వరు" అంది సీత.

"అమ్మదూ, నీకు తెలీదూరుకో" అని కోప్పడ్డాడు సుబ్బారావుగారు.

అలా ఎలక్షనుకి నిలబడని వాళ్లని ఇదివరకు నామినేటెడ్ మినిష్టర్లుగా నిలబెట్టిన సందర్భాలూ, వివరాలూ ఆయన కంఠతా పట్టాడు. అవన్నీ కలసిరాకపోతే, చివరికి ఎలక్షనుకే నిలబడతాను అన్నాడు.

'దర్జాగా నిలబడండి' అన్నారుగాని దగ్గర్లో ఎలెక్షన్లు ఏమీ లేవాయె.

చివరికి విసుగెత్తి దేశసేవని ఐదేళ్లు వాయిదా వేసుకొని తిరుగు టపాలో ఇంటికొచ్చేశాడు సుబ్బారావుగారు సుతాసమేతుడై.

☆ ☆ ☆

"పోనీ, కనీసం డిప్యూటీ దేశసేవన్నా చేస్తాననకపోయారూ –

ఆర్నెల్లుణ్ణేచ్చినా చాలనకపోయారూ" అన్నాడు రామనాథంగారు మర్నాడు ఉదయం సానుభూతి నభినయిస్తూ.

"ఆర్నెల్లు కాదు, ఆరు ఘడియలు కూడా..." అంటూ హఠాత్తుగా ఆగిపోయాడు సుబ్బారావుగారు. మూడు రోజులనాడు తను దేశసేవకోసం హైదరాబాద్ వెళ్తున్నప్పుడు రామనాథంగారు హేళన చేశాడన్న విషయం చటుక్కుని జ్ఞాపకం, అందుకని కోపం వచ్చాయి.

"ఇదుగో – ఏవండోయ్, మీరేమనుకుంటున్నారో ఏమిటో గాని మా పిల్లదాన్ని మీ గురునాథానికి చస్తే ఇవ్వను, ఆఁ" అన్నాడు.

"మేం ఎప్పుడూ అడిగినట్టు గుర్తులేదే" అని తడుముకోకుండా జవాబు విసిరిన రామనాథంగారు క్షణం తరువాత నాలిక్కరుచుకున్నాడు – ఎంతపనై పోయిందీ అని. సుబ్బారావుగారి మనసులో ఇలాంటి సదభిప్రాయం ఉన్నట్లు ఆయన కలలోకూడా అనుకోలేదు. గురునాథరావు సీతవంక గుడ్లు తేలవేసి చూడ్డం గమనించిన సమయాలలోమటుకు ఆయనకి రెండుమూడుసార్లు ఆ ఊహ తోచింది. సుబ్బారావుగారికి మనసులో అలాంటి సంకల్పం ఉందన్నమాట. ఇప్పుడాయన కోపంలో ఇంత చక్కగా దాన్ని ప్రకటించాడు. "ఏం లాభం!"

అప్పటికే, అవతల గదిలోంచి ఈ సంభాషణ వింటున్న గురునాథరావు గుండె గుభేలు మంది. అని, ఓసారి ఆగింది. ఆ తరువాత పనిచెయ్యడమో, ఆగిపోవడమో తేల్చుకోలేక తటపటాయించింది.

'ఏల బ్రతుకేల' అనే విషాదగీతం పాడవచ్చునని యజమానికి సూచించింది. కాని గురునాథరావుకి అలాటి పిచ్చివేషాలు గిట్టవు. సీతకి నచ్చవని భయం.

అనుకోకుండా పెద్దలాడుకున్న సరసం కాస్తా ఇలా బెడిసికొట్టింది. ఆ దెబ్బ తిన్నది పిన్నలు.

సుబ్బారావుగారు తిక్క కోపం కొద్దీ గబగబా వాకబు చేసేసి, మున్సిపల్ ఛైర్మన్ అయితీరాలనుకుంటున్న ఒకానొక గణపతిరావుగారిని వరించి, వారి కుమారుడికి సీత నివ్వ నిశ్చయించారు. అంతకుముందింకో ఇంజనీరు వినాయకరావుగార్ని చూసి ముచ్చటపడి సంబంధం ఖాయపరచబోయారు గాని, వారికి కుమారులు లేని వైనం ఆఖరు క్షణంలో తెలిసి విరమించారు.

తెలుగు సినిమా కథ చివరి భాగంలాగా, ఆయన ప్రయత్నాలూ, నిర్ణయాలూ, కార్యాలూ హడావుడిగా జరిగిపోయాయి. వారూ వీరూ చూచుకున్నారు. ముహూర్తాలూ పెట్టేసుకున్నారు.

ఇలాటివి గురునాథరావు ఖాతరు చెయ్యడుగాని, సీత పద్ధతి చూడటంతో అతనికి మతిపోయింది. చూడవచ్చిన పెళ్లికొడుకు లందరికీ వంకలు పెట్టి వచ్చిన దారినే పంపించేస్తుందనీ, ఈలోగా తను బియ్యేపాసై ఉద్యోగం సంపాదించి పెళ్లికి సిద్ధం కావచ్చుననీ అతని ఆశ.

కాని సీత అలాటి పనేం చెయ్యలేదు. ఔను అనలేదు, కాదనలేదు.

అక్కడితో గురునాథరావుకి సీతమీద ఆశ, జీవితంమీద ఆసక్తి తగ్గిపోయాయి. అశక్తుడి క్రోధం, దాని తరువాయి వాయ అయిన దుఃఖం పెల్లుబికాయి...

... ఉత్తర క్షణాల ఊళ్లో పెద్దల తలకాయలమీద కనబడని రాళ్లు వర్షించాయి. 'ఏమిటిది!' అని వాళ్లు ఆశ్చర్యపడ్డారుగాని –

"ఓ ప్రేమకథా! నీ దారి సదా అడ్డదిడ్డంగానే సాగిందిగదా. వెనుకటికి లైలామజ్నూ, దరిమిలానో ఆ వెనుకో రోమియో జూలియట్, ఇప్పుడు సీతా నేనూ... నాన్నలూ, మామయ్యలూ, సంఘం దళసరి గోడలూ ప్రేమికులని ఎంతో బాధపెడుతున్నాయిగదా!" అంటూ గురునాథరావు క్షుభిత హృదయం విసరిన శాపనార్థాంతారన్యాసాలే అలా రాళ్లయి నెత్తిన పడుతున్నాయని వాళ్లు పసిగట్టలేకపోయారు. ఒకరిద్దరికి తెలిసినా, ఆ ముక్క పైకి అంటే లాయరు సుబ్బారావుగారికి కోపం వస్తుంది, బాగుండదని, నోరు మూసుకూరుకున్నారు.

అలా కోపంగా శాపనార్థాలు గుప్పించడం అయిపోయిన తరువాత గురునాథరావుకి దుఃఖం, ఈ లోకంలో తక్షణం తన జీవితం 'అభావం' అయిపోవాలన్న సంకల్పం మరింత ఎక్కువ అయ్యాయి. ఈ స్థితిలో ఒంటరిగా ఉండటం మంచిది కాదని తోచి, మర్నాడు పొద్దుటే లేచి, తుకారాముణ్ణే వెతుక్కుంటూ బయల్దేరాడు. తుకారాం ఇప్పుడు రోడ్లవెంట తిరగడం లేదనీ, తుకారాం న్యూస్ సర్వీస్ ఆఫీసులోనే కూర్చుంటున్నాడనీ తెలిసింది.

వెళ్లగానే టెలిపతిరావు ఎదురయ్యాడు.

"హల్లో గుడ్‌మార్నింగ్, మీరు ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నారు గదా. రైటే! నాక్కూడా మార్గాంతరం తోచలేదు. కానివ్వండి. విషయాలకు మంచి హెడ్డింగు పెట్టి మెడ్రాస్ పంపిస్తాను. 'ప్రముఖ ప్రేమికుడి ప్రపంచాంతర ప్రయాణం' అని" అన్నాడు టెలిపతిరావు.

గురునాథరావుకి చిరాకేసింది.

"నీ టెలిపతీ మండ" అని విసుక్కున్నాడు.

"మరేండి, నా పేరే టెలిపతిరావు. ఆ వేళ రాత్రి వచ్చింది నేనేలెండి... అరె, అలా కోపంగా చూస్తారేం – కొడతారా ఏమిటి కొంపతీసి" అంటూ అర్జెంటుగా పక్కగదిలోకెళ్లి తలుపేసుకున్నాడు టెలిపతిరావు.

☆ ☆ ☆

గురునాథరావు విచారంగా ఇంటికెళ్లి తన డైరీ తీసి సీత కథను చదువుకుంటూ కూర్చున్నాడు. క్రితంరోజు సాయంత్రం వరకూ జరిగిన సంఘటనలన్నీ చదివి ఆగాడు.

ఈ కథని ఎవరేనా సినిమా తీస్తే ఈ ఘట్టంలో హీరోచేత ఒకసారి నిట్టూర్పించి, డ్యూయెట్ మొదలెట్టించి, తొలి చరణం కాగానే, పక్కవాటాలో ఉండే హీరోయిన్ దగ్గరికి కెమెరాని పాన్ చేయిస్తారు. ఇక్కడొచ్చే చిక్కేమిటంటే సీతకి పాటరాదు. అయితే పాన్‌చేసిన కెమెరాని కొంచెం అసింటా జరిపితే అక్కడ, మంత్రి పదవి లభించలేదని మథనపడుతున్న లాయరు సుబ్బారావుగారు దొరుకుతారు. ఆయనా మంత్రిగిరితప్ప మరోటి గిట్టని ఏకలవ్యుడే కాబట్టి, ఈ ఘట్టంలో ఈ ఏకలవ్యద్వయంమీద డ్యూయెట్ చిత్రించవచ్చు. మంత్రిగిరికి సిద్ధపడ్డాడు గాబట్టి పాటవచ్చినా మానినా పాడేందికి వెనకాడ డాయన.

'పరే' బరువుగా నిట్టూర్చబోయాడు గురునాథరావు. కాని ఆ పనిని అరక్షణంలో ఇంకెవరో చేసిపెట్టారు.

"ఆశ్చర్యపడకు నేనేలే" అన్నాడు తుకారాం.

"దానికీ ఓపిక లేదు" అన్నాడు గురునాథరావు, వెనక్కి తిరిగి చూడకుండానే.

"మరేం ఫరవాలేదు. అదే వస్తుంది. సీతకి గణపతి రాయుడుగారి సంబంధం ఖరారైనందువల్ల, నీకా పిల్ల లభించడం కల్ల. గ్యారంటీ ఇస్తున్నాను... నేను తుకారాం న్యూస్ సర్వీస్ మానేసి తుకారాం గ్యారంటీ సర్వీసు పెట్టానులే" అన్నాడు తుకారాం నవ్వుతూ.

మతిపోయి ఏడుస్తున్నవాడికి, శ్రుతిచూసి మరీ కానిమ్మని యతి ప్రాసాదియుతమైన వాక్యంలో సలహా లివ్వటం, చూచేవాళ్లకు సరదాగా ఉంటుందిగాని, ఆ స్థితిలో ఉన్న గురునాథరావుకు కాదు. అందుకని అతనికి కోపం వచ్చింది. జుట్టు పీకేసుకోబోయి, అంతపనీ చేశాడు. నెప్పెట్టింది. పైగా క్రాఫింగు రేగిపోయ్యింది.

"చూశావా, తొందరపాటు వలన కలుగు నష్టములు. ఇప్పుడు మళ్లీ పాపిడి తియ్యడం అరగంట పని" అన్నాడు తుకారాం దిక్కుమొహం పెట్టి, నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"కాదు, ఐదునిముషాల పని" అని గురునాథరావు చివాలున లేచి, చరచర సెలూనుకెళ్లి తిక్క కోపంలో గుండు చేయించుకొచ్చేశాడు.

రాగానే రామనాథంగారు, ఆయన భార్య కూడా మండిపడ్డారు గురునాథరావు గుండుచూసి. "మేం ఇద్దరం పోయామనుకున్నావా?" అన్నారు.

గురునాథరావు దిగాలు పడిపోయాడు. ఆ పోవడం పోవడం అలాగే మంచిదారిన పడిపోయి దారుణమైన శ్రద్ధతో పుస్తకాలు చదివెయ్యడం మొదలెట్టాడు. కొద్దిరోజుల్లోనే క్లాసులో వెనకబెంచీల వాళ్లంతా అతన్ని వెలేసి ముందరకి నెట్టేశారు. అందరూ అలా తరిమి కొట్టేసరికి గురునాథరావు చివరికి ముందు బెంచీల మంచి విద్యార్థుల్లో కలిసిపోయి వాళ్లని మించిపోయాడు. "ప్రతీ టెస్టులోను అతనే ఫస్టు" అని అందరూ ముక్కున వేలేసుకు చెప్పుకోసాగారు.

☆ ☆ ☆

ఇలా విపరీతమైన ఉపాఖ్యానాలతో గురునాథరావు ప్రఖ్యాతి విస్తరించింది. అక్కడినించి ఆడపిల్లల్ని కన్న తల్లితండ్రులు తమపిల్లనంటే తమ పిల్లని చేసుకోమంటూ గురునాథరావు తండ్రిని బ్రతిమాలసాగారు. కట్నాలు ఎంతైనా ఇస్తామన్నారు.

కాని గురునాథరావు ఏ ఒక్కపిల్లనీ కన్నెత్తి చూడలేదు. పన్నెత్తి పలకరించలేదు. అక్కడితో అతని గిరాకి మరింత పెరిగింది. అంతా ఆశ్చర్యపడిపోయారు. ఎంత ప్రేమైనా మరీ ఇంత ప్రేమా అని విస్తుపోయారు, గురునాథరావు 'ఏకలవ్యు'డని తెలిసినవాళ్ళు.

తుకారాం ఓరోజు పొద్దున్నే గ్యారంటీ సర్వీసులో 'పెళ్ళిళ్ళ బ్యూరో' శాఖ పెట్టానన్నాడు. అని, పదిమంది ఫోటోలు పట్టుకొచ్చేసి చూపించాడు.

"అబ్బీ! ఈ పిల్లని చూడు: ఇంజనీరు. ఆస్తి పదెకరాలు. మేడ, కారు. ఈ బొమ్మ చూడు: గవర్నమెంటు సర్జను. రెండుకార్లు. పోనీ ఇది చూడు: పెద్ద బిజినెస్‌మాను. ఏకబిగిని పదిమంది ఆడపిల్లలికి పెళ్ళిచేసే ఆస్తీ, రెండు కార్లూ, రెండే కూతుళ్లూ ఉన్నాయి. ఇది రెండోది."

గురునాథరావు విసుక్కున్నాడు. "ఇంజనీరుల్నీ, డాక్టర్లనీ నేనెక్కడ చేసుకోనురా? బియ్యే కూడా కాను. అయినా కాకపోయినా సీతని తప్ప ఇంకోళ్ళని చేసుకోను" అన్నాడు.

తుకారాం జాలిపడ్డాడు. "ఇంజనీరూ, డాక్టరూ చేస్తున్నది అమ్మాయిలు కాదు, వాళ్ళ నాన్నలు. వాళ్ళప్రాభవం చెబుతున్నా. అదే ముఖ్యం అనుకున్నా. ఒక్కొక్కడూ ఓ డజనేసి అల్లుళ్ళకి డోడాందలు ఉద్యోగాలిప్పించగలడు. ఇదిగో ఈ చివరి బిజినెస్ ఆయన్ని, అదే ఆయన కూతుర్నిచేసుకుంటే ఇంకో లాభం ఉంది. లావుపాటి బావమరిది దొరుకుతాడు. ఎవర్నైనా తన్ని రమ్మంటే చితగ్గొట్టి చక్కా వస్తాడు."

"గెటౌట్" అన్నాడు గురునాథం.

"దానికేం మా భాగ్యం కాని, ఈ బొమ్మలుగల పన్నెండుమంది పెద్దలికీ కూడా మా తుకారాం గ్యారంటీ సర్వీసువారు గ్యారంటీలు రాసిచ్చేశారు గదా – తప్పక

విన్నొప్పించ గలమని! ఇందులో ఏ ఒక్కర్ని నువ్వుకాదన్నా సరే, మా ఆఫీసుకి పేరు పోతుంది."

"ఫెతాల్" అన్నాడు గురునాథరావు ఉక్రోషంతో.

"అయితే, నీ విషాదగాథ ఎన్నాళ్ళు సాగేట్టు?" అన్నాడు తుకారాం చిన్నబుచ్చుకుని.

గురునాథరావు కోపం దిగమింగి కష్టంమీద చిరునవ్వు ప్రచురించాడు. "శిష్యా, ఇది అనంతం."

"నాన్సెన్స్! వల్లకాదు. నీ కథకి చప్పున ఫులిస్టాపు పెట్టించేసి, అది కాస్తా రాసేసి, దాంతో తుకారాం స్టోరీ సిండికేటు ప్రారంభిస్తా, కాసుకో" – చక్కాపోయాడు తుకారాం.

☆ ☆ ☆

గురునాథరావు తండ్రి రామనాథంగారికి ఒళ్ళు మండిపోయింది కొడుకు వరసచూసి. "ఏదో సంబంధం ఖాయపరిచి తీరాల్సిందే" అన్నాడు కారాలు నూరుతూ.

గురునాథరావు అప్పటికి పిల్లి అయిపోయి తన గదిలోకెళ్ళి తల్లి ద్వారా తండ్రికి మెల్లిగా తన ఊహ చెప్పించాడు.

"కల్ల" అన్నారు రామనాథంగారు, గంభీరంగా కిటికీ అవతలికి చూస్తూ.

"అదే బావుందండీ! ఇదేం సినిమా అనుకున్నారుటండీ, అలా ఒక్క ముక్కలో తేల్చేసి, అటెటో చూస్తారు? నూరేళ్ళ బతుకు. కుర్రవెధవ భయపడుతున్నాడు! పిల్చి కనుక్కోండి సరిగ్గా" అందావిడ.

పిల్చి కనుక్కున్నాడు రామనాథంగారు.

సిగ్గుపడుతూ 'ఔను!' అన్నాడు గురునాథరావు.

"మరి సీతకి ఇష్టమేనా?" అన్నాడు తండ్రి.

గురునాథరావు చాలాసేపు జవాబు యివ్వలేదు. ఆనక తల్లి వంకచూసి, తల వంచుకుని 'తెలీదు' అన్నాడు మెల్లిగా.

రామనాథంగారు పగలబడి నవ్వారు. "ఏమి ప్రయోజకుడివిరా నా తండ్రీ!" అంటూ.

"నా వెర్రినాన్నా! ఎలా బ్రతుకుతావురా నోట నాలుక లేనివాడివి!" అని ఊహూ ఇదై పోయింది వాళ్ళమ్మ.

"అదే, ఆ సీతే తగును వీడికి. ఇన్నాళ్ళూ ఆ తిక్కముండా తండ్రిని పెంచుకొస్తోంది గదా, ఇంక ఈ వెర్రిబాగుల మొగుణ్ణి కూడా సాకుతుంది. ఆ సుబ్బారావుగారు ఏమంటారో చూడాలి మరి."

"సీత కిష్టమే లెండి. ఒకటి రెండుసార్లు కదలేసి చూశాను" అందాయన భార్య.

గురునాథరావు బుర్ర గిర్రున తిరిగిపోయింది. సిగ్గుపడుతూ గదిలోకి పరుగెత్తి "హాయిగా – హా" అనే పాట పాడబోయి వరస కుదరక మానేశాడు.

"జడ్డి వెధవ" అన్నాడు రామనాథంగారు నవ్వుకుంటూ.

☆ ☆ ☆

ఆయన బళ్ళో కెళ్ళబోతూ వుండగా తుకారాం రివ్వున పరిగెత్తుకొచ్చాడు.

"నమస్కారం అండి. నా పేరు తుకారాం, నేను గురువులు ఫ్రెండుని" అన్నాడు వినయంగా.

"గురువు లెవడోయ్?" అన్నారు రామనాథంగారు చిరాగ్గా.

"అదే మీ అబ్బాయండి. ఐ మీన్ గురునాథం."

"ఏమిటా మీను మానూను. ఏం చదువుకున్నావు నువ్వు? ఒక్కవాక్యం సరిగ్గా మాట్లాడలేకపోతున్నావు. ఏం సంగతి?" అన్నారు రామనాథంగారు.

"మీరు కొంచెం గణపతిరావుగారింటికి రావాలండి. అక్కడ మీ సుబ్బారావుగారు, గణపతిరావుగారూ పోట్లాడుకుంటున్నారు. మిమ్మల్ని కేకేసుకు రమ్మన్నారండి...! అస లేమిటంటే–"

రామనాథంగారు సరాసరి గణపతిగారింటికి చరచర వెళ్ళారు. తుకారాం వెనకాలే వెళ్ళాడు.

"ఊఁ, ఏమిటి దెబ్బలాట?" అన్నారు రామనాథంగారు దారిలో.

"మరి నరసన్నగారొచ్చారు గదండీ మెడ్రాసునుంచి?"

"ఆయ నెవరు?"

"ఆయనా? డోళ్ళ వర్తకు డనుకుంటానండి."

"ఏమిటి? డోళ్ళా!"

"మరేండి, డోళ్లు. పెళ్ళికి వాయిస్తారూ? అవీ. ఆయన అస్తమానం డొక్క చీల్చి డోలుకడతా నంటాడుగా. మరి అలా కట్టిన డోళ్ళు అమ్ముకుంటాడని నా అభిప్రాయం."

"నీ అభిప్రాయా లొదిలేసి సంగతి చెప్పవోయ్" అన్నారు రామనాథంగారు.

"అదేమిటండీ! నాకూ రాజకీయాలు తెలుసు. నేను పొలిటికల్ వాణ్ణే."

"అందుకే... సర్లే. తరువాత?"

తరువాతే కథ అడ్డం తిరిగింది. నరసన్న గారొచ్చే వరకూ గణపతిరావుగారూ, సుబ్బారావుగారు ఇల పోటీలేని నేస్తాల్లా మునిసిపల్ ఎలెక్షనుకు సన్నాహాలు చేస్తున్నారు. చైర్మను గిరీకి పోటీ చేస్తున్న రెండో ఆసామి కట్టుదిట్టంగా 'ధనర్ధారి'యై ఎన్నికల సమర రంగంలో దిగాడని తెలిసి గణపతిరావుగారు కాస్త బెదిరారు. ఎందుకేనా మంచిదని మెడ్రాసు నుంచి నరసన్నగారిని పిలిపించారు. ఆయన ఎసెంబ్లీకి పోటీచేసి ఓడిన వ్యక్తి. గెలిచి ఉంటే మినిష్టరై పోయేవాడు. అందుకని ఆయన చెబితే జనం వింటారని గణపతిగారు ఆశపడి రమ్మన్నారు.

తీరా నరసన్నగా రొచ్చాక ఆయనతో సుబ్బారావుగారికి దోస్తీ ఎక్కువైపోయింది.

ఆ నరసన్నగారు అవబోయిన మినిష్టరు. తనేమో అవబోయే మినిష్టరు. ఎలాగేనా ఇద్దరూ ఒక ఫాయావాళ్ళవుతారు. ఆ ముక్క నరసన్నగారే అన్నారు.

సుబ్బారావుగారు పొంగిపోయారు.

ఈ 'మినిష్టర్ల' సరసాలకి గణపతిరావు తట్టుకోలేక పోతున్నాడు.

బియ్యే పరీక్ష తప్పినవాడి దృష్టిలో స్కూలు ఫైనలు పరీక్షలంత లోకువగా కనబడింది, నరసన్నగారికి మునిసిపల్ ఎలక్షన్.

"ఇదీ ఓ ఎన్నికేనా! ఈ పాటిదానికి సాయాలూ ప్రచారాలూ ఎందుకూ? నేనో చిన్న చీటీ రాస్తాను, దాన్ని అచ్చుకొట్టించి పంచిపెట్టేస్తే చాలు" అన్నాడాయన.

"మరే ఇంతోటి ఎలక్షనుకి అంతకన్న ఖర్చు దండుగ" అన్నాడు సుబ్బారావుగారు హుషారుగా.

గణపతిగారికి ఒళ్ళు మండిపోయింది. "ఏమిటండీ మీ హేళన, ఒఖ్ఖలా నిన్నటినుంచి మిడిసి పడిపోతున్నారు. చేవ ఉంటే గెలవండి చూద్దాం. లోకువగా మాటాడినట్టుకాదు" అన్నారు విసురుగా.

సుబ్బారావుగారు తెల్లబోయి నిర్జీవంగా నవ్వుతూ నరసన్నగారివంక చూశాడు.

ఆయన పేపరులో దాక్కుని తెగ చదివేస్తున్నాడు.

"ఆయనవంక చూస్తారెందుకు? ఆయనా ఓ రాయి విసుర్తాడనా? విసిర్నా ఆయనకైతే చెల్లింది. చెల్లినా అలా విసరడు. ఆయన మిత్రుడు; మీరు కాబోయిన బంధువులు. అదే తేడా" అన్నాడు గణపతిగారు.

కథ ఈ ఘట్టంలో ఉండగా చూడవచ్చిన తుకారాం అదను చూచి "సుబ్బారావుగారు దేవుడంటి మనిషండీ, ఆయన్ని నిష్కారణంగా మాటలనకండి" అనేసి పరుగెత్తుకు చక్కాపోయాడు, రామనాథంగారిని కేకేసుకు రావడానికి.

☆ ☆ ☆

రామనాథంగారు సావిట్లో అడుగు పెట్టేసరికి "ఇలాటి వాడికి నేను చచ్చినా నా పిల్లనివ్వను" అంటున్నారు సుబ్బారావుగారు.

"మీరిస్తే చేసుకునేవాడెవడు? మా పిల్లాడికి సవాలక్ష సంబంధాలొస్తున్నాయి" అంటున్నారు గణపతిరావుగారు.

నరసన్నగారు నవ్వుతూ చుట్టతీసి అగ్గిపెట్టెకోసం వెతుక్కుంటున్నారు.

తుకారాం చటుక్కున గుమ్మందాటి పూలమొక్కలు దగ్గరున్న పచ్చ గడ్డిపరకలు నాలుగు తెచ్చి గణపతిరావుగారికీ, సుబ్బారావుగారికీ మధ్యన పడవేశాడు.

అది భగ్గుమంది.

నరసన్నగారు గబుక్కునలేచి, ఆ మంటలో చుట్టముట్టించి పొగ పీల్చారు తృప్తిగా.

"అదే పాయింటండి సుబ్బారావుగారు! మా గణపతిగారబ్బాయికి పిల్లని మీరివ్వకపోతే నేనిస్తాను. ఏమంటారు బావగారూ?" అన్నాడు వెటకారంగా నవ్వుతూ.

"శుభం" అన్నారు గణపతిగారు.

"బావగారూ, ఇంక మనం ఇంటికెళదాం రండి. ఇక్కడేం పని?" అని సుబ్బారావుగారి భుజంమీద చెయ్యేసి ఇవతలికి తీసుకొచ్చారు, అంతవరకూ మాట్లాడకుండా నిల్చున్న రామనాథంగారు.

"సుబ్బారావుగారూ, మీరు అర్జెంటుగా మీ సీతమ్మకి పెళ్ళి చేసేస్తే మీ మాజీ బావగారికి చెప్పుదెబ్బ కొట్టినట్టవుతుందండి" అన్నాడు తుకారాం.

రామనాథంగారు 'ష్' అన్నారు. కోపం రెచ్చగొట్టి ఆ మైకంలో వుండగా వాగ్దానాలు పుచ్చుకోడం ఆయనకి సుతరామూ యిష్టం లేకపోయింది.

నిశ్శబ్దంగా ఇంటికెళ్ళారు.

అక్కడ కూచుని సుబ్బారావుగారు, మంచినీళ్ళుతాగి తేరుకున్నాక, కర్తవ్యం ఏమిటన్నారు విచారంగా.

"కర్తవ్యం మీ వంటివారికి నేనా చెప్పేది? తాపీగా ఆలోచించండి" అన్నాడు రామనాథంగారు లాలనగా.

సుబ్బారావుగారు ప్రసన్నులయ్యారు. "అహఁ– అసలు చెబుదురూ" అన్నారు.

రామనాథంగారు చిన్న పొడిదగ్గు దగ్గి ఉపక్రమించారు:

"మంత్రి కాబోయేముందు మంచిపని చెయ్యాలన్నారు. మా అబ్బాయి మీ పిల్లని చేసుకుంటానని పట్టుబట్టి ఇంకెన్ని సంబంధా లొచ్చినా తిరగ్గొడుతున్నాడు. మీ సీతమ్మకీ ఇష్టమేట. ఇక మా మాట అంటారా – చెప్పే దేముంది? మీ వంటివారితో వియ్యం... మరి మీరు శాంక్షన్ చెయ్యడమే తరువాయి" అన్నారు తాపీగా.

సుబ్బారావుగారు చుట్టూ పరకాయించి చూశారు. గది గుమ్మానికి చేరబడి రామనాథంగారి భార్య నించుంది.

"అవు నన్నగారు –– ఊఁ అనండి" అందామె.

సీత వెనకాల నిల్చుంది –– తనవేపే చూస్తూ. కొంచెం ఆసింటా తుకారాం నిలబడి ఆత్రుతగా చూస్తున్నాడు.

సుబ్బారావుగారు గంభీరంగా మొహంపెట్టి ఆలోచించారు. చుట్టూ పరకాయించారు.

"అప్లికెంటు ఏడీ?" అన్నారు.

"అబ్బాయ్, ఇలా రా" అని రామనాథంగారు కేకేశారు.

గురునాథం వచ్చాడు, మెల్లిగా.

"ఏవోయ్, మా పిల్లని చేస్కోవా లనుకుంటున్నావా?" అన్నారు సుబ్బారావుగారు.

"మరేనండి" అన్నాడు గుర్నాథం, మెల్లగా.

"ఏమే సీతా నచ్చాడా?"

సీత నవ్వింది; ప్రేమించినవాడిని పెళ్ళాడబోయే పిల్లలా.

"శుభం. శాంక్షనై పోయింది. పెళ్ళి ముహూర్తం పెట్టించండి బావగారూ" అన్నారు సుబ్బారావుగారు.

అందరి మొహాలూ వికసించాయి ఆనందంతో.

హీరో గుర్నాథరావు ముఖారవిందం కాస్త తటపటాయిస్తోంది.

ఏమిట్రా అన్నారు రామనాథంగారు.

"గు... గుండు... కొ... కొంచెం ఆగి ము... ముహూర్తం" అన్నాడు గుర్నాథం గుటకలు మింగుతూ.

"హోరి నీ... గుండు కూడా బెంగే?... వెధవ క్రాఫింగు –– ఇట్టే పెరుగుతుంది –– భయపడకు. మీ నాన్న జీతం అనుకున్నావేమిటి, ఒకంతట పెరక్కపోడానికి!" అన్నారు సుబ్బారావుగారు ఫెళఫెళా నవ్వుతూ.

"— లేకపోతే నీ మావగారి అదృష్టం అనుకున్నావా?" అని రామనాథంగారు అందుకోబోయారు గాని,... కో లేదు. తమాయించుకున్నారు.

☆ ☆ ☆

పెళ్ళి మర్నాడు రాత్రి గురునాథరావు సీతకి తన డైరీ వినిపించి తను పడ్డ వేదనని వివరించాడు.

"సీతా, నీ కోసం ఎన్ని సంబంధా లొదిలేశానో చూశావా? మీ నాన్నగారు మంత్రి పదవికోసం ఉద్యోగాలూ, ప్రాక్టీసూ వదిలేసినట్టు! ఎటొచ్చీ నేను సాధించాను, ఆయన ఇంకా లేదు. సాధిస్తారనుకో."

"ఈ ముక్క నా దగ్గరంటే అన్నారుగానీ మా నాన్న దగ్గరంటే జాగ్రత్త. ఆయన సుబ్బరంగా ప్రాక్టీసు చేద్దామని నిశ్చయించుకున్నారు" అంది సీత నవ్వుతూ.

☆ ☆ ☆

'పది' — అంది గదిలో గడియారం.

'మరేస్మీ' అంది సుబ్బారావుగారింటి గడియారం ప్రతిధ్వని.

★ ★ ★



# వరలక్ష్మీవ్రతం

ఇరుగుపొరుగులను ప్రేమించడం మధ్యఇంట్లో కాపురం ఉన్నవారి విధ్యుక్త ధర్మం. పెద్దల మాటల పట్ల గురి, గౌరవం ఉన్న విశ్వేశ్వరరావు పొరుగింట కొత్తగా దిగిన సూర్యనారాయణగారి సుపుత్రి గాయత్రిని ప్రేమించాడు. ఆమె మేడ మీద గది కేటాయించుకుందని తెలియగానే, విశ్వేశ్వర్రావు పిన్నికి, బాబాయికి నచ్చచెప్పి బ్రతిమాలి తనూ తమ మేడ మీద గదిలోకి మారాడు.

పొరుగింటి పంచకల్యాణి ఆ మర్నాటికే పైనుంచి కాంపు ఎత్తేసి కింది గదిలోకి మారిపోయింది. చదువు మానేసిన గాయత్రికి ఉజ్జీగా తనూ తన గదులు మార్చడంకోసం తలనొప్పి, జ్వరం, కుడిచేయి కొద్దిగా తెగుట, కాలి బొటనవ్రేలికి దెబ్బతగులుట మొదలైన కారణాలు వర్ణించి, విశ్వం ఆఫీసుకి సెలవు పెట్టడం కూడా జరిగింది. అహర్నిశలూ గాయత్రి జపించినా ఫలితం లేకపోయింది.

గాయత్రి ఇంటికి వస్తుంది. పిన్నితో కబుర్లాడుతుంది. తన భోగట్టా శ్రద్ధగానే వింటున్నట్టు కనబడుతుంది. అయినా తను కిటికీలోంచి చూచినపుడు, తిరస్కారభావం కనబడేది ఆమె మొహంలో. ఒక్కొక్కసారి తనని చూసి నవ్వుతున్నట్టు కనిపించింది. పిన్ని దగ్గర హేళనగా మాట్లాడినట్లు అనిపించింది.

ఒకానొక ముహూర్తాన తన ఊహలు నిజమేనని నిర్ధారణగా తోచింది విశ్వేశ్వర్రావుకి. ఉత్తర క్షణాన "ఈ పిల్లనెలాగైనా పెళ్లాడుతాను" అని ఒట్టు పెట్టుకున్నాడు.

అయినా గాయత్రి ప్రసన్నం కాలేదు.

☆ ☆ ☆

శ్రీరామపఠన మందిరంలో కూచుని పత్రిక వంక దీక్షగా చూస్తున్న విశ్వేశ్వర్రావు ప్రక్కనే ఒక జోగినాథం చేరాడు. అతను కూడా పత్రికలోకి తొంగి తొంగి చూసి చదువుతున్నాడు. ఆ పేజీ అయిపోయింది. ప్రక్క పేజీ చూడాలి. ఎంతసేపటికీ

విశ్వం పేజీ తిప్పడాయె. జోగినాథం చొరవ చేసి పేజీ తిప్పాడు. విశ్వం విసుక్కోలేదు; 'మేనర్స్ లేవా' అని కసరలేదు.

జోగినాథానికి కుతూహలం కలిగింది. పేపరు లాక్కుంటున్నా కసిరికొట్టకపోవడానికి కారణం ఏమిటా అనిపించింది. అంత విరక్తి దేనికా అనిపించింది.

"ఏమిటోయ్ విసినాథం, అలా ఉన్నావూ?" అన్నాడు.

అసలు సిసలు సినిమా హీరోలా అతి మెల్లిగా తల ఎత్తి కుడివైపుకి తిప్పి బాధగా చూశాడు విశ్వం.

"ఆర్చేవాడివా తీర్చేవాడివా?" అన్నాడు విసుగ్గా.

"అరుస్తాను, తీరుస్తాను. నీకొచ్చిన కష్టం చెప్పవోయ్" అన్నాడు జోగినాథం.

"అయితే చెబుతా పట్టు. ఏమాత్రం సాయం చేస్తావో."

"పూజా పునస్కారాలు లేక బూజుపట్టి ఉన్నాను గానీ, నైవేద్యం పెట్టు మరి, నా మహిమ చూపిస్తాను" అన్నాడు జోగినాథం హుషారుగా.

ఉదయం తొమ్మిది వేశారు. విశ్వం ఒక్కక్షణం ఆలోచించి జ్వరం వచ్చిందని సెలవుచీటీ రాసి, ఆఫీసుకి పంపేశాడు. తరవాత జోగినాథాన్ని వెంటబెట్టుకొని, నైవేద్యం పెట్టడానికి బయల్దేరాడు.

☆ ☆ ☆

ఫలాహారాల అనంతరం, ఆత్మకథను నివేదించాడు విశ్వం.

"పంతులూ – 'గాయత్రీ' జపం ఏం పనిచెయ్యదు. నువ్వు రేపట్నుంచే సూర్య నమస్కారాలు ప్రారంభించాలి" అని తూచి తూచి సలహా చెప్పాడు జోగినాథం.

విశ్వం చప్పగా నవ్వాడు.

"అయినా కాకపోయినా సూర్యనారాయణ గారు నిన్ననే చెన్నపట్టణం వెళ్లారు. పదిహేను రోజుల వరకు రారట."

జోగినాథం ఊహలకు బ్రేకు పడింది. ఇంకో సిగరెట్ ముట్టించాడు. "మీ గాయత్రి అమ్మగారి పేరేమిటో తెలుసా?"

"వరలక్ష్మమ్మగారు."

"రైటో. శ్రావణమాసం సగం గడిచిపోయింది. పోతే పోయిందిలే కాని నువ్వు రేపటినించీ వరలక్ష్మీవ్రతం చెయ్యి. మీ మామగారు రాగానే సూర్యనమస్కారాలు ప్రారంభించు. ఆ పైన నేచెప్పిన రోజున ఉద్యాపన చేసుకుందువు గాని" అన్నాడు జోగినాథం ధీమాగా.

'సరే' అన్నాడు విశ్వం నీరసంగా.

"మరేం భయం లేదు, భక్తిప్రపత్తులతో వ్రతం ఆరంభించి ఆవిడ వాత్సల్యాన్ని సంపాదించు. ప్రసన్నురాలుగా చేసుకో" అని జోగినాథం విశ్వానికి వరలక్ష్మీవ్రతం విధానం ఉపదేశించి, ఇంకో సిగరెట్టు పుచ్చుకున్నాడు.

"పెద్దలను ఖాతరు చేయకుండా ముఖాముఖిని ప్రేమించి పెళ్లాడబోయిన ఆసాములు అట్టేమంది నెగ్గుకొచ్చినట్టు గాథలలో కనబడదు. ఢక్కా మొక్కీలు

బోలెడు తిన్నవాణ్ణి, నేనూ ఎరగను. అందుకని 'అన్యథా శరణం నాస్తి' అని నమ్మి మరీ వ్రతంచెయ్యి" అని హెచ్చరించి, మిగతా సిగరెట్లు తీసుకున్నాడు జోగినాథం.

☆ ☆ ☆

విశ్వేశ్వరరావు గురూపదేశానుసారం, మర్నాడు సూర్యోదయాత్పూర్వమే నిద్ర లేచాడు. ప్రకృతి తెల్లగా, చల్లగా, చక్కగా కనబడింది. "ఓహో! పొద్దున్నే లేస్తే ప్రకృతిసౌందర్యం ఆస్వాదించవచ్చు కాబోలు" అనుకున్నాడు. వీధిలోకి వెళ్ళి చూచాడు. 'గాయత్రి' గుమ్మం కడిగి పసుపు కుంకం పెడుతూంది. గాయత్రి, అభినేత్రి, సావిత్రి, రచయిత్రి, కవయిత్రి అని గబగబా అనుకున్నాడు.

కాఫీ త్రాగి సైకిలెక్కి, గోదావరి ఒడ్డున ఉన్న ఆంజనేయస్వామి కోవెలకు వెళ్ళాడు. పూజారిగారికో నమస్కారం పెట్టి కోవెల ఆవరణలో పూలు కోసుకున్నాడు. చకచక ఇంటికి చక్కా వచ్చి పిన్నికి నాలుగు పువ్వులిచ్చి పెరట్లోకి వెళ్ళాడు. వరలక్ష్మమ్మగారు పెరట్లో ఉన్న మందారం, నందివర్ధనం కోసుకుంటోంది. 'పువ్వులు కావాలా అండీ' అనేశాడు సాహసించి.

వరలక్ష్మమ్మగారు మురిసిపోయింది. పువ్వులందుకుంది. 'శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు' అని ఆశీర్వదించింది చనువుగా.

విశ్వం సిగ్గుపడిపోయాడు.

బాబాయ్ ఫక్కున నవ్వాడు. "ఏరా విశ్వం? ఏం కథ? కొంపతీసి సంధ్యావందనం కూడా చేస్తావేమిటి?" అన్నాడు.

"అక్కడికి రోజూ సంధ్య వార్చినట్లు" అన్నాడు విశ్వం సాధ్యమైనంత గట్టిగా. బాబాయిని సావిట్లోకి వెళ్ళనిచ్చి పిన్నిని బ్రతిమాలుకున్నాడు, సంధ్యావందనం సంగతి దండోరా వేయించవద్దని.

"ఒరేయి, సంధ్యవారుస్తున్నట్లు తెలిస్తే కాలేజీ పిల్లలెవరూ ఎదురుకట్నం ఇచ్చినా పెళ్ళాడరు సుమా" అందావిడ నవ్వుతూ.

"మరేం ఫరవాలేదు. ఇంటర్ ఫెయిలయినవాళ్ళు చాలు. అసలయినా ఇపుడు పెళ్ళి గొడవెందుకు?" అన్నాడు విశ్వం.

"మరే నాయినా, ఏడుమల్లెపూలఎత్తు రాజకుమారిని ఎంత చక్కనిదాన్ని వరిస్తావో చూస్తాంగా" అంది పిన్ని.

☆ ☆ ☆

భారతం, భాగవతం, రామాయణం, స్త్రీల వ్రత కథలు మొదలైన మంచిపుస్తకాలన్నీ ఎక్కడెక్కడినించో పట్టుకొచ్చి వరలక్ష్మమ్మగారికి ఇచ్చేవాడు విశ్వం. రోజూ తెల్లవారేసరికి పూలసజ్జ నిండా పువ్వులు కోసుకు వచ్చి అందించేవాడు.

శుక్రవారం నాడు విశ్వేశ్వర్రావుకి అధికార రీత్యా కాలికి పెద్ద దెబ్బ తగిలినందువల్ల ఆఫీసుకి సెలవు పెట్టవలసి వచ్చింది.

ఆనాడు వ్రతం అయినందువల్ల అతను తొలికోడితో మేలుకుని, కాకితో పడుకున్నాడు.

"ఆయన ఊళ్లో లేనందుకు, ఈ అబ్బాయి లేకపోతే వ్రతం, పేరంటం ఎంత అభాసయిపోను" అని వరలక్ష్మమ్మగారు ఉహూ ఇదైపోయి, పదే పదే ఆ ముక్క అంటూ వచ్చింది. విశ్వం మురిసిపోయి, పరుగున జోగినాథం దగ్గరకు వెళ్లి చెప్పాడు.

"భేష్, కథ దారిన పడింది. కానీ" అని వీపు తట్టాడు జోగినాథం.

☆ ☆ ☆

గాయత్రి హిందీ చదువుతోందిట.

"బుధవారం పరీక్షట బాబూ, కాస్త శ్రమనుకోక ఇవాళా రేపూ దానికి రెండు ముక్కలు చెబుదూ, నాయన్నాయన" అని ప్రాధేయపడింది. వరలక్ష్మమ్మగారు.

"ఎంత మాట? తప్పకుండా," అన్నాడు విశ్వం.

"నీకొచ్చిన ఇంతోటి పాండిత్యానికి ట్యూషనేం చెప్పగలవురా! పైగా ఆఫీసు లేదూ?" అంది పిన్ని.

"మరేం ఫరవాలేదు. రేపూ ఎల్లుండి అంపకంపాలతో ఊష్ణం ఒచ్చేస్తుందిలే" అన్నాడు విశ్వం.

మర్నాడు పదిన్నరకి ఆఫీసునుంచి కబురొచ్చింది. అర్జెంటుగా రమ్మని. అప్పటికి గాయత్రికి పాఠం చెబుతున్న హడావుడిలో జ్వరం సంగతి మర్చిపోయి విశ్వం ఆఫీసుకి వెళ్లాడు.

"ఏదీ జ్వరం?" అన్నారు ఇంజనీరుగారు, పక్కున నవ్వి. తనంటే ఆయనకీ అభిమానమని విశ్వానికి తెలుసు.

"జ్వరం కదండి, వచ్చే వేళయిందండీ. నిన్న ఆదివారం పదకొండింటికి వచ్చిందండి. మళ్లీ ఇవాళా..." అని నసిగాడు.

"అబ్బాయ్. ఇదేం కుదరదు. ఇకనుంచి నీకు రెణ్ణెల్లకోసారి తప్ప జ్వరం రాకూడదు. ఐదార్నెల్లకోసారే కాలు విరగ్గొట్టుకోవాలి. నెలకోసారి చెయ్యి తెగ్గొట్టుకోవచ్చు. తలనొప్పి ఎంత జోరుగా వచ్చినా పొద్దుట పదకొండులోగా పోయి తీరాలి. పెద్ద పెద్ద ఖాయిలాలు అసలు వల్లకాదు. ఏడాదికి ఓసారి వచ్చినా పదిహేను రోజుల్లో పోవాలి" అన్నాడాయన, తల వంచుకొని ఏదో రాసుకుంటూ.

"అలాగేనండీ. ఇవాళా రేపూ మాత్రం జ్వరం రానివ్వండి" అన్నాడు విశ్వం సెలవు తీసుకుంటూ.

☆ ☆ ☆

శ్రావణమాసం, దానితో పాటు విశ్వం వరలక్ష్మీవ్రతం పూర్తికావచ్చాయి. పొరుగింటివారింట చారు ఘుమ ఘుమలాడినట్లు, పిన్ని కాచిన చారు ఘుమఘుమలాడదని విశ్వం అనేకసార్లు ఢంకా మీద దెబ్బ కొట్టినట్లు చెప్పాడు. ఓసారి కాస్త జ్వరం వచ్చినపుడు వాళ్లింట్లో చారు కావాలని పోరి తెప్పించుకుని, సేవించి, మర్నాడు అనర్గళంగా ఆ చారు రుచులను పొగిడాడు.

చెన్నపట్టణం నుంచి సూర్యనారాయణగారు వచ్చిన మర్నాడు ఉదయమే విశ్వేశ్వర్రావు సూర్యనమస్కారాలు కూడా ప్రారంభించాడు.

వీధరుగు మీద కూచుని దంతధావనం చేస్తున్న ఆ సూర్యనారాయణగారు, హఠాత్తుగా ఈ నమస్కారం చూసి హడలిపోయి లోపలికి పరుగెత్తారు.

"ఔనే, ఇలా రా. వాళ్లబ్బాయి నాకు దండం పెట్టాడెందుకు?" అని అడిగేశాడు, ఖచ్చితంగా.

"హయ్యో రాత! రాయిచ్చుకు కొట్టినట్లు చెప్పొచ్చారే! ఆ పిల్లాడి సంగతి మీకేం తెలుసు? ఎంత ఒద్దిక... ఎంత వినయం... ఏం వందనం... అలాంటి పిల్లాడు గర్భవాసాన పుట్టడానికి ఆ తల్లి ఏం నోచిందో!" అంటూ ఆవిడ అదే ఇదిగా చెప్పుకుపోయింది.

☆ ☆ ☆

జోగినాథం చాలా మెచ్చుకున్నాడు, విశ్వం అదృష్టానికి. "పంతులూ, కథ ముగిసినట్టే. ఇంకేం లేదు. చిన్న ఉద్యాపన ఉంది. అది కాస్తా చేస్తిమా, నీ నోము పండిందే! అయితే ఒక్క సంగతి..."

"ఫరవాలేదు. ఎంతో చెప్పు" అన్నాడు విశ్వం హుషారుగా.

"దానాదీనా తడిసి మోపెడవుతుంది కాని, పాతికలో సర్దేస్తాను."

"రైటో. ఉద్యాపన ఏమిటో చెప్పు."

జోగినాథం చెప్పాడు.

విశ్వం 'ఏడిసినట్టుం' దన్నాడు.

జోగినాథం "నీ మొహం, నీకు తెలీదు" అన్నాడు.

విశ్వం 'రైటో' అన్నాడు.

ఉద్యాపనకి శ్రావణమాసం ఆఖరి శుక్రవారం సాయంత్రం ముహూర్తం పెట్టారు. లక్ష్మీవారం సాయంకాలం విశ్వం పెరట్లో పిట్టగోడకు చేరబడి నుంచుని, పిన్నితో 'నేటి సమాజంలో సంస్కరణలు' అను విషయంపై విజ్ఞాన చర్చ జరిపాడు. వరలక్ష్మమ్మగారు తులసి మొక్కకి పూజ చేయడానికి రావడం చూసి, వరకట్నాలు ఎంత దారుణమో, కావాలనేవారు ఎంత రాక్షసులో ధాటిగా ఉపన్యసించాడు.

'ఔరా! ఏమి గొప్ప హృదయం' అని ముక్కు మీద వేలేసుకు మరీ ఆశ్చర్యపడింది వరలక్ష్మమ్మగారు. గాయత్రి ముసి ముసి నవ్వులు నవ్వుతోన్నదల్లా పక్కన నవ్వి ఇంట్లోకి వెళ్లిపోయింది.

"ఇంకా హేళనేనా?" అనుకుని కంఠశోషకు ఉసూరుమంటూ మేడమీదికి వెళ్లి పోయాడు విశ్వం. మర్నాడు సాయంత్రం మసకసంధ్య వేళ, పిన్ని వరలక్ష్మమ్మగారింటికి వెళ్లి, తాంబూలం పుచ్చుకువచ్చింది.

వేసుకున్న పథకం అమలు జరగడానికి ఐదు నిమిషాలు కూడా వ్యవధి లేనందువల్ల విశ్వం పెరట్లోనే విహరిస్తున్నాడు.

"ఒరేయ్ విస్సీ, ఇలా రా" అంది పిన్ని వంటింట్లో పీట వేసి.

విశ్వం వెళ్లాడు.

"నామీద నీకు గౌరవం ఉంటే చెప్పినట్లు విని, వాళ్ల గాయత్రిని చేసుకో" అంది.

విశ్వం నోరు తెరచి అట్టే కొయ్యబారిపోయాడు.

"వినకపోతే నీ కర్మం. లక్షణమైన పిల్ల, బుద్ధిమంతురాలు. నేవళీకం ఉంది. అయినా, ఆవిడా కూడా నిన్ను చూచి ఎంతో ముచ్చట పడుతున్నారు. 'అతనికి గినా కట్నం పుచ్చుకోగూడదని పట్టింపు ఉంటే, అదేదో మరో విధాన ముట్టజెబుతాం' అని బ్రతిమాలారు. ఇష్టమైతే చెప్పు. ఆయన రాత్రి రైలుకి వెళ్లిపోతున్నారు. నువ్వు 'ఊ' అంటే మళ్లీ రాగానే పెళ్లేనన్నారు. అన్నట్లు, అసలు సంగతి మర్చిపోయాను. అలా ఉందిగాని, ఆ పిల్లకి నువ్వంటే పంచప్రాణాలూనూ. ఇందాకా నా ఎదుటే సిగ్గు విడిచి చెప్పింది కూడా. అలాంటి లక్ష్మి నీకు వెయ్యి జన్మలెత్తినా దొరకదు. ఊ అనరా బాబూ" అందావిడ.

కొయ్యబారిన విశ్వేశ్వర్రావు అతికష్టం మీద 'ఊ' అన్నాడు.

పిన్ని సంతోషంతో లేచి, పొరుగింటికి వెళ్లబోయింది. ఎవరో వీధి తలుపులు తట్టారు. 'వచ్చే వచ్చే!' అంటూ విశ్వం వంక చూచి ఆవిడే వెళ్లింది తలుపు తీయడానికి.

అంతలోనే పెరట్లో చప్పుడైంది. "కొంప మునిగింది. అయినా ఇంత లేటుగా చెబితే ఎలా? జోగినాథం ఉద్యాపన కొచ్చాడు కాబోలు" అన్నాడు విశ్వం గట్టిగానే. అంటూనే లేచి పెరట్లోకెళ్లాడు.

"అయ్యో! అయ్యో! దొంగ దొంగ" అంటూ వరలక్ష్మమ్మగారు, ఆమె భర్తా, గాయత్రీ పెరట్లోకొచ్చారు. విశ్వం చెంగున గోడ దూకి అటు వెళ్లాడు.

పారిపోతున్న ఆ దొంగ పెరటి గుమ్మం దగ్గిర రాయి తగిలి బోర్లగిలపడ్డాడు.

'త్వరగా లేచిపో' అన్నాడు విశ్వం దొంగ దగ్గరకెళ్లి. ఇంతలోనే వరలక్ష్మమ్మగారు, ఆమె భర్త వచ్చేయడంతో గుట్టు బయటపడుతుందని విశ్వం తెగించాడు. లేచి పారిపోబోతున్న జోగినాథం రెక్క పట్టుకొని ఆపాడు.

"దొంగ వెధవా! ఎక్కడికి పారిపోతావ్" అని గద్దించాడు చేతనయినంత కోపంగా.

"కనిష్టీపుల్ని పిలుస్తా ఉండు" అన్నాడు సూర్యనారాయణగారు.

విశ్వానికి పై ప్రాణం పై నించి లేచిపోయింది. "అబ్బెబ్బే! వద్దండి, మనవాడే... ఐమీన్... మనమే చిదగ్గొట్టి పంపేద్దాం. శుక్రవారం పూటా ఒక మానవుణ్ణి జైలుకు పంపటం ఎందుకు?" అన్నాడు.

"ఆ వెధవేం చేశాడో నీకు తెలుసా బాబూ? మా వరలక్ష్మికి నేను వేసిన నెక్లెసు తీస్తున్నాడు. అంతలో నేను వచ్చి అట్టే అన్నాను. ఒక్క క్షణం ఆలస్యమయితే.... ఇంకేమన్నా ఉందా!"

"అంతే లెండి పిన్నిగారు – ఐ మీన్ అత్తయ్యా... అయినా వదిలేద్దాం, పోలీసుల గోల మనకెందుకు? మనమే... నేనే తన్నేస్తా" అన్నాడు విశ్వం గంభీరంగా.

"వెధవని డొక్క వాలికట్టేసి మరీ వదులు బాబూ!" అన్నాడు సూర్యనారాయణగారు గోచీ బిగించుకుంటూ.

వ్రతం చెడ్డా ఫలితం దక్కాలి. ఇప్పుడు వ్రతం ముగిసేలోగానే ఫలం దక్కింది. జోగినాథం దొంగతనం చేయబోవడం, తను అడ్డుపడి, ఆ 'దొంగ'ను తరిమివేసి అత్తగారి మెప్పులందుకోవడం ఈ వ్రతానికి ఉద్యాపన. ఇప్పుడు గనక ఈ

ఉద్యాపనచెడితే గుట్టు రట్టు అవుతుంది. కథ బెడిసి కొడుతుంది. ఫలం నిష్ఫలం అవుతుంది.

"జోగినాథం! నన్ను క్షమించు" అని మనసారా అనుకుని, చుట్టూ వున్నవారికి అనుమానం కలగకుండా ఉండగలందులకుగాను, అంతకన్న మనసారా జోగినాథం జుట్టుపట్టుకొని వీపు బద్దలయ్యేలా బాదాడు విశ్వం. దెబ్బ దెబ్బకీ ఐదూ, పదీ, పది హేనూ చొప్పున పరిహారం ఇచ్చుకుంటానని సాంకేతిక భాషలో చెబుతూనే వాస్తవికత ఉట్టిపడేటట్లు అభినయించడానికై జోగినాథం చెంపలు కూడా వాయగొట్టాడు.

* * *

# ఋణ రమణీయం




ఎనిమిదిన్నరకు మేలుకునే వయోజనులందరికీ తెల్లవారింది. ఈల పాటలు వచ్చిన వాళ్ళంతా ఇంగ్లీషు, హిందీ మెట్లలో అందుకు పూనుకుంటున్నారు. రానివాళ్ళు గాత్రం పాడుతున్నారు. భగ్నహృదయులు బాధపడుతూ, కాఫీతాగి సిగరెట్టు కాలుస్తూ బెంగపెట్టుకుంటున్నారు. దగ్గర్లో రేడియో ఉన్నవాళ్ళు బాధాకరమైన పాటలు వింటూ, వాటి సహాయం పుచ్చుకు మరీ బాధపడుతున్నారు. టింగు రంగారావు సినిమా పుస్తకాలు తిరగేస్తున్నాడు. పోజురాజు అద్దంముందు రిహార్సల్స్ వేసుకుంటున్నాడు.

అప్పారావు అప్పు సంపాదించటానికి ఉపాయాలు ఆలోచిస్తున్నాడు.

అప్పారావు ఋణవంతుడు. ఆ కల్పవృక్షం మీద గురి, గౌరవం కలవాడు. లోకభ్రమణానికి అదే మూలాధారం అని నమ్మినవాడు. అన్యథా భావన లేనివాడు. తరచుగా ఉద్యోగాలు, అంతకన్న తరచుగా భోజనం చేసేవాడు కావటంవల్ల అప్సరసలను – దేశవాళీ విదేశవాళీగూడా, అరుదుగా కన్నెత్తి చూసేవాడు.

అప్పారావు అసలు పేరు తుకారాం. అతనికి ఎప్పుడూ అప్పులిచ్చే గోపాలం, మీసాలంవంటి ఆప్తమిత్రులు అప్పారావని పేరు పెట్టుకున్నారు. ఇదొక్కటనేకాదు, గోపాలం ఏ పేరు పెట్టి పిలిచినా తుకారాం పలుకుతాడు.

బేడ అప్పుచేసి కాఫీ తాగేసి, అర్ధణా అరువుపెట్టి సిగరెట్టు తీసుకున్న తుకారాం, ఘాటుగా, గబగబా ఆలోచించి, రైటో అనుకున్నాడు. అనుకుని తిన్నగా గోపాలం యింటికి వచ్చాడు.

హలో! కులాసా? అన్నాడు.

లాభం లేదురా తుకారాం అన్నాడు గోపాలం నవ్వుతూ.

పోనీ హలో. ఉత్తి హలో.

ఉహుఁ. ఇవ్వనురా శోభనాద్రీ అన్నాడు గోపాలం.

తుకారాం హలో కులాసా అంటే ఐదురూపాయలు అప్పుకావాలని తాత్పర్యం. ఉత్తి హలో అంటే రెండే రెండు చాలు అన్నమాట.

అర్జెంటు గోపాలం. యమర్జెంట్. కాసిని మంచినీళ్లూ రెండు రూపాయలూ, ఓ సిగరెట్టూ, నీ సైకిలూ ఓసారి కావాలి. రెండోదీ నాలుగోదీకూడా సాయంత్రం యిచ్చేస్తా అన్నాడు తుకారాం అర్జన్సీని అభినయిస్తూ.

కుదరదప్పారావ్. ఒకటోదీ మూడోదీ నిక్షేపంగా పుచ్చుకో.

ఉహూ! అక్కర్లేదు.

గోపాలం నవ్వి లోపలికి కెళ్ళాడు.

నరసింహారావుకి రెండు రు||లు ఋణం కావాలిట. వీలైతే, కాసిని మంచినీళ్ళుకూడా ఇవ్వమన్నాడు అన్నాడు.

రాధ అలవాటు ప్రకారం చిరాకుపడింది. దానికేం ఇక్కడే పాతరుందిగా ఇవ్వండి.

అలాగా, ఉందా.... ఎక్కడా? అన్నాడు గోపాలం చిరాకుపడ్డ రాధ ముఖంలో వచ్చే మనోహరమైన పరిణామాలను మహా శ్రద్ధగా గమనిస్తూ.

నా నెత్తిమీద అంది రాధ విసుగ్గా.

రాధకి తలితండ్రులు పెట్టని సొమ్ములపైన గోపాలానికి బంగారం వంటి చామంతి పూలచెండు కనబడింది. పసుపుఛాయలీనే కోలనుదురు మీద కెంపులాంటి పెద్ద బొట్టులో లక్ష్మీకళ కనబడింది.

పోనీలే. ఇవ్వద్దు. ఇవ్వనన్నావనీ... ఇవ్వననీ ... ఊహూ లేదని చెబుతా అన్నాడు గోపాలం.

మంచినీళ్ళు పట్టుకొచ్చి తుకారాంకి ఇచ్చి; మా ఇంట్లో డబ్బు లేదటోయ్ అన్నాడు యదాలాపంగా.

నువ్వు బలేవాడివే. ఇవాళ నువ్వు కాదంటే; ఏడాది పొడుగునా నాకు దమ్మిడీ అప్పు పుట్టదు. దమ్మిడీ బాకీ తీర్చలేను తెలుసా? అన్నాడు తుకారాం.

భేష్, అయితే అసలివ్వను.

అలాక్కాదు. నువ్విపుడు యిచ్చితీరాలి. సాయంత్రం మళ్ళా నేను ఈ అప్పు తీర్చి తీరాలి. ఇంక అసలు ఎవణ్ణీ యెన్నడూ అడగదలచుకోలేదు. అందుకూ.

ఆకాడికి ఇవాళ పుచ్చుకోకపోవడమే మంచిదిగా అంటూ, వంటింటి వేపు తొంగిచూసి, చెక్కురాసిచ్చాడు గోపాలం. మామూలుగానే చెక్కుతోపాటు చీవాట్లు, పెళ్ళి చేసుకోరాదట్రా అని ఓ సలహా జతపరచి చేతులో పెట్టాడు.



చెక్కు చేతపట్టుకుని చివాట్లు సలహాతోసహా చిల్లుజేబులో వేసుకొని బయల్దేరాడు తుకారాం.

గోపాలానికి అసలుసంగతి జ్ఞాపకం వచ్చింది. ఒరే అప్పారావు!...ఓయ్! షణ్ముగం, యిలారా మాట మాట అన్నాడు.

త్వరగాచెప్పు, పోవాలి అన్నాడు తుకారాం, తిరిగి వచ్చి ఇంకో సిగరెట్టు తీసుకుంటూ.

ఏంలేదు. నీకు పెళ్ళి. రేపే ప్రయాణం. మూటాముల్లె ఉంటే సర్దుకో.

అలాగా. శుభం. ఏ వూరు?... అయినా నా కెందుకులెద్దూ, సలహాలిచ్చే తెలివీ లేదు, పనుంది వస్తా

అప్పారావ్. వెధవ్వేషాలెయ్యకు. నీక్కాదూ చెప్పేది?

ఏమిటి?

పెళ్ళి.

ఎవరికి?

నీకే....

ఏడిశావు.... అయినా ఏ వూరు?

వూర్నికాదు పెళ్ళాడేది ఆడపిల్లని. గర్ల్! మా వూరే. మా చినమావగారి కూతురు.

మీకు చినమావగారున్నారా? మీసాలరావుకికూడా ఉన్నారు. ఆయన చాలా మంచివాడు. క్రితంసారి యీ ఊరొచ్చినప్పుడు.....నువ్వు వూళ్ళో లేవులే. అర్జెంటుగా ఐదుకావాలంటే సర్దాడు...బహు మంచివాడులే, తరవాత ఇస్తానంటే వద్దన్నాడు.

వతి అప్పోమానియాగాడు అని గట్టిగా విసుక్కున్నాడు గోపాలం.

ఎవరూ ఆయనా?

ఛఫ్!

ఇంకెవ్వరు? మీ చినమామగారా?

ఛఫ్! నువ్వే.

నేనేమిటి?

అప్పోమానియాక్ వి.

అనగా?

నీకు ప్రపంచంలో అప్పులు, అప్పులు యిచ్చేవాళ్ళుతప్ప మరొకటి కంటికానదు అన్నాడు గోపాలం.

జరిగితే జ్వరం అంత సుఖంలేదు. దొరికితే అప్పులాంటి మంచివస్తువులేదు. తుకారాం మనసారా నమ్మిన మాట ఇది. అందుకని పకపక నవ్వాడు. విరగబడి నవ్వాడు.

హారినీ. ఇందుకా పనిమల్లె పిలిచావు వస్తా పనుంది అన్నాడు.

అరే అదేమిటి నే చెప్పిన సంగతేం చేశావు.... పెళ్ళి సంగతి?

పెళ్ళా. ఎవరికిరోయ్ అన్నాడు తుకారాం హుషారుగా.

పెంకె భడవా అని, ఆ పంథాలో కొంతసేపు ఉపన్యసించ సంకల్పించాడు గోపాలం. అంతలోకే, గోపాలం చినమామగారు జగన్నాథంగారు బజారునుంచి తిరిగి వచ్చారు.

తుకారాంని ఆయనకి పరిచయం చేశాడు గోపాలం.

మాటా మంతీ ఆడినపుడు అప్పుల విషయం రాకుండా జాగ్రత్తపడ్డాడు. తుకారాంని బలవంతాన కుదేసి భోజనం పెట్టాడు.

నువ్వు బొత్తిగా యిలా అయితే యెలా జలాలుద్దీన్ అన్నాడు గోపాలం లాలనగా.

వస్తా పనుంది అన్నాడు తుకారాం.

మీ సీతని ఈ అబ్బాయికిస్తే బావుంటుందండి. బహుమంచివాడు. అత్త ఆడపడుచుల పోరుండదు అన్నాడు గోపాలం

అబ్బాయి దీపంలా ఉన్నాడు. ఓ సారిచూస్తే సరి అన్నాడు జగన్నాధంగారు.

శుభం రేపే ప్రయాణం అన్నాడు గోపాలం.

వెంటనే తుకారాం గుహ వెతుక్కుంటూ వెళ్ళి శుభవార్త చెప్పాడు.

వెయ్యినూటపదహార్లు కట్నం యిస్తారు తెలుసా? మాంచి వ్యాపారం చేసుకుందు గాని. ఈ స్కూలు గుమాస్తా బెడద ఉండదు అన్నాడు.

అబ్బెబ్బె. మనం కట్నం చచ్చినా పుచ్చుకోం తెలుసా? ఓ పని చెయ్యమను. ఆ వెయ్యికి యింకోవెయ్యి కలిపి అప్పుగా యివ్వమను, కావలిస్తే నోటు రాసిద్దాం అన్నాడు తుకారాం.

☆ ☆ ☆

సాయంకాలం దీపాలవేళ, రాధమ్మ పెరట్లో తులసికోట దగ్గర దీపం పెడుతూ వుండగా గోపాలం వచ్చి గుమ్మంమీద కూర్చున్నాడు.

షికారయిపోయిందా యేమిటి....ముందు గుమ్మం దిగండి. పీటేసుకు కూర్చోండి అంది రాధ.

అది సరేలేకాని, మా శోభనాద్రికి పెళ్ళిసంబంధం చూశాను అన్నాడు గోపాలం.



శోభనాద్రెవరండీ?

అదే. వాడే గోవిందలాల్....

అతగాడెవరు?

అబ్బ. అప్పారావు... ఐమీన్ తుకారాం అన్నాడు గోపాలం చిరాగ్గా.

బావుంది, మీ ముద్దు పేర్లన్నీ నా కెలా తెలుస్తాయి. సరే...ఏ వూరుట?

మీ ఊరే, సీత!...మీ బాబాయి సరే అన్నారులే.

మీకేం మతిగినా పోయిందా. వరహీనంకూడా. పైగా అది పరమగయ్యాళీ. దాంతో ఇలాటివాడు వేగలేడు అంది రాధ.

అది గయ్యాళీ అయితే వాడు మొండి తెలుసా, వాడి కిష్టంలేని సంగతి చెవినెక్కించుకోడు....యిక యోగ్యతంటావా, అందుకేం లోపంలేదు.

నే నన్న దదికాదు. ఆ పెంకెఘటాన్ని భరించలేడని అంది రాధ ముభావంగా.

గోపాలం! ఏం చేస్తున్నావు? అంటూ జగన్నాధంగారు పెరట్లో కొచ్చాడు.

అదే, సీత పెళ్ళిసంగతి మాట్లాడుకుంటున్నాం బాబాయ్. నీకు ఈ అబ్బాయి నచ్చినట్లేనా? మొహమాట పడకుసుమీ అంది రాధ.

నచ్చినట్టే అనుకో....కాని....

సందేహించకండి మావయ్యగారూ... అన్నాడు గోపాలం మర్యాదకి.

అంటే మరేంలేదుసుమీ. ఆ మీసాలున్నాయి చూడు, టిప్పుసుల్తానులాగా.

అబ్బే అదాండి. ఇదివరకు అక్బరు పాదుషా పంథాలో పెంచేడు. మీసాలరావు ప్రభావంలెండి. దరిమిలా కృష్ణదేవరాయల ఫాషన్‌కి మార్చాడు. ఈ మధ్యనే ఎవరో చెబితే, యిలా చేసుకున్నాడు. దానికేముందిలెండి... అన్నాడు గోపాలం.

మీకు వాళ్ళ మీసాల పరిణామఘట్టాలు చరిత్ర కంఠతా వుంటాయిగాని, ఇవాళ బాబాయికి సినిమా చూపిద్దామన్నమాట గుర్తులేదు కదూ అంది రాధ.

ఇప్పుడే పెళ్ళి గొడవెందుకులే. ముందర – ఐమీన్ సినిమా కేం తొందరలే. ముందర పెళ్ళి సంగతి ఆలోచిద్దాం. రెండో సంగతేమిటండీ మావయ్యగారూ?

అదే, పిట్ట కొంచెం కూత ఘనమన్నట్టు ఆ పిల్లాడికి యీడు తక్కువ అయివుంది. అంతలేసి మీసాలుంటే... చూశావూ నాకు సరిపడదు. ఇహ రెండోదేమిటంటావూ అతనికి చొరవపాలు వొఖరవ్వ యెక్కువనుకుంటా. అంటే డబ్బుతో కూడిన లావాదేవీలలో....

గోపాలం గుండె గతుక్కుమంది. గబుక్కున తమాయించుకున్నాడు.

మిమ్మల్ని అప్పు అడిగాడనికదూ మీరు చెప్పేది? నే నతనికి బాకీలెండి, ఇందాక అతనికి ప్రాణావసరం వచ్చి అడిగాడు. చెక్కు యిచ్చాను. సరే, యివాళ బ్యాంకులేదు గదా అని, అంత అవసరమైతే మిమ్మల్ని అడగమన్నాను లెండి అన్నాడు కంగారుగా.

నా తలకాయిలా వుంది. మీ సమర్థింపూ మీరూనూ అంది రాధ చిరాగ్గా.

అబ్బే. నేను తప్పట్టుతున్నా ననుకునేవోయ్. అతనికి మంచి ఆత్మవిశ్వాసం వుంది. యోగ్యుడుకూడా. బజార్లో ఇందాక కనబడ్డాడులే. ఏదో మాటా మంతీ ఆడుతూ వుండగా అర్జున ప్రసక్తి వచ్చింది. ఆఁ దాందుంపతెగా, కుటుంబం పోషించుకోలేని వాడుంటాడండీ, నామటుకు నేను ఎన్నడూ దేనికీ లోటురానివ్వనూ, అంతగా అయితే అప్పయినా చేస్తాం అవటాఅన్నాడు... మంచి ధైర్యవంతుడే.

అది హేళనో నిజమో గోపాలానికి తెలియలేదు.

ఆ ముక్క నిజమేనండి. అయినా లోకంలో అప్పు చెయ్యనివాడెవడున్నాడు. ప్రపంచం అంతా అప్పుమీదే నడుస్తోంది. గవర్నమెంటువాళ్ళు జనం దగ్గిరా, జనం

గవర్నమెంటు దగ్గిరా అప్పు తీసుకుంటారు. అప్పు పంచభూతాలలో ఒకటి. పృధివ్యాపస్తేజో వాయురాకాశా లన్నారు అన్నాడు గోపాలం వెకిలిగా నవ్వుతూ.

☆ ☆ ☆

రాధకి ఉవ్వెత్తున కోపం వచ్చింది. వెక్కిరించబోయినంత పనిచేసి, చాల్లెండి ఎవరన్నా వింటే నవ్విపోతారు అని ఊరుకుంది.

☆ ☆ ☆

రైలెక్కేముందు తుకారాంని చాటుకి పిలిచి పది రూపాయలు చేతిలో పెట్టాడు గోపాలం.

అబ్బీ, నువ్వు కాబోయే పెళ్ళికొడుకువి. రత్నంవంటి పిల్లని చూడబోతున్నావు. కాబోయే మావగారు నీ వెంటే వస్తున్నారు. ఒళ్ళు దగ్గిరపెట్టుకొని మసలుకో. నన్నుగాని, మా ఆవిణ్ణిగాని, ఆయన్నిగాని, మరే ప్రాణినిగాని దమ్మిడీ అప్పు అడిగావో నీకూ నాకూ అంతే అని హెచ్చరించాడు.

అది జేబులో పెట్టుకుంటూ వుండగా, గోపాలానికి అలాంటివే మరో నాలుగు కనబడ్డాయి.

ఎక్కడిదిరా అంతడబ్బు? నిన్ననేగా నన్నడిగావు అన్నాడు.

ఆఁ ప్రయాణం చూడు. ఎందుకేనా వుంటుందని నలుగుర్నీ అడిగి జతపరచుకొచ్చాను అన్నాడు తుకారాం ఇకిలిస్తూ.

పది వుంచి మిగతాది తీసుకున్నాడు గోపాలం.

రైలెక్కాడేకాని తుకారాంకి కాలు నిలవడం లేదు. స్టేషన్‌లో ఆగడం తడవు, రైలు దిగి నాలుగు పెట్టెలూ పరకాయించి చూసి వస్తున్నాడు. ప్రతి చోటా యెవడో ఒకడు తెలిసినవాడు కనబడుతూనే వున్నాడు.

ఒక స్టేషన్‌లో గోపాలం రైలుదిగి సిగరెట్లు తేవడానికి వెళ్ళివస్తూ వుండగా ఆ పక్కనే తుకారాం యెవరితోటో గుసగుస లాడుతున్నాడు. పెద్ద నోటుంది. మార్చి తరువాత యిస్తాగాని, ఓ రూపాయివ్వండి అని వినబడింది.

ఒరేయ్ అవతారం, నువ్విలా రారా! నీక్కాదు చెప్పిందీ అని గద మాయించాడు గోపాలం.

రైల్లో కబుర్లూ ఆ పంథాలోనే సాగాయి, వేరుసెనక్కాయల్నించి ఆటంబాంబువరకూ, ఏ సంగతి ఎవరు మాట్లాడినా అప్పులమీదికి చర్చల్ని మళ్ళించేస్తున్నాడు తుకారాం. ఆపడానికి గోపాలం వల్ల కాలేదు. అణా బేడా అప్పుచేసిన లక్షాధికారుల కథలు, అప్పుల గురించిన వింతలు విశేషాలు, దానిమీద అనుభవజ్ఞుల సిద్ధాంతాలూ కొల్లలుగా ఎడతెరిపి లేకుండా అనర్గళంగా వర్ణిస్తున్నాడు. రాధకి నవ్వాగటంలేదు. జగన్నాధంగారికి వూపిరాడటంలేదు.

ఇదెక్కడి గోలోయ్ దేవుడా. వీడెక్కడి మనిషోయ్ భగవాన్లూ అని ఊహా తలక్రిందులై కర్తవ్యం నిర్ధారణ చేసుకోలేక తిప్పలు పడుతున్నాడు. గోపాలం దాదాపు ఆశ వదిలేసుకున్నాడు.

ఒక స్టేషన్‌లో హుషారుగా దిగి షికారు వెళ్ళిన తుకారాం, ఐదునిమిషాల తరువాత బిక్క మొహం వేసుకొచ్చాడు.

ఏం గిరాకీ అన్నాడు గోపాలం నవ్వుతూ.

హలో కులాసా హలో కులాసా అని తారంగం తిప్పి మూలిగాడు తుకారాం (అంటే పదిరూపాయలు పోయాయని భావం.)

గుడివాడ సంధి వచ్చేసింది. రైలు ఆగుతూ వుండగా, ఎవర్నో చూచి ఎగిరి గంతేశాడు తుకారాం.

గోపాలం అమాంతం వెంటబడి రెక్క దొరకపుచ్చుకున్నాడు.

నీకేం మతిపోయిందా అన్నాడు కోపంగా.

లేదు, పది అని గొణుక్కున్నాడు తుకారాం.

కూలీలు చుట్టుముట్టారు. తుకారాంకి భయమేసింది, దర్జాకోసం గోపాలం తనని కూలి యిమ్మంటాడేమోనని.

జెమా జెట్టీల్లా మేం వుండగా మీ రెండుకోయ్ అన్నాడు గంభీరంగా.

జగన్నాధంగారు ఛ ఛ అన్నాడు గబుక్కున.

కుర్రాడు లోకువైపోతాడని భయపడి గోపాలం బుకాయింపుకి సిద్ధపడ్డాడు.

మీ రూరుకోండి మావయ్యగారూ. కాయకష్టం గౌరవం మీరింకా గ్రహించలేదు. మీ కెందుకు, మీరలా ఉండండి చెప్తా. మీరక్కడ సామాను చూస్తూ వుండండి. రాధ అవతల ప్లాట్ ఫారంమీద వుంటుంది. నిమిషంలో మేం సామాను అవతలకి చేర్చేస్తాం అన్నాడు.

రాధ విస్తుపోయి మరచెంబు, టిఫిన్ కారియరు పట్టుకు బ్రిడ్జి యెక్కింది. గోపాలం ఉసూరుమంటూ మోస్తున్నాడు. తుకారాం ఆయాసపడుతూ పరుగు పెడుతున్నాడు. అయినా కళ్ళుమాత్రం లేడికళ్ళలా నలువంకలా చూస్తూనే వున్నాయి. ఆయన్నిగాని, కూలీల్నిగాని, గార్డునిగాని యింకెవ్వరినిగాని దమ్మిడీ బదులడిగావో చంపేస్తా అని బెదిరిస్తూవచ్చాడు గోపాలం. రెండు ట్రిప్పులు అయ్యేసరికి ఓపిక తగ్గింది, జాగ్రత్త! అని ఓసారి, చంపేస్తా అని ఓసారి క్లుప్తంగా హెచ్చరికలు, బెదిరింపులు చేస్తూ వచ్చాడు. నాలుగో ట్రిప్పు అవుతూవుండగా, అంత సామాను తెచ్చినందుకు మామగారిమీద విసుక్కున్నాడు. ఎదటివేపు నుంచి రైలొచ్చింది. పరుగెడుతున్న తుకారాం కనబడ్డాడు. గోపాలం బ్రిడ్జి దిగేసరికి ఇకిలిస్తూ, మురిసిపోతూ చకచక వచ్చేశాడు.

ఏం చేశావు? ఎంత తెచ్చావు? అన్నాడు గోపాలం ఆయాసపడుతూ

ఛ ఏం లేదే.

ఇద్దరూ చెరోబుట్టా-పట్టుకు మళ్ళా బయలుదేరారు. అటువెళ్ళేసరికి గోపాలం బాల్యమిత్రుడు మీసాలరావు, అతని భార్య రాధతో మాట్లాడుతున్నారు. మీసాలరావు గడ్డంకూడా దట్టంగా పెంచాడు. మొహం అసలు కనబడటంలేదు.

ఏరోయ్! ఎప్పుడు రావటం? అన్నాడు గోపాలం.

అదే, మొన్న రైలు దిగాను. మా పెట్టె ప్లాట్‌ఫారం చివర ఆగిందిలే. తాపీగా మజిలీలు చేస్తూ ఇవాళకి ఇక్కడికి చేరాను. ఏమిట్రా నీ బొంద, చవటప్రశ్నలూ నువ్వూను అన్నాడు మీసాలరావు.

తుకారాం, గోపాలం వెనక దాగినట్టు నిల్చున్నాడు.

వీడికి ఎంతిచ్చావురా అన్నాడు గోపాలం. మీసాలం పకపక నవ్వాడు.

ఐదు....వాడి దుంపతెగా మాట తోచనిస్తేనా. నే నిక్కడే దిగుతున్నానని చెబితే వినిపించుకోడే. రైలు ఆగకుండానే చూశాడు. అంతే, ఆ చివరికొచ్చి అర్జెంటు ఐదు అంటూ తగులుకున్నాడు. ఇవ్వక చస్తానా... ఏరా అప్పారావు, అంతేనా? అన్నాడు.

పాయింటే అన్నాడు తుకారాం.

☆ ☆ ☆

పెళ్ళిచూపులు ఫలప్రదం కాలేదు. సీతకి తుకారాం వాటం నచ్చలేదు. అందులోనూ, సుబ్బారావు అనే ఘటం ఒకటి– పెద్దసైజు ఋణధ్రువం హాజరు కావడంతో తుకారాంకు హుషారు పట్టపగ్గాలు లేకుండా పోయింది. సంబంధం కుదరనందుకు గోపాలం చిన్నబుచ్చుకున్నాడు.

బావుందండీ. దానికి నచ్చకపోతే మనమేం చేస్తాం అంది రాధ.

కావలిస్తే ఓ పదిరూపాయలు అప్పిస్తాను. ఏమనుకోవద్దను బావా అంది సీత నవ్వుతూ.

రాధ మందలించింది.

నిజానికి తుకారాం యీ విషయం అట్టే పట్టించుకోలేదు. ఫలితం చూచాయగా తెలియగానే ఒక్కక్షణం తలవంచుకున్నాడు. ఘటన ఉండాలిగదా. మా యిద్దరికీ ఋణానుబంధం లేదేమో అన్నాడు మెల్లిగా.

నీ ఋణం తగలేసిరి అన్నాడు గోపాలం ఉప్పొంగే ఆశ్చర్యంతో, ఆనందంతో, ప్రేమతో, వాత్సల్యంతో.

☆ ☆ ☆

పెళ్ళిచూపులకి పెద్దమనిషిగా వచ్చిన ఋణధ్రువం సుబ్బారావుకీ, మహా ఋణవంతుడు, ఋణాశనుడు, ఋణాఢ్యుడు అయిన అప్పారావనే తుకారాంకి క్షణాలమీద స్నేహం కలిసిపోయింది. దృక్పథాలు ఏకీభవించాయి. ఒకరి ప్రతిభ నొకరు గుర్తించారు. అక్కడే చిక్కు, ఇద్దరికీ భయంపట్టుకుంది, ఎవరి నెత్తిన ఎవరు చెయ్యి పెడతారా అని.

షికారు రమ్మన్నాడు సుబ్బారావు. సరే పద అన్నాడు అప్పారావు.

పది నిముషాలలో ఋణగుణధ్వని చెలరేగింది. నా మాట వినండి నా మాట వినమనుకున్నారు. బాబ్బాబు అని బ్రతిమాలుకున్నారు. రేపటికి ఫిరాయించేస్తానని పరస్పరం హామీలు యిచ్చుకున్నారు.

స్థానబలమే జయించింది. ఋణధ్రువమే సార్థకమైంది. అప్పారావు అనే తుకారాం, గుడివాడ సంధిలో మీసాలరావు దగ్గిర వడేసి పుచ్చుకున్న ఐదు రూపాయలూ సుబ్బారావుకి అప్పుగా సమర్పించుకున్నాడు. జీవితంలో తొలి పరాజయం అది.

సుబ్బారావుకి జీవితంలో తొలి ఘన విజయం అది. మురిసిపోయాడు. గర్వ పడ్డాడు. తుకారాం మీద అభిమానం పెల్లుబికింది. గొప్ప ఊహ తట్టింది.

మా యింటికి భోజనానికి రా అన్నాడు.



రైటో అన్నాడు తుకారాం. సుబ్బారావు అత్తగారు మాటామంతీ ఆడుతూ ఊరూ పేరూ కనుక్కుంది.

భోజనానంతరం తుకారాంని సావిట్లో కూర్చోపెట్టి, లోపల అత్తగారితోనూ, భార్యతోనూ, మరదలితోనూ మాట్లాడి వచ్చాడు సుబ్బారావు.

పదినిముషాల తరువాత సుబ్బారావూ, అత్తగారూ సావిట్లోకివచ్చి, తుకారాంకి పిల్లనిచ్చి పెళ్ళి చేస్తామన్నారు. ఇంకో క్షణం తరువాత, సుబ్బారావు తన మరదల్ని కేకేశాడు.

తుకారాం ఓ క్షణం ఆలోచించి ఆట్టే బెట్టు చెయ్యికుండానే రైటో సుబ్బారావ్ అనేశాడు.

☆ ☆ ☆

రాత్రి ఎనిమిది గంటలకి తుకారాం గోపాలం ఉన్న ఇంటికి వెళ్ళాడు.

పరారీ అయిపోయావనుకున్నా... రా అని చేరదీశాడు గోపాలం.

దూరదృష్టి లోపించినందువల్ల తుకారాం జేబు గుట్టు బయట పెట్టింది.

ఈ నోట్ల కట్టేమిటిరా. ఇక్కడెవరు అప్పిచ్చారురా నీకు? అన్నాడు గోపాలం ఆశ్చర్యబోతూ.

కాబోయే అత్తగారులే. సుబ్బారావు మరదలిని చేసుకుంటున్నా. కట్నం ఐదొందలు. టెంపరరీగా ఓ యాభై అప్పు తీసుకున్నాను అన్నాడు తుకారాం సిగ్గు అభినయిస్తూ.

అ ప్రయత్నంగా గోపాలం ఆ నోట్లు లెక్కపెట్టాడు. పాతికే వున్నాయేం? అన్నాడు వెంటనే.

ఓ పాతిక మా తోడల్లుడు సుబ్బారావు చేబదులు తీసుకున్నాడు అన్నాడు తుకారాం.

నువ్వెవరో కాని అసాధ్యుడివిరా అన్నాడు, గోపాలం కొయ్యబారి చూరువంక చూస్తూ.

దానికేముంది, ఋణానుబంధం అని ఛలోక్తి విసిరాడు తుకారాం.

అబ్బే, నీ సంగతి కాదులే అన్నాడు గోపాలం.

★ ★ ★




ఋణకిరణాలతో లోకాన్ని జోకొడుతున్న చంద్రుడు, ఆఋణకిరణుడు కనుచూపు మేరలో కానరాగానే తెల్లబోయి పాలిపోయాడు. రాత్రి తెల్లవారి ప్లేటు తిరగేసి యెర్రబారబోయింది. అప్పులు తీర్చేసినవాడి మనసులా లోకం ప్రశాంతంగా వుంది. గాలి చల్లగా మెల్లగా వీస్తోంది. ఉషాదేవి తనలో ఉండి ఉండి నవ్వుకుంటోంది. పువ్వులు

మెల్లిగా మేలుకుంటున్నాయి. తొలిసారి వికసిస్తున్న మొగ్గలు పట్టపగ్గాలు లేకుండా మొదటిరోజున అక్కయ్య చీర కట్టుకున్న కన్నెపిల్లలా ఉన్న చోటునే పరవళ్ళు తొక్కుతున్నాయి. పక్షులు గుర్తుకొచ్చిన పాటలన్నీ పాడేస్తున్నాయి కవులు నిరుత్సాహ పడకుండా. కాఫీపొడి అప్పు దొరికేదాకా ఆయనా పిల్లలూ నిద్ర లేవకూడదని ఇల్లాళ్ళు ఆశపడుతున్నారు. అప్పులు ఇచ్చుకున్నవాళ్లు ఉప్పొంగి 'పోతున్నారు' – వీధుల్లోకి! తెచ్చుకున్నవాళ్ళు ఉప్పొంగి 'పోవటం' లేదు – గది అవతలికి.

యజమాని అడుగుల చప్పుడు విన్నా, రానీ చూదాం అని కూర్చున్న సేవకుడిలా మొత్తంమీద జగతి ఇంకా తటపటాయిస్తోంది డ్యూటీలో పడదామా, కాస్సేపు ఆగుదామా అని. సూర్యభగవానుడికి కోపం వచ్చింది. చాలాకాలం తరువాత రావలసిన డబ్బు చేతికి రాగానే అప్పుల వాళ్ల మొహాన విసిరి కొట్టేవాడిలా, ఆయన దూకుడుగా కిరణాలను గుప్పించేస్తున్నాడు. చిక్కటి మర్రిచెట్టుమీద కొమ్మ తొట్టిమధ్య కట్టిన గూట్లోకి ఓ కిరణం పడింది. అందున్న పిల్లకాకి మెల్లిగా ఓ కన్ను సగం తెరిచిచూసి ఓహో తెల్లవారిందనుకొని కావురించి, లేత రెక్కలు బద్ధకంగా విరుచుకుని నోరు తెరచుకొని అలాగే పడుకుంది. నోట్లో ఏమీ పడకపోయేసరికి ఆకలోయ్ అంది.

ఉష్ కాకి! ఏమిటా కావు కేకలు అప్పులాడిలా అంది తండ్రి కాకి. పిల్ల కన్ను తెరిచి చూసింది. తల్లీ, తండ్రీ గూడుపక్కనే కొమ్మమీద కూర్చుని దేనికోసమో శ్రద్ధగా చూస్తున్నారు. మంచి పురుగులకోసం కాబోసు అనుకుంది పిల్ల.

అదుగో వచ్చేస్తున్నాయి చూడు. అయిందా పెళ్లి! నే చెప్పలే? అంది తల్లి కాకి.

అతను ఓరకంటనే కోరగా చూశాడు. పొద్దుటే పరగడుపుని ఆ మాటెందుకు మళ్లీ? నువ్వూ నీ అలంకారాలూనూ అని విసుక్కొని మళ్లీ కిందికి చూశాడు.

అతనిమాట రెక్కలో బాణంలా గుచ్చుకుంది. ఆమె నొచ్చుకుంది.

☆ ☆ ☆

చెట్టుకింద పెద్ద పుట్టదగ్గర చాలా సందడిగా వుంది. మూడు రోజులనాడు పుట్ట ఖాళీ అయినప్పటినుంచీ మళ్ళీ యెవరొస్తారా, యెలాటి పాము దిగుతుందా అని కంగారు పడుతున్నాయి కాకులు రెండూను.

క్రితంరోజు మధ్యాహ్నం ఓ డజను చీమలు వచ్చి వెళ్ళాయి. సంజవేళ కాకీ, కాకీ బాకీ గురించి తగవులాడుకుంటున్న అలికిడి అయిచూస్తే, అయిదారువందల చీమలు కనిపించాయి. అవి పుట్టలోకివెళ్లి వాటాలూ, గాలివాలూ, చెట్టునీడా, వానా వరదల తాకిడికి అవకాశాలు చూసుకున్నాయి. ఇవతలికి వచ్చి అన్నీ కూడబలుక్కున్నాయి. వాటిలో డజను చీమల్ని మిగతావన్నీ గుచ్చి గుచ్చి అడుగుతున్నాయి.

వెర్రికుంకలు అనుకుంది ఆడకాకి...తీరా యిందాక తెల్లవారేసరికి చూస్తే షుమారు యెనిమిది లక్షల చీమలు సంబారాలూ అన్నీ పట్టుకొని తరలి వచ్చేస్తున్నాయి.

☆ ☆ ☆

కాకమ్మ విరగబడి నవ్వింది. చూడు చూడు ఇంకాసేపటికి సుబ్బన్న, నాగలక్ష్మి వచ్చేస్తారు. ఇవన్నీ యేంగానుట అప్పుడు... పరిగెడతాయి పాలోమని, అంది.

అవెక్కడొస్తాయిలే, ఆ పాములాడు యీ పాటికి నాగమ్మనుకూడా పట్టి బుట్టలో వేసుకునుంటాడు.

కాదంది కాకమ్మ.

మాటలోనే దూరంగా సుబ్బన్నా, నాగలక్ష్మీ కనిపించారు. చర చర వచ్చేస్తున్నారు – సరసాలు ఆడుకుంటూ, బుసా బుసా మంటూ,

మందారమొక్క దగ్గర నిలబడ్డ లేడిపిల్ల ఒకటి ఆలోచిస్తోంది – ఈ ఆకులు బావుంటాయా అని.

కొంటె సుబ్బన్న పోతూ పోతూ అటు తిరిగి బుస్సుమన్నాడు. లేడిపిల్ల ఉలికిపడి చూసి నవ్వింది. కానీ పరిగెత్తలేదు.

నాగలక్ష్మి హేళనగా నవ్వింది. చూశావా, తేడా తెలిసిపోతూంటేను... అంటూ తనోసారి బుస్సుమంది. లేడి, మందారాకుల రుచి సమస్య పరిష్కారం అర్జెంటుగా వాయిదా వేసి వాళ్ళమ్మని పిలుస్తూ పరుగెత్తింది.

కోరలు పీకేశారు కామోసు పాపం సుబ్బన్నకి అంది కాకమ్మ జాలిగా అటే చూస్తూ.

కాకరాజు మాట్లాడలేదు. జరగబోయే కథ తల్చుకుంటే అతనికి గుండె గుభేలు మంటోంది..

ఉత్సాహంగా ఆడుతూ పాడుతూ సుబ్బన్నా, నాగలక్ష్మీ పుట్ట దగ్గరికి రానే వచ్చారు. వచ్చినవారల్లా కొండపల్లి బొమ్మపాముల్లా కొయ్యబారిపోయారు – తమ పుట్టకు పట్టిన గతి చూడగానే.



పుట్ట గుమ్మాలనిండా, గోడలనిండా లక్షోపలక్షల చీమలు, చాలా హడావిడిగా సందడిగా తిరుగుతున్నాయి. ఐదారు పెద్ద చీమలు ఉత్తర్వులు చేస్తున్నాయి. పిల్లల్ని ఒక కంతలోంచి, బియ్యపు గింజల్ని ఇంకో గుమ్మంలోంచి పంపిస్తున్నాయి. మరో దారివెంట కొన్ని చీమలు పుట్టమట్టిని పట్టుకెళ్తున్నాయి లోపల గదులు కట్టడానికి.

సుబ్బన్నకి కోపం వచ్చింది. ఏమిటే అఘాయిత్యం, దారుణం, ఏమిటే చొరవ, సరసం, దోపిడి అనుకొని పడగెత్తి బుస్సుమనబోయాడు.

స్. నువ్వొద్దు, నా మాట విను, పరువుపోతుంది అంటూ నాగలక్ష్మి పుట్టకేసి బుసకొట్టి తరువాత మాట తూలినందుకు మన్నించమంటూ మొగుడివంక చూసి

నాలికలు కొరుక్కొని తల వంచుకుంది. చీమలన్నీ గజగజలాడి ఎక్కడివక్కడ స్తంభించిపోయాయి. సింహద్వారం దగ్గిర ఒక చీమంతి చుట్టూ చేరి కులాసాగా కబుర్లు చెపుతున్న కుర్రకారంతా ఆ పిల్ల వేసిన ఒక జోక్‌కు చిమచిమ నవ్వబోయి మానేయడం కూడా సంభవమైంది.

సుబ్బన్నా, నాగలక్ష్మి పుట్టకి కొంచెం దగ్గరగా పాకి ఆగి పడగలెత్తి సర్పదర్పాన్ని అభినయించారు.

పోజు ఫోటోజెనిక్ గానే ఉంది అన్నాడొక చీమంతుడు. చుట్టూ ఉన్న వాళ్ళంతా పగలబడి నవ్వాడు.

బుస్సుమంది నాగలక్ష్మి.

ఉస్ తప్పని మందలించింది పెద్దచీమ. తరువాత ముందుకొచ్చి గుమ్మందగ్గర గుట్టమీద నిలబడి ఎవరు మీరు ఏం కావాలి అంది ఠీవిగా.

చెప్పుకోండి చూదాం అంది నాగలక్ష్మి వ్యైటకారంగా.

చీమ మందహాసం చేసింది.

అమ్మాయి.... ఇలాటి పొడుపుకథలేకాదు. నేనింకా చాలా చెప్పుకోగలను.... అయినా నువ్వడిగింది చెబుతా. ఈ పుట్ట యింకా మీదే అనుకుంటున్నావుగాని, కాదు. మీకూ దీనికీ ఋణానుబంధం తీరిపోయింది. మిగిలింది మీకూ మాకూను. అందుచేత ఇకనించీ ఇది మాది అంది.

పాములు పెట్టిన పుట్టలు చీమల కిరవైన యట్లు అన్నాడు సుబ్బన్న విచారంగా.

చప్.... పాములు పెట్టిన పుట్టలు కాదు చీమలు పెట్టిన..... అంది నాగలక్ష్మి కోపంగా.

అచ్చు తప్పు పడివుంటుంది నువ్వు చదివిన పుస్తకంలో.....పాములే రైటు. ఆ కారణం వల్ల కూడా యిది మాదే. లేదా నువ్వన్నట్టు చీమలు పెట్టిన పుట్టలే అయినా కూడా ఇది మాదే. అంచేత యే విధంగా చూసినా..... – అంది చీమ.

బుస్‌మంది నాగలక్ష్మి. సుబ్బన్నకి కూడా తిక్కవేసుకొచ్చింది. ముందుకు దూకబోయాడు.

అట్టె అట్టె ఆగు– అంది పెద్దచీమ. నాయనా ఆడదాని మాట విని తప్పుదారిన పడకు, నువ్వు పూర్వజన్మలో మాకు ఇంటద్దె బాకీ ఉండి వుండవచ్చుగద. అంచేత మేము యీ యిల్లు బేవార్సుగా తీసుకొన్నా తప్పులేదు – పాతబాకీ కాకపోయినా, నువ్వు ఐదారు జన్మల తరువాత కోటికి పడగెత్తి పుట్టి, వేలకొద్దీ అద్దెకొంపలకు యజమాని కాగల ప్రమాదం వుంది. ఈ చీమలన్నీ అప్పుడు అక్కడ అద్దెకి దిగవచ్చు. నువ్వు అయిదు రూపాయల యింటికి పాతిక వసూలు చేయవచ్చు. అప్పుడు పడగల బాకీకి ఇప్పుడు అడ్వాన్సుగా యీ ఇంటి రూపేణా జమకడితే, దేవుడికి మొక్కుబళ్ళు తప్పుతాయి గదా అప్పుడూ.

సుబ్బన్న సందేహంగా భార్యవంక చూశాడు. ఆమె పడగ ఆడించింది.

నాకీ జన్మలమీదా గిన్మలమీదా నమ్మకంలేదు. అంతా ఉత్తి దొంగమాటలు నీవి– బాకీలేదు, కాకీలేదు అన్నాడు సుబ్బన్న ధైర్యంగా.

కావ్ కావ్ మంది చెట్టుమీద కాకి.

చూశావా. నువు కాకి లేదంటే ఉన్నానని పైనించి సాక్ష్యం – అలాగే బాకీకూడా ఉండే వుంటుంది. అంది చీమ.

వాళ్లమాట నమ్మకు అని రెచ్చగొడుతోంది నాగలక్ష్మి.
పెద్దచీమ పక పక నవ్వింది.
ఓయీ అమాయకుడా! నీ ప్రక్కనున్న దానిమాటే నమ్మకు. అది యెవ రనుకున్నావు? నీ భార్య అనా! పొరబాటు. ఆమె అసలు పేరు ఋణసుందరి. నూరేళ్ళ క్రితం నువ్వు ఋణదత్తుడి జన్మలో ఉన్నప్పుడు ఈవిడకి బాకీ పడ్డావు. దాని తాలూకు బకాయి, ఈ జన్మలో వసూలు చేసుకుంటోంది. నిన్న నీ కోరలు పీకించింది యెందుకనుకున్నావు? అంది పెద్దచీమ.
సుబ్బన్న తెల్లబోయి నోరు వెళ్లబెట్టాడు.
చెట్టుమీద కాకమ్మ ముందుకు వంగి తొంగిచూసి, ఇందాక చెప్పింది నిజమే, సుబ్బన్నకి కోరలు పీకేశారు పాపం. అందుకే ఇందాక లేడి భయపడలేదు అంది.
మొగుడు మాటాడలేదు.
ఆడదానిమాట వినడంగూడా ప్రమాదమేనని అతనికీ భయం పట్టుకుంది. సరిగ్గా మూడురోజుల క్రితం సుబ్బన్న మంచి పొగరెత్తిన కోడెతాచు. ఇవాళ ఉతి బోసితాచు. ఆరోజు అతనూ నాగలక్ష్మి చెట్టు కింద దోబుస లాడుకుంటూండగా ఓ పాములవాడు వచ్చాడు. నాగలక్ష్మి వాణ్ణి చూడగానే గతుక్కుమంది. ఒక నిముషం తరువాత, మొగుడిని పిలిచి, వాడికి దొరికిపొమ్మంది. వాడు పాపం బీదవాడుట. సుబ్బన్న పట్టుబడితే తీసికెళ్ళి అమ్ముకొని నాలుగు డబ్బులు తెచ్చుకుంటాడట. వాడు అమ్మెయ్యగానే సుబ్బన్న, తనను కొన్నవాణ్ణి కరిచేసి పారిపోయి రావచ్చు. వెనక తనుకూడా వచ్చి అక్కడివాళ్ళని కరిచి మొగుణ్ణి విడిపిస్తుంది. ఏ కళనున్నాడో సుబ్బన్న ఒప్పుకున్నాడు. పాములవాడికి మటుకు ఈ పథకం, నాగలక్ష్మి సదుద్దేశం పూర్తిగా బోధపడలేదు. అందుకని సుబ్బన్న దొరకగానే ముందరే కోరలు పీకేసి మరీ తీసుకెళ్లాడు. తరువాత నాగలక్ష్మి పొరపాటుకి నాలికలు కరుచుకుని, వాడి కూడాపోయి పట్నంలో సుబ్బన్నని వాడెవరికో అమ్మగానే వాళ్లని కరిచేసి అతన్ని విడిపించుకు చక్కా తీసుకొచ్చింది. అయితేమటుకు? సుబ్బన్న కోరలో?
అవి వుంటే యీ చీమలు ఇన్ని నీతులు మాటాడగలిగేవా?
సుబ్బన్నకూడా ఆ మాటే అనుకుంటున్నాడు దిగాలు పడిపోయి. చీమ వోదార్చింది. ఫరవాలేదు ఋణదత్తుడా, విచారించకు. నీకూ నీ కోరలకీ ఋణం తీరిపోయింది. ఈ ఋణానుబంధాలు లోకంమీద అంతటా ఉన్నవే. నీ కింత చేటు తెచ్చింది చాలక యింకా తేవాలని చూస్తున్న నీ భార్య నాగలక్ష్మి అను ఋణసుందరికి నువ్వెలా బాకీ పడ్డావో ఆ కథా కమామీషూ గుర్తు చెయ్యనా? అంది.
సుబ్బన్న నాగలక్ష్మివేపు చూశాడు కథ విందామా అని. ఆమె ఏమీ అనలేదు.
చీమ నవ్వింది. వింటుందిలే భయపడకు. లేదా ఏనాడో వో గంటసేపు నాకు బలవంతాన నీ ఆత్మకథ ఏకరువుపెట్టి ఆ గంటా ఋణపడ్డాననుకో అంది.
సుబ్బన్న సరే కానీ అన్నాడు.
మరయితే నువ్వలా పడగ ఎత్తి కూర్చుంటే యెలా, బెణుకుతుంది. స్థిమితంగా కూర్చో, ఓ ఋణదత్తుడా! ఈ కథను సావధానంగా వినవలసింది అంటూ కథ ఆరంభించింది చీమ.

★ ★ ★

# ఋణదత్తుని కథ



మీ ఆలుమగ లిద్దరికీ ఋణానుబంధం యేర్పడ్డది నూరేళ్ళక్రితం. అప్పట్లో నీ పేరు ఋణదత్తుడు. మీ తండ్రి  ఋణబుద్ధిగారు, ఋణసిద్ధి అనే దుష్టుడికి డబ్బు బాకీపడి తీర్చలేక ఆ లోగానే జన్మ ఫిరాయించవలసి రావడంవల్ల  వ్యవధిలేక నిన్ను ఋణసిద్ధికి అప్పగించాడు.

నువ్వప్పుడు ఇరవై యేళ్ళ చిన్నవాడివి. మంచిబలంగా ఏపుగా ఉండేవాడివి. ఋణసిద్ధిగారి అప్పుతీరే పర్యంతం నువ్వు  ఆర్జించినదంతా ఆయనకు ఇచ్చుకుంటూ వచ్చేటట్టు ఏర్పాటు. ఆనాటి నుండి నీకు ఋణదత్తుడు అని పేరు వచ్చింది. కానీ నువ్వు అసాధ్యుడివి. అప్పులనేవి ఉండగా కష్టపడి సంపాదించడమేమిటని నవ్వుకున్నావు. పైగా  అప్పుతీర్చడానికి అప్పుడబ్బే ముఖ్యమని నీ నమ్మిక. అందువల్ల కుడి యెడమైనా చిత్తం వచ్చినట్టు రెండు  చేతులా అప్పు చేశావు. రద్దీనిబట్టి దగ్గరున్న వాళ్ల చేతులు అప్పు పుచ్చుకుని వాటితోకూడా అప్పు చేశావు.

అప్పు ఇవ్వగలవాడిని యేరుకోవడంలో, యేరుకున్న వాడిని యెరవేసి పట్టుకోవడంలో, పట్టుకున్న వాడిని  ఆకట్టుకోవడంలో, ఆనక వాడిచేత అప్పు (అసలాపాటికె వాడివ్వబోయే అప్పు నీ దృష్టిలో వాడివ్వవలసిన బాకీగా  తయారయిపోయి ఉంటుంది) కక్కించడంలో, అది మళ్ళీ ఇవ్వకుండా చెల్లు పెట్టించడంలో నీకు నువ్వే సాటి అనిపించుకున్నావు. నిన్ను చూపించి విశ్వామిత్రుడిని నక్షత్రకుడూ, అతడిని ఇతడూ హేళన చేసుకునేవారు. బీద  ఉపాధ్యాయులకూ, గుమాస్తాలకూ, వారి వారి ఇల్లాళ్ళు నిన్ను ఆదర్శంగా చూపించే వారు. ఋణదత్తుడు అప్పు  అడగడంలో చూపే ప్రతిభలో సగమేనా మీరు కప్పాలూ, పన్నులూ, బాకీలు వసూలు చేయడంలో చూపితే ఖజానా ఇంత  బావురుమని ఉండేది కాదు అంటూ మహా మంత్రులు, ఇతర రాజోద్యోగులూ ఆయా వసూళ్ల ఉద్యోగులను  చీవాట్లేసేవారు.

ఈవిధంగా నీ పేరు ముమ్మరంగా మోగిపోతున్న రోజుల్లో యీ అమ్మాయి ఋణసుందరి నిన్ను గురించి వింది. ఆమె తండ్రి ఋణకేతుడు కొన్నాళ్లు ఉద్యోగంచేసి, ఇదేమిటని మానేసి అప్పుచేసి బాగా డబ్బుగడించాడు. ఆయనకు ఋణసుందరికాక అఋణ, కఋణ అని మరిద్దరు పుత్రికలు. తన ఆస్తిని నిర్వాకంచేసి నిలబెట్టే ఋణదీపకుడు లేనందువలన, ఉన్న ముగ్గురు కూతుళ్ళలో ఋణసుందరి అనే చిన్నదాన్ని అధికారిణిగా ఎన్నిక చేసుకొని, డబ్బుని ఎలా కాపాడుకోవాలో, దొంగల నుండి, అప్పులడిగేవారి బారినుండి యెలా తప్పించుకోవాలో, తప్పించుకొన్నట్లు నటించాలో ఆమెకు బాగా నూరిపోశాడు.

ఒకరోజున నువ్వు నీ మిత్రులతో కలిసి కులాసాగా అప్పుల గురించీ, ఇచ్చి పుచ్చుకోడాలలో వాడుపుల గురించీ కబుర్లు చెబుతున్నావు. అంతా శ్రద్ధగా వింటున్నారు.

'...అసలడిగేవాడి తేజంలో కొంత వుంటుంది. ఏదీ మాటవరసకి చెబుతా, మీరో వరహా ఇలా ఇవ్వండి చెబుతా... మీరోటి ఇవ్వండి. శ్రేష్టిగారూ, తమరు ఒక హస్తం దయచేయండి. కొత్వాలుగారి అల్లుడా! నువ్వో జోడు మంజూరు చేయించు అంటూనే హడావుడిగా వాళ్ళేంచేస్తున్నారో, వాళ్లకే తెలిసేలోగా రెండు పుంజీల వరహాలు పుచ్చుకు రొంటిన దోపుకుని కల్ల బొల్లి కబుర్లు మరి నాలుగు చెప్పి 'మీ వరహాలు మళ్ళీ నాల్రోజుల్లో పంపిస్తా'నంటూ చక్కాపోయావు.

నిన్నాహకంట కనిబెడుతున్న ఋణసుందరి చెలికత్తె ఋణతిలక అనేది హారా అని ముక్కున వేలేసుకొని నిన్ను పిలిచి, ఓ చిన్నవాడా మా ఋణసుందరి దగ్గిర అప్పు సంపాయించగలవూ? అన్నది.

అదెంతపని అనుకొని ఆ మాటే అని, మర్నాడే నువు ముస్తాబై జలతారు కండువా వేసుకొని హాయిలుగా ఋణకేతుడింటికి ఆయన ఇంట లేనివేళ వెళ్ళి అయ్యా! ఋణకేతుడుగా రున్నారా! అన్నావు.

ఋణసుందరి సావిట్లో ఉయ్యాల ఊగుతోంది, లేరని నిజంగా మీకు తెలీదా అంది వెటకారంగా.

అమ్మా, అయినింటి పడుచు అనతగ్గ మాటలు కావివి. అయినా అడిగావు కాబట్టి చెబుతున్నా, వారు లేరని ఖరారు చేసుకుందికి అడిగాను అన్నావు నువ్వు వినయంగా.

ఎవరు మీరు, ఏం కావాలి? అంది ఋణసుందరి నిర్లక్ష్యంగా

నా పేరు ...ఋణదత్తుడు అన్నావు గంభీరంగా నిలచి కండువా సవరించుకుంటూ.

ఊయలలో చిన్నది తెల్లబోయింది. తానిన్నాళ్ళూ యెదురుచూస్తున్న ఘనుడు యెదుట నిలచాడన్న తలపు రాగానే ఆమె చెంపలలో కెంపులు వెలిగాయి.

మీకేమైనా అప్పు కావాలండీ? అని తెగించి అడిగేటంత ప్రేమ, గౌరవం పెల్లుబికాయి ఆమెలో. సుశిక్షితురాలు కాబట్టి అంతలోనే ఆ ఊహని నిభాయించుకుని కూర్చోండి అంది పీఠం చూపిస్తూ.

నువ్వుకూడా ఆ ముహూర్తాన అమితంగా కలవరపడి పోతున్నావు. ఇంత అందమైన చిన్నదాని గురించి ఎంత ఘోరమైన వదంతులూ అని. ఇంత చక్కనిదాని

దగ్గర క్రూరంగా అప్పు తీసుకోవడమేనా అన్న భావం కూడా కలిగి చలించిపోయావు. కానీ సుశిక్షితుడివి కాబట్టి ఆ ఊహని నిభాయించుకున్నావు."

కథ వింటున్న సుబ్బన్న, నాగలక్ష్మి ఈ మధుర ఘట్టాన్ని తలచుకొని ఒకరినొకరు ఓరకంట చూసుకున్నారు.

"అదిగో ఆ చూపులే మీ ఇద్దరినీ ఒకే క్షణంలో మోసగించాయి. ఆమె చూపులు నీ చూపులు కలవగానే నీ గుండె ఝల్లుమని, ఒళ్ళు జలదరించి–సుందరీ అడగను నిన్ను ఋణం అడగను–అనేశావు నువ్వు.

సరిగా ఆ ముహూర్తానికే చిరంజీవి సౌభాగ్యవతి ఋణసుందరికి కూడా అలాంటి తలపే కలిగి, అడగండి! మీ ఇష్టం వచ్చినంత ఋణం అడగండే, ఇస్తాను అనేసింది.

ఆ లోగానే నువ్వు నాలిక్కొరచుకుని (అపుడు ఒకటేలే) పదివేలు చాలు అనేశావు.

ఆ పిల్ల అలాగే మనసు మార్చుకునేదేకాని, మాట జారిందాయె. చేసేదిలేక ఇచ్చేసింది. ఈ జన్మకి మీ ఋణం తీర్చుకోలేను అంటూ నువ్వు సగర్వంగా వెళ్ళిపోయావు.

ఆ రోజున ఆమెని అప్పచెల్లెళ్ళు ఈ అప్పు గురించి ఒకమాట అన్నారా...ఒక హేళన చేశారా...సాయంత్రానికి ఋణకేతుడు ఇంటికి వస్తూనే, జరిగిన ఓఘాయిత్యం విని నిలువునా కుప్పకూలి పోయాడు. కూడదీసుకొని లేచాక, కూతుర్ని పునరుక్తిదోషం పట్టినా సరేనని కొద్దిపాటి ఘాటుమాటలతోనే మళ్ళీ మళ్ళీ తిట్టిపోశాడు.

సుందరి చిన్నబుచ్చుకుంది. మళ్ళీ ఆమె కోలుకోలేదు. అంతేకాదు, ఎవరొచ్చి అడిగినా అడక్కపోయినా పనిమల్లె పిలిచి అప్పులిచ్చేసేది డబ్బు. అది చూసి తండ్రి ఋణశాస్త్రజ్ఞులను పిలిచి చూపించాడు. ఇచ్చిన పెద్ద అప్పు మళ్ళీ రాబట్టించడమే మందన్నారు వాళ్ళు.

పుచ్చుకున్నవాడు ఋణదత్తుడు, మరోడూ మరోదూకాడు. ఎలాగ? అని నిరాశపడ్డాడు తండ్రి.

చాలా ఆలోచించి చివరికి ఋణసుందరిని నీకిచ్చి పెళ్ళిచేసేశారు, బతికున్నాళ్ళూ, కూడా వుంటావు కాబట్టి వసూలు చేసుకో అని. కానీ ఆ జన్మలో అప్పులు తీర్చే ఉద్దేశమూ లేదు, శక్తీలేదు నీకు. నీదగ్గర ఉన్నదంతా అప్పు డబ్బే. ఆమెకు పనికిరాదు. నువ్వు సంపాయించగా చూసి వసూలు చేదామని కాచుకొని కాపరం చేసింది. అంతలోకే ఆ జన్మ అయిపోయింది.

పక్కజన్మలో నువ్వు వడ్డీ వ్యాపారస్తుడివి. ఒకళ్ళకి అప్పులివ్వడమే తప్ప తీసుకోడం నీకు పని కాదాయె. మీ యింట నౌకరుగా పుట్టిన సుందరి ఆ జన్మంతా చూసి చూసి విసుగు చెందేవరకూ నువ్వు ఇల్లు మారి గుర్రం అయ్యావు. ఈ పిల్ల మళ్ళీ అడగుర్రమై పుట్టి నీతో జతగట్టి అప్పు వసూలు చేయబోయింది. ఒక వాయిదా కట్టావో లేదో నువ్వు తొడుక్కున్న గుర్రానికి గడ్డిపరకలు చెల్లాయి.

పొరుగు జన్మలోనో ఆ పక్కదాంట్లోనో యీవిడ నీ కొడుకై పుట్టి నానా క్షోభా పెట్టి చాలావరకూ అప్పు వసూలు చేసింది. తరవాత వోసారి నువ్వు గండభేరుండమై పుట్టావు. ఈవిడ నీ కడుపున పుట్టింది. నీక్కోపం వచ్చి తిట్టబోయావు. పిల్లకు

కొంచెం భాష తెలిసేదాకా ఆగి తిడదామనుకుంటున్నావు. అంతలోనే కాలాతీతం అయిపోయి ఇల్లు మారిపోయావు. ఈ సారి వో మంచివాడి కడుపునపడి కొంచెం పెరుగుతూనే అప్పు తీర్చిపారెయ్యాలనుకున్నావు. ఇంకా చాలా పథకాలు వేసుకున్నావు– ఆ జన్మలో తొడుక్కున్న శరీరానికీ, దానికి పెట్టిన పేరుకీ పేరూ గట్రా తెద్దామని. ఓ రోజున దానికి దెబ్బ తగిలింది. తరవాత దాని మూలానే శాల్తీ పాడైపోయింది. అనుకున్న పనులు ఆగిపోతాయని, దానికి యెన్నో మరమ్మతులు చేయించావు. మాసికలు వేయించావు. ఆ జన్మలోనే యీవిడకి చాలావరకు అప్పు తీర్చేశావు. ఇంకో పది వరహాలుండనగా యీవిడ గల్లంతై పోయింది. ఇప్పుడు యీ జన్మకి మీరు నాగుపాములై పుట్టాక ఇదిగో ఆ మిగతా డబ్బుకోసం నీ పెళ్ళమై నానా అవస్థలూ పెడుతోంది.

మొన్న నిన్ను పట్టుకున్న పాములాడికి యీవిడ ఆ మధ్య వో జన్మలో పదివరహాలు బాకీ. నువ్వెలాగా యీవిడకో పదివ్వాలిగదా, అది నీద్వారా ఇప్పించేస్తే ఇటు తనకి నీ బాకీ, అటు వాడికి తన బాకీ కూడా వొక్కసారే చెల్లిపోతాయని, యెవరిదారిన వాళ్ళుపోయి కొత్తవారి దగ్గర అప్పులు చేసుకోవచ్చనీ ఊహపడి నిన్ను వాడికి దొరికిపొమ్మంది. వాడు నిన్ను అమ్మి నాలుగు కాసులు చేసుకుపోవచ్చుగాని, తెలీక కోరలు పీకేశాడు పాపం. ఇపుడు..."

కళ్ళు మూసుకొని కథ అంతా వింటూ మనసు సమాధాన పరచుకొంటున్న సుబ్బన్నకి అంతలోనే, ఐ.పి. పెడుతున్న వాడికి ఆ క్రితం రోజే ఆస్తిమీద అరవై వేలు అప్పిచ్చినవాణ్ణి చూసి తోటివాళ్ళు నవ్వుతున్న రకం అలికిడి వినబడి కళ్ళు తెరచి చూశాడు.

దాదాపు రెండులక్షల చీమలు పొట్ట చెక్కలయేలా నవ్వుతున్నాయి. కొన్ని కిందపడి దొర్లుతున్నాయి. కొన్ని ఇందాకటినుంచీ కథ చెబుతున్న పెద్ద చీమకి జోహార్లు చేస్తున్నాయి.

అద్భుతం మావయ్యా! ఇంత గొప్పవాడి వనుకోలేదు. ఈ జన్మలూ గిన్మలూ ఇవన్నీ యెలా అల్లావయ్యా. ఈ కథ ఎలా కల్పించావయ్యా అంటున్నాయి కొన్ని చీమలు.

పెద్ద చీమ వినమ్రత నటించి యేదో గమ్మత్తు...యేం చెప్పకపోతే ఈ పాములు యీ వరకు పుట్టని ధ్వంసం చేసేవి గదా అంటోంది.

చీమలన్నీ పగలబడి నవ్వుతున్నాయి.

అయితే స్వామీ! ఈ జన్మల గొలుసుకథ ఎక్కడిది. లేనిపోని యీ కోతలూ, అబద్ధాలూ చెప్పడం యెక్కడ నేర్చారూ... క్రితం జన్మలో మనిషిగా పుట్టారా ఏమిటి పుట్టతీసి అందో ఆడచీమ.

అబద్ధానికి మనిషే కావాలనేముంది?... మీ ఆడంగులు చాలరూ అన్నాడామె మొగుడు ఎత్తిపొడుపుగా.

పెద్దచీమ తుళ్ళి తుళ్ళి నవ్వుకుంటోంది, జన్మట, పాత జన్మట, సి,సి అంటూ.

సుబ్బన్నకీ, నాగలక్ష్మికీ కూడా జరిగినకథ క్షణంలో తెలిసిపోయింది.

ఒక్కసారిగా నాగలక్ష్మి తోకమీద లేచి బుస్సుమంది. పుట్టమీద చీమలు కకావికలై పోయాయి. నాగలక్ష్మి పుట్టమీదకి విరుచుకుని పడబోయింది. అంతలోకి సుబ్బన్న చుట్టూ చూసి గతుక్కుమని నాగలక్ష్మిని ఆగమన్నాడు. నాగలక్ష్మి ఆగింది. ఆగి చుట్టూ చూసింది.

పదిలక్షల చీమలు, ఎప్పుడొచ్చాయో చడీచప్పుడూ లేకుండా చీమల్లా వచ్చేసి పాముల్ని చుట్టుముట్టడించి నిలబడి ఉన్నాయి గంభీరంగా, ఎటుచూసినా కనుచూపుమేరలో నేల కనబడటంలేదు.

రేఖవిటిది, రేఖవిటీ ఓఘాయిత్యం. మిమ్మల్నందరినీ బూడిద చేసేస్తాను అన్నాడు సుబ్బన్న.

బలవంతమైన సర్పము చలిచీమల చేతజిక్కి అందో చీమ తెలివిగా. సాటి చీమలన్నీ పగలబడి నవ్వాయి.

ఏడిశారు బోడి తెలివీ మీరూను—అసలు మీరు చలిచీమలు కారుగా అంది నాగలక్ష్మి వెటకారంగా.

చూస్తారా ఏవిటి తడాఖా. పద్యం రైటో కాదో ఇపుడే తేల్చేదాం అంది చిన్న చీమ దూకుడుగా.

పెద్దచీమ దాన్ని మందలించి సుబ్బన్నని అనునయించింది.

అయ్యా సుబ్బన్నగారూ సారస్వత గోష్ఠి మన సమస్యను పరిష్కరించదు. జరగాల్సింది చూద్దాం...ఇప్పుడు జరిగిందేదో జరిగింది. దిగిన వాళ్ళం ఎలాగా దిగిపోయాం. ఇపుడు కదిలిపోవడం కష్టం. పోతే మిమ్మల్ని ఓడించడం సులభం. ఇప్పటికే కొంత స్నేహితులమైనందువల్లా, కందపద్యాలలో ప్రాసాదికాలవంటి ఛందో బాంధవ్యాలవల్లా, రెండూ మనకు తగవు. అందువలన సంధి చేసుకుందాం. ఈ పుట్టని మీరు మాకు అప్పుగా ఇవ్వండి. మేము స్థిమితపడ్డాక మీకో పుట్ట కట్టిపెడతాం.

అన్నన్నా! ఎంతమాటన్నావు! ఇంకేమైనా అడుగు. ప్రాణం అడుగు. అంతే తప్ప....ఓ పక్కనుంచి స్నేహం, బాంధవ్యం అంటూ అప్పు అడుగుతావేమిటయ్యా? అన్నాడు సుబ్బన్న.

పెద్దచీమ తెల్లబోయింది.

సుబ్బన్న మందహాసం చేశాడు. ఔను, అప్పు అడగడం అంత అకార్యం ఇవ్వడమే. ఇన్నాళ్ళూ మనం బోలెడంత ప్రేమాగీమా లేకపోయినా...పగ లేకుండా బ్రతుకుతున్నాం. అప్పు అనగానే అది వచ్చి పడుతుంది...నువ్వెరగవు కాబోలు గాని నేను కనీవినీ చాలా అనుభవం గడించాను. అదీ ఎవరిదగ్గరనుకున్నావు? మనకన్నా తెలివైన వాళ్ళు, నీతిపరులు అని చెప్పుకునే మనుషుల దగ్గర. నేను అక్కడే పుట్టి పెరిగానులే.

* * *

# గుర్నాధం కథ



ఊరి శివారులో మునసబుగారింటిదగ్గర పుంతలో మా అమ్మ నన్ను కంది. తరువాత యే డేగో తన్నుకుపోతుందని వారింటి పెరట్లో గడ్డిమేటు చాటున గోడలో కూర్చో పెట్టింది. ఆ పెరట్లో ఆడవాళ్ళ బుణగుణధ్వని వినలేకా, వీధి వెంపు ఉంటే కాస్తంత కొత్త మొహాలు కనబడి కాలక్షేపం అవుతుందనీ మెల్లిగా వాకిలివేపు వెళ్లి వీధరుగుల మీద గాదెచాటున బసచేశాను. మునసబుగారు పెద్దవాడై కొడుక్కి పని ఒప్పగించేశాడు. గాదెకి కొంచెం అసింటా పడక్కుర్చీ వేసుకొని పులిలా కూర్చుని కృష్ణా రామా అనుకుంటూ, వాళ్లనూ వీళ్లనూ చివాట్లేస్తూ, పిల్లలకి సలహాలు చెబుతూ, గడించిన ఆస్తిని నిలబెట్టుకునే ఉపాయాలు చేస్తూ వుండేవాడు. ఆయన ఉండడం మానేస్తే బాగుండునని ఆయనకు అప్పుపడ్డవాళ్లు అనుకుంటూ ఉండేవారు. కానీ ఈయన మొండి. వసూళ్ళు పూర్తికాందే పోరాదని తీర్మానించుకున్నాడు. ఆయన కులదీపకుడు గుర్నాధం ఒకనాడు హడావుడిగా యెక్కణ్ణించో ఇంటికొచ్చి 'నాన్నా ఓ అయిదొందలివ్వే నాన్నా అర్జెంటుగా' అన్నాడర్జెంటుగా.

ఏవిటోయ్ ఆ అర్జెంటూ, ఏమిటా దూకుడూ, యెందుకంత డబ్బు? అన్నాడు మునసబుగారు.

ఓ ఫ్రెండుకి అప్పివ్వాలిలే. పాపం. మళ్లీ రేపిచ్చేస్తానన్నాడు. అన్నాడు గుర్నాధం.

అట్టెఅట్టె గుఱ్ఱాన్ని కట్టెయ్. ఔనుగానీ, నువ్వూ వాడూ పోట్లాడుకున్నారా? అన్నాడు తండ్రి.

మునసబుగారు విట్టీగా మాటాడతారని ఆయన పెళ్లాంబిడ్డలూ, వూళ్లో జనాభా, అప్పులడగ వచ్చేవాళ్లూ అంతా చెప్పుకుంటూనే ఉంటారు. ఆయన మొహంమీదే నిర్మొహమాటంగా అనేస్తారుకూడా.

తండ్రి చమత్కారానికి కొడుకు నవ్వాడు.

బలేవాడివే నాన్నా. పోట్లాడుకుంటే అప్పు కావాలని వాడెలా అడుగుతాడు, నేనెందుకిస్తానూ అన్నాడు.

ఇంకెందుకుటా, అందుకే పోట్లాడుకోబట్టే వాడికి నీమీద కోపం వచ్చి అప్పడిగేశాడు. నీకు వాడిమీద తిక్కరేగి ఇస్తానంటున్నావు... అప్పంటూ యిచ్చాక ఇహ కజ్జాలు రావడం ఎంతసేపుటా అన్నాడు మునసబుగారు.

పోవేనాన్నా! నువ్వంతా విడ్డూరంగా మాటాడతావు. తొందరగా తాళపుజేతులివ్వు. అతను శివాలయంకాడ కూచున్నాడు. బాగుండదు కష్టపెట్టుకుంటాడు అన్నాడు గుర్నాధం.

కొడుకుమాట పట్టించుకోకుండా. ఓ చుట్ట తీసి వెలిగించేరు మునసబుగారు. అబ్బీ శివాలయం వీధిలో శేషయ్య గార్నెరుగుదువుగదా అన్నాడు.

ఆ! ఎరక్కేం, వెధవ. మహా దుర్మార్గుడు, రాక్షసుడు.

★ ★ ★




ఓయ్ ఓయ్ ఆగు. అందుకే అడిగాను. రాక్షసుడనడానికి కారణం ఏమిటి? బాలనాగమ్మని యెత్తుకుపోయాడా? ఏకచక్రపురం మీదపడి మనుషుల్ని మింగేశాడా? ఏవిటంటావు?–నువ్వేమీ అనొద్దులే, విను, శేషయ్యగారు చేసిన తప్పూ–రాక్షసప్పనీ మరేంకాదు. నరశింహాలు అనే ఓ మిత్రుడు కష్టంలో వుంటే తల తాకట్టుపెట్టి పదొందల రూపాయలు అప్పిచ్చి ఆదుకోడం. అంతేనయ్యా! గిర్రున తిరిగేసరికి ఆ బ్రాహ్మడికి వెర్రెత్తించారనుకో. ఇచ్చినరోజున పుచ్చుకున్న నరశింహాలు ఇతగాడ్ని ఇంతవాడనీ అంతవాడనీ తెగ పొగిడేశాడు. స్నేహం అనే మాటమీద యెక్కడేనా వాదాలువస్తే శేషయ్య అనే అర్థం రంగున సరిపోతుందని దండోరా వేశాడు. తీరా అప్పుతీర్చే వాయిదా వచ్చి వెళ్లేవరకు, ఆ ఉత్సాహం అప్పుచేసిన డబ్బులా హడావిడిగా ఖర్చయిపోయింది. పూర్వం మల్లె నరశింహాలికి, ఋణదాత శేషయ్య మొహంలో కరుణ తొణికిసలాడడం కనబడడం మానేసింది. అతని మాటలో పూర్వం పేట్రేగిపోతూ వచ్చిన అణకువ దరిమిలా అణగారిపోయినట్లు అనుమానం వచ్చింది. శేషయ్యగారి ఆత్మవిశ్వాసం కల్తీలేని పొగరు అని ఇన్నాళ్ళూ పోల్చుకోలేక పోయినందుకు అతనూ అతని కొత్త మిత్రులు కూడా పనులు మానుకుమరీ ఆశ్చర్యపడసాగారు.

శేషయ్యని కొందరు మిత్రులు కదలేశారు–ఆ నరశింహాలు నా స్నేహితుడు. అతనే ఇచ్చేస్తాడు. చాలా మంచివాడు అన్నాడుట శేషయ్య.

హారి వెధవ! వీడికి అడ్డమైనవాడూ అప్పులివ్వా! ఎంతపేళన! ఇదంతా వెం.గెం. శ్లేష్మం కాబోలు. బోడివె...వీడికే వీడి బతుక్కి చమత్కారం ఒహటే అనుకున్నారు నరశింహాలూ వాళ్ళూనూ. శేషయ్యకి వ్యంగ్యంలో ప్రజ్ఞ ఉందని నిర్ణయించిన మర్నాటినుంచీ నరశింహాలు కోపం తెచ్చుకున్నాడు.

నేను చచ్చినా వీడికి ఆ బాకీ తీర్చను. చూదాం వాడికెంత ఓపికో, వాడి అంతు కనుక్కునే ఓపిక నాకూ వుంది అన్నాడు నరశింహులు. అతని వాక్చాతుర్యానికి పొంగిపోయి శేషయ్య శత్రువోడు ఉన్నపళంగా పదిరూపాయలు అప్పిచ్చేశాడు. అక్షర లక్షలు అప్పిద్దును పెట్టుబడి పెట్టే వాడుంటే అన్నాడాయన ఉదారంగా. అప్పుడు నరశింహులు కృతజ్ఞతతో ఉక్కిరి బిక్కిరైపోయి, పదిరూపాయల్లోనూ మూడు రూపాయలు అప్పటికప్పుడే అప్పుతీర్చి పారేశాడు.

శేషయ్య మర్యాదగా నడుచుకొని ఉంటే వాడికి మాత్రం యిలా పారెయ్యక పోయాడా అన్నాడు ఓ నిమిషం తరువాత మిగతా యేడులోనూ వో మూడు అప్పడగబోతున్న అప్పయ్య. తక్షణం శేషయ్య మర్యాదస్తుడు కాడు అని యావన్మందీ తీర్మానించుకొని, మర్నాడు సెలవులు పెట్టి అద్దె సైకిళ్లమీద ఆ వైనం నలుగురికీ బట్వాడా చేయబోయారు.

ఇలా అప్పులిచ్చి చాలా క్రూరంగా వసూలు చేసిన అందరి దుష్టుల కథలన్నీ పైకితీసి దులిపి వెల్లవేసి, రంగులు వేసి పంచిపెట్టారు. వర్ధమాన నాటక రచయిత ఒకడు 'శేషయ్యలూ పెరుమాళ్ళూ' అనే ఉజ్జ్వల సాంఘిక నాటకం రాసేసి, అందులో అప్పులిచ్చే వాళ్లని యేకేసి అవతల పారేశాడు. ఋణబాధితులంతా శక్తివంచన లేకుండా గబగబా అప్పులు దండెత్తుకొచ్చి నాటక ప్రదర్శనకు యేర్పాట్లు చేసుకున్నారు.

అంతలో శేషయ్యకు నిజంగా డబ్బు అవసరం వచ్చింది. వియ్యంకుడు శేషయ్య కూతుర్ని యింటికి పంపేసి, 'తిరుగు టపాలో కట్నం బకాయి జమకాని పక్షంలో తమ కుమార్డు చి॥ వెంకట్రామయ్య పునర్వివాహ శుభలేఖ మరుగుటపాలో అందగలదనిన్నీ, గాన తెలియపర్చడమైనదనిన్నీ' జాబు వ్రాశాడు. అటు నరశింహులు తల కాయడం కోసం, శేషయ్య తన తలతాకట్టు పెట్టగా డబ్బిచ్చినవారు కూడా డబ్బుగానీ సదరు శేషయ్య తల గానీ రాబోయే ఫలానా తదియనాటికి జమ చేయకబోతే కోర్టల్ల వెంటతిప్పి పరువు ఖర్చు పెట్టించవలసి వస్తుందని అభిప్రాయపడడం మొదలు పెట్టారు.

నాయనా, ఏం చెప్పమంటావు. శేషయ్య ఒహరాత్రిపూట గుట్టుగా వెళ్ళి నరశింహులుకి సంగతంతా చెప్పుకున్నాడు. నా పరువు నిలిపి నీ పరువు నిలబెట్టుకో అన్నాడు.

డబ్బేదిబావా, ఉంటే యిన్నాళ్లా. నాకసలు అప్పులంటే అసహ్యం. ఒహడికి యిచ్చేవాణ్ణేదప్ప దేహీ అన్నవాణ్ణిగాను. ఇన్నాళ్ళకి ఖర్మగాలి నీ దగ్గిర అఘోరించాను బుద్ధి గడ్డి తిని. చాలు నువ్వు చేసిన మేలు. పంట కొంపకిరానీ ఇచ్చేస్తా. ఆ శెట్టికో వందో రెండొందలో యివ్వాలి. వాడిది కూడా మొహాన కొట్టేస్తాను. పీడా విరగడవుతుంది అన్నాడు నరశింహులు వినయంగా.

బావా, నేను అప్పివ్వబట్టికదా యింత రభస. ఇటు పిల్ల కాపురం నాశనం అయేలాగుండె. లేకపోతే రెండేళ్ళు ఆగినవాణ్ణి ఆర్నెల్లు ఆగనా. నువ్వైనా బాగుపడ్డావుకదా. వడ్డీకి తిప్పుతున్నావుట, పోనీ అలా సర్దినాసరే అన్నాడు శేషయ్య దురాశకొద్దీ.

నరశింహులికి అప్పు తీసుకున్న వాడికొచ్చేటంత కోపమూ వచ్చేసింది. అతని కేకలు విని దొంగలు పడ్డారనుకుని జనం పోగయ్యారు.

నరశింహులు బావురుమని ఏడిచేశాడు.

అయ్యా చూడండి ఇదీవరస. నా దగ్గిర దేని తాలూకో రొక్కం ఉందనీ, ఇస్తావా ఛస్తావా అనీ రోజూ యిలా అర్ధరాత్రి వేళవచ్చి ప్రాణం కొరుక్కు తినేస్తున్నాడు. లోకంమీద అప్పులిచ్చినవాళ్లూ వున్నారు. పుచ్చుకున్నవాళ్లూ ఉన్నారు అన్నాడు.

—మరీ యింత చేటా, యెంతచేటైనాగాని అంది నరశింహులు ధర్మపత్ని.

నలుగురూ శేషయ్యనే ఆడిపోసుకున్నారు. అతను తలొంచుకు వెళ్లిపోయాడు. మర్నాడు పట్నం వెళ్లి కోర్టులో ఓ ముక్క తగిలించి, వియ్యంకుడింటికెళ్లి మరొక్కవాయిదా అడిగి తిరిగి చక్కా వచ్చేవరకూ ఊరు గగ్గోలుగా ఉంది.

నరశింహులింట దొంగలుపడి ఊడ్చుకుపోయారట.

ఏమనుకుని ఏంలాభం. వాళ్లకి రుణపడి ఉంటావు, వచ్చి అప్పుతీర్చుకు చక్కాపోయారు అన్నారు కొందరు.

శేషయ్యే చేయించాడన్నారు కొందరు. గిట్టనివాళ్ల మాటలులెస్తూ అన్నారు కొద్దిమంది. కనీసం యిలా నరశింహులింట నాలుగువేల నగదున్న వైనం చెబుతూ, యే దొంగలముఠాకో శేషయ్య ఓ కార్డుముక్క రాసిపారేసి ఉంటాడన్నారు నరశింహులు ఆత్మీయులు. చివరికి అంతా మళ్ళీ శేషయ్యనే ఆడిపోసుకున్నారు. వాడి వెధవచేత్తో భోరున యేడుస్తూ డబ్బిచ్చాడు. బెడిసికొట్టి కొంపక్కొంపా నాశనమయింది అనుకున్నారు. అమ్మా, లక్కాను.

—నాటికీ నేటికీ అతనిమీద ఆ అపర్దిష్టమ్ముచ్చట అలాగే ఉండిపోయింది. అంచేత బాబూ అప్పులిచ్చేటప్పుడు జాగర్తగా ఆలోచించి మరీ యివ్వాలి. నువ్వు యే చెడ్డపని చేసినా చెడ్డపేరు పెట్టడానికి గడువుదొరుకుతుంది గాని, అప్పిస్తేమటుకు అరక్షణంలో చెడ్డవాడివి అయిపోతావు. దరిమిలా డబ్బు చెడ్డవాడివి, చివరకి స్నేహం, బంధుత్వం చెడ్డవాడివికూడా అయిపోతావు. ఆ పైన నీ యిష్టం. తాళం చేతులు యివిగో. కావాలంటే పైకం పట్టిగెళ్ళు. ఇదంతా నీదే, నాదేముంది అన్నాడు మునసబుగారు.

కులదీపకుడు వంచిన తల యెత్తలేదు. ఎగిరి గంతేసి తాళంచేతులు అందుకోలేదు. ఓ నిమిషం అలాగే కూర్చుని లేచి సరే నాన్నా ఆలోచిద్దాం....... రేపు చూదాం అని చెబుతా నా స్నేహితుడితో అన్నాడు.

కాన, ఓ చీమలసింహాద్రీ! విన్నావా, అదీ కథ అని సుబ్బన్న ఆ కథ ఆపాడు.

చివరికి యేమైంది? ఆ పిల్లడు మర్నాడు వెళ్లి స్నేహితుడికి అప్పిచ్చాడా? అందో చీమ ఉండబట్టలేక.

చెబుదునుగాని పేజీలు పెరుగుతాయి. పబ్లిషరేమంటాడో అన్నాడు సుబ్బన్న.

అప్పు చేస్తాడు లెద్దూ అంది నాగలక్ష్మి.

అదిగో ఆ మాటేగదా వద్దన్నది అన్నాడు సుబ్బన్న యికిలిస్తూ.

ఇకిలింపు బావుందనుకుంటున్నావుగాని కోరలు లేవని గుర్తుతెచ్చుకో. బోసినోరూ నువ్వూను అంది నాగలక్ష్మి కోపంగా.

సుబ్బన్న కథను కొనసాగించాడు.

మర్నాడు సంజెవేళ మునసబుగారి వంశోద్ధారకుడు గుర్నాధం మళ్ళా తండ్రి దగ్గరకు వెళ్లి నాన్నా యిచ్చేద్దామే డబ్బూ అన్నాడు. మునసబుగారు ఆ మసక

చీకట్లోనే సాధ్యమైనంత తెల్లబోయి, ఆ వైనం కొడుకు పసిగట్టి వుండడని అనుమానించి వాడిల్లు బంగారంగానూ– అవసరం తీరాకా అప్పుదొరకా–వాడింకా అప్పుకావాలంటున్నాడురా నీ జతగాడూ అని ప్రకాశంగా ఆశ్చర్యపడ్డాడు.

మర్నిన్నివ్వలేదుగదే అన్నాడు అబ్బాయి.

నిన్ననిస్తే యివాళే మళ్లీ సర్దేస్తానన్నా డన్నావుగదా! ఆ ముక్కే రైటైతే యివాళ యింకా నిన్నడగాల్సిన పనేమిటీ అన్నాడు మనసబుగారు. పిల్లడు నివ్వెరబోయాడు. తన యుక్తికీ సూక్ష్మబుద్ధికీ ముసలాయనకు నవ్వు పెల్లుబికి రాబోయి దగ్గుగా తర్జుమా అయిపోయింది.

ఔనే నాన్నా నిజమేమరి అతను యివాళే యిస్తానన్నాడుగదా నిన్నడిగినప్పుడూ. గమ్మత్తుగానే ఉందే అని తికమకపడ్డాడు గుర్నాధం.

★ ★ ★

# తాతబ్బాయి కథ



వెఱ్ఱినాగన్నా, ఈ తరం సజ్జు ఉట్టి కుఱ్ఱనాగమ్మలు. అప్పు అడగడంకూడా చేతగాదు. ఎందుకు పనికొస్తారంట. మా కాలంలో ఇలాగేనా మరి. మన తాతబ్బాయి ఉన్నాడంటే ఎంత గట్టివాడూ.....వాడు అప్పుల్జేస్తే ఇలాగే చేశాడా, ఇంత అవకతవకగానే అడిగాడా మరి. నీకు తెల్సా వాడి పెళ్లి సంగతి. [తెలీదన్న భావానికి అభినయంగా అరుగుమీద కూలబడి స్తంభానికి జేరబడ్డాడు గుర్నాధం] నాన్నమ్మ కూతురు వరాలమ్మకు మనువెలా అయిందని. అదంతా ఓ కధగాదూ మరి. తాతబ్బాయీ, రావకిష్టుడూ ఇద్దరూ తోడబుట్టినవాళ్లేనాయె. ఏణ్నర్ధం అటూ ఇటూ గాళ్లేనాయె. పిల్లదాన్ని ఎవడికిచ్చి ఎవడిక్కాదనేట్టుటా. ఓనాడు మధ్యాన్నవేళ కుఱ్ఱాళ్ళిద్దరూ జెమాజెట్టీల్లా, రావలక్ష్మణుల్లా పోటాన పోటీలు పడుతూ వాకిట్లో చలవ పందిరేస్తూ వుండగా నానమ్మకేం వూహాబోయిందో మరి– ఒరే తాతిగా ఒరే రావకిష్టుడూ అదలా ఒగ్గేసి మీరిలా రండఱ్ఱా అంది. అప్పగారంటే ఇద్దరికీ హడలే. పని ఉన్నపళంగా వదిలేసి చేతులు గట్టుకు నిలబడ్డారు. అరుగుపక్కన నానమ్మ పిల్లదానికి మొగల్జడేస్తోంది. ఏవిరా రావకిష్టుడూ వరాల్నిచ్చి పెళ్ళిజేస్తాగాని కూడెట్ట గలవట్రా అంది. రావకిష్టుడు గర్వంగా చిన్నాడికేసి చూసి వరాల్ని ఓరకంట చూసి చెస్ పెళ్లాని క్కూడెట్టలేని వాడుంటాడెస్. అంతగా యేం లేకపోతే అడుక్కు దెచ్చున్నా పెట్టనా అన్నాడు.

ఓరి నీయింట కోడిగాల్సా, ఏం కూత కూశావురా. కొంపకీ కులానికీ కూడా అపర్దిష్ట మాటంటివిగదరా. మాలక్ష్మినిచ్చి మనువుజేస్తే అడుక్కుతెచ్చి వణ్నం పెడతా నంటావుట్రా అంది నానమ్మ నవ్వి.

మరి తాతబ్బాయీ నీమాటేవిటిరా, నువ్వూ పట్నంలో అడుక్కుదెస్తానంటావా అంది ఇంకోక్షణం ఆగి.

చెచేస్. అడుక్కోడవేంగతి అప్పా. సంపాయిత్తా. అందాకా అవసరమైతే ఎవడి తలో తాకట్టేసి అప్పాదెచ్చి బువ్వపెడతా. అపాటి మొగాణ్ణికానా.

ఎవడూ ఇవ్వకపోతే నువ్వు ఇస్తావు అప్పా అన్నాడు తాతబ్బాయి ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

నీ కడుపు చల్లగుండ. ఎంతమాటన్నావురా కడుపులో ఎంతోటి ఊహలున్నాయి అని ముక్కున వేలేసుకుని అలాగే విస్తుబోయింది నానమ్మ.

అమ్మా జెడయ్యవేవ్. మెడ నెప్పెడతాది అని మాలక్ష్మి వరాలు గావుకేకేసేవరకూ తల్లి తేరుకోనేలే.

సరే ఇద్దరిలోనూ తాతబ్బాయి ఇంత ప్రెవేజకుడుగదా – అని, ఇంటేల్లపాదీ పెద్దవాడు రావకిష్టుడు వేపే మొగ్గినా, నానమ్మ పట్టుబట్టి పిల్లని వీడికే కట్టబెట్టింది. మరి తరువాత వాడెంత ప్రవేజకుడైనాడనీ. అప్పాలైయ్యడం కూడా ఏమంత గొప్పపని కాదనుకో. అయితేనేం అందులో తలకాయలు మార్చడం, మాట సుళువూ, మనిషి సుళువూ తెలీడం ఉన్నాయి. తాతబ్బాయి ఇల్లుగట్టాడు, గుర్రబ్బండికొన్నాడు. పెదనాయుడనిపించుకున్నాడు. వాడు అప్పచేశాడంటే చేసినట్టే ఉండేదికాదు. ఇచ్చినాడిక్కూడా తెలిసేది గాదన్నమాట. ఒక్క నాకాడే వాడి ఆట సాగిరాలేదు. నేనీ విషయంలో కాలాంతకుణ్ణిలే.... ఎవరదీ ఆ వచ్చేది? నాన్నా చీకటడిందీ, కోడలు పిల్లను దీపందెచ్చి పెట్టమనూ వాకిటా. ఎవరది నర్సయ్యా! రా రా రావయ్యా అలా కూర్చో అన్నారు మునసబుగారు కథ ఆపి.

★ ★ ★




గుర్నాధం లోపలికెళ్ళి దీపం వెలిగించి వచ్చేవరకూ మాటలు వినిపిస్తున్నాయి సావిట్లోకి. నరసయ్య మహా ఉత్సాహంగా, హడావుడిగా మాట్లాడుతున్నాడు.

నాయుడుగారూ మీదాకా వచ్చిందీ! ఘంట కితం కరణంగారింట దస్తుదస్తంతా క్రిష్ణార్పణం అయిపోను..... ఎవడో నల్లటాడు కోరమీసాలూ జులపాలూ వాడూ జీబూతంలా ఉన్నాడు....కాకపోయినా అంత ఇదయితే ఎలాగండీ. ఎంత కరణవేనా ఇంట్లో అలా వేలకి వేలు దస్తు అట్టెపెట్టుకుంటే ఎలా? ఎప్పటిదప్పుడు పైకి పంపించెయ్యాలిగాని ( ఎంతయ్యా పోయిందీ అంటున్నారు మునసబుగారు) ఆ ఇదంతా పరపతి కోసంలే. పదీ పరకా సర్ది మునసబంత వాడనిపించుకోవాలని తాపత్రయం. అది సరే గాని మాటవరస కడుగుతా మీరు ఇన్నాళ్లు మునసబుగిరీ చేశారు. మంచాయె చెడ్డాయె రొఖ్ఖం అలా ఇంటో ఎక్కడపడితే అక్కడ పడేశారండీ.... అహ తెలీకడుగుతున్నా..... ఎంతన్నారు రొండొందలా...... చూశారామరి, అపాటి మగసిరి లేకనే మీరు కొర్ది రొఖ్ఖం అట్టెపెట్టుకోడం? అపాటి పెగ్గె మీకు లేకపోయిందా అంట. ఏవిటో ఎవడిమటుకు వాడు ప్రవేజకున్నానుకుంటాడు వాడితోటే ఆ విద్య పుట్టిందని – ఇదిగో మా వెధవా ఉన్నాడు పెవేజకత్తానికి. తెల్లారి మెయిలుబండికి చెన్నపట్నం వెళ్లితీరాలి చచ్చితీరాలి అని పట్టుబట్టి కూర్చున్నాడు. వెధవాయి. నాకేమో రేపు పున్నమెల్లిన తదియనాటిగ్గాని ఆ కోపరేటివువాళ్లు లోను తగలెయ్యనంటున్నారు – ఆ వందా మీరిటు సర్దితే అది రాగానే ఫిరాయించేదాం. ఏదో ఆ పాటి పదిరూపాయలు చేతబట్టుక్కూచోగల మొగాడేడండీ వూళ్లో. ఎవడిమటుకు వాడికి భయమేనాయె – ఏ నర్సయ్య వచ్చి అప్పిదెమ్మంటాడో – ఏ నర్సయ్యవచ్చి కన్నంవేస్తాడోనని – జవాబు చెప్పే సత్తా లేకనేగదా పెతివాడూ రొక్కం దగ్గర పెట్టుకోంది. మన

కాలం ఇలాంటి జజ్జితనం ఉండేదండీ– వంద చాలు. పున్నమెళ్ళిన తదియనాడు చంద్రోదయం వేళకల్లా మళ్ళా సర్దెయ్యనూ – పెద్దమనిషితో మాటా మరోటా – అబ్బాయా ఏమిటి –

అబ్బాయి గుర్నాధం దీపం పట్టుకువచ్చాడు.

మునసబుగారు మీసాలను లాలించి, 'గుర్నాధం సందుగు పెట్లో ఓ వంద దెచ్చి నర్సయ్యకివ్వూ. పద్దు పుస్తకం గూడా పట్రా' అన్నాడు గంభీరంగా.

నర్సయ్య గాలిదుమారంలా వచ్చి వెళ్లిపోయాడు.

ఆ ఇందాక చెబుతున్న దేమిట్రా..... అన్నారు మునసబుగారు.

అప్పలడిగే వాళ్లదగ్గిర నువ్వెంత గట్టివాడవో చెబుతున్నావు అన్నాడు గుర్నాధం సావిడివంకచూసి నవ్వుతూ. అటించికూడా సన్నటి నవ్వు వినబడింది.

ఎవరక్కడా–కోడలా. నీక్కూడా నవ్వొచ్చేనే తల్లీ.... చూదాం రేపొద్దున్న నీ మొగుడెంత పెవేజీకత్వం చూపిస్తాడో. నాదేముంది, అంతా అయిపోయె. మాకు మాకూ మొహమాటాలుంటాయి. అదీకాక ఈ నర్సయ్యగాడు మహాటక్కరిలే. వస్తూనే ముందు నాదగ్గిర చేకాపుకి రొఖ్ఖం రెండొందలుంటుందని చెప్పించు కున్నడయ్యె, ఆనక కాదనకుండా..... పరువా మరోటా నువ్వే చెప్పుతల్లీ అన్నాడు మునసబుగారు అంతకు మునుపే పారిపోయిన కోడలు నిల్చున్న చోటువేపు చూస్తూ.

గుర్నాధం సిగ్గుపడ్డాడు నవ్వినందుకు.

ఎలాగేనా నర్సయ్య మంచిముండావాడు, మర్యాదస్తుడు అన్నాడు మునసబుగారు ఓ నిముషం నిశ్శబ్దం మీద బింకంగా.

అవున్నాన్నా ఊళ్లో ఆయనకు వీధివీధినా అప్పులే. మర్యాదస్తుడు కాబట్టి అందరప్పులిచ్చుంటారు. మనకే ఆరు బస్తాలగింజ, దీంతో కలిపి నాలుగొందల రొక్కం ఇవ్వాలి. పద్దు బుక్కులో చూశాను.

పోన్లెస్తూ. అసలు వాడి మాటతీరుకి, ఆ ఒడుపుకీ ఊరికేనే ఇవ్వచ్చు వందాను. దీన్ని జూసైనా ఓ పాఠం నేర్చుకో. వందతో తెమిలిన అప్పుకాస్తా, వెయ్యిదాకా వెళ్లలేదని సంతోషపడి దేవుడి కో దణ్ణం బెట్టుకో.

అన్నట్టూ దేవుడంటే గుర్తొచ్చె– శివాలయంకాడ మా స్నేహితుడు పాపం కూర్చునుంటాడు నాకోసం– ఏం చెప్పనూ? అన్నాడు గుర్నాధం లేచి నిలబడి.

మునసబుగారు ఓ నిముషం ఆలోచించి, పోనీ పైకం పట్టెగెళ్తావా నీ అంతవాడివి నువ్వూను అన్నారు.

కాదులే నాన్నా, రేపటికి వాయిదా వేద్దాం అన్నాడు గుర్నాధం.

ఆఫీసు వీధి తూముపొద కాబూలీవాలాలా సిద్ధమైంది ఒకటో తారీఖు సాయంకాలం, గుర్నాధం ప్రాణానికి. బిక్కమొహం పెట్టి తండ్రి ఎదురుగా కూర్చున్నాడు.

★ ★ ★

# ఋణగ్రహృదయము



ఉదయం ఏడింటికల్లా శివాలయం దగ్గర విరహగీతాలూ అ–ఋణగీతాలూ పాడుతూ కూచుంటానని, అతన్ని అప్పడిగిన స్నేహితుడు క్రితంరాత్రి బెదిరించాడు. దానికితోడు గుర్నాథం అతనితో మాట్లాడుతూ ఉండగా, ఒక మొహమాటస్థుడికి పాతిక రూపాయలు సర్దాల్సివచ్చేవరకూ ఆ స్నేహితుడే ఇతనికి అమాంతం ఆ పాతికా ఇచ్చాడు. పెద్దమనిషిని పంపేశాక, గుర్నాథం తీరుబాటుగా ఆశ్చర్యపడి లేచి, బ్రదర్ నీ దగ్గర డబ్బుండగా నన్నెందుకు అప్పడుగుతున్నావూ అని అడిగాడు. స్నేహితుడు ఋణతరుణహాసం చేసి, ఆ దీన్దేవుందిలే, నీకోసం రెండు సాయంకాలాలు ఇక్కడ పడిగాపులు పడివుండగా ఉబుసుపోక దారేపోయే వాళ్లని పలకరిస్తూ ఉంటే దానంతటదే జమ పడిందిలే అన్నాడు. ఏ విద్య అయినా– ముఖ్యంగా ఋణగ్రహణ విద్య, సాధనచేస్తూ ఉంటేనేతప్ప పనిచెయ్యదని ఉపదేశించాడు. అయినా మన సొమ్మేంపోయె. తెలిసినవాడు మన వాతపడితే ఓమాటు కులాసా? అని చూసేది. ఔనంటే అయిదో పదో అర్థో పావలో అడిగి జేబులో వేసుకునేది. కాదంటే అదేపాయె. ఇంకోసారి దొరుకుతాడు. కాకపోయినా అప్పేగదా. మళ్లీ ఎప్పుడో అప్పుడు వాడి డబ్బు వాడి మొహాన యెలాగా విస్సిరి కొట్టేదేనాయె. ఇంతకీ తీరిక వేళలో అలా రెండూ మూడూ అయిదూ పదీ వడేసి పుచ్చుకోమట్టేగదా ఈ క్షణాన గుర్నాథం పరువు శివాలయం దగ్గర నిలబడింది. ఆపాటి గుర్నాథం దగ్గర లేకనా, ఒక్కడుగు ఇంటికెళ్తే కొల్లలు ఇనప్పెట్లో. అయితేనేం ఆ ఒక్కడుగూ వేసేలోగానే పరువులు పోవచ్చు. కొంపలు కూలిపోవచ్చు, కులగిరులు తలకిందులై పోవచ్చు. ముష్టి పాతిక రూపాయలకోసం పరువులూ, కొంపలూ, కులగిరులూ పోయి, కూలిపోయి, తలకిందులైపోవడం సబబేనా. వాటివల్ల రైళ్ల రాకపోకలు దెబ్బతింటాయి. దానివల్ల మెడ్రాసులో, వైజాగులో, భానుమతులూ, సీతలూ, కాలేజీలకూ, హైస్కూళ్ళకీ వెళ్లివచ్చేవేళ గుర్నాధాలు సందుమొగల్లో, బస్టాండు దగ్గరా బీటుకాయడం వీలుపడదు. దానివల్ల సరోజకళ్లలోకి లోతుగాచూసి బోల్డు ఫీలవుతూ

సిగరెట్లు కాల్చుకోడానికి (దానికీ అప్పు దొరకదు గదా) వీలుండదు. అలాగే అప్పొడు అప్పొలిచ్చే వాళ్లివ్వలేరు, పుచ్చుకునేవాళ్లు పుచ్చుకోలేరు. చివరికి ఈ విధంగా దేశంలో ఆర్థిక వ్యవస్థ అంతా స్తంభించిపోతుంది. ఇదంతా దేనివల్లటా! గుర్నాధం ఒక మొహమాటస్థుడికి పాతిక సర్దడం కోసమని. ఒక్కడుగు– ఒక్కటంటే ఒక్కటే అడుగుస్మీ– ఆ ఒక్కడుగూ వెయ్యవలసి రాలేకపోవడంవల్ల. ఆ అడుగువేసి ఇంట్లో ఇనప్పెట్లోంచి డబ్బు తెచ్చేదాకా అప్పారావు కనక ఆ పాతికా గుర్నాధానికిస్తే– తన జేబులో వున్న పాతికా ఒక్క నిముషం సేపు గుర్నాధం అజమాయిషీ కింద అతని ఇలాకాలో ఉంచితే? – ఏమీలేదు– లోకం అంతా ప్రశాంతంగా ఉంటుంది. కోకిలలు కూస్తాయి, పువ్వులు పూస్తాయి. అప్పులడిగే వాళ్లు అడుగుతారు, ఇచ్చేవాళ్లిస్తారు. ఇవ్వని వాళ్లూ ఇస్తారు– సరిగ్గా అడిగితే. పరువులు యెక్కడికీపోవు. ఉన్నచోట తిష్టవేసుక్కూచుని, సత్యాగ్రహం చేసేవాళ్లలా ఛస్తే కదలం అంటాయి. కొంపలు కూలనే కూలవు, సరికదా కాలరెత్తుకు మరీ నిలబడతాయి, పొగరుగా. కులగిరులూ అంతే, అప్పారావుకి వెయ్యి రూ.లు అప్పిస్తానన్న గుర్నాధం ప్రతిజ్ఞలా చలనం లేకుండా అలా నిలబడతాయి. ఇదంతా దేనివల్ల? అప్పారావు జేబులో పాతిక రూపాయల్నీ పిలకట్టుకు ఇవతలికి లాగి,– ఇదుగో మిమ్మల్నే– వీరు గుర్నాధంగారు. ఒక ఐదు నిముషాలసేపు వీరి చేతులోకెళ్లి వారు చెప్పినట్లు చెయ్యండి. ఎక్కడికి పొమ్మంటే అక్కడికి పొండి. తరవాత ఆయనే మళ్లీ పంపించేస్తాడు. నా దగ్గరకే వద్దురుగాని. బెంగెట్టుకోకండి. మరేం ఫర్వాలేదు, ధైర్యమే జయము, సత్యమే జయించును. ధర్మరాజు శాంతమూర్తి, నకులుడు, సహదేవుడు, అర్జునుడు, హో భీష్ముడు పొండి. అంటూ వాటికి నీతిచెప్పి గుర్నాధానికి ఒప్పగించటం వల్ల ఇంత లోకకళ్యాణమూ ఫెళ్లుమంటూ జరుగుతుంది. కాదనడానికి మధ్యన అప్పారావు ఎవడు? బోడి అప్పారావు. అంచేత అప్పారావు సాహసించి, త్యాగంచేసి నిస్వార్థంగా ఆ డబ్బుని గుర్నాధానికిచ్చాడన్న మాట. ఏవిటిచ్చాడు? అప్పు. అప్పనగానేమి? మనచేతిలో పాతిక రూపాయల్ని కాసేపు గుర్నాధాన్ని పట్టుకోనివ్వడం! అంతే. రేపు గుర్నాధం పెట్లో వెయ్యిరూపాయల్ని వాళ్ల నాన్నతో చెప్పే– కాసేపు–మహ ఐతే ఓ రెణ్నెల్లు– డబ్బు చేతికందితే ఒకపూట చాలు– అప్పారావుని పట్టుకోనివ్వడం. అంతే, అప్పనగా ఇది. అప్పారావనగా నెవరు? దేశ సేవచేసి ఇందాకటి పరువూ, కొంపా, కులగిరులూ వగైరాలను కాపాడే మహదవకాశమ్ మారువేషంలో అప్పారావై వచ్చి గుర్నాధం యెదుట నిలబడింది. కదా!

హిందూ థింకర్స్ అన్నదదే. హిందూ ఫిలాసఫీ, హోల్ హిందూ థాట్, ఒక హిందూథాటే ఏమిటి హోల్ వరల్డు థాట్ అంతా కూడా గొంతు చించుకుని అన్ని భాషల్లోను ఘోష పెడుతున్నది ఇదే. ఒబ్బీ అప్పారావు! నిన్ను గనక అప్పడిగితే వాణ్ణే ఉద్ధరించడం అనుకోకు. అప్పిచ్చే ఛాన్సును, అవకాశాన్ని, అదృష్టాన్ని ఇంతమంది సామాన్య జనులలోనూ నీకే ఇవ్వాలని, నిన్నే ఎన్నికచేసి ఎడ్రసు కనుక్కుని వెతుక్కుని వచ్చినవాడు మహనీయుడేనని తెలుసుకో. వాడిని చూసి ఆనందపడి పొంగిపో. స్వామీ, తమకు అప్పు ఇచ్చే మహదవకాశాన్ని నాకు ప్రసాదిస్తున్నారు. నేను బహుయోగ్యుణ్ణే అనీ, నేను అప్పిచ్చి మళ్లీ యెన్నాళ్లకీ

అడగననీ లోకం కోడై కూస్తోంది. కాన కటాక్షించి నాకు కొంచెం పెద్దకోటా ఇచ్చి అప్పు ఎక్కువ తీసుకోవలసిందని వేడుకుంటున్నాను అని ప్రాధేయపడి మరీ ఇవ్వాలి. అయితే గుర్నాధం అలా అన్నప్పటికీ అప్పారావు పుచ్చుకుంటాడా? కోడు. గుర్నాధం మీద ఎంత ప్రేమ, అభిమానం ఉన్నా అప్పారావుకు పక్షపాతం లేదు. నీ కోటా వెయ్యి రూ.లు. దాటనివ్వను. ఇంకోసారి చూదాం అని కరక్టుగా వెయ్యి రూ.లే. (చిల్లర ఖర్చుకి ఐదు రూపాయలు కాక) పుచ్చుకొని పొమ్మంటాడు. మళ్లా ఎప్పుడిస్తాడు? ఏమో గుర్నాధం ఇట్నించి నోట్లు లెక్కపెట్టి వంద, రెండొందలూ, మూడూ, నాలుగూ అంటూ ఉండగానే, మరోపక్కనించి అప్పారావు ఆ అప్పును తీర్చి పారేస్తూ ఉండవచ్చు. లేదా రావలసిన డబ్బు సకాలంలో రాకపోతే వారం పదిరోజులో, నెలారెణ్నెల్లో పట్టచ్చు. తరవాత ఆ డబ్బు తిరిగిచ్చి నాయనా దీన్ని యింకోడికి అప్పిచ్చి సద్వినియోగం చెయ్యాలని దీవించవచ్చు. అందువల్ల గుర్నాధం ఈ అపూర్వావకాశాన్ని చేజారవిడుచుకోక తప్పకుండా వాళ్ల నాన్ననడిగి వెయ్యీ సర్దేస్తే రక్షించినవాడవుతాడు. అప్పారావు గుర్నాధం మేలు జన్మజన్మలకీ జ్ఞాపకం చేసుకుంటాడు; ఋణం ఈ జన్మకి తీర్చలేడు. చర్మం చెప్పులు కుట్టించడానికి అభ్యంతరం లేదు కాని బాగుండదు. జోళ్లు పల్చగా వస్తాయి. అంతకన్న గవర్నమెంటువాళ్ళు చేయిస్తున్న జోళ్లు చాలా మంచివి. మన్నును. చౌక కూడాను.

పోతే అప్పు సంగతి. గుర్నాధం కనక రేపు తెల్లారి యేడున్నరకి, రొక్కం జతపరచకపోతే, అప్పారావు శివాలయం గుమ్మం దగ్గర్నుంచి సరాసరి పొరుగులోకం, ఏ కైలాసమో పోయి అక్కడ, అప్పు వెతుక్కోవలసి వస్తుంది. లేదా కోవెల అసింటా కూర్చున్న స్వామీ ఋణానందతో కలిసి ఋషీకేశం లేచిపోవలసి వస్తుంది. సన్యాసంకూడా ఆత్మహత్యే నన్నారు పెద్దలు మరి. కాబట్టి గుర్నాధం ఈ ముక్క మనసులో ఉంచుకుని మరీ వాళ్ల నాన్నని ఒప్పించడం మంచిది అని ఋణధీరుడు అప్పారావు క్రితంరోజు రాత్రి శివాలయం దగ్గర గుర్నాధానికి ఋణహృదయం విశదం చేశాడు.

ఆ ముక్కే మనసులో ఉంచుకొని వో మూల తనకీ అనుమానం పీకుతున్నా తండ్రి ఎదటపడి నసుగుతూ నిలబడ్డాడు గుర్నాధం మర్నాడు ఉదయం" అని సుబ్బన్న కథ ఆపి కడుపారా గాలి ఫోంచేసి ఋస్సున తేన్చాడు.

ఇంతకీ యెవరీ అప్పారావు. ఆ పిల్లాడు వీడికి అప్పిచ్చేశాడా? అన్నాడు చీమల సింహాద్రి కుతూహలంతో.

"సరిగ్గా ఈ ప్రశ్నే మునసబుగారు అడిగారు.

అబ్బాయ్, యెవరోయ్ ఈ అప్పారావు? నీ కెలాటి స్నేహం యితనితో. ఇంత డబ్బు నమ్మి యివ్వవచ్చునా? నా యెదుట పడి అడగడేం అన్నారు.

అప్పారావు నాకు మెడ్రాసులో స్నేహం అయాడు నాన్నా అన్నాడు గుర్నాధం.

ఎంత స్నేహం అయితేమటుకు యిలా స్వగ్రామాల దాకా తరివి తరివి అప్పులడుగుతారుటోయ్–ఇదెక్కడి స్నేహం అన్నాడు మునసబుగారు ఆలోచించి.

గుర్నాధం మందహాసం చేశాడు.

★ ★ ★

# వచ్చినవాడు అప్పారావు



హుఁ నాన్నా నీకేం తెలుసునే అప్పారావు సంగతీ అంది ఆ నవ్వు. అప్పారావు ఒక మనిషితో పది నిముషాలసేపు మాటాడి కూడా దమ్మిడీ అప్పు అడక్కుండా వెళ్లిపోయి యెదటివాణ్ణి చితక్కొట్టేసిన సందర్భాలున్నట్టు చరిత్రలో దాఖలాలున్నాయి. పదినిముషాలూ మాటాడి కేవలం ఒక్క దమ్మిడీయే అప్పుచ్చుకు అవతలివాణ్ణి చితగ్గొట్టేసిన రోజులూ ఉన్నాయి. అతను యెప్పుడు యెవర్ని యెంత అడుగుతాడో, యెవరి దగ్గిర యెంత ఎలా పుచ్చుకు చక్కాపోతాడో అతనికే తెలియాలి. అతనికీ తెలియదేమో గూడా. ఆ ఋణలీల మనకి అర్థంగాదు. మనదేముంది? మనమంతా నిమిత్తమాత్రులం. కేవలం అప్పిచ్చే క్వాలిఫికేషన్ ఉంటే చాలు. ఒక్కొక్కసారీ అదీ లేకపోయినాసరే, ఆ సదుపాయం కూడా అతడే చేసి పెడతాడు నాన్నా! నీకు తెలుసో తెలీదో గాని ఇండియా గవర్నమెంటువాళ్లు, ఇంకా చిన్న సర్కార్లవాళ్లు, రిజర్వు బ్యాంకీల వాళ్లు దేశంమీదా విదేశాలమీదా అప్పులు నొల్లుకోవాలంటే, బ్యాంకీలవాళ్లు డిబెంచర్లు ఫ్లోట్ చెయ్యాలంటే, ఓంప్రథమంగా యితన్ని ముందు సలహా అడిగి గాని మరొకపని చెయ్యరట. ఫోర్డు, రాక్ ఫెల్లరు, జేబిటేలరు, సి.డి. దేశ్‌ముఖ్ వీళ్ళంతా కూడా ఇతనికి ఉత్తరాలు రాస్తారుట. రెండో కంటికి తెలియకుండా ఇతని రూముకివచ్చి సలహా చెప్పమని అడిగి విని పోతారుట.

అప్పారావు కొత్తరూపాయి నోటులా ఫెళ ఫెళ లాడుతూ ఉంటాడు. కాలదోషం పట్టిన దస్తావేజులాంటి మాసినగుడ్డలూ, బడిపంతులుగారి చేబదుళ్లలా చిందర వందరగా ఉండే జుట్టూ, అప్పు తెచ్చిన విచ్చు రూపాయిలా మెరిసే పత్తికాయలాంటి కళ్ళూ, అప్పులివ్వగల వాళ్లందరినీ చేపల్లా ఆకర్షించగల యెరలాటి చురుకైన చూపులూ! అతను, బాకీల వాళ్లకి కోపిష్టివాడి జవాబులా పొట్టిగా టూకీగా వుంటాడు. మొత్తం

మీద అతని మొహం ముప్పావలా అర్థణాలా వుంటుందనీ, అతనికీ ఎప్పుడూ అంతే అప్పు ఇచ్చే మిత్రుడు అభివర్ణించాడు.

అప్పారావుకి అప్పులు చేయడం ఉగ్గుపాలతో పెట్టిన విద్య. అతని పుటకల్లోనే, వాళ్లనాన్న ఉగ్గు పొరిగింట అప్పుతెచ్చి పట్టించాడుట. ఏడేళ్లొచ్చేసరికి వాళ్ళనాన్న బళ్లోవేస్తూ పలకలూ, యెక్కాలబుక్కులూ పంచిబెట్టబోయేసరికి ఎవరోవచ్చి యెందుకయ్యా ఇంత ఖర్చు అన్నాడుట.

నేను గబగబా బడి చదివేసి పెద్దపోలీసు వాణ్ణయిపోయాకానేమో బోల్డు రూపాయలు అప్పు సంపాయించి అప్పు తీర్చేస్తానుగా అన్నాడు అప్పారావు.

పువ్వు పుట్టగానే పరిమళించింది అని సరసమాడారు అప్పారావు జనకుడు అప్పలస్వామి మిత్రులంతా.

అయితే అందాకా ఈ నా బాకీ తీరదా ఏమిటి అన్నాడు అనాటికి అప్పలస్వామికి అప్పుసర్దినాయన బిక్కమొహంపెట్టి.

అయితే ఇంతకీ వాడు నా యెదుట పడడేం– చెప్పు, అలా ముసిముసి నవ్వులు నవ్వుకుంటే ఎలా అన్నారు మునసబుగారు. యింతసేపూ ఆయన స్టేజిమీద జనాంతికం డైలాగు చెబుతున్న వాడి పక్క నటుడిలా ఏం చెయ్యడానికి పాలుపోక చుట్టకాలుస్తూ కూర్చున్నాడు.

గుర్నాధం చిరునవ్వు నవ్వాడు. నాన్నా అప్పారావే గనక ఎదుటపడి అడగడం జరిగితే మనిద్దరం ఇలా మూన్నాళ్లు యిద్దామా వద్దా అని ఆలోచించడానికి తెరిపే ఉండేదికాదు. అతను సుడిగాలిలా వచ్చిపడి అడుగుతాడు. అతను వెళ్లిపోయినాకగాని, నువ్వతనికి ఇందాక అప్పిచ్చాననీ, యింత మొత్తం ఇచ్చాననీ నీకు తెలీనే తెలీదు. అంచేత అతను రానందుకు ఆనందించు నాన్నా అంది గుర్నాధం చిర్నవ్వు.

ఎక్కడో అసాధ్యుడల్లే ఉన్నాడే. ఇలాంటివాళ్లు నీకెలా తటస్థపడ్డారోయ్ అంది మునసబుగారి పొగ కర్తీ నిట్టూర్పు.

★ ★ ★




ఇవన్నీ తండ్రికి కొడుకు చెప్పేవికావు. చెబితే ఐదారు మాటలకోమాటు భానుమతి మాట రాకతప్పదు. అసలు గుర్నాధం ఫోర్తు బియ్యే చదువుతున్నప్పుడు మాటిమాటికీ ఈమాటే వచ్చేది.

అప్పట్లో అప్పారావు అడుకోకపోతే గుర్నాధం చెడ చదివేసి పాసైపోయి ఊరుకునేవాడు. కాలేజీలు తెరచిన కొత్తలో అప్పుడే సెకండియర్ స్టూడెంట్లంతా ఫస్టియర్‌లో ప్రేమలేఖలన్నిటికీ తరువాయిలు రాస్తూ, సశేషాలు సాగదీస్తూ, ద్విగుణీకృత ఉత్సాహాలతో జరిగిన కథలను కొనసాగదీస్తున్నారు. సీతలూ, సరోజలూ కనబడగానే లాస్టియర్ మీకు కాలేజీనుంచి బస్టాండుదాకా సాయం వచ్చిన వాడిని అంటూ పరిచయాలను తిరిగి గుర్తుకు తెస్తున్నారు. ఒక సాయంకాలం వేళ అందరూ ఆ ధ్యాసలో ఉండగా ఎక్కణ్ణించో అప్పారావు బయల్దేరి వీరాభిమన్యుడిలా ముందుకు పోతున్నాడు. ఒక్కొక్కణ్ణే పలకరించి ఒక హాలో (రెండు రూపాయలు) హాలోహాలో (నాలుగు) హాలో కులాసా (ఆరు) అంటూ లెక్క ప్రకారమే లెక్కనందుకుంటూ ఒక వరస పూర్తి చేసి చివర కొచ్చే వరకూ అప్పారావుకి అప్పిచ్చిన మహాదుష్టుడొకడు క్రూరంగా కర్కశంగా కఠినంగా ఆపళంగా అతన్ని నిల్చున్నపళంగా వంటినున్న డబ్బంతా వొలిచేసుకొని పొమ్మన్నాడు.

అప్పారావు నిరుత్సాహపడ్డాడా? లోకంమీద అందరిలా అతన్ని తిట్టుకున్నాడా? శపించాడా? ఆఖరికి అతనిమీద నిల్చున్నపళంగా "క్రూర అప్పులవాడు" అనే ఒక లావుపాటి సాంఘిక నాటకంగాని, చచ్చు సంభావన ఓ తెలుగు సినిమా (పెరుమాళ్లు మార్కు)డైలాగుగాని రాసి పారేశాడా? లేదు. వాటన్నిటికీ టైములేదు. అర్జెంటుగా

అట్నించటే లవర్స్‌డెన్ లాడ్జిలోకి పోయి పడ్డాడు. అక్కడ జనాభా అంతా కాలేజికి సెలవు పెట్టి మరీ ఫీలవుతూ నేపథ్యప్పాటలు పాడుకుంటున్నారు.

హలో కులాసా? అన్నాడు అప్పారావు ఉత్సాహంగా కళ్లు చికిలించి.

ఎవరూ కులాసాగా లేరు. ఇది పనికాదనుకొని, అక్కడున్న అక్కడ లేనివాడి సిల్కు చొక్కా (చొక్కా ఉండి, అందులో శాల్తీలేదని గ్రహించ ప్రార్థన)లో ఎక్కిపోయి వీధినపడి ఒక గొప్పవాడి దగ్గర అప్పడగబోయాడు హడావుడిగా. దారిలో ఇంకో బాకీలవాడు కనబడేసరికి తప్పించుకునేందుకు మార్గాంతరం తోచక 'మార్గాంతరాన్ని' బట్టి పరుగెత్తాడు. కొంతదూరం పోయేసరికి జేబులు తడుముకొని అరె నా దగ్గర డబ్బుంది అప్పెందుకుటా అనుకుని ఆశ్చర్యపడి లేచి ధారాళంగా దానధర్మాలు యజ్ఞయాగాలూ చేసేసి ఖర్చు పెట్టేస్తుండగా అక్కడ లవర్స్ డెన్‌లో గుర్నాథం స్నానంచేసివచ్చి లాగు బనీను తొడుక్కుని 'నా చొక్కా ఏదిరోయ్ వాట్ మై షర్టు వ్వేర్' అని గావుకేక పెట్టాడు. రూమ్‌మేట్స్ అంతా ప్రేమసీమలోంచి ఒక్కసారి జారిపడ్డారు గదిలోకి. ఎవరో నల్లటి పొట్టివాడు హడావుడిగా వచ్చి తొడుక్కుపోయినట్టు లీలగా గుర్తు అని ప్రేయసిని ఏమంత గాఢంగా ప్రేమించలేని వాడొకడన్నాడు. అంతలోకే ఇంకో మిత్రుడు అద్దె సైకిలుమీద హడావుడిగా వచ్చి గుర్నాథం, ఎవడో నీచొక్కా మోకాళ్ళదాకా తొడిగేసుకుని మరీ అందులోని డబ్బంతా తగలబెట్టేస్తున్నా....డు రోయ్ అని, ఓ నిమిషం మూర్ఛపోయి తిరిగి స్పృహ వచ్చాక భానుమతి మిడ్‌లాండ్ కెళుతోంది అని కష్టంమీద చెప్పిపోయాడు. గుర్నాథం గుండె గుభేలుమంది. ఇపుడెలాగా – కొంప మునిగింది. భానుమతి మిడ్‌లాండ్‌కి వెళ్ళినప్పుడు తను వెళ్లకపోతే ఇంకేముంది. చొక్కాలేదు. ఈపాటికి అందులో డబ్బూ వుండదు. నీరుగారి పోయాడు. ఎవరైనా ఓ చొక్కా, రెండ్రూపాయలూ అప్పివ్వండన్నాడు. చొక్కాలున్నాయి కాని, ఎవరి దగ్గరా డబ్బులేదు. ఇళ్ల దగ్గర్నుంచి మనియార్డర్లొచ్చి అప్పుడే మూడు రోజులు అయింది. ఇంకా యెక్కడ డబ్బుట!

గుర్నాథం హడావుడిగా కంటికి నదరుగా వున్న రెండుమూడు చొక్కాలు తొడుక్కుని అప్పారావుకోసం బయల్దేరాడు. డబ్బులేకపోయినా చొక్కా ముఖ్యం. అది లక్కీషర్టు. అది వేసుకున్నప్పుడే భానుమతి తొలిసారి నవ్వింది. ఆ ఫలానా చొక్కా అబ్బాయి లేడూ అని యెవరితోనో అంటూ వుండగా తను విన్నాడు.

పార్కు దగ్గిర దొరికాడు అప్పారావు. ఎవరో గుడ్డివాడికి రూపాయి దానమిచ్చి ఛోరున ఏడ్చి పుణ్యం గడించాలన్న ఆధ్యాత్మిక చింతనకొద్దీ తన దగ్గర మిగిలినది రెండు రూపాయల నోటు అయినందువల్ల మీ దగ్గిర రూపాయుందా? అని అడిగాడు.

అప్పడుగుతున్నాడన్న అపోహతో అతను తల తాటించాడు. అలాకాదు ఫరవాలేదని ఇతను బలవంతం పెట్టాడు. గొడవయేసరికి ఎవరో రౌడీ వచ్చి గుడ్డివాడి డబ్బు దోచుకుంటున్నావా అని కూకలేసి అప్పారావు చేతిలో రెండూ పట్టుకు ఉడాయించేశాడు.

గుర్నాథం నోరెత్తి ఒరేయ్ అనేలోగానే, అప్పారావు అప్పు వసూలు చేసినంత చురుగ్గా ఇదంతా జరిగిపోయింది.

గుర్నాథం అప్పారావుని తిట్టిపోశాడు. ఇప్పుడు సినిమా కెళ్లకపోతే ఎలా అన్నాడు. వెళ్ళడం ఎలా? అని కూడా అన్నాడు.

అప్పారావు అతన్ని ఓదార్చి అతని చొక్కా అతనికిచ్చి అతను తొడుక్కున్న చిన్నదాంటో తను సర్దుకొని పద చెబుతానని కొంచెం అసింటా ఉన్న హాస్టలుకు దారి తీశాడు. ఆ హాస్టలు గదుల్లో అప్పారావు మిత్రులు— అప్పిలిచ్చేవాళ్లు, ఇవ్వనివాళ్లు చెల్లాచెదురుగా ఉంటారు. ఆ గదుల్లోనే అప్పారావు తన చొక్కాలు కొన్ని స్టాండులికి తగిలించి ఉంచుతాడు. వాళ్ళు పరాగ్గానో, చిరాగ్గానో ఆ చొక్కాలు తొడుక్కుని, వాటితో వెళ్ళి ఎవరిదగ్గరేనా అప్పు చేయవచ్చు. అలాటప్పుడు అప్పారావు డేగలా వాడిమీద వాలి, ఇది నా చొక్కారోయ్ అని గావుకేకపెట్టి ఉన్న పళంగా అది విప్పాకు చక్కాపోయి నిమ్మళంగా జేబులో తడివి చూసుకోవడం పరిపాటి. ఒక్కొక్కసారి అయా నేస్తాలు డబ్బుతో ఉన్న ఆ చొక్కాలను గదిలోనే స్టాండుకి తగిలించి ఉంచుతారు. అపుడు సరేసరి. డబ్బుమటుకు తీసుకొని చొక్కా అట్టేపెట్టి చక్కాపోతాడు. ఇవాళ గుర్నాథాన్ని సినిమాకి తీసుకెళ్ళే బాధ్యత మీదవేసుకొని అతను హాస్టలులో ఒక రౌండు కొట్టి చూశాడు. తన చొక్కాలు నాలుగు పత్తాలేవు. బహుశా డ్యూటీలో ఉండి ఉండాలి అని విచారించాడు అప్పారావు.

అఘోరించాయి అని విసుక్కుని టైమైపోతోంది అని చేతకానివాడి శివతాండవం ఒకటి చేశాడు గుర్నాథం.

ఇక లాభంలేదని, పద, హాలుదగ్గర కెళదాం ముందు అన్నాడు అప్పారావు.

గేటులో టిక్కెట్లు దొరక్క వచ్చేస్తున్న ఒక సుబ్బారావును కాలరు పట్టుకొని అవునుగాని ఒరే నువ్వా— అనే వరకు అతను జేబులో రూపాయా యిచ్చేసి, ఇంతేవుంది బ్రదర్ అని తప్పాకు పారిపోయాడు—చొక్కా చేతిమడతలో పదిరూపాయల కాగితాన్ని పరామర్శించుకుంటూ.

ఇంకో పదినిమిషాలలో రెండు రూపాయలు తెచ్చాడు అప్పారావు.

ఎక్కడివిరా అన్నాడు గుర్నాథం.

సీత ఇచ్చింది.

సీతా? సీత నీకు తెలుసా? అన్నాడు గుర్నాథం హుషారుగా.

నాకు పరిచయంలేదు. నీకు తెలుసటగా. నీక్కావాలని చెబితే రెండూ ఇచ్చి, చాలా అని కూడా అంది పాపం అన్నాడు అప్పారావు వినయంగా.

గుర్నాథం హైజంప్‌లో పోల్ వాల్ట్ రికార్డు బద్దలు కొట్టేసేవాడే గాని అంతలో గేటులో భానుమతిని చూసి, తన స్థితి తలచుకొని దిగాలుపడి కుంగిపోయి స్తంభంచాటు బెంచీమీద కూలబడిపోయాడు.

అదేవిట్రా అశోకవనంలో సీతమ్మవారి పోజు నువ్వాను—లే టికెట్టుకొందాం అన్నాడు అప్పారావు.

అంతలో రూపాయిపావలా గేటు దగ్గర కలకలం బయల్దేరి అక్కడి క్యూ దివాలా ఎత్తినవాడి పరువులా చితికి చెల్లాచెదరైపోయింది.

డబ్బున్నవాళ్ళూ, భానుమతికోసంకాక సినిమాకోసం వచ్చేవాళ్ళూ పై టికెట్‌కు ఎగబడుతున్నారు. భానుమతి అలవాటు ప్రకారం చెలికత్తెతో కలసి రూపాయప

ధ్వానులుగణాల వేసే రాజహంసలా తారు రోడ్డుమీద చెవర్లెట్  కారులా, పట్టుదారం మీద ముత్యంలా, వీణమీద స్వరాలలా, బ్రహ్మదేవుడి దగ్గర్నించి వరాలలా, సంగీతంలా వెళ్ళిపోయి 'టూ ప్లీజ్' అంది.

అయిన కాకపోయినా—ఆడపిల్లలు, అందులోనూ చదువుకుంటున్న వాళ్ళు వన్ ఫోర్టీన్ కెళ్ళడం ఏమిటి? కలియుగం! ఎడ్యుకేషనల్ స్టాండర్డులు పడిపోయాయంటే పడవుమరీ అన్నాడు అప్పారావు కోపంగా.

ఛస్ నోర్ముయ్, వెధవ లెక్చరూ నువ్వూను. ఎవడికి కావాలి నీ బాల్డు విడో లెక్చర్లు అన్నాడు గుర్నాధం  శాంతానికి చేతనైనంత వరకూ అభినయం పడుతూ.

మనం ఇలా నా స్కాలర్‌షిప్‌మీద చర్చించితే ఇది పూర్తి అయేలోగానే ఆ టిక్కెట్లు కూడా అయిపోతాయి. భానుమతి  సినిమాకీ మనం యింటికీను. కర్తవ్యం ఆలోచించుము అర్జునా అన్నాడు అప్పారావు. ఆరుంబావైంది. ఆలోచనకు  టైము చాలదు. దానికి ముందు బుర్రెక్కడుందో జ్ఞాపకం చేసుకు తెచ్చుకోవాలి ఎలాగో.

గుర్నాధం దగ్గరలో ఉన్న గోడమీద ఒక మసిబొగ్గు గీత ఏరుకొని దానిని తేరిచూస్తూ పరధ్యానంలో పడిపోయాడు.

ఆ? అన్నాడు గుర్నాధం తేరుకొని.

ట్రిక్కు ఆలోచించి పెట్టరాదా అంటున్నా అన్నాడు అప్పారావు.

హూ! లైఫే ఓ పెద్ద ట్రిక్కులా వుంది.

హోరి నీ దుంపతెగా! అడగ్గానే అప్పు దొరకా! ఎంత కొటేషనన్నావురా. టైము లేదుగాని తల తాకట్టేసేనా అక్షరలక్ష  లిప్పిద్దును అన్నాడు అప్పారావు.

ఉందా ఏమిటి నీకు.

అప్పారావు నవ్వాడు. అందుకేగదా నీ బుర్ర అప్పడిగాను. పరేగాని నువ్వలా నీరసపడి నీరు కారిపోతే ఎలా?  ఆరుంబావైపోయింది.  భానుమతి లోపలికెళ్ళి కూర్చుంది. ఇంక సినిమా మొదలు పెట్టేస్తారు, నువ్వింకా అప్పుగురించి ఆలోచించవు ఎలా?

గుర్నాధం పూర్తిగా మేలుకొన్నాడు పరాకులోంచి చిరాకులోకి. ఆ క్షణంలో కోపంలో అతనికి అప్పారావు పేరు  గుర్తురానందువల్ల ఇడియట్ ఫూల్‌వంటి పేర్లతో వాక్యాలారంభించి ఈ దుస్థితికి కారకుడూ, స్నానం చేస్తున్న తన  చొక్కాని తొడిగేసుకొన్నవాడూ (చొక్కా స్నానం చేస్తుందా అని విట్టు వెయ్యడానికి అప్పారావు జంకాడు) అందులో  డబ్బుని అప్పారావు నాన్నగారి సొమ్ములా ఖర్చు పెట్టేసినవాడూ అంటూ అప్పారావుని పేర్కొని, ఇప్పుడు ఎక్కడో  అక్కడ అప్పు తెచ్చి టిక్కెట్లు కొనే హక్కు అతనికే దత్తం చేస్తున్నట్లు ప్రకటించాడు ఉదారంగా.

చాలా కృతజ్ఞుడిని బ్రదర్! కాని, ఒక్కటే చిక్కు, నేను అప్పు అడగడం ఆరంభిస్తే ఆగడం తెలీదు. అభిమన్యుడిలా  అలా చెక్కేస్తూ పోవడమే. అలా వసూళ్ళు చేసుకుంటూ ఏ చిలకలపూడిలోనో ఆగుతాను. అప్పటికి సినిమా మొదలైపోతుంది. అదీకాక నాకు అప్పివ్వాలని తహతహలాడిపోతున్న వాళ్లతో ఈ భూమి  కిటకిటలాడిపోతున్నట్లు తోచదు. కాన నీవే అందుకు ప్రయత్నించు. వెనక

నా అండదండలు ఉండనే ఉంటాయి అన్నాడు అప్పారావు పది అడుగుల అవతల ఒక క్రూర అప్పులవాణ్ణి చూసి, హఠాత్తుగా వినమ్రుడై తలవంచుకుని.

టిక్కెట్టు కొనేసి, సీట్లలో రుమాళ్లు పడేసిన వాళ్ళంతా ఇవతల కొచ్చి సిగరెట్లు ముట్టించి "బుక్ చేసిన సీటు మా జీవితం" అన్నట్టు నిల్చున్నారు ఠీవిగా.

ఇంత జనాభావుంది లోకంలో. నిర్దిసీ తంతే ఒక్కడి దగ్గరైనా బస్సు టిక్కెట్టుకు పోను ఒకటి రెండన్నా ఉండకపోవు. షూట్. వెళ్లు, స్నేహితుల నడక్కు. పరిచయస్థులు వాళ్లకన్న మెరుగు. జాగ్రత్త. నీ పర్సు పోయిందట. ఇవాళ పిక్చరు చూసి తీరాలిట. ముసలివాళ్లతో అయితే ఇది నీ షేక్స్పియర్ అను. పడుచువాళ్ళతో అయితే దీని హీరో నీ ఆప్తమిత్రుడనీ నువ్వుచూడలేదని తెలిస్తే యే లోకానున్నా భోర్న యేడిచేస్తాడనీ విట్టీగా చెప్పు. కొంచెం మొండిఘటం తటస్థపడితే మాట అని దగ్గిరకు పిలిచి సరస్వతితోడు అనమని, నీ లవ్ స్టోరీ టూకీగా చెప్పేసి, సూటిగా అడిగెయ్.

నీ మహారహస్యం వాడొక్కడికే చెప్పావన్న కృతజ్ఞత కొద్దీ తక్షణం యిచ్చేస్తాడు. దీనికి ఢోకాలేదు. నేను వాడిన మీదటే చెబుతున్నాను. నాకూ నీకూ తెలిసినవాడైతే ట్రూ స్టోరీ....ఏది....అప్పారావు గాడు నీ చొక్కా, దాని తాలూకు జేబూ, అందులో డబ్బూ సమిష్టిగా తగలేసి, ఇప్పుడు తప్పు గ్రహించి, ప్రేమకథలో విలన్ అయినందుకు బాధతో కటుకు కటుకు నాలిక్కరిచేసుకుంటున్నాడని, అది మానిపించి నాలుకను కాపాడుటకైనా రెండు రూపాయలు అవసరమని చెప్పు. నమ్మకపోతే నీ కళ్లలోకి చూడమను. వాట్? బయలుదేరు. విష్ యూ లోన్. విష్ యూ టూ రుపీస్ అంటూ గద్గదస్వరంతో వీడ్కోలుచెప్పి కంటతడి పెట్టుకున్నాడు అప్పారావు. వానచినుక్కోసం ముత్యపుచిప్పలా, లైలా కోసం ఫిలింసెట్ మీద మజ్నూలా, మనీఆర్డర్ కోసం పోస్టలుగదిలో నీలా, భానుమతి కోసం బస్సు దగ్గిర మల్లీ నువ్వేలా, దిలీప్‌కుమార్ మూడ్ కోసం ప్రొడ్యూసర్‌లా ఎదురుచూస్తూ ఉంటా, కదులు అని కూడా చెప్పి బాధగా తలవంచుకున్నాడు అప్పారావు.

క్రిందని గుర్నాధం కాళ్లు లోధి జేబులో డబ్బులా స్థిరంగా అక్కడే పడి ఉన్నాయి.

హరినీ యింకా కదలలేదా! ఈ పాటికి అప్పుతెచ్చేసి ఉంటావు, కథ కదులుతుందీ అనుకుంటూ ఉంటే?

నేను వెళ్లను, నాకు భయం, నా కివ్వరు అన్నాడు గుర్నాధం ముక్తసరిగా.

* * *

# ఋణోపదేశం



హోరి పిచ్చివాడా అన్నట్టు నవ్వి హోరి పిచ్చివాడా అన్నాడు అప్పారావు. ఎందుకలా భయపడతావు. వీరంతా మనుషులే. మనుషులంతా మంచివాళ్లే. చాలామంది చేబదుళ్లిస్తారు. అదిగో ఆ గుండాయన చూడు, అడగడం తడవు ఇచ్చేస్తాడు. మళ్లీ మనంతట మనం ఇచ్చేదాకా అడగడు. ఆ చారల చొక్కావాణ్ణి చూడు. కనిపిస్తే అప్పుకావాలా అని తనే అడిగేస్తాడు. (ఈ మధ్య మానేశాడు)మనం అడిగినపుడు చేత డబ్బులేకపోతే బెగ్ బారో ఆర్ స్టీల్ చేసయినా ఇస్తాడు. దొంగనోట్లు అచ్చుకొట్టేనా ఇచ్చేస్తాడు. అంత మంచివాడు. అందులోనూ ఎపుడూ అడగని నీలాంటివాడు అడిగితే యివ్వననగలవా డెవడు? అడగడం పరువు తక్కువని భయపడకు. అప్పులు మహా మహావాళ్లు చేశారు. జీవితమే ఓ పెద్ద అప్పు. ధర్మరాజుగారికో రోజున రొఖ్ఖం కావలసివచ్చి వేళకి జతపడక భీమసేనుడిని కుబేరుడు దగ్గరకు పంపాడుట అప్పు తెమ్మని. తీరా అతను అందాకా వెళ్లి అడిగేసరికి కుబేరుడేమో మీ అన్న వడ్డీ ఇస్తాడా మరి అన్నాడట. రణరంగంలోనే తప్ప ఋణరంగంలో యేమంత ప్రతిభాశాలిగాని భీముడు తంగున జవాబివ్వలేక మళ్లీ భూలోకం వచ్చేసి, అన్నా వినమని కథ చెప్పాడు. వడ్డీ పుచ్చుకోకపోతే మనం అప్పు పుచ్చుకోము అని చెప్పు అని కబురంపాడు ధర్మరాజు ఎందుకైనా మంచిదని. కుబేరుడు అప్పూ ఇచ్చాడు. వడ్డీ వద్దనీ అన్నాడు. ఈ ట్రిక్కు బలేగా పనిచేస్తుందిలే. అలాగే ఇంకా చరిత్రలో యెన్నో....ఎటు తిరిగినా గొప్పవాళ్లలో అప్పు చెయ్యనివాడెవడు? రాక్ ఫెల్లరుకి యెంత డబ్బున్నా, జేబులో వేసుకుతిరగడుగదా? ఓ అర్ధనా బటానీలు కొనబోయినపుడు చెక్కులిస్తే వాడు

పుచ్చుకోడుగదా. అప్పు చెయ్యకేం చేస్తాడు పక్కవాడి దగ్గర? కర్ణుడు, దుర్యోధనుడి దగ్గిర అప్పుచేసి దానాలు ఇచ్చేస్తుండేవాడు. హరిశ్చంద్రుడికి ఇరుగుపొరుగు చక్రవర్తుల దగ్గిర అప్పు చెయ్యాలన్న ఊహపోకనే నక్షత్రకుడితో నానా అవస్థలూపడ్డాడు. ఈ అయిడియా తగిల్తే ఆ పని చేసేవాడు కాదంటావా? అసలు అప్పుడుకూడా అపకీర్తి శేషుడు కాగల ప్రమాదంలేదుగా. అప్పు పుట్టించే తాహతూ, పలుకుబడీ ఇవే ఒహడి గొప్పతనానికి గీటురాళ్లు. అప్పంటే ఏమనుకున్నావు..... అదిగో – ఒకాయన పోవడంలే? ఎంత మంచివాడో నే చెప్పలేను. ప్రతీ నెలా నాకైదు అప్పిస్తాడు. నేను 30న తీర్చేస్తా. మళ్ళీ ఫస్టున అప్పిస్తాడు.....ఏం, అప్పంటే ఏమనుకున్నావు. మహా పవిత్రమైనది. పంచభూతాలలో ఒకటి. పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం అన్నారు. ఇదీవరస. ఏడాది పొడుగునా సముద్రుడి దగ్గిర అప్పు పీల్చేసుకుంటాడు అబుణకిరణాలవాడు. అందుకే ఏడాది తిరిగేసరికల్లా బాకీ తేర్చేస్తాడు వబుణుడు.. తీర్చమని వబుణుడిని కోరేవే బుక్కులు. వీటితోటే వేదాలనే నాలుగు బుక్కులు రాశార్ట. నేనెపుడూ చూడలేదనుకో. కాని మంచి పుస్తకాలే అయుండాలి. విలువైన ముక్క చెబుతున్నప్పుడు మెచ్చుకోక తప్పదుగదా. అదీ సంగతి. లోకమంతా ఇలా ఇచ్చిపుచ్చుకోడాలమీదనే సాగిపోతోంది. అడిగితేనే ఇవ్వడం, ఇస్తేనే పుచ్చుకోవడం, పుచ్చుకుంటేనే మళ్లీ ఇవ్వడం. ఈ మూడూ లేకపోతే జీవితం 'బోరు' కొట్టెయ్యదూ? కాబట్టి నా మాటవిని ముందడుగెయ్యి. టైమైపోతోంది. సినిమాకి సెకెండ్ బెల్ కొడుతున్నారు పద అని బుణోపదేశం చేశాడు అప్పారావు.

గుర్నాథం కదల్లేదు. ఏమనుకుంటారో అన్నాడు జంకుగా.

హారినీ! అదా నీ భయం. నీదగ్గిర అడ్డమైనవాడూ అప్పుచేసి ఎగ్గొట్టా అన్నట్లు నవ్వి ఆ మాటే అన్నాడు అప్పారావు.

నీ కా భయం అక్కరలేదు. అందులోనూ సినిమా కెళ్లడానికి అప్పడగడంలో తప్పు ఏమీలేదు. పై పెచ్చు గొప్ప ఫాషను. ఏదో ఆకలి తీరడానికి, పరువు నిలబెట్టుకోడానికి చేయిజాస్తే తప్ప, సినిమా టిక్కెట్ల కేవుటోయ్. రాజాలాటి కారణం అది. సినిమాలను. సిగరెట్లను. మందను. మాకను. గుర్రప్పందాలను. ఆటను. పేకాటను.–ఇలాటి వాటికి నూటికి నూరు ఛాన్సులూ ఉంటాయి అప్పుదొరకడానికి. ఇవ్వలేకపోయినవాడు పశ్చాత్తాపంతో అగ్నిప్రవేశంచేసి ఆత్మహత్య చేసుకుంటాడు. ఇవ్వగలిగినవాడు ఆనందంతో ఇస్తాడు.

అంతెందుకు, నా అంతవాడికి ఓసారి అర్జెంటుగా ఓ పాతిక కావాల్సి వచ్చింది. అప్పుడే 'అశ్వమేధయాగం' కథ విని ఆనందంతో పొంగిపోయాను. ఎటొచ్చీ మా అమ్మ పొరుగూళ్లోనే అయినా, నిక్షేపంలా ఉన్నందువల్ల టెలిగ్రామూ రెండ్రూపాయల చిల్లరా దొరికితే అది పట్టుకు వీధిని పడ్డాను. ఇలా టెలిగ్రామొచ్చింది, మదరిల్లాకి బావులేదుటా, తిరుగు టపాలో పంపిస్తాను. ఓ పాతిక సర్దూ అని అడిగితే ఒహడూ విదపడే! పైగా మంచిదిగా అంటాడు. చివరికిది గాదని ఇంకో ఫ్రెండింటికెళ్లి అబ్బీ ఇలా బెంగుళూరులో అద్భుతమైన పిక్చరాడుతుందిటా, మరి నేను వెళ్లి చూడాలని ఫ్రెండు టెలిగ్రాం కొట్టాడూ, నువ్విస్తేనేగాని వల్లకాదూ అవటా అన్నాను. ఠంగున పాతికా చేత పెట్టి, అవస్థపడతావేమో మరో పది పుచ్చుకోరాదా అని కాళ్లావేళ్లా

బ్రతిమాలాడు సినీ పతివ్రతలాగ. వద్దుపో అని తూలిపడేలా తూలనాడి తన్ని ఇవతలికివచ్చి పొట్ట చెక్కలయేలా నవ్వుకున్నా. అంతలో ఇంకో మిత్రుడు కనుపించాడు.

ఇవాళ శారద మా హోస్టలు వీధిలోంచి వాళ్ళ నేస్తురాలింటికి వెళ్లబోతున్నట్లు నాకు తెలిసింది. దారిలో కాంక్రీటు పూసి బంగారు మలామావేసి జెండాలుకట్టి బాజాభజంత్రీలు పెట్టి లాండ్రి వాడికి పాతబాకీ అరణాలు తీర్చేసి ఓ జత ఇస్త్రీ గుడ్డలు తెచ్చుకొని, విలాసానికోసారి ఫోంచేసి వీధి మొగలో నిలబడి..... అంటూ చెప్పుకుపోయేసరికి వాడు ఇరవైనాలుగుం బేడా ఇచ్చి విష్‌యు గుడ్‌లక్ అని వెళ్ళిపోయాడు. కాబట్టి గుర్నాథమూ ఇంకనైనా కదులు అని హెచ్చరించాడు అప్పారావు.

అయినా ఈ కథలాగే గుర్నాథమూ అంగుళం కూడా కదల్లేదు. బాబోయ్ నాకు భయమేస్తోంది, అడిగితే వాళ్ళేమంటారన్నది ఊహించిన కొద్దీను. నాకు సినిమా వద్దు, భానుమతీ వద్దు. మా నాన్నకి తెలిస్తే మక్కెలిరగదంతాడు అని పరుగెత్తబోయాడు గుర్నాథం.

అప్పారావు అతని కాలరు పట్టుకు ఆపేసి, క్రాఫింగు చెరిపేసి, బలవంతాన అతని కుడికాలు జోడు ఊడదీసి అది తాను తొడిగేసుకొని తనది అతనికి మార్చి బ్రదర్, కసబియాంకాలా ఇక్కడే వుండు, భయపడకు, నే తెస్తాను అంటూ ఉత్సాహంగా నాలుగడుగులు నడచి దారికడ్డుపడ్డ శాస్త్రీకి అడ్డపడి హలో సర్ యునో గుర్నాధం–మీరు గుర్నాధాన్నెరుగుదురా? ఉంగళకు గుర్నాథం తెరియుమా? ఆప్ గుర్నాధ్‌కో జాన్తేహై? తమకి గుర్నాథం గొత్తా? గుర్నాథనే తాంగళ్‌కు అరయామో? వాట్? అన్నాడు కళ్ళు చక్రాల్లా తిప్పి.

ఏందయ్యో నీగోలా అన్నాడాయన.

ఓ తెలుగేనా మీది! సార్ మీదేవూరన్నారు?

నేనేం అనలేదే.

లేదా, పోనీయండి. అలా నిష్కర్షగా చెప్పాలి. ఐ లైక్ యు. యూ వే యేమిటి, ఫ్రాంకుగా సూటిగా నిర్మొహమాటంగా నిజం చెప్పేవాళ్ళన్నా, సత్యాన్ని పాలించేవారన్నా అడపా తడపా ఐదూ పదీ సర్దేవారన్నా నేను ప్రాణం పెడతానంటే నమ్మండి.

నమ్మను అన్నాడాయన.

అరే! నిజం? మీమీద నాకు గౌరవం క్షణక్షణానికీ పెరిగిపోతోంది చక్రవర్తిలా. నన్ను నమ్మకపోతే పోయెగాని గుర్నాధాన్ని నమ్మండి. గొడ్డు జెంటిల్‌మన్. అప్పు కావాలా అని అడిగినా పుచ్చుకుందుకి సిగ్గుపడతాడు. మునసబుగారబ్బాయి, ఏ వూరో గుర్తులేదులెండి. ఇపుడతనికి అర్జెంటుగా టూ రుపీస్ కావాలి. టి.యం.ఓ. రాగానే ఎడ్రసిస్తే మీకు నేనే తెచ్చిస్తా, ఇస్తారుగదూ.

ఇవ్వను అన్నాడాయన అప్పారావుని ఎగాదిగా చూసి. ఇవ్వరా! హా! మీకు నిర్మొహమాటమే కాక మంచి హ్యూమరుకూడా ఉందే – చూట్టానికలా ఉన్నా. తెండి, బలేవారే టైమైపోతూంది అన్నా డప్పారావు చనువుగా.

ఇవ్వను.

అదేవిటండీ హాస్యం అయిపోయిందిగా, నిజంగా ఇవ్వరేమిటి, నన్నెరగరా.
ఎరగను.
దానికేముంది మనమంతా ఓ కథలో వాళ్ళం, అపాటి నమ్మకపోతే ఎలా?
నాకు తెలీదు.
మీరిస్తారని చెప్పి పంపాడే!
ఎవడు వాడు?
ఈ కథ రాస్తున్నవాడు.
వాడి మొహం, ఇవ్వనన్నానని చెప్పు.

ఎక్కడో పోకిరీ రౌడీ కార్లెక్టర్లా ఉన్నావయ్యా. దాచుకో. నీ దగ్గిర ఎంత డబ్బున్నా ఖర్చు పెట్టేందుకు వీల్లేకుండా చేయిస్తా ముందు ఆథరుతో చెప్పి. హుఁ అంటూ అప్పారావు ఇంకో శాల్తీని చూసి హలో అని అటు తిరిగి ఓ టు రూపీస్–అన్నాడు.

మూాంద్రూాబాసార్. ఒన్ ఫోర్ అన్నాడు వాడు.

ఆలస్యం తగదని, రూపాయ పావలా టిక్కెట్లు రెండు తమ దగ్గరున్న మూడు రూపాయలకి బ్లాకులో కొనేసి గుర్నాథం అతనూ హాల్లోకి వెళ్ళిపోయారు. అక్కడ స్తిమితంగా ప్రయత్నించి ఇంటర్వెల్ లోనైనా రూపాయ పధ్నాలుగణాలు కొనుక్కుపోవచ్చునని.

సినిమాలో చీకట్లో అప్పారావు పక్కవాడి చెవిలో జోరీగలా పోరీపోరీ డాక్యుమెంటరీ అయేవరకూ వాణ్ణి హోరెత్తించాడు. అసలే ఇంగ్లీషు పిక్చరు. అందులో పక్కవాడి ఋణగుణధ్వని. ఇక కథేం తెలిస్తుందని దిగాలుపడి అతను తొంగిపోయాడు.

చీకటిలో నా మొహం మీకు కనబడడం లేదుగానీ, మీరు నన్నెరుగుదురు. నేను మీ ఇల్లెరుగుదును. ఇప్పుడు కాదన్నారంటే ఆనక వెలుగులో నన్ను గుర్తుపట్టాక నాలిక్కరిచేసుకొని భోరున ఏడిచేస్తారు నాకేం అన్నాడు అప్పారావు.

ఏందయ్యా నీ గోల అన్నాడాయన.

హా లక్కీ! మీరు ... మీరు టెలుగు పీపులేనన్నమాట. ప్రాణం లేచొచ్చింది–టెలుగు మాటవినగానే. మెడ్రాస్‌లో టెలుగూస్ లేరన్న గూస్ ఎవడూ? ఇంతమందితో ఇలా కిక్కిరిసి పోతూంటే. వాడి పేరూ ఎడ్రసూ చెప్పండి చెబుతా... మీకు తెలీదా? డోంట్ వర్రీ! శ్రమపడకండి హాయిగా సినిమా చూడండి. చూసి ఆనందించండి. ఈలోగా జస్ట్ టూ రుపీస్ పారేసుకోండి. అవి రేపు మళ్ళీ తెల్లారేసరికి మీ గుమ్మానికి వచ్చి తలుపుకొట్టి, పలకరించి ఎత్తుకోమని, జేబులోకెక్కి కూర్చుంటాయి. అద్భుతంలెండి...యస్సార్ మై నేమీజ్ అప్పారావు–థాంక్యూ...రేపొద్దున్న, టుమారో మార్నింగ్...పదవోయ్ గుర్నాథం కమాన్ అంటూ తనులేచి, గుర్నాథాన్ని వెంటబెట్టుకు బయటపడి రూపాయపధ్నాలుగణాలకి టిక్కెట్టు మార్చేశాడు అప్పారావు.

గుర్నాథం ఆ క్షణాన ఈ లోకంలో లేడు. అప్పారావు హడావుడి చూసి కళ్ళు తిరిగిపోయి విభ్రాంతుడై ఉన్నాడు. టిక్కెట్లు మార్పిడి అయ్యేవరకు మేలుకొని ఎవర్రా అది? నీకు అప్పిచ్చినాయన ఎవరూ? అన్నాడు మెల్లిగా.

అప్పారావు ఫులిక్కిపడ్డాడు. అరెరె పొరపాటై పోయింది. పేరు అదీ కనుక్కోలేదే. సారీ...అన్నాడు.

గుర్నాధం తెల్లబోయాడు. ముక్కూ మొహం ఎరగని వాడి దగ్గర అప్పుచేశావా? అన్నాడు.

ఆ దాందేముందిలే–ఇదివరకెరక్కపోతే ఇప్పుడు తెలుసుకుందాం. పరిచయాలు, స్నేహాలు, అంతర్జాతీయ సంబంధాలు ఎలా పుట్టి పెరిగి విరుగుతాయని! అప్పులు మూలాన్నే కదా! అప్పడక్కపోతే వాడెవడో మనమెవడో. డోంట్ వర్రీ నాకు సీతీ గట్రా ఉందిలే. సప్తసముద్రాలు గాలించైనా–

ఏమీ అక్కరలేదు. రూపాయ పావలా క్లాసులోకి మళ్ళీ వెళ్లి, ఇందాక మనం కూర్చున్నచోటు వెతుకు చాలు. అక్కడే ఉంటారు. క్షమాపణ చెప్పుకొని, కాళ్లు పట్టుకొని హోస్టలుకు లాక్కురా. నేను కూడా నీ మూలాన వాడికాళ్ళమీద పడతాను. ఎంత అపర్దిష్ట! సిగ్గులేదురా. ఆ మధ్య ఉండేదనేవాడివీ! అదంతా ఏం చేశావురా? అన్నాడు గుర్నాధం మండిపడుతూ.

బావుంది ఇంకెక్కడుందోయ్! సిగ్గు విడిచి రెండేసిసార్లు అడిగితే తప్ప మీ రప్పు లివ్వరు. ఎప్పుడో నిండుకుంది కాబోలు అన్నాడు అప్పారావు.

ఛప్ ముందెళ్ళి ఆ పెద్దమనిషిని వెతికి కాళ్ళమీద పడు...ఇదంతా మా నాన్నకి తెలిస్తే–

అప్పారావు అర్జంటుగా లోపలికెళ్లి, తొలిసారిచ్చిన చేబదులు డబ్బులా వెంటనే ఠంగున తిరిగి ఇవతల కొచ్చేశాడు హడావిడిగా.

మళ్ళీ ఎందుకొచ్చావు వెళ్ళు అని గదమాయించాడు గుర్నాధం. ఈ సారి మెల్లిగా లోనికెళ్ళి అప్పిచ్చిన పెద్దమనిషి పక్కన కూర్చుని సార్ క్షమించాలి అన్నాడు వినయంగా.

మళ్ళీ వచ్చా? ఎవడ్రా నువ్వు. ఇందాక నా చేతిలోంచి రెండు రూపాయలు లాక్కున్నది నువ్వేనా?

అఫ్‌కోర్సు, నేనేనండి, నేను అబద్దమాడను, అది చేతనైతే –

నాయనా నీకూ నీపెద్దలకీ ఓ దండం. ఇక్కణ్ణుంచి పోరాదూ?

నోసార్! తమరు ఒక్కసారి మా హోస్టలుకు దయచేస్తే మా గుర్నాధం మీ కాళ్ళమీద పడాలని మహ యిదవుతున్నాడండి.

ఆయన చీకటిలోనే తెల్లబోయాడు. వాడెవడు? వాడి కదేం బుద్ధి అన్నాడు.

తెలీదండి. కానీ ఒకటి గుర్తుంచుకోండి. మా గుర్నాధానికిదేం హాబీ కాదు– ఇలా అందర్నీ హోస్టలుకు పిలిచి వాళ్ళ కాళ్ళమీద పడడం. ఏదో ఈ సారి సరదా పుట్టింది. ఉన్న వాటిలో మీది బెష్టని ఎన్నికచేసి ఉంటాడు. నా ఒపీనియన్ అడిగితే భానుమతి పాదాలు సజెస్టు చేసేవాణ్ణే. తమలపాకుల్లా...

పెద్దాయనకి సంగతి బోధపడింది. అప్పారావుకేసి ఆ చీకట్లోనే జాలిగా చూశాడు. ఆయన గుండె తరుక్కుపోయింది.

ఔనౌను. అవే మెరుగు. నేనూ చూశాను. ఆ మాటా నిజమే. బయటికి పద....మీ వాడి పేరేమిటన్నావు...వాడితో చెబుదాం....దా....మ్మ దా అంటూ అప్పారావును వెంటబెట్టుకొని ఇవతలి కొచ్చాడు.

అల్లంత దూరాన్నుంచి వాళ్ళిద్దర్నీ చూసిన గుర్నాధం గుండె గుభేలుమంది.

అమ్మబాబోయ్ అనేందుకు కూడా వ్యవధి చాలక స్తంభం చాటుకు తప్పుకుని, వారిద్దరినీ సంస్మరించి అలా చాటునుండే గేటువైపు సాగి అక్కడ ముడుచుకొని, అవతలపడి విశాల ప్రపంచంలో కలిసిపోయి హోస్టలు కెళ్ళిపోయి బనీను కూడా మార్చేసి తలపాగా చుట్టుకొని పడుకున్నాడు గుర్నాధం.

అరగంట తరవాత అప్పారావు వచ్చాడు ఉత్సాహంగా.

తానొక్కడే వచ్చాడని కాళ్ళాయన-గుర్నాధం కాళ్ళమీద పడదామనుకున్నాయన-(అంటే గుర్నాధం కాళ్ళమీద కాదు) రాలేదని ఒట్లు సత్యాలు పెట్టాక తలుపుతీశాడు.

కానీ అప్పారావు ఒక్కడూ రాలేదు! అతనితో పెద్ద ముప్పాకటొచ్చి పడింది.

ఆయన కాళ్ళమీద పడే ఛాన్సు ప్రస్తుతానికి వాయిదా పడింది. కాని బాధపడకు. నిరాశతో, నిస్పృహతో కుంగి కుమిలిపోకు. తప్పకుండా నీకా అవకాశం కలుగుతుందని ఆయన గ్యారంటీ ఇచ్చాడు. అసలు నీ కలాటి ఊహ రావడమే ఎంతో అద్భుతంగా ఉందనీ, శుభసూచన అనీ, ఆనందం కలిగించిందనీ ఆయన అన్నాడు. ఐదు రూపాయలు సర్దారుకూడా పాపం. మళ్ళీ రేపిస్తానంటే, వద్దు చంపేస్తానన్నాడు. అంతగా అయితే ఏడాదికో పదేళ్ళకో ఈ జన్మ చివరికో నా దగ్గిర డబ్బు మరీ ఎక్కువ అయిపోయి దానధర్మాలు గట్రా చేసినపుడు కావాలంటే ఓ నోటు తనమీద పారెయ్యొచ్చునన్నాడు. ఇలాటివాడూ...ఇంత మంచి మావగారూ మన కెక్కడ దొరుకుతారురా? ఇంత ఉదారుడు, దానశీలి...శిబి, దధీచి, మహారధి కర్ణా అన్నాడు అప్పారావు.

* * *




ఈ విధంగా ఆరున్నరనుండీ ఏడున్నరవరకూ అప్పారావు చేసిన ఋణప్రసంగంలో, చెత్తా చెదారం వేరుచేసి దాన్నే పోగేసి చూసుకొనే సరికి గుర్నాథం గుండె గంటన్నర సేపులోను రెండోసారి గుభేలు మంది.

భానుమతిరా! ఆ పిల్లనుతప్ప ఇంకోళ్ళని చచ్చినా చేసుకోను. రామయ్యగారి ట్వెంటీ యాకర్సు పొలంవద్దు. వాళ్ళ అన్నపూర్ణ అంతకన్నా వద్దు. చచ్చేనా పోతాను గాని, చచ్చినా చేసుకోను అన్నాడు గుర్నాథం.

రామయ్యగారిని గనక నువ్వు అవమానిస్తే మీ నాన్న తక్షణం టెలిగ్రాం మీద నీ డొక్క చింపించి డోలు కట్టించి దానిమీదే తండ్రి మాట వినని పుత్రుడి గాధ ఏమైనదో టముకు వేయించేస్తాడు. మిగతా డొక్కతోటే డోళ్ళు, బుర్రలు చేయించి, బుర్రకథలు చెప్పిస్తాడు అన్నాడు అప్పారావు.

చెయ్యనీ చూద్దాం.

చూదాం కాదు...విందామను. వినడానిక్కూడా నువ్వుండవుగా.

ఛప్ నోర్మూయ్. హిస్టరీ లెక్చరర్లా చవటవిట్లూ నువ్వూను. వేసినవే వేస్తూ నవ్వడానికి విసుగులేదూ?

హిస్టరీ లెక్చరరు విట్టు నేనెప్పుడూ రెండోసారి వినలేదుగా నీలాగా. హిస్టరీ లెక్చరరు విట్టుకన్నా చాలా బావుండని 'విట్టు' – మీ కాబోయే మామయ్య రామయ్యగారు రేపు తెల్లారి ఎనిమిది గడియలకు రెండోసారి నీకు తటస్థపడతారు. అది చూడు ముందర అన్నాడు అప్పారావు.

గుర్నాథం తలవంచుకున్నాడు మాటాడకుండా. అతనికేం పాలుపోలేదు. వాళ్ళ నాన్న పంపిన అన్నపూర్ణ ఫోటోవంక చూస్తూ దిగాలు పడిపోయాడు.

అప్పారావు తేలుకుట్టినట్లు కిటికీదాకా వెళ్ళి మళ్ళీ వచ్చి, పద, విచారించకు, సినిమాకి పోదాం అన్నాడు.

ఈ సారి నిజంగా డబ్బుందిలే. హోలు దగ్గిర అప్పు చెయ్యను అని ధైర్యం చెప్పాడు.

ఎక్కడిది ఆయన ఇచ్చిందేనా? అన్నాడు గుర్నాథం ఆ బాధలోనే.

కాదు, ఇప్పుడు వరండాలో రాజు పోతుంటే కిటికీలోంచి అడిగాను. మారు మాటాడకుండా ఇచ్చాడు. ఎలాగేనా చాలా పెద్దమనిషి అనుకో, నువ్వు వెయ్యిచెప్పు...ఛీ ఛీ అదేమిట్రా హీరోయినులా అలా...తప్పు. సిల్లీ. ఏమిటి సంగతి. వాటీజ్ రాంగ్? అరే!

గుర్నాథం కళ్ళు వత్తుకున్నాడు. మా నాన్న మనియార్డరు పంపగానే నీకు పదిరూపాయలు అప్పిస్తాగాని, సమస్య చూడరా. ఈ పెళ్ళి జరిగితే, నేను చచ్చిపోతాను. జరక్కపోతే మా నాన్న చంపేస్తాడు...ఎలాగ.

అప్పారావు జాలిపడ్డాడు....పుట్టుట గిట్టుట కొరకే అనకూడదనుకో ఇపుడు. అయినా అంత భయమేమిటి. రామయ్యగారు రేపు నిన్ను చూడగానే భేష్ అనేస్తాడే అనుకుందాం. ఆయన అభిరుచిమీద నాకు గురిలేదు – అప్పులు బాగా ఇచ్చినాసరే. ఆ అమ్మాయి అన్నపూర్ణ ఒప్పుకోవద్దూ? కోడిలా చూపులూ, బోడి షోకూ వీడూ నాకేం బావులేడు నాన్నా అనేస్తే? అన్నాడు.

అలా అనకురా, నన్ను చేసుకోకపోతే ఇంచుమించు చచ్చిపోతానన్నట్టే మాటాడింది టామ్మాయి.

ఇద్దరూ మాటాడలేదు.

పోనీ ఓ పనిచేస్తే...అన్నాడు గుర్నాథం. ఈయన కాళ్లమీద ఎలాగా పడదామనుకున్నాం కాబట్టి రేపొద్దున్న రాగానే ఆ పనిచేసి అయ్యా! ఇలా నేను ఫలానా పిల్లని చేసుకోవాలనుకుంటున్నాను, నా మీద దయయుంచి మీ అమ్మాయితో పెళ్ళి తప్పేందుకు మీరే ట్రిక్కు చెబుదురూ అని రహస్యంగా అడిగితే?

అప్పారావు జాలిగా నవ్వాడు. ఆయనకి నువ్వు చెబుతున్న ఫలానా అమ్మాయి భానుమతి మీద ఏమాత్రం మంచి అభిప్రాయం ఉన్నట్లు లేదు, నవ్వేస్తాడు, తాడేమిటి! నవ్వేశాడు కూడా అన్నాడు అప్పారావు.

గుర్నాథం ఉలిక్కిపడ్డాడు. అదేమిటి! భానుమతి ఆయనకు తెలుసా? అన్నాడు.

భానుమతిని అప్పారావే అయనకు పరిచయం చేశాడుట.

ఏం చెయ్యను! ఇందాక హోలుదగ్గర నువ్వు పారిపోయాక ఆయన నన్ను పిచ్చివాడని పోలీసుకి ఒప్పచెప్పబోయి, నా ఇంగ్లీషూ అదీ విని డంగైపోయి నాలిక్కరుచుకున్నాడు. సారీ అన్నాడు. తరవాత కాఫీ తాగాం. తరవాత నా సంగతి అడిగి నీ పేరెత్తి నీ ఎడ్రసు అడిగాడు. నువ్వు తెలుసునని చెప్పి, ఎందుకని అడగడం మర్చిపోయి మన కథ చెప్పాను.

భానుమతి ముక్కు కొంతదూరం వచ్చి గబుక్కున పైకి తిరుగుతుందన్నాను. నవ్వాడు...వాళ్ళింట్లో వాళ్ళు భానుమతి ఉందిగదా అని ఇంటికి దీపాలు పెట్టించుకోలే దన్నాను...నవ్వాడు...భానుమతి నడుము ఉందని కొందరూ, లేదని కొందరూ పందాలు వేసుకున్నారనీ, ఉందన్న వాళ్ళు ఓడిపోయారనీ చెప్పాను. అబ్బా అన్నాడు...నవ్వి, నువు నవల్సులు రాయకూడదోయ్. అవునుకాని, గుర్నాథం ఎడ్రసేమిటన్నావూ.

బుద్ధిమంతుడేనా? అతనున్నాడని హోస్టల్లో దీపాలు మానేశారా? ఇలా మా పిల్ల నిద్దామనుకుంటున్నాం. పిల్ల చిదిమి దీపం పెట్టినట్టుంటుంది. రేపొద్దున్నొచ్చి అబ్బాయిని చూసి, అతను ఔనంటే- ఈ పాటికి మా పూర్ణమ్మ ఫోటో అందేవుండాలి, ఊరికెళ్తూనే తాంబూలాలిచ్చుకోడమేనూ అన్నాడు, అన్నాడు అప్పారావు.

గుర్నాధం దిగులు పడిపోయాడు ఏందారీ? అన్నాడు.

ఏం దారి చెప్మా అని అప్పారావు ఆలోచించబోయాడు.

అల్ రైట్ గుర్నాధం, అన్నపూర్ణతో పెళ్ళి తప్పే మార్గం ఆలోచిస్తానుగాని నువ్వు ఇందాక మాటిచ్చావుచూడు... ఏది మీనాన్న మనియార్డరు పంపగానే పదిహేను అప్పిస్తానన్నావే, ఆ ఇరవయీా గనక ఇప్పుడెక్కడైనా ఎడ్వాన్సుగా అప్పుతెచ్చి ఇచ్చావో, నాకు బుర్ర అమోఘంగా పనిచేస్తుంది. తెల్లారేసరికి ఫస్టుక్లాసు అయిడియా పుడుతుంది. నేను మళ్ళీ నీ పాతిక నీకు పువ్వుల్లో పెట్టి ఇచ్చేస్తాను, డబ్బు రాగానే. ఏమంటావు? సయ్యేనా? బాగా ఆలోచించుకో ముప్ఫై రూపాయల అప్పుతో నీ జీవితం అంతా బ్రెమ్హాండంగా అయిపోయే అయిడియా ఇస్తాను చెప్పు సరేనా? అన్నాడు.

గుర్నాధం గబుక్కున తలవంచుకుని మళ్ళీ మెల్లిగా బాధగా దేవదాసులా తలెత్తి చూశాడు. అబ్బీ నువ్వలా రేటు పెంచకుండా ఉంటే పది కాదు, ఐదు రూపాయలేనా సరే ఇస్తాను అన్నాడు.

నా జోకు పక్క నీ జోకు డోకులా వుంది. సర్లే పడుకొని నిద్రపో. రేప్పొద్దున్న అన్నపూర్ణతో పెళ్ళి తప్పినందుకు ఓ గ్లాడ్ సాంగూ ఎల్లుండి భానుమతిని చేసుకోగల ఛాన్సు పేరు చెప్పి ఒక యుగళగీతం, అసలు ఎవరో ఒకర్ని పెళ్ళి అంటూ చేసుకోవలసి వస్తున్నందుకు ఓ బ్రెహ్మాండమైన శాడ్ సాంగూ పాడుకుంటూ నిద్దరపో, ఈలోగా పాట మధ్యన ఆర్కెస్ట్రా వచ్చినపుడు చక్కగా నువ్వు నాకు బాకీ ఉన్న యాభై రూపాయల అప్పుగురించీ జ్ఞాపకం చేసుకుంటూ ఉండు, ఎక్కడలేని దిగుళ్ళూ పోతాయి అంటూ అప్పారావు అక్కడనుండి వెళ్ళిపోయాడు.

గుర్నాధం భానుమతితో ఆలోచనలు ఆరంభించడంతో అవి అక్కడే ఆగిపోయాయి. కాస్సేపటికి, అన్నపూర్ణ అనే పెళ్ళికూతురు బొమ్మ. దాన్ని బలవంతాన తనకి కట్టబెట్టడానికి రేప్పొద్దున్న వాళ్లు నాన్న వేషంలో వస్తున్న రాక్షసుడు రామయ్యగారు గుర్తుకొచ్చి, ఈ పెళ్లి కాదంటే తన తండ్రికి రాగల కోపం గుర్తుకొచ్చి. అతనికి ప్రాణం బెంబేలెత్తిపోయింది.

ఇహ నిహలోకంలో ఉండి లాభం లేదని, సుబ్బరంగా చచ్చిపోతే స్వర్గంనుండి భానుమతిని, ఆమె కాబోయే భర్తను దీవించి నీవైనా సుఖపడుమా అని తను ఏడుస్తూ పాడడం మంచిదని నిశ్చయించుకున్నాడు. ఈ విధంగా తను ఆత్మహత్య చేసుకోబోతున్నట్లు వాళ్ల నాన్నగారికీ, సంఘానికీ, ప్రపంచానికీ, పోలీసు కమీషనరుకీ నాలుగు పాడుగుపాటి ఉత్తరాలు మొదలుపెట్టి, ఒకటోది సగం రాసేసరికి సూయిసైడుకి స్పెల్లింగు కుదరక, కుదిరింది నచ్చక, నచ్చింది రాస్తే నాన్న తిడతాడనీ, తిట్టి మనియార్డరు పంపడనీ అనుమానం వేసి, ఆ సమస్యలో కొట్టుకులాడి నిద్రలో మునిగిపోయాడు.

పొద్దున్న ఎనిమిదిన్నరకి తెల్లవారింది. లైసెన్సున్నవాళ్లూ మొండివాళ్లూ ఒకటి తిన్నా పది తన్నగల జబ్బపుష్టిగలవాళ్లూ రొటీను సినిమా పాటలు పాడుతున్నారు. లేనివాళ్లు ఈలలేస్తున్నారు. అదిరానివాళ్లు వింటూ విసుక్కొంటున్నారు.

కొందరు నిన్న సాయంత్రందాకా వదలకుండా అప్పులవాడిలా తగులుకున్న పాటను పరాగ్గా ఉండగా విప్పి పారేసి, కొత్తపాట తొడుక్కుంటున్నారు. కొందరు బద్ధక యోగాసనాలు వేస్తున్నారు. మిగతావాళ్లు అద్దంలో సౌందర్యారాధన చేస్తున్నారు. రాగాలేవీ రానివాళ్లూ, దేవదాసులూ, తదితర భగ్న ప్రేమికులూ, పిరికివాళ్లూ, ఫస్టుమార్కులు, మెడల్సూకోరే దురాశాపరులూ, చదివితేనే పాసవుతామని పొరబడే అమాయకులూ, ఏమీ తోచనివాళ్లూ, ఈ క్లాసు పుస్తకాల్లో అసలేం రాస్తారో ఓసారి చూదాం అని కుతూహలం గలవారూ, రెండుజడల సీతలు అడిగితే ఇచ్చేందుకు నోట్సులు రెడీగా ఉంచాలనుకునేవారూ పుస్తకాలు తీసి చదువుకుంటున్నారు. అప్పారావు చురుగ్గా ఏ జేబులో ఏ అప్పుందోనని అందర్నీ అడిగి అందినంతవరకు అప్పులు చేస్తున్నాడు. అందులోనే కొంత తీరుస్తున్నాడు – మన సొమ్మేం పోయిందని.

★ ★ ★

# ప్రమాదము తప్పిన ప్రకరణము



గుర్నాథం కళ్లు తెరచి తొలిచూపులు ప్రసరించిన వేళకి రెండు బుర్రమీసాలమీద పెద్దముక్కుకి ఎడాపెడా నల్లంచు కళ్లజోడుతో ప్రపంచం పుట్టింది. ఆ మీసాలకింద మెడచుట్టూ జరీకండువా, రెండు భుజఖండాలూ, వాటికింద కీటికీ, దాని అంచుమీద ఇంకో జరీకండువా దానిమధ్య అప్పారావు తల వెనకవేపూ ఉన్నాయి.

గుర్నాథం ఇంకా లేవలేదు సార్. రండి యిలా నించోండి. రాత్రి పావలా పాయింటుమీద ఆడాడేమో టైము తెలిసిందిగాదు. ఏదీ ఇప్పుడే కన్నుమూశాడు కునుకట్టిందోలేదో ఇంకా పాపం అంటోంది అప్పారావు కంఠం.

గుర్ గుర్ మని చప్పుడైంది మీసాల మొహంవేపు నుంచి.

మరేండి ఓ పక్క లెక్చరరు పరీక్షలు గిరీక్షలు అంటూ ప్రాణాలు తీసేస్తారండి. ఇక్కడ మా అవస్థలు వాళ్ళకేం తెలుసు. పాపం మావాడికి కాలేజివైపు వెళ్లడం అంటేనే భయంగా వుంది. దానికి తోడు టెరమ్ ఫీజోటి కట్టాలి. రాత్రి పావలా పాయింటుమీద అడిందందుకే. అందులో స్వార్థం లేదు, కేవలం వాళ్లకోసమే– ఆ కాలేజీ ఋణాన పడుండడం యెందుకూ ఆ డబ్బేదో పారేస్తేసరి అని, కాని ఆట అడ్డం తిరిగిందాయె. మీ అల్లుడు అన్‌లక్కీ ఇన్ కార్డ్సు. అంత మాత్రాన లక్కీ ఇన్ లవ్ అనుకునేరు. వట్టి దురదృష్టవంతుడు....... నిజంగా వాడి అది తలుచుకుంటే మీ గుండెకూడా ఇద్దైపోతుంది.

మీసాల మొహం పాడెదగ్గ దగ్గి యెవరు? నువ్వు చెప్పేది గుర్నాథం మాటే?.......మా నాయుడిగారి గుర్నాథమే? అంది.

గుర్నాథం నవ్వుకున్నాడు విలాసంగా.

కాకపోతే ఇంకెవరండి అంటున్నాడు అప్పారావు. గుర్నాథం ఒక్కడే ఉన్నాడు. వాడిగురించే నేను చెప్పేది. నే నేమిటి లోకం అంతా కోడై కూస్తోంది. కొక్కొరోకో అంటూ, మంచే కానీండి, చెడే కానీండి చర్చ అంటూ చేస్తోంది గదా. మంచీ

చెడ్డా అనేవి రిలెటివ్. మనిషికీ మనిషికీ ఉంటే చుట్టరికాన్నిబట్టి ఉంటాయి. నేనంటే మీకు గిట్టనపుడు నాకు మంచిదైంది మీకు చెడ్డది. ఏమంటారు? భేషైన మాటన్నాను గదూ. ఇంకా బోల్డు అనగలను. పుచ్చుకొనేవాడికి అప్పు అయినదే యిచ్చుకొనేవాడి ప్రాణానికి బాకీలా కనిపిస్తుంది. నిజానికి ఆ మధ్యనున్నది కేవలం పది రూపాయలనోటే. వీడికీ, వాడికీ కొండమీద కోతికీ అందరికీ కావలసిందదే. దాన్నే కొందరు అప్పు అని పొరపడతారు. కొందరు బాకీ అని భ్రమిస్తారు. కొందరు ఇవ్వం అంటారు. కొందరిస్తామంటారు. ఈ భ్రమాభ్రమణం మధ్య అఖండ జ్యోతిలా వెలిగేది డబ్బు. అందుకే ఒక సూర్యుండు సమస్త జీవులకు..... అంటూ ఒక ఋక్కు. అన్నట్టు అప్పంటే గుర్తొచ్చింది చెప్పొచ్చినమాట. మీ రొక్క రెండువందలు సర్దగలరూ. రాత్రి ఆటకాగానే టాక్సీ దొరికితేసరి; లేదా తెల్లారగానే మీ హాస్టలుకి తెచ్చి ఇస్తాను. మీరు హాస్టల్లో ఉండరుకదూ.... పోన్లెండి. మీరుండే ఇంటికే... ఇది నాక్కాదు సుమండీ. మధ్య ముక్కూ మొహం ఎరగనివాడు ఇలా అడిగాడనుకునేరు. మీక్కాబోయే అల్లుడికే. పడుకోబోయేముందు చెప్పమన్నాడు. కావాలంటే కట్నంలో అడ్జస్టు చేసుకోవచ్చు. లేదా రేపే ఇస్తాను అని చెప్పమన్నాడు. ఆ పైన మీ యిష్టం. వాడే అడుగును కాని మొహం చెల్లదట..... మనలో మనమాట మళ్లీ వాడితో అనకండి. ఏడుస్తాడుగాని. వాడి మొహంకన్న సత్తు బేడ చప్పున చెల్లుతుంది. వాట్? వెళ్లిపోతున్నారేం? డబ్బు యింటికెళ్లి తేవాలా? పోన్లెండి ఉన్నదేదో ఇచ్చివెళ్తే ఈలోగా రెండాటలేస్తాం.... అరె కోపమా? అసలివ్వరా? యాభైకూడా ఇవ్వరా? నాకేం అల్లుడికి కోపంవస్తే అనక మీకెంత ట్రబులిస్తాడో తెలుసుకోండి. సోషల్ డ్రామాలు చదవలేదు మీరు. మొహం చూస్తే తెలీలే? మీసాలూ మీరూనూ.... ఏవండోయ్? ఆగండి.... మాట. ఇందాక పదిస్తానన్నారు నాకూ. అవైనా ఇవ్వండి. నిన్నటి ఐదు, ఇదీ కలిపి.... భలేవాడివయ్యా... ఏవండోయ్! ఆగండాగండి. అప్పొద్దులెండి. ఇదిగో మీ మీసాలూ కళ్లజోడూ ఇక్కడ మర్చిపోయారు...

ఖంగారుగా పోతున్న రామయ్యగారు గబుక్కున ఆగి మొహం తడుముకొని ఒక్కసారి ఉలిక్కిపడి ధుమధుమలాడుతూ నేరుగా రైలుకి వెళ్లిపోయారు. ...

☆ ☆ ☆

అప్పారావు హాస్టలుగదిలో కొచ్చేసరికి యిందాక రామయ్యగారు ప్రదర్శించిన రసాన్నే గుర్నాధం అద్భుతంగా పోషిస్తున్నాడు.

అప్పారావు యెందుకేనా మంచిదని ఓ కాయితం ముక్క అతని చూపు పడేచోట పడేశాడు. అది భగ్గుమంది. అబ్బాయి, పెళ్లిచూపులకి తెచ్చాను ఈ కండువా, పంచానూ. మనవికావు. నువ్వలా కోపంగా చూసి మాడ్చేస్తే నువ్వే చ్చుకోవాలి అన్నాడు అతని పక్కనజేరి.

గుర్నాధం అప్పుడు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ, కొత్తగా నేర్చుకున్న వచ్చీ రాని అరవమాటల్లోనూ, హిందీలోనూ అప్పారావుమీద తనకుగల అభిప్రాయాలను సమగ్రంగా వివరించి అప్పారావు మేధా సంపదనూ, అతని విధానాలనూ రేడియోలో ప్రతిశబ్దాన్నీ ప్రసారయంత్రాలు ఖండించినట్లు చెక్కేశాడు. తన పెళ్లి సంబంధం

తప్పించి రక్షించి పెట్టినందుకు కృతజ్ఞతనుకూడా మధ్యలో తనకీ అతనికీ కూడా తెలీకుండా వెల్లడించాడు.

ఇప్పుడు ఈ రామయ్యగారు మా వూరెళ్లి మా నాన్నకి చెప్పేస్తే ఎలా....నేనిలా మూడుముక్కలాట లాడుతున్నాననీ అప్పులు చేస్తున్నాననీ.... ఆయన ఇది నిజమనుకుంటే, కాదని ఋజువు చెయ్యడానికి జేజెమ్మ దిగొచ్చినా లాభం లేదుగదా అన్నాడు.

అవ్వా బువ్వా యెలా వస్తాయి అని విసుక్కున్నాడు అప్పారావు. ఏదో ఆ టైముకి ఓ బ్రిలియంట్ అయిడియా వచ్చింది. అంతే అన్నాడు.

నీ తలకాయ. నువ్వు చేసింది చవటపని. నీది పరమ చెత్త అయిడియా. నువ్వేసే జోకులంత పాతది.

అయితే అప్పివ్వవా?

ఇవ్వను.

అయితే నీ ఖర్మం. నేను గనకా తక్షణం వెళ్ళి కీల్పాకు అస్పత్రిలో చేరిపోయానంటే రామయ్యగారికి అంతా తెలిసిపోతుంది. నేను పిచ్చివాణ్ణని విన్ననే అనుమానపడ్డాడు. ఇవాళ నమ్మేసి చెంపలేసుకొని నీ రూముకి మళ్లీవచ్చి వరించి అవతల పారేస్తాడు. అప్పుడు దేవుడుకాదు, నేనుకూడా రక్షించలేను నిన్ను. జాగ్రత్త అన్నాడు అప్పారావు శాంతంగా.

ఆర్నెల్ల తరువాత బి.ఏ. తప్పి ఇంటిదగ్గర ఆత్మహత్య జేసుకుంటానని హడావుడిచేసి ఆ పట్టు పట్టూ భానుమతిని పెళ్లాడేదాకా పట్టు పట్టి నెగ్గి గృహస్థాశ్రమం వాళ్లలో కలిసిపోయిన గుర్నాధం.... వర్తమానంలో తండ్రి కెదురుగా, అప్పారావుకి అప్పు మంజూరు చేయించే సమస్య మీద పక్క స్తంభానికి జేరబడి జరిగిన కథ నెమరువేసే వరకూ కళ్లు చెమ్మగిల్లాయి.

తాడో పేడో తేల్చుకోవాయ్! అలా నానుస్తూ నిలబడితే ఎలా? నీకు అన్నిందాలా సాయపడ్డవాడైతే కాదండమూ బాగుండదు మరి. కోడలు కూడా నొచ్చుకుంటుందేమో మీ యిద్దర్నీ కలిపినవాడుగదా.........

గుర్నాధం ఉలికిపడి ఆయనకేసి చూశాడు, ఇదంతా నీకెలా తెలుసు నాన్నా అన్నట్టు.

మునసబుగారు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ కుర్చీ పక్కనున్న ఋణానందలహరి నవలను చిత్తా అవర్జాల బుక్కు చాటుకి తోసేశారు గుంభనంగా.

గుర్నాధం సిగ్గుపడ్డాడు.

ఇస్తే బాగానే ఉంటుంది నాన్నా. అతను మంచివాడు. మళ్లీ తప్పకుండా ఇచ్చేస్తాడు. ఐనా, ఐదొందలే గదా అన్నాడు నసుగుతూ.

అయిదొందలకేం, అదిసర్లే. తరువాత ఆ డబ్బు, నీ జతగాడుకూడా లేకుండాపోతే యేంగాను అని. స్నేహాలు చెడతాయిచూడూ, ఓపక్క నీకు బాగా కావలసివాడంటున్నావాయె.......

గుర్నాధం యేదో అనబోయి తండ్రి మొహం చూసి తలవంచుకున్నాడు.

కొడుకు మొహం కవళికలు వాటి చాటున చిన్నబుచ్చుకున్న వైనమూ గమనించి లాలనగా సర్లే అనబోయి మానేసి......

అప్పివ్వడానికి రొఖ్ఖమూ, ఇద్దామన్న మనసూ ఎలా అవసరమో తీర్చడానికికూడా డబ్బూ, తీరుద్దామన్న మనసూ ఉండాలి. అవి రెండూ చూసుకోవాలి మరి ప్రవేజకుడు కాదల్చుకుంటేను అన్నారు జనాంతికంగా.

కొడుకు మాటాడలేదు. గచ్చు పగులులో ఇరుక్కుపోయిన వొక చిన్న పూచికపుల్లను ఖయిదు విడిపించి ఒక పక్కగా పెట్టాడు.

కొందరు తీసుకున్నంత దూకుడుగా తిరిగివ్వరుమరి. ఓ పట్టాన యివ్వ బుద్ధిగాదు. రాక రాక పెద్దమొత్తం చేతికొస్తే అదిగాస్తా అప్పులాడి ఎదాన గొట్టటానికి ప్రాణం ఒప్పదుకదా!

★ ★ ★




చెంచయ్య కథ దెలుసా? మీ పెదతాత చెప్పేవాడు అప్పలకొచ్చే వాళ్లకి. వాకిట నులకమంచం వేసుకు, పులిలా కూచువేవాడు కబుర్లూ కథలూ చెపుతూ. నివ్వెప్పుడన్నా విన్నావో లేదోగాని నాకు అస్తమానం మనసులో మెసుల్తానే వుంటుంది. కథ వింటే జాలివేస్తుంది, కోపం వస్తుంది, నవ్వూ వస్తుంది– చిన్నప్పుడు ఉట్టి కథే అనుకున్నా, తరవాత తరవాత దాంట్లో మజా అనుభవాలైనకొద్దీ తెలిసొచ్చింది.

నువ్వాకథ వినుండవులే. చేబదులు చెంచయ్యని పిలిచేవారు. ఒకటిగాని వందగాని నోటిమాటనే తప్ప నోటుమాట రాకుండా పుచ్చుకోడం అతగాడి పెగ్గె. అబ్బో. ఇప్పటికథా, నువ్వు మీ అమ్మ కడుపున పడడానికి పుష్కరం నాటి మాట. ఎందుకు గుర్తుండిపోయిందీ అనేవు. మీ అమ్మకి సీమంతం జరిగేరోజున నాదగ్గరకొచ్చి ఓ పాతికవేలు చేబదులిస్తావా బావా అన్నాడు. చెప్పొద్దూ, నాకు నవ్వొచ్చింది. అలాగే ఇంకా సేపు ఊసులాడి నవ్వించి, పాతిక రూపాయలు పట్టుకపోయాడు. చెప్పొచ్చింది విను.

చెంచయ్య ఇలాగే మేలమాడినట్లే యేడుకొండలని ఒక పెదకాపు దగ్గిర నాలుగొందలు చేబదులడిగాడు. ఏడుకొండలు డబ్బు వడ్డీకి తిప్పేవాడే అనుకో, అయితే యెంత పెచ్చరిగ్గా నిర్వాకం చేసేవాడనీ, ఒరబ్బో అవలించమని పేగులు లెక్కెట్టేసుకునేవాడు మళ్లీ మనిషి మారుగిల పడకుండా. అప్పుడూ శతకోటి లెక్కలుచెప్పి ప్రాణాలుతోడేసి మరీ విదిపేవాడు డబ్బుని. వసూళ్లకూడా అంతే. రాక్షసుడే, అయితే ఒక సుగుణం. ఆ మాట ముందే చెప్పేసేవాడు, ఏదీ యిలా నేను రాక్షసుడిని బావా అని. ముందు ముందు ఎలాగా యవారం బెడుస్తాది. వాడెలాగా వీణ్ని కాబోలీ దెయ్యం అంటాడు. అప్పుడు వీడు, నేను మొదటే

చెప్పానుగా, నీకు తెలుసు అని నవ్వి మరీ కుప్పమీద పంట, అవసరమైతే పై మీది బట్టకూడా యెగరేసుకు పోయేవాడు.

యేడుకొండలికి ఒక్కగానొక్క బిడ్డడు. వాడికోసారి వాతంకమ్మి ప్రాణమ్మీదికొచ్చేవరకు చెంచయ్య రాత్రికి రాత్రి మూడామడదూరం వల్లకాటి కడ్డంపడిపోయి దేవరగార్ని వున్నఫళంగా లేవదీసుకొచ్చి మందు పోయించి పోయే ప్రాణానికి చక్రంవేసి అట్టే నిలబెట్టాడు. ఆ విశ్వాసం యే మూలో నిలదొక్కుకుంది ఏడుకొండలకి.

అదో, మరి ఇంకేకళనున్నాడో, రెండుపుంజీల అప్పుకి చెంచయ్య గాడు నాలుగొందలకాడ బేరంపెట్టగా, బావా! నీకు చర్మం చెప్పులు కుట్టిచ్చినా ఋణం తీరుద్దా అంటూ—వడ్డీ గిడ్డీ వద్దులే అంటూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వల్లమాలిన షరాలు, షరతులు పెట్టకుండా నాలుగు పెద్దనోట్లు వాడిచేత బెట్టాడు. పంటలు దింపగానే మళ్లీ యిచ్చెయ్యాలని మటుకు మాట దీసుకొన్నాడు. నెత్తిమీద పున్నమిచంద్రుడూ బండి నీడలో నేనూ కొంచెం అసింటా అదుగో నీ పెళ్లాం నిలబడ్డంత దూరాన, ఏడుకొండలు ఇంటిదీ సాక్ష్యం.

మూడు తిరిగి నాలుగో పున్న మొచ్చేనాటికి రొక్కం సర్దుబాటవుతుందనీ, తప్పకుండా ఇచ్చేస్తాననీ, వడ్డీకూడా పదో పరకో ముట్టచెబుతాననీ సత్తె పెమాణం పెట్టాడు చెంచయ్య. ఇలా ఆపదకి అడ్డు పడ్డందుకని కంటతడిబెట్టాడు కూడా.

చెంచిగా నీకు అంత డబ్బెందుకురా, ఆడిస్తాడని నువ్వు తీసుకుంటున్నావా, నిజంగానే కావాలా. అనక మల్లా యిచ్చుకునేటపుడు బరువవుద్దని నేను ఓ మూల నసిగాను. ఛెఛెస్ నీకేటి తెలుసు నా అవుసరం అని యెగిరాడు. ఏడుకొండలుకూడా యేమనుకున్నాడో మరి ఔనే బావా, కొంచెం ముందెనకలు చూసుకు మరీ తీసుకోడం మంచిది గాదా, అనక ఈడి పేరేడుకొండలేగాని, వుట్టెదవనాయాల, కాబూలీ జీబూతం అనగలవు, చూడు మరి అన్నాడు పరాసికంగా అన్నట్టు.

కాదుకూడదంటూ అవురుబావురని రొక్కం లాగేసుకు రొంటెని దోపేసుకున్నాడు చెంచయ్య.

ఏమోలే. పిల్లా జెల్లా ఉండె, పైగా రొండుకాపురాలాయె అడికేటి అవుసరమో మనకేల అని నేనూరుకున్నాను.

నేననుకున్నట్టే అయింది. వారం తిరిగేసరికే పెద్దామె అక్కాబత్తుల వాడింటిమీదపడి దుమ్మెత్తిపోస్తోంది – చిన్నామెకి పట్టెడ పురమాయించి నపుడు నాకేల జెప్పలేదు అని. తరువాత సవుతులిద్దరూ తగవులాడుకున్నారు. నీకు పిల్లాజెల్లాలేరు. గొడ్రాలివి..... నీకేం కులుకుతావు. నీకు దోచిపెట్టే అప్పుల్తో నా కొంప గుండం చేస్తున్నాడు అంది పెద్దామె. ఆపైన ఏడుకొండల్నికూడా తూర్పారబట్టేసింది.

వింత జెబుతా విను. ఇంతపోరూ అయేసరికి చెంచయ్యకి యేడుకొండలమీద మనిషికొచ్చినంత కోపమొచ్చేసింది. ఈ యెదవనాయాల యియ్యమట్టేగదా నే బుచ్చుకున్నా, దాని మూలానేగదా చిన్నమ్మికి పట్టెడ చేయించడం, పెద్దమ్మికి ఉసురు పెట్టడమూను అని ఆ వాడనా ఆ వాడనా అన్నాట్ట. ఏడుకొండలికి పౌరుషమేసుకొచ్చింది. న్యాయాల నే నొద్దు మొర్రో అంటే పేణం కడంటేలా పీక్కు తినేశాడుగదయ్యా అన్నాడు. కాని ఎంత రాక్షసుడయినా మంచి ముండావాడేమో తమాయించుకున్నాడు. చెంచయ్యకేమట్టుకు కోపం పోలేదు. ఇంత వొంచనజేసి

నన్ను పెడదారిన పెడతాడా, ఇలా ఎన్ని కొంపలు కూలిపోతున్నాయో అని నచ్చజెప్పుకున్నాడు.

అంచేత డబ్బు చేతికందిన రోజున ఏడుకొండలు గుమ్మానికొచ్చి పిలిచేవరకు చెంచయ్యకి డబ్బు వదులుకో మనసు కాలేదు. మనసు నీరుగారి పోయింది. చచ్చి చెడి గడించిన డబ్బంతా ఈడెదాన ఒక్కసారి గుమ్మరించడమేవిటని విసుక్కున్నాడు. ఆపైన మళ్లీ ఏమనుకున్నాడో యేం జాలిపడ్డాడో లేకపోతే ఏడుకొండలు కండలుచూసి ఇంకేమన్నా అనుకొన్నాడో మొత్తానికి శాంతంగానే యీవలకొచ్చి, కూచోమని దాహం అడిగి, కుశలంజెప్పి, బావా ఒక్కిన్నపం అన్నాడు.

ఏంది చెంచయ్యా అన్నాడేడుకొండలు కులాసాగా.

మరేంలేదు బావా. నగదేమో చేతికొచ్చినమాట రైటే. నీకు దెల్సనుకో. కాని ఇపుడేగదా అందిందీ. ఇంకా సరిగ్గా లెక్కెట్టికూడా చూడలేదాయో అంటోంది నీ చెల్లమ్మ అంటూ నసిగాడు.

ఏడుకొండలు నవ్వాడుగాని మాటజారలేదనుకో.

అయినా ఆ కాస్త నవ్వే దొరకబుచ్చుకుని పుంజుకున్నాడు. రెండ్రోజులు యింట్లోవుంచుకుని నీది నీకు పువ్వుల్లో బెట్టిచ్చెయ్యనూ, అందులో కానీ ముట్టుకుంటే ఒట్టు..... మరేంలేదు, మాలక్ష్మి యిలా కొంపలో అడుగుపెట్టిందో లేదో అప్పుడే మళ్లగొడితే మనసు పీకుతాదని బుల్లెమ్మ ఇదవుతుంది అన్నాడు.

సర్లే. నీ మాటే కానీయ్ అంటూ చెంచయ్య బుడ్డాడి బుగ్గ పుణికి, చేతిలో జీళ్లపొట్టం వాడిచేత పెట్టి ఏడుకొండలు వెళ్లిపోయాడు.

రెండ్రోజులు తరువాత మనింటెదగ్గర జతపడ్డారిద్దరూ. అపుడే బాకీ బాగోతం అంతా బాగా తెల్సిందనుకో. ఏడుకొండల్ని చూడగానే చాటుకి పిలిచి, బావా నీ డబ్బు అలాగే ముడిగట్టుందయ్యోవ్! అన్నాడు చెంచయ్య తెచ్చిపెట్టుకు నవ్వి.

మరేమంటావు. నేను వచ్చేట్టా, మాపిటికి నువ్వు దెచ్చేట్టా అన్నాడు ఏడుకొండలు.

మాపిటికే గావాలంటావా. పిల్లలు పెడతదేమిటి అన్నాడు చెంచయ్య చనువుదీసుకుని.

యాడవబోయి బావుండదని నవటాలంటే యేవిటో ఏడుకొండలు మొగం చూడగా నా కానాడు దెల్సింది.

యాడాది రెక్కలకష్టం గదా, అందులో ఒక్కరూపాయి డబ్బు లెట్టి పవ్వా వణ్ణవూఁ సుబ్బరవైన కూరా చేసుకుదిన్న పాపానపోలేదూ మన వేఁడత్తా యిత్తే అన్నకి మటుకేవిఁ సుకవూఁ అంటందయా చెల్లమ్మా అని నసిగాడు చెంచయ్య.

ఏటో మీ చాదస్తాలు మరీ చిత్రంగున్నాయి అంటూ వెళ్లిపోయాడు ఏడుకొండలు.

వారం తిరిగాక ఓరోజు మద్దినేళ చెంచయ్యింటికి వెళ్ళాడు ఏడుకొండలు.

ఎండని పడొచ్చావేటిసేషాలన్నాడు చెంచయ్య.

కొత్తవేటున్నాయి గనకా అన్నాడు ఏడుకొండలు గుంభనగా.

పాతవి మటు కేవున్నాయి అన్నాడు చెంచయ్య ఇంకా తొణక్కుండా.

—డబ్బు కాకా— అని మాట జారేసింది బుల్లెమ్మ.

శాస్త్రరం జెప్పినట్టుంది, బావకస్తమానూ అదే జాసనుకున్నావేటి మన్లాగా అన్నాడు చెంచయ్య– నవ్విన పెళ్లాంకేసి కొరకొర జూసి.

మీ సంగతేవోఁ నా కెరుకలేదుగాని, నాకు మటుకు డబ్బు గావాలయ్యోయ్ అన్నాడు ఏడుకొండలు సిగ్గువిడిచి.

అంత మోటగా తీసుకుపోవద్దని బతిమాలాడాడు చెంచయ్య. ఇంటో తెచ్చి పదిరోజులైనా ఉంచుకోకుండా ఇస్తే మనసొప్పటం లేదన్నాడు. ఎలాగా ఇచ్చేసేదిగదా అన్నాడు. ఇంకొక పదిరోజులుంచుకోనీ అన్నాడు.

సరేనన్నాడు ఏడుకొండలు. పది వెళ్ళాక పదకొండో రోజున అడిగితే, ఇవాళ సుక్కురారంగదా చూస్సూచి మాలక్ష్మిని ఎలా పంపుకోను అన్నాడు.

శనివారంనాడు ఏడుకొండలు గుమ్మంలో కొచ్చేసరికి చూడనట్టు లోపల కూర్చుని తలుపేసుకుని పెళ్లాన్ని పిలిచి, ఆ శనిగాడొస్తాడు డబ్బెక్కడుందో చూడమని గట్టిగా పురమాయించాడు.

ఏడుకొండలకి ప్రాణం నీరుగారిపోయి వచ్చిన వాడొచ్చినట్టే వెనక్కెళ్లిపోయాడు.

ఆదివారంనాడు చెంచయ్య సంతకెళ్ళాడు.

సోమవారంనాడు చెంచయ్య బుల్లోడు, ముంతెడు రూపాయిలూ కలబోసుకు ఆడుకుంటున్నాట్ట, వాణ్ని ఏడిపించటం ఎలా? సరే మంగళవారం ఎలాగేనా మంగళారం గదా బుధవారం నాడు మటుకు ఇదిగో పదబావా, నీ వెనకాలే వస్తున్నా, ఎంతేనా కష్టార్జితం చూడు అన్నాడు చెంచయ్య.

నాది మటుకు కాదేటి. అప్పనంగా వచ్చిపడ్డ బాపతనుకున్నావా అన్నాడు ఏడుకొండలు.

అంతమాటన్నానా శాంతపడు అన్నాడు చెంచయ్య నవ్వి– అప్పనంగా వచ్చింది అప్పలాళ్ల కడుపుకొట్టి కొంపలార్చి, వడ్డీలుగా పోగేసింది కాకపోతే ఇది కష్టార్జితమా ఏవిటని మనసులో అనుకున్నా. అందుకని తన కష్టార్జితం మీద జాలేసింది. పాపం అనుకున్నాడు కూడా మొత్తానికి బుధవారం నాడు ఏడుకొండలు వెనకాలే డబ్బు మోసుకొస్తానన్నాడుగాని అంతపని చెయ్యలేదు. పిల్లాడు కబుర్లు చెపుతావుంటే సరదాగా కూచుండిపోయాడట.

లక్ష్మింవారం, సుక్కురారం, శనివారం ఏడుకొండలు అటేపు వెళ్లనేలేదు. ఆదివారంనాడు చెంచయ్యే కబురెట్టాడు ఏడుకొండలికి.... ఒక్కసారి చూసిపొమ్మని.

ఒంట్లో నలతగా ఉంది బావా. పులపరం తగిలిందంతకన్నేం లేదని బుల్లెమ్మందిగాని ప్రాణం బేజారుగా వుంది. నేనే పైకం తెద్దామనుకొన్నాను గాని, వొల్లనయింది గాదు అన్నాడు చెంచయ్య నీరసంగా.

ఏడుకొండలికి తలకొట్టేసినట్టయింది. ఇన్నాళ్లూ అందరూ, అందరితోపాటు తనూ, తనని యములాడనన్నా నవ్వేసేవాడు. ఈసారి నిజంగానే తను యముడు అయినట్టనిపించింది. ఆ రోజుల్లో ఉండుండి మీసం తడుముకొనేవాడు. దున్నపోతుకూ బర్రెలకీ దూరంగా నిలబడేవాడు.

అలాగే కానీ అన్నాడు దిగులుగా.

మరేంలేదు. కొంపలో నాలుగురాళ్లున్నాయన్న ధీమా చూడూ, అదే పదిమందుల పెట్టు. పత్తెం దినగానే..... అన్నాడు చెంచయ్య.

పదిహేనురోజులిగ్గాని పత్తెం దిన్నట్టు పల్లీకున ఒప్పుకున్నాడుగాదు చెంచయ్య.

ఈలోగా ఏడుకొండలు డబ్బుకి రొక్కసంపడ్డా నోరు మూసుకున్నాడు.

ఆ తరువాత అతను నోరెత్తిన రోజుని చెంచయ్య గజగజలాడి పోయాడు– మార్గశిరమాసంలో గోదాట్లో స్నానం జేసినాడిలా.

అంతలో నోరు పారేసుకున్నందుకు ఏడుకొండలికి మళ్లీ మనసెలాగో అయిపోయి శాంతపడి ఇంటికెళ్ళిపోయాడు.

మర్నాడు, అతన్ని వాకిట కూచోబెట్టి చెంచయ్య బుల్లెమ్మా చెరోవెంపూ జేరి ఓదార్చారు. మరేం ఫరవాలేదు, తిడితే తిట్టావు మేం కోపం జేసుకోంలే అన్నారు. నువ్వు కాకపోతే మరెవ్వరు తిడతారన్నారు. మరోడు తిడితే ఊరుకుంటామా అన్నారు. ఊరుకునేది లేదని కూడా ఖచ్చితంగా చెప్పేశారు. ఆనక చెంచయ్య డబ్బుసంగతి కూడా మెల్లిగా నచ్చచెప్పారు.

ఏడుకొండలకి వెంటనే ఆ నాలుగొందలూ ఇవ్వడానికి అభ్యంతరం లేనిమాట నిజమేట. కాని అంత దూకుడుగా వెళ్లి ఆ నాలుగొందలూ చక్కబెట్టే రాచకార్యాలేముంటాయి గనుక. చేసే నిర్వాకం ఏముంటుంది గనుక. అవేమన్నా పిల్లలు బెడతాయా. ఆ మాటకొస్తే ఓ నెల్లాళ్లపాటు ఇందమ్మటే తన ఇలాకాలో ఉంటే పాతికా, పరకా వడ్డీవస్తే పిల్లలకీ బట్టాపాతా కొనవచ్చు. ముసల్ది మూడేళ్లమట్టి సణుక్కుంటోంది ఓ కొత్త గొంగలీ కొని తగలెయ్యమని. అందుకని, మొన్నే....డబ్బు ఇంటో ఊరికే పడుంటే ఎవడు దిన్నట్టని– మొన్నంటే మొన్న ఒహ కావలసి నాయనికి సర్దాడతను. మళ్లీ నెల తిరక్కుండా తిరిగొచ్చేస్తుంది పైకం. అవతలివాడు చాలా పెద్దమనిషి. మరోడూ మరోడూకాదు, అన్నవేళకి తప్పకుండా జమచేస్తాడు, దేవుడంటే నమ్మ ఏడుకొండలూ అంటూ జరిగిన విషయం చెప్పుకొచ్చాడు.

ఏడుకొండలికి మధ్యలో ఓచోట కోపం వచ్చింది. ఓ చోట దుఃఖం పొర్లిపోయింది. ఇంకోసారి ఖూనీ చేద్దామని బుద్ధి పుట్టింది. ఓసారి తనే పొడుచుకు చద్దామని, అందుకు ముందో వెనకో ఈ చెంచయ్యగాడికి అప్పేస్తానన్న నాలికని తెగ్గోసేసుకోవాలనీ మనసైంది. మరోసారి ఆలుమగలిద్దర్నీ వేలాంపాడి పారెయ్యాలనిపించింది. చివరికి జరిగింది మాత్రం భోరున ఏడిచి నెత్తికొట్టుకొని ప్రాణం చాలొచ్చి కుప్పకూలిపోవడం. ఆలుమగ లిద్దరూ అతన్ని పోగేసి లేవదీసి కుదేసి మంచినీళ్లిచ్చి పంపేసారు దప్ప డబ్బు ఇవ్వలేదు. ఇచ్చేందుకు డబ్బు లేకనా అనడగవేం? డబ్బేమో ఉండె.

కాని రెక్కలార్చి గడించినదాన్ని ఈ యములాడి ఎదాన గొట్టటానికి చేతులురాలేదు. వాళ్లుమటుకేం జేస్తారు. అప్పుతీర్చేడబ్బు అలాటిదాయె. తీర్చేటప్పుడు ప్రతి మనిషికి మనసలా ఉండునాయె.

నువ్వు కావాలంటే ఓసారి మన చిఠ్ఠాబుక్కు చూడు.

బదులు తీసుకొన్న పైకాన్ని అసలసలుగా మొత్తంగా జమకట్టిన కాతా లెన్నున్నాయో లెక్కెట్టిచూడు. వందబుచ్చుకున్నవాడికి, వందా ఇవ్వడానికి చచ్చినా చేతులావు. తొంభై

ఇస్తాడు. పదీ అనకపంపుతా బాబాయ్ అంటాడు. ఇంతడబ్బు నీ ఎదాన కొడుతూ వుంటే వెధవ పది రూపాయలకి ఏడవక్కర్లేదులే అన్నట్టు. అనక ఆ పదీ ఏదిరా అని మనం అడిగితే వాడిచ్చిచచ్చాడా. చిన్నదయిపోయె. ఏదిరా అని అడిగితే మనం నూగింజకి నాలుకజాపే దరిద్రులం అయిపోతాం. అడక్కపోతే ఆ మాటేనా ఉందా. మళ్లీ అప్పుకొచ్చినపుడు నీ పాతబాకీ అణాపైసల్తో పారేశా కావాలంటే చిరాజాసుకో అంటాడు. పదుచ్చుకున్నవాడు అందులో రెండుకో మూడుకో నామం బెడతాడు. ఇదీ మనకి దక్కే వడ్డీ.

ముసలాడు పొద్దున్నే కూచోబెట్టి ప్రాణం తోడేశాడనుకునేవు. ఊరికే లోకమ్మీద సంగజ్జెప్పాను. నీ జతగాడు మంచివాడే కావచ్చు. కానీ సంగతది. బాకీ తీర్చేటపుడు డబ్బు విదల్చడానికి ఓ పట్టాన ప్రాణం వొప్పదు. ఇదన్నా డబ్బు వుంటే గింటే మాట. అసలు చేతికే డబ్బు రాబోతే ఇంకెంత అవస్థ చూసుకో.

ఇంతకీ ఏడుకొండలు చెంచయ్యదగ్గిర ఆ బాకీ ఎలా వసూల్జేశాడంటావు? అన్నాడు మునసబుగారు.

ఏమో తెలీదేనాన్నా అన్నాడు గుర్నాథం.

ఆలోచించి చూడు.

నాకు తెలీదే, నీకు తెలుసా?

నాకూ తెలీదు. అసలు వాడు వసూలే జెయ్యలేదు. ఏడుకొండలు అవసరాన్ని బట్టి "నేనెరిగిన పెద్ద మనిషి దగ్గిర ఋణమిప్పిస్తాను పట్టు" అంటు మూడోమనిషిద్వారా ఐదొందలు నూటికి నెలకి రూపాయి వడ్డీ మీద నోటురాయించుకు ఇప్పించాడు చెంచయ్య. నోటు మాటవరసకే అన్నాడు. వడ్డీ నేను సర్దేస్తాలే అని మాట వరుసకు అన్నాడు. ఏడుకొండలకి తను బాకీ ఉన్నది అలా ఫిరాయించేస్తానని కూడా మాటవరుసకే అన్నాడు. ఏడాది తిరిగే సరికి, కోర్టునుంచి సమన్లొచ్చాయి. నోటు వరసమూలంగా. ఏడుకొండలు రాద్ధాంతంచేసి, నువ్వేపోయిచ్చుకో అన్నాడు చెంచయ్యని. నాకేం పట్టె మధ్య, నేన్నీబామ్మర్ది ననుకున్నావా, పోవోస్ నీకన్నా మొనగాళ్లను చూశాం అని గసిరిపారేశాడు చెంచయ్య.

ఏడుకొండలు మాట అలా తూలకపోతే తాను సర్దేవాడేనట. చివరికి ఎక్సుపార్టీ డిక్రీ అయిపోయింది దావా. అమీను గుమ్మాన నిలబడేసరికి అనూ మినూ అనకుండా ఐదొందల అరవై కరుకులూ, కోరటు ఖర్చులూ పైగా అమీనుగారి ముడుపూ చెల్లించుకున్నాడు. తరువాత ఏడుకొండలు మళ్లీ మనిషవలేదు.

మరి నువ్వు సాక్ష్యం ఇవ్వలేదా? ఇలా ఏడుకొండలు చెంచయ్య బదులివ్వగా చూశాను– అని? అని గుర్నాథం తండ్రిని అడగలేదు.

అడిగినా చెంచయ్య ఆ బాకీ తీర్చలేదనడానికి మటుకు సాక్ష్యమేముందిటా అని తండ్రి అంటాడని అతనికి తెలుసు.

ఇలాటి ప్రశ్నలు అడగరానివనికూడా లోగడ ఇలాటి ప్రశ్న వచ్చినపుడు ఆయన చెప్పాడు. ఎందుకో ముందు ముందు నీకే తెలుస్తాయిలే అన్నాడు.

సరేనాన్నా వాణ్నోసారి అడిగొస్తాను. మళ్లీ బాకీ తీర్చడానికి నీకు డబ్బెక్కడనుంచి వస్తుందీ, ఎంత వస్తుందీ అని కనుక్కుంటాను. వాడిచేతి కెంతొస్తుందంటే అందులో సగమివ్వచ్చునేమో. అప్పుడు బాకీ తీర్చడానికి అట్టే బాధగా ఉండదుగదా అన్నాడు గుర్నాధం.

నీ యిష్టం, నాదేముంది అన్నాడు మునసబుగారు"

☆ ☆ ☆

సుబ్బన్న అప్పారావు కథను ఆపి బుస్సురని నిట్టూర్చాడు.

## చీమా పాముల సంవాద ప్రకారము

చీమల సింహాద్రి కళ్ళు పెద్దవిచేసి చూసి ఏమయ్యా విచారిస్తున్నావు. చివరికి అప్పారావుకి గుర్నాధం ఆ అప్పు కాస్తా ఇచ్చేస్తాడని బాధగా ఉందా అన్నాడు.

నాగలక్ష్మి విసుక్కుంది.

సుబ్బన్న మొగలిపొదల మీదనుంచి వచ్చిన గాలిమటుకు అల్పాహారం చేసి మిగతాది నాజూగ్గా వదిలేసి స్తిమితపడి నవ్వాడు.

అబ్బీ మీకేం చల్లగా గుట్టుచప్పుడు కాకుండా మా పుట్టలో దూరి కూచుని పుట్టని అప్పెడతావా అని బేరాలు పోతారు. అప్పెట్టడం ఎంత ముప్పో మీకేం తెలిసేను. చీవంత చింతలేదు తీసుకునేవాడికి, ఇచ్చేవాడి బాధ బోధపడేదెలా? అన్నాడు సుబ్బన్న.

సింహాద్రి చిన్నబుచ్చుకున్నాడు. అబ్బీ సుబ్బన్నా అదేపనిగా అప్పులు చెయ్యడం మాకేం సరదా కాదు.

అసలు తీరికాలేదు. ఇవాళ మీరు ఇచ్చారుగదా అని మేము తీర్చకాపోము; తీర్చాం గదా అని అదే పనిగా అడగనూ అడగము. అడిగిన కొద్దీ ఇస్తున్నారని రేటు నానాటికీ పెంచనూ పెంచము. అప్పుడు, అప్పడి కథలా అసలుకే మోసంవస్తుందని తెలుసు.

అప్పడి కథేమిటి? అసలుకే మోసం ఏ మొచ్చె అంది నాగలక్ష్మి.

తానెరిగిన తాళపత్ర గ్రంథాలలోని అప్పడి కథను అప్పుడు సింహాద్రి ఇలా చెప్పాడు.

★ ★ ★

## అప్పడింకథ



పూర్వము అప్పడని ఒక్కడుండెను. ఇద్దరు ఉన్డుటకు వీలులేకనే వక్కడు వున్డెను. వానికి డబ్బుగల స్నేహితుడూ గలడు. అందువల్ల డబ్బులేదు. అందువల్ల స్నేహితుడు అప్పడికి మొహమాటంచే ప్రతిదినమూ ఒక వరహా బదులు ఇచ్చుచుండెను. ఇట్లుండగా ఒక దినమున అప్పడు ఇట్లాలోచించెను; వీడు నాకు రోజురోజా వడ్డీ వరహా ఇస్తూ వున్నాడుగదా, వక్కసారే వంద ఎందుకు అడగరాదూ. వీడు ఇవ్వరాదూ. ఇట్లా యోచించి అట్లా అప్పడు మిత్రుడుని ఒకరోజున వక్కసారిగా వంద వరహాలు అడిగెను. వాడు వెంటనే నా వద్ద అంత డబ్బులేదుగదా ఏమి చేయుదునూ అని యోచించి ఓరీ అప్పడూ నావద్దలేదు అని చెప్పివేసెను. మొహమాటము పోయింది గావున మరునాడు కూడా ఒక వరహా యివ్వలేదూ.... అని కథ ముగించాడు చీమల సింహాద్రి అయాసపడుతూ.

## బాతు పరిహసించుట

ఆ దారినపోతున్న బాతు సుబ్బన్నకి దూరంగా ఆగి బక బక నవ్వి ఈ సింహాద్రిగారు మన కథలనే మనుష్యుల మీద అల్లి తమాషాగా చెబుతున్నారు అని తమాషాగా నవ్వి, నాగలక్ష్మి బుస్సుమనేసరికి తుర్రున పారిపోయింది.

★ ★ ★

# ఋణాన్నభుక్కుల కథ



ఔను, దురాశ దుఃఖానికి చేటు అన్నాడు సుబ్బన్న. పూర్వమొక ఋణాన్నభుక్కు ఇలాగే తిరిగి ఎక్కడో ఒక చోట ఒక మాడ అప్పు తెచ్చుకుని మూడు ఝాముల వేళ ఇంటికిపోతూ, రాజవీధి మొగలో దూరంగా ఋణాశనుడనే వాడిని, వాడి మొహాన్ని చూసి వాడికికూడా అనాడు ఓ మాడ దొరికే ఉంటుందని, తను తన యింటి బాధను మరొక్కసారి ఏకరువు పెడితే ఋణాశనుడి రొంటిలో ఉండగల మాడలో సగబాలు అప్పు సంపాదిస్తే, మర్నాడు తనకి వేతనం రాగానే తీర్చి పారెయ్యొచ్చనీ ఆశపడి పనిమల్లె ఋణాశనుడికి ఎదురేగి పలకరించి తన పాచిక వేయబోయాడు. ఆ వరకే ఈ ఒయినం పసిగట్టిన ఋణాశనుడు ఇతనికన్నా ధాటిగా దుఃఖించి, తాను ఇవ్వకపోవడమే కాక, ఋణాన్నభుక్కు రొంటిన వున్న మాడా కూడా అప్పుగా వడేసి పుచ్చుకు తనదారిన పోయాడు అన్నాడు సుబ్బన్న.

ఈ కథ లాలకించిన చెట్టుమీద కాకి మటుకు కావుకేకపెట్టి అయితే ఔ గాక, మహా చక్కటి నీతి కథలు గదా, సుబ్బన్నగారూ మీరేం అనుకోకండిగాని, నా మాటవిని మీ పుట్టని అప్పివ్వండి. మళ్లీ వాళ్లు కాళీచేసి యిచ్చేస్తారు అని ఊరుకుంది.

చీమలూ పాములూ పైకిచూసి నవ్వుకున్నాయి. ఒకటి రెండు జాలిగా కూడా చూశాయి.

★ ★ ★

# ఋణకేతుని కథ



కొాకరాజా! నీ మాటే కాక వ్యూహకూడ మంచిదికాదు. పరాయి గొడవల్లో కలుగచేసుకోరాదు. నువ్వే చిక్కుల్లో ఇరుక్కుంటావు ఋణకేతుడులా జాగ్రత్త అంది నాగలక్ష్మి వెటకారంగా.

ఎవరా ఋణకేతుడు? అన్నాడు సుబ్బన్న భార్యవంక చూసి.

నాగలక్ష్మి ఆ కథ చెప్పింది.

పూర్వము ఋణవ్రతుడు అనే వాడొకడు ధనస్వామి అనే శ్రేష్ఠిని అప్పడగబోయాడు. ధనస్వామి లేదంటున్నాడు. ఇతను ఇవ్వమంటున్నాడు. దారిని పోయే ఇంధనస్వామి వీరి తగాయిదా చూసి పలకరించి యేమయ్యా మా ఋణస్వామి మహాయోగ్యుడు గదయ్యా. బుద్ధిమంతుడు గదయ్యా అతనికి అప్పివ్వడానికి సందేహమేల అన్నాడు నవ్వుతూ. ధనస్వామి కోపగించుకుని నేనలా కళ్లు మూసుకుని అప్పులివ్వలేను. అంత నమ్మకము ఉంటే నువ్వే ఇవ్వరాదా అన్నాడు. ఓ ఎందుకివ్వనూ అనేశాడు ఇంధనస్వామి కళ్లు మూసుకునే. అవి తెరవగానే కటుక్కున నాలిక్కరచుకొని, అదీ అప్పుడే ఆ దారిని అమ్మొచ్చిన గంపలో పచ్చి వెలక్కాయా కలిపి మింగేసి గుడ్లు మిటకరించి "చేత డబ్బయితే లేదుగాని" అని – సాగదీశాడు.

దానికేముంది నీక్కావాలంటే నేను అప్పిస్తాను. నిన్ను నమ్మగలనుగా అంటూ ధనస్వామి ఇంధనస్వామికి అప్పిచ్చాడు. గత్యంతరంలేక ఇంధనస్వామి దానిని ఋణకేతుడి చేతుల్లో తగలేశాడు. అది ఇంక మళ్లీరాదని సలహా ఇచ్చేముందే తనకు తెలుసు. కాబట్టి ఇంటికెళ్తూనే అంగరకా విప్పి భోరున ఓ ఏడుపు ఏడ్చి ఊరుకున్నాడు. కాబట్టి ఓ కాకరాజా ఖబర్‌దార్: చెట్టుమించి నీ గూటికే మోసం రాగలదు అంది నాగలక్ష్మి.

కాకరాజు భార్య కంగారుపడి కావురు బావురని ఏడ్చి నాగలక్ష్మిని బతిమాలుకుంది. నా తల్లీ, పిల్లలవాళ్ళం, అలాటి పనులు చెయ్యకండి అంది. అని మొగుడి డొక్కలో

రెక్కతో పొడిచింది. రెక్కాడితేగాని డొక్కాడనివాళ్ళం. మనకే రభసలేల? నీవుపోయి పిల్లలకి మేత పట్రాకుండా కాకమ్మ కబుర్లూ నువ్వూనూ అని మందలించింది.

తరువాత ఓ రెండు నిముషాల సేపు నిశ్శబ్దం గంభీరంగా ఉపన్యసించింది.

ఇంతకీ యేమంటారు? పుట్ట కాళీచేస్తారా లేదా అంది నాగలక్ష్మి కర్కశంగా.

చిత్తం తమరిలా అంటే ఎలా. కాళీ చెయ్యాలన్నా లక్షలకొద్దీ ఉన్నాం. కాబట్టి వ్యవధి పడుతుంది. ఈలోగా మీరు తొందరపడితే కుట్టి చంపేస్తాం గాన గ్రహించగలరు అన్నాడు సింహాద్రి.

కాపోయినా, పదికాలాలు మనకి అప్పిస్తే వీళ్ల పుట్ట మునుగుతుందా. నిజంగానే రేపు వరదలొచ్చి పుట్ట కొట్టుకుపోతే ఏంగాను ఋణతిలకుడి డబ్బులా అందో కుర్ర చీమ.

* * *




ఏమా కథ అని యెవరూ అడగలేదు. అందుకని తనే చెప్పేసింది.

ఋణతిలకు డనేవాడు' తన దగ్గిర డబ్బుని అంతా అప్పు అడుగుతారని భయపడి పెరట్లో గోతిలో దాచుకోగా, దానిని దొంగ లెత్తుకుపోగా, మర్నాడు వాడేడుస్తూ ఉండగా వాడిని క్రితంరోజునే అప్పడిగి లేదనిపించుకున్న అప్పన్న వచ్చి పక పక నవ్వి ఓరి నువ్వు నాకు నిన్న అప్పు ఇచ్చి ఉండినట్లయితే దొంగతనం జరిగినా నీ డబ్బంతా నేను అచ్చుకునే వాడినిగదా అని పకపక నవ్వి వెళ్లిపోయెను, అని ఒక్కగుక్కలో కథ ముగించి అమ్మయ్య అయిపోయింది, అందా కుర్ర చీమ.

* * *




సింహాద్రి వాత్సల్యంతో కొంచెం ఓరిమి నటించి మరీ నవ్వి, పిల్లవాడు చెప్పింది నిజమే, నా పాత జన్మలో ఓసారి ఒకడిలాగే ఊరిమీద బందిపోట్లు రేపో మాపో పడుతున్నారని తెలిసి తక్షణం, తన డబ్బుని అడిగిన వాడికి అడగని వాడికి కూడా అప్పులిచ్చేసి ఋణపత్రాలు రాయించుకొని అవి ఓ పెట్టెలో భద్రపరచుక్కూర్చున్నాడు. మూడోనాడు దొంగలు రానే వచ్చారు. దోపిడీ చెయ్యనే చేశారు. నాలుగోనాడు నా మిత్రుడు ఉప్పొంగిపోతూ ఊరేగి, నా బాకీలు తీర్చండి అని రభస చేశాడు. దొంగలు కొల్లగొట్టారు ఎక్కడ తెమ్మన్నావు అని వాళ్లంతా మొత్తుకున్నారు. ఆ మాట న్యాయాధికారికి చెప్పుకోండి, నేను అభియోగం తెస్తున్నా మీమీద అంటూ, అతడు ఉత్సాహంగా ఇంటికెళ్లి ఋణపత్రాలు తీసుకోబోయాడు అని సింహాద్రి ఆగాడు. కాబట్టే అప్పులు ముప్పులు నివారించే శ్రీరామరక్షలుగదా అన్నాడు.

అలాగేం? ఆ తరువాత కథ నాకు తెలీదనుకున్నావా అంది నాగలక్ష్మి వెటకారంగా.... సుబ్బన్న ఆమె వంక కుతూహలంతో చూశాడు.

# గడసరి కథాంతం

గుర్తులేదూ. నువ్వే ఆ జన్మలో ఈ పనిచేసిన వాడివి. తీరా ఆ రోజున నువ్వు ఋణపత్రాలు చూడబోయేసరికి అవిలేవు. బందిపోటు దొంగలు దోపిడి హడావిడిలో నీ యిల్లు కొల్లగొట్టి ఋణపత్రాల పెట్టిచూసి అందులో డబ్బుంటుందని పారబడి అదీ పట్టుకుపోయారు గదా. అందుకే నువ్వు కోర్టుకెళ్లలేకపోయావు. అప్పులివ్వకుండా ఉంటే అయ్యో నా డబ్బు దోచుకుపోయారు అని అందరితోపాటు సమానంగా ఉత్సాహంగా యేడ్చి, ఎవరిదగ్గరేనా సాయం సంపాయించే వాడివి. అప్పులివ్వడం వల్ల ఆఖరికి ఆ యేడుపుకికూడా సదుపాయం లేకపోయింది. అంచేత ఇప్పుడు ఈ పుట్ట ఇవ్వద్దు. కూలిపోతే హాయిగా ఏడుద్దాం అంది నాగలక్ష్మి.

మీరు యిలా హఠాత్తుగా కాదంటే యెలా? మీరు కాదనరన్న ఆశతో మేము ఇందులో దిగాం కదా. మూడుపూటలు గడువివ్వండి ఖాళీ చేస్తాము అన్నాడు సింహాద్రి.

సుబ్బన్న మందహాసం చేశాడు. అప్పు దొరుకుతుందన్న వూహతో గాలిపుట్టలు కట్టుకోడం చాలా పొరపాటు– ఐదారు జన్మల తరువాత నువ్వు గాలిమేడ కట్టబోయినట్టు అన్నాడు.

సింహాద్రి గుండె గతుక్కుమంది. నేనింకా ఐదారు జన్మలెత్తాలా.

ఐదారేం ఖర్మ.... జన్మజన్మలా బ్రాటోవర్లు సర్దుబాటై ఇచ్చి పుచ్చుకోడాల్లో బేరీజు సరిపడేదాక ఇదే పని.

ఐతే అప్పుడు నేనేం చేస్తాను? ఏమవుతుందీ అన్నాడు సింహాద్రి.

★ ★ ★

# భవిష్యజ్జాతక కథలు



అవడానికేముంది? నీ దగ్గిర మామూలుగానే డబ్బుండదు ఇప్పటి లాగానే అప్పుండు. ఓ రోజున గబగబా అప్పులన్నీ తీర్చి అవతల పారెయ్యడమే గాక అప్పుల వాళ్లందరి మొహాలు బద్దలయ్యేలా విసరికొట్టి వాళ్లకి యెదురప్పులుకూడా యిచ్చి ఏడిపించేటంత ధనికుడివి కావాలన్న దురాశ కొద్దీ ఓ రోజు పొద్దున్నే మంచిమాట చేసుకొని చిన్న లక్షాధికారింటికి వెళ్లి ఐదొందలు అప్పుతీసుకుని, పెద్ద కోటీశ్వరుడింటికి బయలుదేరుతావు. ఓ షిర్లాగారింట చేబదులు అడగాలని వెళ్తూంటావు. ఆ రోజున షిర్లాగారు కారు నచ్చక సరదాకి రిక్షామీద కొంచెం దూరం వెళ్తారు. రిక్షాకి కూలి ఐదొంద లివ్వడానికి చిల్లరలేక, లక్షరూపాయల నోటుకి చిల్లర దొరక్క "వాట్" అనుకుంటూ వుంటారు. ఛేంజి నాదగ్గరుందని అందాకా ఆ పక్కనే వున్న నువ్వు ఆ డబ్బులిచ్చి రిక్షాని పంపేస్తావు. ఆనక ఆయన నీ ఫ్రెండయిపోయి, ఎపుడేనా లక్షా కోటీ యిబ్బందయితే మొహమాటపడకు పుచ్చుకో అంటాడు. అంటూ ఓ కోటి యిస్తాడు. ఇంకోటిమ్మంటావు నువ్వు. గంటసేపట్లో అప్పు తీరుస్తానంటావు. ఆ రెండుకోట్లూ ఇలా ఆ గంటా పట్టుకునేసరికి వూళ్ళో పలుకుబడి దారుణంగా పెరిగిపోయి పెద్ద-డబ్బు-గాడిలో పడిపోతావు. అపుడు ఖంగారులో షిర్లాగారే నీ దగ్గర పది లక్షలు అప్పు తీసుకుంటాడు కూడా.

ఈ విధంగా ఆలోచించుకుంటూనే వోపక్క అప్పులవాళ్లకు అందకుండా, వాన చినుకులమధ్య నకులుడు గుర్రం తోలినట్లు నీ చేతిలో డబ్బు పట్టుకు వెళ్తూ వుంటావు. అయితే నీ కల, పతాక సన్నివేశానికి వచ్చేసరికి, ఆ కలలో నీ చేత డబ్బును ఏ షిర్లావో అడిగాడనుకొని అందించ బోయినట్టు పట్టుకుంటావు. అపుడు యెక్కడనించో అప్పారావు వచ్చి రెండొందలు చేబదులు తీసుకొని, నీదగ్గర డబ్బుందని గాలిలో వూదేవరకు, అప్పులవాళ్లు వడగళ్లలా వచ్చిపడి ఉన్నది ఊడ్చుకుపోతారు.

ఓ సింహాద్రీ: ఇపుడు ఆ బుద్ధే ప్రదర్శించి దొరకబోయే అప్పాను నమ్ముకుని నా పుట్టలో ప్రవేశించావు గాన తెలపడమైనది అని సుబ్బన్న ఊరుకున్నాడు.

సింహాద్రి తెల్లబోయి తేరుకుని సెహబాసు, ఔనుగాని సుబ్బన్నా నీ కెలా తెలుసు ఇవన్నీ, ఈ జన్మలూ ఫిరాయింపులూ కథా కమామీషూనూ? అన్నాడు.

నీవు నేర్పిన విద్యయే అన్నాడు సుబ్బన్న వినమ్రత ఉట్టిపడేలా.

నాగలక్ష్మికి ఈ వరస చూడగా ఒళ్ళు మండింది. బావుంది నీ వినయం నువ్వూ. ఆనక కథయ్యేటపుడు అంతా కలిసి ఫోటోగ్రాపు దిగుదురుగాని, ముందర వాళ్లని లేవగొట్టు అంది భర్తతో.

ఓ నడికారు చీమ, గొంతు సవరించుకుని కలుగజేసుకుంది. అయ్యా సుబ్బన్నగారూ అలా చెప్పొదు మాటలు వినరాదు, చెడేరు.

★ ★ ★

## రష్యాలో రామయ్య కథ



పూర్వము రష్యాలో రామయ్య అనే రైతు ఉండేవాడు. వో మాయదారి మారయ్యకి నాలుగొందలు అప్పివ్వడానికి ఒడిగట్టి, మర్నాడు పంచాయితీ దగ్గిరకొస్తే కాయితం రాసుకు నగదు పుచ్చుగుందుగాని రమ్మన్నాడు. మారయ్య అప్పలు తీర్చడని భయపడ్డ నలుగురు దుర్మార్గులు ఇది తెలిసి పంచాయితీ ఆఫీసు అరుగుముందు రామయ్య ఒక్కడూ కూర్చుని ఉండగా చూసి కొంచెం అసింటా కూర్చుని, ఈ ఊళ్లో ఎవరో వెర్రివెంగళాయ మారయ్యని నమ్మి అప్పేదుతున్నాట్ట, అంతకన్న డబ్బుని గొయ్యితీసి కప్పెట్టుకోరాదూ అని విడివిడిగా రామయ్యకే వినబడేలా అనుకుని లేచి చక్కాపోయార్ట. వరసగా ఇలా నలుగురు అనుకునేవరకు రామయ్యకే మతిచెడి మారయ్య రాగానే నే నివ్వనని చెప్పి లేచిపోయాట్ట. అప్పుడు ఊరివారూ మునసబూ అంతా సంతోషించార్ట. రామయ్యకి గొప్ప ప్రమాదం తప్పిందిట. చెప్పుడు మాటలు వినడంవల్లనేగదా ఆహా అనుకున్నారుట.

చీమ హఠాత్తుగా కథ ఆపేసి చుట్టూ చూసింది. మిగతా చీమలన్నీ తనకేసి భయంకరంగా చూస్తున్నాయి. నాగలక్ష్మి, సుబ్బన్న విరగబడి నవ్వుకున్నారు.

చీమ నాలిక్కరచుకుంది. ఓహో తప్పకథ చెప్పాను కాబోలు లేదా కథ తప్పచెప్పి వుంటాను. పొరబాటు అంది.

కథేకాదు. నువ్వు మాటాడ్డమే పొరబాటు. అసలు నువ్వే పెద్ద పొరబాటు అన్నాడు సింహాద్రి కోపంగా.

★ ★ ★




సుబ్బన్నా నాగలక్ష్మీ ఇహ లాభంలేదని కూడబలుక్కుని పడగలు దింపి పుట్టమీదికి బయల్దేరబోయారు. చీమలన్నీ వాటి భాషలో హాహాకారాలు చేశాయి. అంతలో చూస్తూ ఉండగా సుబ్బన్నకి కొంచెం ఎదరగా ఓ పెద్ద డేగ నీడ పడి ముందుగా సాగిపోయింది. బాబోయ్ అంది నాగలక్ష్మి పైకి చూసి.

అప్పాలవాడులా వుంది అన్నాడు చీమల సింహాద్రి నవ్వుతూ.

సుబ్బన్న మాటాడలేదు. నాగలక్ష్మిని వెంటేసుకుని పక్కనేవున్న పొదలో దూరి కూర్చున్నాడు. ఇపుడుగనక చీమలన్నీ ఇవతలకొచ్చేస్తే అది పైనుంచిచూసి, ఇక్కడేదో ఫలహారం ఉందని కిందికి దిగుతుంది అంది నాగలక్ష్మి.

అయ్యో సుబ్బన్నగారూ, మీరు చాలా అద్భుతమైన నికుంజంలో ప్రవేశించారు. అదృష్టవంతులు. ఇపుడపుడే షికారు వెళ్లరు కాబట్టి అప్పారావు కథ ముగించేస్తారా? అతనికి మునసబుగారు అప్పిచ్చినట్టా లేనట్టా అన్నాడు సింహాద్రి.

* * *

## అప్పారావు కథ




ఆ విధంగా అప్పారావుకి బాకీ తీర్చే సత్తా ఉందో లేదో కనుక్కొస్తానని త్మ కుమారుడు గుర్నాధం కదలగానే, మనసబుగారుకూడా లేచి అగరా అబ్బీ నేనూ వస్తా, అటేపే పనుంది, అంటూ వెంట బయల్దేరారు.

ఈ విధంగా వారు వెళ్తూండగా గజ్జెలగుర్రం వంటి ఓ చిన్నది కడవ చంకనబెట్టినది వయారంగాపోతూ ఎదురయేవరకు, అదృష్టవశాత్తు గుర్నాధానికి ఎరిగిన మనిషొకడు తటస్థపడగా, నువ్వు పద నాన్నా అంటూ ఒక్కడుగు ఆగాడు గుర్నాధం. ఈలోగా నాలుగడుగులు ముందుకువేసి వీధి మళుపు తిరిగి శివాలయం చేరబోయేసరికి మనసబుగారికి సుబ్బారావు అని ఒక ఋణగ్రహీత కనుపించాడు. అతడు ఆయనకు ఐదొందలు ఇవ్వాలి. నిన్ననో మొన్ననో జ్మ పెడతానన్నాడు. సరే ఇతగాడిస్తే, తను సుపుత్రుడి మిత్రుడికి ఈ పైకం ఇలాగే ఫిరాయించేయొచ్చునని ముచ్చటపడి మునసబుగారు అతని దరి చేరబోయారు.

వారిని చూడగానే అప్పారావునకు గుండె గుభేలుమంది. అయితే అతను ఉపాయాలపుట్ట కాబట్టి, కర్తవ్యాలు ఎరిగినవాడు కాబట్టి ఆ దారినే బడికిపోతున్న పిల్లల్ని చూసి అందులో ఒకణ్ణే ఆప్యాయంగా ఎత్తుకు ముద్దాడబోయాడు. వాడు మావాడు కాదు అన్నారు మునసబుగారు చిరునవ్వు నవ్వి.

అప్పారావు ఆ పిల్లాణ్ణి పడేసి మందలో ఇంకోణ్ణి ఎత్తుకుని ముద్దాడి ఆయనవంక చూశాడు.

వీడూకాదు అన్నాయి మునసబుగారి చూపులు. వెంటనే అప్పారావు వాణ్ణి పారేసి ఇంకోణ్ణితీసి, ముద్దాడే ముందు ప్రశ్నార్థకంగా చూశాడు.

వద్దు అన్నాయి మునసబుగారి చూపులు.

అప్పారావు కంగారుగా ఇంకో పిల్లడిని ఏరి ఎత్తుకోబోగా నాకు ఆ వయసు చిన్నపిల్లలు లేరు అన్నాడు మునసబుగారు నవ్వి.

చిత్తం ఏ వయసులో ఉంటారండి సుమారు అన్నాడు అప్పారావు వినయం నటించి.

పాతికేళ్ళు.

అబ్బా! చాలా బరువుంటాడండీ అన్నాడు అప్పారావు బిక్క మొహంతో.

నీకన్న ఫరవాలేదు. వెధవాయి తిండి పసిలేక అలా వున్నాడు కాని మా వంశంలో వాడే అర్భకుడు. అయినా నివ్విప్పుడు వాణ్ణెత్తుకోడం నా కిష్టంలేదు. నేనొప్పుకున్నా వాడికి ఇష్టం ఉండదు. వాడి పెళ్లాం నవ్వుతుందని భయం అన్నారు మునసబుగారు పుసుక్కున నవ్వి.

అప్పారావు ఫెళ ఫెళ నవ్వేసి, విరగబడిలేచి, భలేవారండి మీరు. జెంతసరసులూ! చూట్టానికల్లా వున్నారు కాని అని ముడేసుకుపోయాడు.

అది సర్లేకాని సుబ్బారావూ మూన్నాళ్ల క్రితమే పైకం జమచేస్తానన్నావూ ఇదేమన్నా బాగుందా అన్నారు మునసబుగారు.

మరేండి ఏంబావుంది, మహా ఏడిసినట్టుంది. చాలా తప్పుకాదూ? ఆమాటే నేను మా జతగాడికి చెబుతున్నా. ఒరేయ్ అవతల పెద్దమనిషితో మాటరోయ్, మరొకటి కాదురోయ్ డబ్బుయిచ్చితీరాలి అని చీవాట్లేస్తున్నా. ఈ పూట తప్పకుండా యిస్తానన్నాడు. రాగానే మీకు ఫిరాయించేస్తా అన్నా డప్పారావు.

నేనేనా దాన్ని పాతరేసి దాచబొయ్యేది లేదు. నువ్విలా ఇచ్చావో నేనలా మరొకరికి ఫిరాయించేస్తా. మా పిల్లడి జతగాడికి పాపం అర్జెంటుగా కావాలిట అన్నాడు మునసబుగారు.

అప్పారావు గుండె ఠంగున ఆగిపోయింది. అంతలో అల్లంత దూరాన గుర్నాధాన్ని చూడగానే మళ్లీ గబగబ కొట్టుకుంది.

సుబ్బారావూ— వాడేనోయ్ మా పిల్లడూ అన్నాడు మునసబుగారు.

చిత్తం వాడే మా జతగాడు అన్నాడు అప్పారావు.

హాల్లో అప్పారావు, సారీ లేటయింది అన్నాడు గుర్నాధం. వేళకొచ్చావురా అన్నాడు అప్పారావు.

నీ పేరు సుబ్బారావు గాదటోయ్ అన్నాడు మునసబుగా రనుమానంగా.

అప్పారావు చెడ్డ బటాణి సమిలిన వేదాంతిలా నవ్వి, వాటీజినే నేమ్ సార్. పేరులో నేముంది? అన్నాడు వినయంగా.

పదినిమిషాలు కిందా మీదా పడ్డాక మునసబుగారు ఫెళ ఫెళ నవ్వి భలేవాడివయ్యా! నీకు నిజంగా ఐదొందలూ వూరికే యిచ్చినా తప్పులేదు అన్నాడు.

చిత్తం మీ దయ. గుర్నాధం! నువ్విస్తానన్న ఐదొందలిస్తే మీ నాన్నగారికి బాకీ తీర్చేస్తాను మరి పెద్దమనిషితో మాటా మరోటా అన్నాడు.

ఇంక మళ్లీ వాడు ఇచ్చేదేముందిలే. వాడిచ్చినట్టేననుకో అన్నారు మునసబుగారు.

చిత్తం. అయితే వీడిచ్చింది మీకు నేనిచ్చినట్టనుకోండి. ముందర మీ బాకీ ఫయిసలయిందిగదా. అమ్మయ్యా గుండెమీద రాయి దిగినట్టయింది. అదేవిటో ఆ రాయి లేకపోతే నాకు నిద్రపట్టదు అన్నాడు అప్పారావు.

రాస్కెల్ మా నాన్నకే వేశావ్ టోపీ. నాకు తెలీకుండా మా నాన్న దగ్గిర ఎలా పుచ్చుకున్నావూ అన్నాడు గుర్నాధం.

బావుంది నీకు తెలీకుండా నీ దగ్గిర తీసుకోగాలేంది మీ నాన్న దగ్గిర తీసుకోవడం విశేషమా. నీ కసలు నిర్వాకం తెలీదు.

అలా చెప్పనాయనా అన్నారు మునసబుగారు.

చెబుతానండి. ఇంకా బోల్డు చెబుతానుగాని మీరిందాకో మాటన్నారు చూడండి.... అదే ఐదొందలు ఊరికే ఇచ్చినా ఫరవాలేదనలే? అది ఇచ్చేస్తే బాగుంటుంది. అడిన మాట తప్పనివారు, పైగా శివాలయం, పైన అష్టదేవతలూ సాక్షులు. అనవసరంగా ఋణానపడి ఇదవడం మంచిది కాదు, అన్నాడు అప్పారావు.

ఏడిశావు. బోడితెలివీ నువ్వూను అనబోయాడు గుర్నాధం.

కుర్రాడు మంచి చమత్కారి. ఉండాల్సినవాడు. అలాగేలేవయ్యా నాలుగురోజులు ఆగు. చేతికి డబ్బురాగానే నీ బాకీ జమకడతాను అన్నారు మునసబుగారు.

చిత్తం నేను ఎల్లుండి ఊరికెళ్తున్నాను. ఈ లోగా ఇచ్చెయ్యండి. ఒకవేళ డబ్బు రెడీకాపోతే కరణంగారు నన్నెరుగుదురు. వారితో చెప్పి సర్దమంటాను. తరువాత మీరూ మీరూ చూసుకొందురుగాని.... బై ది బై గుర్నాధం! మీ నాన్నగారు ఐదొందలు ఇవ్వగానే మళ్లీ నీది నీకిస్తా గాని ఓ అర్ధణా డబ్బులిలా పారెయ్! శోషొస్తోంది సోడా తాగాలి.

అంటూ కథ ముగించాడు చీమల సింహాద్రి. కాబట్టి ఓ సుబ్బన్నా....

## వారేవీరు లేక పరివర్తనము

అంటూ హఠాత్తుగా నేలమీద డేగ నీడ కనబడేసరికి గబుక్కున పుట్టలో దూరిపోయాడు సింహాద్రి.

ఉత్తర క్షణంలో సుబ్బన్న ఇదేమిటో! చీమకి డేగలంటే భయమేల అనుకుని, తన శరీరం చూసుకుని గతుక్కుమన్నాడు.

చుట్టూ చూసి ఇంకా గతుక్కుమన్నాడు. హడలిపోయాడు. గజగజ వణికిపోయాడు.

మెల్లిగా పడగెత్తి పుట్ట అవతలికి తొంగిచూశాడు. డేగ, పైన చక్రాలు తిరిగి తిరిగి ఒక్కసారి రివ్వున, సుబ్బన్నా నాగలక్ష్మీ అంతకు ముందు దాగిన పొదమీదకు దిగి దాన్ని చికాకు పరిచి వెతికి తెల్లబోయి చిన్నబుచ్చుకుని, నవ్వుకుని అటూ ఇటూ చూసి ఎవరూ తన పరాభవం చూడలేదని ధైర్యం తెచ్చుకొని ఎగిరిపోయింది.

ఓ నిముషం తరువాత సుబ్బన్నా, నాగలక్ష్మీ పొద ఇవతలికి వచ్చారు.

పుట్టలోంచి సింహాద్రీ, అతని బలగం కూడా బయటపడ్డారు బిల బిల్లాడుతూ.

ఇదేమిటి వింత? అన్నాడు సుబ్బన్న.

సింహాద్రి చుట్టూ చూశాడు. తన కళ్లను తానే నమ్మలేక. తనూ తన తోటి లక్షలాది చీమలూ పాములుగా మారిపోవడం జరిగింది.

అంతవరకు వ్యూహా పొగరుగా బుసలుకొడుతున్న సుబ్బన్నా నాగలక్ష్మీ నేలకంటుకుని ఉన్నారు. వాళ్లిద్దరూ చీమలు అయిపోయారు.

నా కర్థం కాలేదు అన్నాడు సుబ్బన్న.

ఏముందీ ఆర్నెల్లు స్నేహంచేస్తే వారు వీరవుతారు అన్నాడు సింహాద్రి తమాషాగా నవ్వి. అతను తన పడగా అదీ చూసుకు మురిసిపోతున్నాడు.

ఇప్పుడు మీరంతా పాములు. ఇన్ని లక్షలమందికి ఒక పుట్ట ఎలాగా చాలదుగదా అంది నాగలక్ష్మి ఆశగా.

మీరిద్దరే చీమలు. మీకు ఇంత పెద్ద పుట్టెందుకు బావురుమంటూను. నిశిరాత్రివేళ మెళుకువవస్తే ఝుడుసుకుంటారు కూడాను అన్నాడు సింహాద్రి.

నాగలక్ష్మి ఓ నిమిషం ఆలోచించి, భయపడితే పడతాంగాని, ఆ పుట్ట మాకు అప్పివ్వండి. ఎంతసేపు, ఇట్టె నిండుతుంది లెండి అంది.

అప్పా? అన్నాడు సింహాద్రి పకపక నవ్వి. మళ్ళీ అదేంమాట. ఇందాకేగా మీ ఆయన అప్పులు అడగరాదూ ఇవ్వరాదూ అని నీతి కథలతో ప్రపంచతంత్రం బోధపరచా ననుకున్నాడు? మళ్ళీ ప్లేటు ఫిరాయిస్తారా?

జన్మలూ శాల్తీలూ ఫిరాయించగా లేంది ప్లేటు ఫిరాయించడానికి ఏముంది.... అదీగాక, ఆర్నెల్లు స్నేహమైతే వారు వీరవుతారని మీరే అన్నారుగా. మళ్లీ బేరాలాడదాం ఆర్నెల్లపాటు. అపుడు మళ్లీ మీరు మేమూ, మేము మీరూ మోరు మారూ మెరు మూరూ మూము మేమూ మూమె మేమే.....

అఋణకిరణుడు నవ్వుకుని కొండచాటుకి పోగానే ఋణకిరణుడు ఇవతలికివచ్చి ప్రతాపం వెలిగిస్తున్నాడు. మళ్లీ అప్పిచ్చినవాడొచ్చి మండిపడేవరకూ నిశ్చింత.

సూర్యుడు సముద్రుడి దగ్గిర అప్పు తీసుకుంటున్నాడు. ఆయన దగ్గరనుండి భూమి అప్పు తీసుకుంటోంది. దాన్ని సముద్రుడు వడేసుకుంటున్నాడు. మళ్ళీ పై వాడికి అప్పులిస్తున్నాడు.

ఋణభ్రమణం దాఋణంగా సాగిపోతోంది.

★ ★ ★




**ఋణా**నందలహరి చదివినవారికి అప్పులుచేసే ట్రిక్కులు కొన్ని తెలియును. ఎన్నో స్ఫురించును. కాని ఒక చదివినవారి మీద యింకొక చదివినవారు యిందులో తాము ట్రిక్కులనుకున్నవి ప్రయోగించటం గిట్టుబాటైన పని కాజాలదు. ఒక చదవనివాడు ఇంకొక చదవనివాడు దగ్గిర ఈ ట్రిక్కులు తెలిసి ప్రయోగించే అవకాశం ఉండదు కనుక చెప్పేదేంలేదు. ఒక చదవనివాడు ఒక చదివినవాడిదగ్గిర ప్రయోగించటమూ అంతే కాబట్టి ఒక చదివినవాడు ఇంకో చదవనివాడిదగ్గిర ( ఉంటే) ప్రయోగించవచ్చు. కాని, అవి చెల్లుబడికాకపోవచ్చు. అందువల్ల ఒక చదివినవాడు ఇంకో చదివినవాడితో చేరినపుడు దీన్ని గురించి, ఇంకా యితర ఋణ వాక్యాల గురించీ కాసేపు మాట్లాడి, ఛలోక్తులాడి, చివర్ని సూటిగా అడిగేస్తే మంచిది. అప్పుదొరకడం, దొరక్కపోవడం వేరే సంగతి. ఇది చదివినవాడు ఒక సుబ్బరమైన అప్పారావును కేకేసుకొచ్చి ఓ అయిదురూపాయలు ఋణదక్షిణ ఇవ్వవలెను.

★ ★ ★

# ఋణదా! శరధీ! కరుణాపయోనిధీ!

ఎవ్వనిచే జనించు ఋణ
మెవ్వనిచే భ్రమియించు లోకమం
దెవ్వని బుద్ధియే ఋణాద
మెవ్వడు నవ్వుచు నప్పారిచ్చు దా
నివ్వగ జాలనం చనక
నివ్వగ జాలకఁ దిప్పనట్టి వా
డెవ్వడు – ఆ ఋణాత్ము, ఋణదేశ్వరు
నేను ఋణంబు వేడెదన్.

ఒక సూర్యుండు సమస్త జీవులకు
దా నొక్కొక్కడై దోచు న
ట్లొకటే రూక ధనమ్ముగా ఋణముగా
నొక్కొక్కచోఁ శిక్షగా
నొకచో రక్షగ, లక్షగా, తృణముగా
నొక్కొక్కలై దోచుగా
కొకటే సత్యము– ఒత్తిరూకసుడీ!–
అప్పొప్పాల్ అపోహల్, భ్రమల్.

ఋణ ఋగ్వేదికి వాదికి
ఋణకారణ జన్ముడైన ఋణఖాదికి దా–
ఋణబుద్ధికి ఋణసిద్ధికి
ఋణభ్రమాభ్రమరునకును ఋణికిన్ ఘృణికిన్.

వ. ఋణతరుణ వందన సహస్రం బాచరించి, నా యొనర్పం బూనిన శతక ప్రకారంబు.... ఒక్క నిముషం; ముందు  నా మనవోఁటి వినండి. తరవాత అసలు విషయానికి రావచ్చు.

కబ్బము చేయుచుంటి నిది
కాగనె, యచ్చుకు బంపగానే, మా
సుబ్బయ డబ్బు పంపగనె–
సుబ్బయ తప్పక పంపులెమ్ము–నీ
డబ్బుల నిత్తుగాని, యొక డెబ్బది–

ఈ యతివల్ల–నిమ్ము, లే
దబ్బ యనంగబోకు
ఋణదా! శరధీ! కరుణాపయోనిధీ!

అప్పులు చాల చేసితిని యర్థత
లేదనబోకు లోకమం
దప్పులు తప్పులు న్నెరుగనేరని
వారెవరైన నుందురే
అప్పులస్వామి యా వరుణు; డప్పుల
కుప్పలు మేఘవార్నిధుల్–
తప్పగునా ఋణంబు? ఋణదా!
శరధీ! కరుణాపయోనిధీ!

సాగరు 'డప్పు'చేసి ఋణసాగరు
డైనను నిచ్చు వాహినుల్
నాగతి చూడవా! యనెడు
నాగటిచాలున కీవు; కావునన్
ఈగతి నప్పు చేసితిని ఇమ్మిక
నమ్మిక నప్పు దాచినన్
దాగని దానశీల! ఋణదా!
శరధీ! కరుణాపయోనిధీ!

'నాకడ నప్పు చేయుటగునా'
యని నవ్వుకొనంగబోకు మీ
లోకమునందు పారు నదులన్నిట
వార్నిధి యప్పుబిల్చగా
నా కడలి న్నగస్త్యముని యక్కటు!
పుక్కిటబట్టి నిల్పలే
దా? కరుణాసముద్ర! ఋణదా!
శరధీ! కరుణాపయోనిధీ!

పూవుల నుండి తేటులును
పున్నమి చందురు నుండి కల్వలున్
గోవులనుండి వత్సములు
కోమలి మోవిని యాని కామియున్–
తావుల తేనె, వెన్నెలను,

తీయని పాలు, సుధారసంబులన్
ఏవిధి నశ్రమంబుగ
గ్రహించెడి-నట్టుల నిప్పుడేను నీ
తావున నప్పుగొందు ఋణదా!
శరధీ! కఋణాపయోనిధీ!

(తమరు ఋణదానం చేసే పర్యంతం బండి కదలదు. ఋణగుణ ధ్వని చప్పున చల్లారిపోతుంది గాన వెంటనే వో దేవా! తామీ విషయం బాలోచించగలరు.)




★ ★ ★

# జన రమణీయం



## ఆకలీ ఆనందరావూ

విద్యుద్దీపాల క్రింద నిలచి ఉన్నాడు ఆనందరావు తెల్లనైన వెలుగుతో నిండిన నల్లనైన చీకట్లను చూస్తూ... అపశ్రుతి సంగీతాలకు లయవేస్తున్న నిశ్శబ్దాన్ని వింటూ.... బజారు బీభత్సంలో బస్సుల రొదలో ప్రశాంతతను వెతుకుతూ...

విలువైన వలువల లోపల శిలలైన గుండెలు గల జనారణ్యంలో విలాసంగా నిలచివున్న నీకు తన ఉనికి చిరాకు కలిగించవచ్చనే భయంతో, తన మాసిపోయిన జీవితంలో పాతిక సంవత్సరాల దొంతర క్రింద నలిగి మాసి పాత చిరునవ్వు శిథిలాలను చూపించి నిన్ను కానీ అడగడానికి వస్తున్న జీవచ్ఛవం, శతసహస్ర ఛ్ఛాయలతో క్షణక్షణం విస్తృతమౌతున్న సారవంతమైన శ్మశాన భూవాటిక మధ్య – నిలచి ఉన్నాడు ఆనందరావు– తన శరీరాన్ని స్వహస్తాలతో భూస్థాపితం చేసే సంకల్పంతో

బజారులో భోజన హోటలు బోర్డుల నీడలో తొమ్మిది గంటల మీద ఇరవైమూడు నిముషాల మీద – ఇంక సరిగ్గా ఏడు నిమిషాలలో భోజనహోటలు మూస్తారు.

బజారు ఆవలిస్తున్నది. బద్ధకంగా మత్తుగా పొగరుగా – అనుకున్నాడు ఆనందరావు. అతనికి ఆవలింత రాలేదు. ఆకలి వేసింది.

ఎవరో ఇంకెవరితోనో అంటున్నారు – సినిమా లేదు, గినిమా లేదు. చప్పున భోంచేసి పోయి పడుకుంటాం. ఆనందరావు వెనక్కి చూశాడు.

అతని కడుపులో కాముడు గావుకేక పెట్టాడు. కసిరి కొట్టాడు. వాళ్ళను చూసైనా బుద్ధి తెచ్చుకో. ఇంక ఆరు నిమిషాలలో హోటలులోకి వెళ్ళి భోజనం ఏర్పాటు చెయ్యి.

ఆనందరావు జవాబు: నువ్వు బెదిరిస్తే ఇక్కడ ఝడిసేవాడు లేదు.

కాముడు: ఈవాళ భోజనం పంపకపోయావా నేను నిరసనదీక్ష ప్రారంభిస్తా.

ఆనందరావు: అదే నే కోరేది.

కాముడు: అందరూ సత్యాగ్రహంచేస్తారు. జాగ్రత్త. రేపు నీ గది నుంచి బయటకు రావు... మళ్ళీ బజారు మొహం చూడవు.

ఆనందరావు: ష్! ఆగు తగ్గు, ఫ్రెండొస్తున్నాడు.

కాముడు: కోతలు, శుద్ధ కోతలు!

ఆనంద: ఒట్టు! సాయంత్రం నేను పలకరించలే? వాడే. మళ్ళీ వొస్తున్నాడు.

కామదు: అప్పుడివ్వని వాడు ఇప్పుడిస్తాడా?

ఆనంద: అదంతా నీకెందుకు రెండు నిమిషాలాగు – కాఫీ, తప్పితే టీ పంపుతా.

కాముడు మొండి జవాబు: చచ్చినా ఒప్పుకోను కాఫీ టీ లకు. ఇవన్నీ పోసి మభ్యపెట్టొద్దు. చెప్తున్నా. నువ్వు కాఫీ పంపించు తిప్పికొడతా.

ఆనందరావుగా మొండికెత్తాడు. వినిపించుకోలే. సిగరెట్టు ముట్టించాడు. కంగారుగా చిరునవ్వు పులుముకొన్నాడు మొహం మీద. ముస్తాబు పూర్తి అయింది. పరిచయం తక్కువ కాబట్టి అతడి దగ్గర అప్పు పుట్టే అవకాశం ఎక్కువే.

ఆనంద: హలో! ఏమండీ!

స్నేహితుడు: ఏమండీ!

నిశ్శబ్దం. ఆనందరావు ఇకిలించాడు. కడుపులో కాముడు సకిలించాడు.

కాముడు: టైము. టైము.

ఆనంద: ఏమిటండీ విశేషాలు.

స్నేహి: ఏమున్నాయండీ. సినిమాకి బయల్దేరారా?

ఆనంద: కొత్తసినిమాల్లేవండీ. చాలామట్టుకు చూశాను. వస్తారా దేనికేనా పోదాం?

లోపల కాముడు కథకళి నృత్యం ప్రారంభించాడు.

కాముడు: పొగరెత్తిందా? టైం ఐదు నిమిషాలే. జాగ్రత్త.

ఆనంద: నోరు మూసుకో! నాకా మాత్రం బుద్ధిలేదా?

స్నేహితుడు సందేహం అభినయించాడు.

ఆనందరావు ఎదురు చూసిన క్షణం వచ్చింది.

ఫరవాలేదు లెండి. ఇవాళ కాకపోతే రేపు. అదీకాక నాకు ఒంట్లో బాగుండలేదు లెండి. రేపెల్దాం. ఔనుగాని, మీరు తక్షణం ఓ మంచి పని చేయాలి.

ఉత్సాహం ప్రకోపించింది. ప్రవాహం సాగింది.

మరేం లేదు. నాకు ఒక్క రూపాయి అప్పివ్వండి. రేపు మనం పిక్చరుకెళ్ళినపుడు నేను తెస్తా.

స్నేహితుడు విచిత్రంగా నవ్వాడు. వెరీసారీ. లేదండీ. ఇందాక మీరు సినిమాకు వెళదాం అన్నపుడు సందేహించా నందుకే. నిజానికి నా దగ్గరున్నది – అంటే ఇపుడు, అరుకానులు.

నిరాశపడటానికీ, తిట్టుకుందుకూ టైము లేదు ఆనందరావుకు.

కాముడు హేళన చేశాడు హి హి హి అంటూ.

ఆనంద: ఫరవాలేదు లెండి. కాని ఆ ఆరుకాన్లూ ఇవ్వండి చెప్తా. మువ్వంటు రోడ్డులో ఒకడు డబ్బివ్వాలి. అక్కడికి వెళ్తా. థాంక్స్యూ. రేపు వస్తారుగా సినిమాకు. డబ్బు ఒకవేళ లేకపోయినా మానకండి. నా దగ్గర బోలెడుంటుంది, గుడ్‌నైట్.

గాలివాన వెలిసింది. ఆనందరావు కాముడిని పిలిచాడు.

టీ పంపనోయ్?

కాముడు: అక్కరలేదు. నీ నెత్తిన పోసుకో.

ఆనంద: సిగరెట్టు కూడా కాలుద్దాం.

కాముడు: నీ నెత్తిన కొడతా.

ఆనంద: నెత్తి ధీము వదిలెయ్. అయినా మరెలాగ చెప్పు. గంట నుంచి ఇక్కడే వున్నాం గదా? ఒక్కడిచ్చాడూ అప్పు? బాకీ వున్నవాళ్ళు అయిపే లేరు.

కాముడు: నిన్ను అప్పులెవడిమ్మన్నాడు?

ఆనంద: నే తీసుకోవడం లేదూ?

కాముడు: ఏడు నీ ఖర్మ... రేపటి నుంచి సమ్మె ప్రారంభం... ఇదే నోటీసు.

ఆనంద: ఆగు ఆగు... అప్పుడే ప్రకటించకు. పాత ఫ్రెండొస్తున్నాడు... అధమం బన్‌రొట్టేనా పంపిస్తా.

కాముడు: ఉద్ధరించావులే – వాడిచ్చాడు. నువ్వు పంపావు.

ఆనంద: కాదులే. వీడి కిదివరకు బోలెడు డబ్బిచ్చా. ఇప్పుడు వాడుద్యోగం చేస్తున్నాడు.... ఏంరోయ్ రాజా!

రాజు: ఏంరోయ్! ఏమిటి, నువ్వింకా ఈ వూళ్ళోనే ఉన్నావూ?

ఆనంద: ఎప్పట్లాగే.

రాజు: ఏమిట్రా ఆ పుస్తకం?

కాముడు: మళ్ళా ఆ పుస్తకం మీద చర్చిస్తావా?

ఆనంద: లేదు... లేదు... ఇదా! ఇది పుస్తకం. చూస్తావా. చూడు తీసుకుపో చదువుకో... ఇప్పుడు వివరాలు అడక్కు.

రాజు: బాగుంది... అవునుగాని అదీ...

ఆనంద: ఒద్దొద్దు అది సినిమా... బావుంటుంది... ఆపెయ్, దాన్ని గురించి వాదించకు.

రాజు: ఏవిట్రా అది! ఇలా మాట్లాడుతున్నావు?

ఆనంద: నిజం చెప్తా. ఇప్పటికే ఆ సినిమా గురించి ఐదుగురితోను, ఈ పుస్తకం గురించి ఇద్దరితోను చర్చించా. వాళ్లు వాగి నన్ను వాగించి వెళ్ళిపోయారు. వాళ్ళకు కాలక్షేపం, నాకు వృత్తీని.

కాముడు: మొత్తానికి నీ బుద్ధి పోనిచ్చుకున్నావు గాదు. వాగుడు ఆపవా?

ఆనంద: ఓదార్పు అయిపోయింది. కొంచెం ఆగు. అయినా మధ్యాహ్నం పంపిన బఠాణీలేం చేశావు?

కాముడు: ఇవాళ కాదు. నిన్న పంపావు.

ఆనంద: ఒరేయ్ రాజా, ప్రమాదం వచ్చి పడింది. నీ ఇష్టం వచ్చినట్టనుకోగాని, నాకు హఠాత్తుగా ఒక రూపాయి అవసరం. అంత లేకపోతే అర్జంటుగా తొమ్మిదణాలు అత్యవసరం. ఎంతిస్తావు? టైమ్ లేదు. చెప్పు.

ఆనందరావు కళ్ళుచెమ్మగిల్లాయి. తననూ, తన ఆకలినీ కూడా ఏవగించుకున్నాడు. మమకారం అనే పదానికి భాషలో తావిచ్చినందుకు చిరాకుపడ్డాడు. రాజు చాలా తాపీగా, సావకాశంగా సిగరెట్టు తీసి అంటించాడు. ఆనందరావుకు ఒకటిచ్చాడు.

రాజు: ఇదేరా నా దగ్గరున్నది. ధనరూపంలో మిగిలినది కటాకటిగా బస్ ఛార్జికొస్తుంది.

ఆనందరావు ఉసూరుమని నిట్టూర్చాడు.

కాముడు: అయిందా. స్వస్తివాచకం పాడు.

రాజు: దేనికిరా డబ్బు – భోజనానికేనా?

పరాకుగా, ఎటో చూస్తూ అన్నాడు ఆనందరావు – అవును కాబోలు.

రాజు నవ్వాడు. పొద్దుట భోంచేశావా?

లేదు.

రాజు రోడ్డు మీద పోతున్న అమ్మాయిని సావకాశంగా చదువుకుంటూ యథాలాపంగా అడిగాడు. ఎన్నాళ్ళయిందిరా భోంచేసి?

భోజనం మీద పూర్తిగా ఆశ వదులుకుని, గత అరవై నిమిషాలలోనూ తను కొత్త కొత్త వాక్యాలతో ఏడుస్తూ, నవ్వుతూ, ఇకిలిస్తూ, వెక్కిరిస్తూ, విమర్శిస్తూ రూపాయి అప్పుకోసం ఎంతమంది స్నేహితులను, పరిచితులను ఎంటర్టెయిన్ చేశాడో సమీక్షించుకుని తన మీద తనే జాలిపడుతూ ఆకలోయ్ అని గోల చేసే కాముడిని అసహ్యించుకుంటూ ఉన్న ఆనందరావుకు రాజు వేసిన ఈ ప్రశ్న బాధ కలిగించలేదు. కాముడు నిద్రపోయాడు. కడుపులో గోల అణిగింది. ఎటో చూస్తూ పరాకుగా జవాబిచ్చాడు.

జ్ఞాపకం లేదురా, మొన్న పొద్దున్నో అటు మొన్న రాత్రో అని.

రాజు త్రుళ్ళిపడటానికి ఉపక్రమించాడు.

ఆనందరావు వారించాడు. కంగారుపడకురా. అధమం నా ముందు ప్రదర్శించకు. ఇప్పుడు నీ సింపతీ అడగలేదు. రూపాయి అడిగాను. ఫరవాలేదులే. మనుషులు ఏంలేకపోయినా కొన్నాళ్ళు బతుకుతారు.

రాజు కొంచెం బాధతో అన్నాడు. ఒరేయ్ నిజంగానే లేదురా. నీకివ్వాలి కూడాను. కాని – హఠాత్తుగా రాజు చేతులు కట్టి వివేకానందస్వామిలా నించున్నాడు, తన పల్చటి చొక్కా జేబులో రూపాయి నోట్లు బయటకు కనపడతాయని గ్రహించి.

☆ ☆ ☆

మూడు రోజులయిందండి భోంచేసి, మాదీ వూరుకాదండి అన్నాడు ముష్టివాడు. ఆనందరావు గొణుక్కున్నాడు. నేనూ అంతేనోయ్. మాదీ ఈ వూరు కాదు.

ముష్టివాడినని ఒప్పుకుని ముష్టి అడిగాడు వాడు. చేతులో వున్న అరుకానులూ ముష్టివాడికిచ్చాడు ఆనందరావు.

☆ ☆ ☆

క్రీనీడ పొడుగు కొలుచుకుంటూ, నిర్వికారమైన మనస్సుతో నిలచి ఉన్నాడు ఆనందరావ్. ఏడో నిమిషం పూర్తి కాగానే తన గదికి వెళ్ళిపోతాడు. బజారులో డ్యూటీలో ఏభై సెకండ్ల వ్యవధి ఉంది. ఏభయి సెకండ్లలో ఏభయి కోట్ల లోకాలు

సృష్టించుకుంటాడు ఆనందరావు. మెత్తగా, నిశ్శబ్దంగా, అందంగా అందమైన కారు ఆనందరావు ఎదుట ఆగింది. కారు లోపల సీత ఉంది.

అందంగా నవ్వాడు సీతను చూసి. ఆ నవ్వు తెలుపుకన్న తెల్లగా ఉంది. సీత రెండు క్షణాలు ముగ్ధురాలై విప్పారిన నేత్రాలతో చూసింది ప్రేమగా, అమాయకంగా, ఆకర్షణీయంగా, అందంగా, ఆనందంగా...

కారు తలుపు తీసింది సీత. ఆనందరావు కారెక్కాడు. మెత్తగా, నిశ్శబ్దంగా అందమైన కారు ప్రవహించింది. అందమైన సీత ఆనందరావును దగ్గరకు తీసుకుంది.

ఆనందరావు ఆనందం భరించలేక చనిపోయాడు... తనలో, తన సీతలో, సీతలో మునిగిపోయిన తనలో మునిగి చనిపోయాడు.



☆ ☆ ☆

చనిపోయిన ఆనందరావు నానా వీధులూ తిరిగి తన రూము వున్న వీధి చేరాడు. ఏభయికోట్ల ప్రపంచాలలోని ఏభైకోట్ల కార్లనూ, ఏభైకోట్ల సీతలనూ, ఎడం కాలితో తన్ని పారేశాడు ఆనందరావు. నాయరు కొట్టు చూడగానే కడుపులో కాముడు అగ్గిరాముడయ్యాడు.

తక్షణం ఆనందరావు మొన్నటి (భోజనం చేసిన రోజు) చిరునవ్వు మొహానికి రాసుకొని, నాయర్ కొట్టులోనికి కెళ్ళాడు.

నాయర్! చూడూ, నీకు మొత్తం ఎంత బాకీ అన్నావు.... రూపాయి పదమూడణాలు కదూ? సరే, ఇప్పుడు ఒక బన్నూ, సింగిల్‌టీ, ఒక అణా చార్‌మినార్ సిగరెట్లూ ఇచ్చేయ్. రేపు సాయంకాలం మొత్తం రెండు రూపాయలూ ఇచ్చేస్తా. అబ్బే... మరేం ఫరవాలేదు... తప్పకుండా... ఒకవేళ రావలసిన డబ్బు రాకపోతే పేపర్లు అమ్మేనాసరే నీకిస్తా... అవున్లే... కష్టమే అనుకో, నాకు తెలుసుగా... టీ స్ట్రాంగా చెయ్యి. ★ ★ ★

# కన్నీటిపాటు



పన్నీటి జల్లులా పడింది వాన. ఆవురావురుమంటున్న వేసంకాలం గుండె జివ్వుమంది. బాధలోంచి హాయి ఎగజిమ్మింది. హాయిగా సన్నటి ఆవిర్లు నిట్టూర్చింది. అవి వట్టివేరు వాసనకి రేఖా చిత్రాల్లా వున్నాయి.

పల్లెటూరి పెరట్లో మల్లె పందిరి పక్కన వేశారు తొలి రాత్రి పక్క...

"అనాఘ్రాతం పుష్పం" అని గొణుక్కున్నాడు బుజం వాసన చూస్తూ...

సుబ్బులు కంగారు పడింది. పక్కకి జరిగింది.

"ఇంకా నిద్రే పోలేదు. కలవరిస్తున్నారు" అంది దీనంగాచూస్తూ–

తను బుజాన్ని విడిచి పెట్టలేదు. తిరిగి గాఢంగా వాసన పీల్చాడు.

"కలవరింత కాదు. కవిత్వం. కాళిదాసనీ ఓ పెద్దకవి చెప్పాడు. ఎవరూ ముట్టుకోని పువ్వుని తొలిసారిగా వాసన చూసినవాడి గురించి.. .. అదృష్టం అంటే వాడిదే.. .. ఆ తరవాత ఇగో వీడిదే.. ..హాః... వట్టివేరు వాసనకన్నా బాగుంది నీ బుజం."

సుబ్బులు పకాలున నవ్వి పక్కకి జరిగింది. అటు తిరిగింది.

"చాల్చాలు. వట్టివేరూ లేదు – గట్టివేరూ లేదు – గట్టిగా పీలిస్తే చెమట వాసనేస్తుంది."

వెంటనే రెండో బుజం ఆఘ్రాణించాడు.

"వట్టివేరు కాదు. పారిజాతం. బొగడ పువ్వు. సరిగ్గా చెప్పాలంటే వేసంకాలం పొలం మీద తొలకరి పడ్డపుడు వచ్చే సువాసన లేదూ? అది. ఇవాళ ఇది మన తొలకరి. అదే నింగి నేలా కలయిక... తొలి ముద్దు... హాః ... హాః ... తెలుగులో అచ్చులు 16, హల్లులు 36. ఉభయాక్షరాలు మూడు సున్నా, అరసున్న విసర్గ. కాని ఈనాడు ఇవి వాడకంలో లేవు...ట! ఎవడ్రా చెప్పాడు? చెప్పిన చెవలాయెవడ్రా?... మైధునాంతన హో హా ల పక్కన అరసున్న లేకపోతే భాషేమిటి? అది భావాన్ని పలకగలదా? సుఖాన్ని తెన్గించ గలదా? ఆ? ... వాడకంలో లేవుట ...హా!ః ... హా!ః ...

ఆకాశంలో ఊగిపోతున్నాడు ఆనందరావు.

గుభేల్న గుద్దుపడింది వీపు మీద.

☆ ☆ ☆

"ఆ? ఎవరది?" అన్నాడు ఆనందరావు.

"ఇంకెవరు? నేనే – నీ నేస్తం."

"ఓ నువ్వా ఆకలివా?... సోదరా! యాభై ఏళ్ళనించి ఇల సాటిలేని జంటలా వుంటున్నాం. లోగడ నువ్వు నా నీడవి. ఇప్పుడు నేనే నీ నీడలా వెన్నంటి వస్తున్నాను. అలవాటే గదా... ఏదో మట్టివాసనలో వట్టివేరు వాసన లేరుకుని హాయిగా వుంటే ఇపుడిలా వెన్నుపోటు పొడుస్తావా? ఇప్పుడే పగ తీర్చుకోవాలా?"

"సరేగాని – అదేవిటి అప్పుడే ఇంటికేసి మళ్ళావు. అప్పాలు దొరకవని తేలడానికి ఇంకా నాలుగైదు వీధులున్నాయి."

"నా వల్ల కాదు. కాళ్ళు గుదిబండల్లా వున్నాయి. అవి నన్ను మొయ్యటం లేదు. నేనే వాటిని లాగుతున్నాను. నా కోపిక లేదు. కొంపజేరి – "

"– జేరి?"

"ఏముంది. కడుపులో కాళ్ళెట్టుకు పడుకుందామని."

"కడుపులో కాళ్ళు పెడతావా?... నాకే చోటు చాలక ఉక్కిరి బిక్కిరై చస్తుంటే–"

"నువ్వు చావవు... నా వల్ల నీకా భయం లేదు... మూర్ఛబో ... నిదరబో... బాబ్బాబు – పీక్కుతినకు."

"హ హ హ ... తమాషా కన్నాను. ఇంతకీ నేను నీ తాలూకు ఆకల్నిగాను గురూ! అది ఎప్పుడో కోమాలో పడిపోయిందిగా – నువ్వేమేనా పడేసినా దానికి తెలీదు. అనదు."

"మరి?"

"వాల్మీకి ఫామిలీ ఏజంటుని."

"వాళ్ళెవరు?"

"లోగడ వాల్మీకి దారి దోపిడీలు చేసి పెళ్ళాం బిడ్డల్ని పోషించేవాడట. ఇంకోడి పొట్టకొట్టి తెచ్చిన పాపిష్టి కూడులో పాలు పంచుకుంటున్నారు గదా, ఆ పాపంలో కూడా పాలుపంచుకుంటారా అని నారదుల వారడిగించారు. పాలే తప్ప పాపాల సంగతి మా కనవసరం నీ సుఖం కోసం ఫామిలీ పెట్టుకున్నావు గాని మా కోసం గాదు. చచ్చినట్టు మమ్మల్ని మేపాలి – చచ్చాక నరకానికి పోవాలి అన్నారట... అలాగ్గా నీ యిల్లాలూ – అదే మెడ మీద వట్టివేరు, బొగడ వగైరా వాసనలు గుప్పించే నీ అర్ధాంగి సుబ్బలక్ష్మి, నువ్వూ, నీ దయవల్ల ఆవిడ వెదజల్లిన అయిదారుగురు పిల్లలూ, వాళ్ళ తాలూకా ఆకలేజంటుని –"

"ఓహో!" అన్నాడు ఆనందరావు.

"ఓహోలో 'హో' పక్కన అరసున్న వుంటుందా? ..."

"నీకు ధర్మం కాదు. దుఃఖ చీకటి సముద్రంలో ఏడుస్తూ కూచోకుండా చిన్న దీపం వెలిగించుకుని సంతోషపడుతుంటే – ఇలా గుప్పున ఊదేస్తావా?"

"తప్పదు. కలకీ, ఆకలికీ పడదు. తెలుసుగా. ఆకలి ఐహికం; కల ఆముష్మికం."

"బోడి వేదాంతం."

"బోడులకే ఆకలి తప్పలేదు. తలలు బోడులైన తలపులు బోడులా? అయినా నారు బోసినవాడు నీరు పొయ్యాలని దేవుడికే రుద్దారు. నీకు తప్పుతుందా? ఇటు... ఇటు... ఇటు తిరిగి గోదావరి ఒడ్డు రోడ్డెక్కు..."

ఆకలెరగని వాళ్ళూ ఆయాసం ఎరగని వాళ్ళూ రోడ్డు మీద పడుగూ పేకల్లా తిరుగుతున్నారు... అప్పుల ఆశతో కొందరూ, బాకీల బాధతో కొందరూ... ఆకలి వెయ్యడం కోసం కొందరూ ఆకలి తీరడం కోసం కొందరూ –

ఆకలీ ఆనందరావూ ఇలా సాటిలేని జంటలా ఒకరి మీద ఒకరు మండిపడిపోతూ చల్లగా తెల్లగా నవ్వుతూ నడుస్తున్నారు.

"ఈ రోడ్డు చాలా కష్టాల రోడ్డు. పురుగూ పుట్రా పులి గిట్రా వుంటాయి" అన్నాడు ఆనందం.

"సుబ్బరమైన తార్రోడ్డు. సెర్చిలైట్లలాటి దీపాలు, పుచ్చపువ్వులాంటి వెన్నెల – పురుగూ పుట్రా, పులి గిట్రా విన్నేం చేస్తాయి?"

"అదే నీ అజ్ఞానం. నీ కడుపు గోల తప్ప లోకజ్ఞానం లేదు. ఇక్కడ పురుగూ పుట్రా, పులిగిట్రా అంటే వేరే అర్థం. నాకు అయిదూ, పదీ, పాతికా, పరకా అప్పిచ్చి – ఆ వసూళ్ళ కోసం వేటాడే నరరూప రాక్షసులు అని టీక, తాత్పర్యం ఈ రోడ్డు మీదకి ఈడ్చుకొచ్చావు... ఎవడైనా ఎదురై కాలరు పట్టుకుని నా బాకీ మాటేమిటయా అంటే –?"

"'చొక్కా వదులు!' అని గింజుకో – కాలరు దగ్గర చిరుగుతుంది. 'నా చొక్కా చింపేశావు రోయ్' అంటూ సబ్జెట్టు మార్చేసి రట్టు చెయ్యి. పాడిలిపోయి రూపాయో, అర్థో అప్పిస్తాడు కుట్టించు కునేందికి –'"

"ఛీ – నవ్వు వాల్మీకి ఫామిలీ కన్నా కనికష్టం. విశ్వాసం లేదు."

"ఎందుకుండాలి... అయినా వాల్మీకి ఫామిలీవాళ్ళు నిజాయితీపరులు కాబట్టి నిజంచెప్పేశారు. నిజాని కన్ని ఫామిలీలూ అంతే – చాలమంది నిజం చెప్పరు కాని అంతే. వాల్మీకి ఫామిలీ నిజం చెప్పేసింది. నిజమే. వాళ్ళు నిన్నేం అడగలేదుగా ఫామిలీ పెట్టువాయ్ అనీ – నువ్వే పెళ్ళాడావు – ఫామిలీ పెట్టావు. ఇవాళ నీ సుఖాల ఇంజను పెట్టి లాగుతున్నది– దానికి జేరబడి తగులుకున్న కష్టాల గూడ్సురైలునే. సానికన్న సంసారి చౌక – ఫ్రీ అనుకన్నావు. అది స్ప్రాట్ కాష్ వసూలు చేసి చెయి కడుక్కుంటుందనీ, సంసారి బతుకంతా వదలని బంక అనీ తెలుసుకోలేదు. పెళ్ళాం అయితే రోజుకెన్నిసార్లయినా ఏడాది కెన్ని రోజులయినా దమ్మిడీ ఖర్చు లేదనుకున్నావు. అయిదుగురు మొలుచుకొచ్చారు. వాళ్ళ పోషణా–"

"ఛీ దరిద్రుడా! పవిత్రమైన భార్యాబిడ్డల సంబంధానికి నీచోపమానాలు చేస్తావా? గూడ్సు రైలంటావా... అయినా నేను ఐదారుగుర్ని కావాలనేం కనలేదు. ఆరో సంతానానిదే అదృష్టం అంతా అని జాతకాలవాడు చెప్పాడు. ఆ ఆరోవాడి కోసం తప్పనిసరిగా – ఇష్టం లేకపోయినా – అయిదుగుర్నీ కనేశాము. తీరా మోసి–"

"తెలుసు తెలుసు ఆ ఆరోవాడు పుట్టి భూమ్మీద పడగానే నీ యిల్లూ వాలకం – అన్నలూ, అక్కలూ ఐదుగుర్నీ చూశాడు. భయపడి పారిపోయాడు. అదృష్టం అంటే వాడిదే. అదృష్టం అంటే అదే! ఆ పారిపోడమే."

"రామ రామా... నోరు ముయ్యరా!"

"అలాగే పని చూడు పని చూడు – ఈ పూటకొక్క రూపాయి డబ్బులేనా కళ్ళజూస్తే అరకిలో బియ్యం ఉడకేసి మా కుంతి పాండవులకి పెడుతుంది."

"మరి నాకు?"

"అరిటాకే –"

ఆనందరావు పనిచూడ్డం ఆరంభించాడు – అంటే రూపాయిని కళ్ళారా చూడడం. జేబులోంచి తీసి అప్పిచ్చేవాడు లేడు. అందువల్ల జేబులోది రోడ్డుమీద పారేసుకున్నవాడు కావాలి. వాడు ఎందుకు పారేసుకుంటాడు? కోవాలి? పూర్వజన్మలో తనకీ రూపాయి బాకీ వుండి ఎగేసినవాడు ఈ జన్మలో ఎదురుపడి ఇంద నీ బాకీ అనడానికి మొహం చెల్లక ఆ రూపాయని తమ వెళ్ళే దారిలో గుట్టుగా జారివిడిచి పోయేవాడు కావాలి.

అట్టివాడీ కలియుగంలో ఉండునా?

ఎందుకుండడూ చచ్చినట్టుంటాడు. పూర్వజన్మలో నాకు రూపాయి బాకీపడి ఈ జన్మలోనేనా తీర్చకపోతే వాడు పెద్దమనిషి కాడు... అమ్మనీయమ్మ! అదిగో రూపాయి! హల్లదిగో రూపాయి! ...అదివో అల్లదివో శ్రీహరి వాసము! పది వేల శేషుల పడగ మయమూ హం ... హంccc

రోడ్డు మధ్యన ఆగిపోయా డానందరావు... ఎదర, రోడ్డు మీద పదిహేను అడుగల దూరంలో తళుక్ తళుక్ మని మెరిసిపోతోంది రూపాయబిళ్ళ!

పున్నమి వెన్నెలని ఆకాశానికిస్తున్న నేల మీద చందమామలా కన్నుల పండగ్గా వెలిగిపోతోంది. అద్భుతం! బ్రహ్మాండం! దేవుడున్నాడు!! అలా ఇలాక్కాదు! అమోఘంగా బోలెడున్నాడు.

గా – నీ వాడికి కొన్ని చిన్న దురలవాట్లున్నాయి. కప్పకీ లిప్పకీ – నూరామడ దూరం పెంచెయ్య గలడు. తమ ఈ పదడుగులూ వెళ్ళి వొంగి ఆ సిద్ధాన్నాన్ని అందుకునేలోగా ఇంకో దౌర్భాగ్యుడు అందు మీద చెయ్యి వేస్తే?... అది తన రూపాయేననీ, పూర్వజన్మలో బాకీ తీర్చలేనివాడు ఈ జన్మలో ఇవాళ ఇపుడు ఈ అపత్సమయంలో ఈ రూపేణా ఋణం తీర్చేసుకుంటున్న మహోజ్వల ఘట్టంరా అనీ చెపితే వాడు ఒప్పుకుని తప్పుకుంటాడా? పోబే అని లాక్కుంటాడా?

దూరంగా నవ్వులు వినబడి తలెత్తి పైకి చూడబోయాడు. పదిటన్నుల మాగ్నెట్‌లు – ఋణధవ ధ్రువాలలా పనిచేశాయి – చూపుని బుర్రనీ రూపాయి బిళ్ళ ఠక్కున వెనక్కి లాగేసింది.

అతి కష్టంమీద కళ్ళు మూసుకుని తల పైకెత్తి చూశాడు. రోడ్డు పక్క తూము మీద ఓ రెండు పుంజీల భావి పౌరులు కూర్చుని కేరింతలు కొడుతున్నారు. సిగరెట్లు కాలుస్తున్నారు. ఒక్క వెధవకీ నేల మీద రూపాయి కనిపించినట్టు లేదు. బేఖాతరీ దశలో పెరుగుతున్న భావి పౌరులు గదా అందరికీ నెత్తి మీద కళ్ళే తప్ప నేల చూసే బాపతు కళ్ళుండవు...

అదీ మంచిదే నయ్యోయ్!

పద మగడా పద ... పరిగెత్తి తీసుకో... అన్నాడు ఆకలి పురుషుడు.

పదతాను మగడా పదతాను ... కాని కాస్త ముందూ వెనకా ఆలోచించాలి. వంగి రూపాయి తీస్తుంటే – ఆ వెధవలు చూసి నాదంటారు – లేదా నవ్వుతారు. కాస్త పరువు ప్రతిష్ఠా గట్రా చూసుకోవాలి గదా –

ఇదిగో ఆనందరావ్! నువ్వు నోటికాడ కూడు దగ్గర మీనమేషాలెక్కెడుతున్నావు. ఈ పూటా రూపాయ మనకి అందలేదో – నీ ఆకలి మంటలో అయిదు గాలన్ల పెట్రోలు పోస్తా జాగర్త.

ఏడిశావు – ఆయనే వుంటే మంగలెందుకని – నీ కంట్రోల్‌లో పెట్రోల్ డబ్బులే వుంటే నా నెత్తురు తాగేవాడివా – సర్లే నోర్మూసుకో డిస్టర్బ్ చెయ్యక ... ఏకాగ్రత ... కాంసంట్రేషన్ ... వన్ టూ త్రీ ... వచ్చేస్తోంది. రూపాయి కదిలి వచ్చేస్తోంది. అమ్మో! శ్రీ మహాలక్ష్మి! ... లక్ష్మీం క్షీరసముద్ర రాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం శుక్లాంబర ధరం ... ఇది ముందు చదవాలి కామోసు...

అయిదారుడుగుల దూరంలో వుండగా ఆగినట్టాగి అడుగులు అరడుగులుగా అతి నెమ్మదిగా వేశాడు. సూటిగా వెళ్లి వంగి రూపాయిని తీస్తే – కుర్ర నా కొడుకులు మీదికి దూకి నాది నాదంటే?...

అవునా డేంజరుంది. ఆనందరావులో కవి రచయితా నాటకకర్తా నటరాజూ మేలుకున్నారు. ఆఖరు అడుగు వేసి రూపాయిని ఓ పక్కగా దాటి వెళ్తుండగా

బుజం మీద తువ్వాలు చాలా హాయిగా జారి పడిపోయింది – రూపాయి మీద –

అరె! అని ఆశ్చర్యం అభినయించి ఆగి వెనకడుగు వేస్తూనే వంగాడు తువ్వాలు కోసం. కుఱ్ఱ వెధవలసందడి ఆగిపోయింది. చూశారు! చూసేశారు!!

... ఆ ఏవిటి వాళ్ళ బొంద చూసి చచ్చేది. పై తువ్వాలు పడింది; ఆసామీ వంగి తీసుకుంటున్నాడూ – అంతే. దట్సాల్.

ఆనందరావు వేళ్ళు తువ్వాలుని కొంచెం పల్చగా నలిపి రూపాయి బిళ్ళ మీద తడిమాయి. ఉత్తర క్షణార్థంలో తువ్వాలు గుడ్డతోపాటు బిళ్ళని పైకి తీసుకోబోయాయి. కాని బిళ్ళ లేచినట్టు లేదు. మునివేళ్ళకు తువ్వాలు గుడ్డే తగులుతోంది. తీసిన తువ్వాలును మళ్ళా వదిలేశాడు.

కుఱ్ఱ వెధవలు నిశ్శబ్దంగా వున్నారు.

చూస్తున్నారా? ... లేపోతే వెళ్ళిపోయారేమో అకళ్ళేసి... తలెత్తకుండానే కన్నులెత్తి తూము కేసి చూశాడు. వెధవలు గోడ మీద కోతుల్లా అక్కడే కూర్చున్నారు. కాని కోతుల్లా కిచకిచమనటం లేదు ...

రూపాయిని మళ్ళీ లాగాడు. అది కదల లేదు. నిశ్శబ్దం చేతి మణికట్టులో బ్రిడ్జి మీద రైలింజనులా అదర గొడుతోంది. నిండా మునిగినవాడికి చలేమిటి? హర హర మహాదేవ! – తువ్వాలు తీసేసి ఆ వెండి బిళ్ళని పట్టిగ్గా తీసుకోబోయాడు.

ఆఁ!...

అది రూపాయి బిళ్ళ కాదు! కార్క్ సోడా మూత. చదుమ చేసి తిరగేసి రోడ్డు మీద పెట్టి చిన్న మేకు కొట్టారు – రూపాయిలా కనిపించింది.

తాడుని చూసి పాముని చూసి తాడుని చూసి పామును చూసి...

నిశ్శబ్దం భళ్ళున బద్దలైంది. ఈలలు, చప్పట్లు హహ్హాహాలు! ఒళ్ళు చచ్చిపోయింది. ఆనందరావు లేచింది. నిలబడి అటు చూసింది. ఓరి కుఱ్ఱ నా కొడుకుల్లారా! ఒక దీనుడిని హీనుడిని చేసి నవ్వే పీనుగుల్లారా!... ఈ ఆశ – ఈ బాధ ఈ కష్టం మీకు ఇపుడు తెలీదురా. పదేళ్ళలో పెళ్ళిళ్ళయి ఐదారేసి మంది గాడిద కొడుకుల్ని కని జీతాలందకా అప్పులు దొరక్కా అకలి నీరసాలతో ఒళ్ళు తూలీ కళ్ళు తిరిగీ చావబోయే వేళ మీకు అర్థమవుతుందిరా. ... అలా అవాలని శపిస్తున్నానురా... మీరీ గోదారొడ్డు షికార్లూ, సినిమాలూ తెప్పుఁల్చుకుని ఆకలితో ఇళ్ళకెళ్ళేసరికి అమ్మా అన్నం అంటూ వీధిలోంచే పొలికేక పెట్టే వేళకి మీ కంచాల్లో కుంభాలు వొంపడానికి మీ తలిదండ్రులు నాలా ఎక్కడెక్కడ గడ్డి కరుస్తున్నారో అప్పులు చేస్తున్నారో అడుక్కుంటున్నారో దొంగతనాలూ మోసాలూ చేస్తున్నారో గొంతుకలు కోస్తున్నారో కాళ్ళు పట్టీ దొడ్లూడ్చీ ఏవేం హింసలు పడుతున్నారో – మీ అకళ్ళ గురించి ఎంతెంత క్షోభలు పడుతున్నారో మీకేం తెలుసురా భావి పౌర కుంకల్లారా అని గుండె గావుకేకలు పెట్టింది.

కసిగా చూస్తూ అలాగే నిలబడిపోయాడు. కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

ముసిలాడు సిగ్గుతో నెత్తిన గుడ్డేసుకుని పారిపోకుండా – బరితెగించి నిలబడి కసిగా చూడ్డంతో తూము మీద కుఱ్ఱాళ్ళు బెదిరారు. నవ్వులు మానేసి తూము దిగి నిలబడి ఆనందరావు వంక చూశారు. వాళ్ళ జోకు బెడిసికొట్టింది. ఆనందరావు

ఇపుడు వాళ్ళ ముఖాన ఉమ్మేస్తే వాళ్ళు కోంబడరు. లాగి లెంపకాయ కొడితే తిరిగి కొట్టరు. ముఖాలలో తప్పుచేసి దొరికిపోయిన వాళ్ళలా ఒక జడ్డి నవ్వు జలగలా సాగి నిలబడింది.

పిడుగు!

ఆనందరావు నెత్తిన పేద్ద పిడుగు పడింది. తలని చీల్చి కపాలం బద్దలుకొట్టి లోపలికి దిగి గుండెలో పెఢేలున మళ్ళీ పేలింది.

ఎదరగా వున్న ఆరుగురు భావి పౌరులలో ఒకడు తనకి తెలిసిన కుర్రాడు! బాగా తెలిసినవాడు.

తన పెద్ద కొడుకు!

17 ఏళ్ళ యువరాజు!

సుందర్రామారావు!

మైగాడ్!

ఇంతకన్న అవమానమేమి! ఓ రామచంద్రా! ఇంతకన్న అవమానమేమి?

తండ్రిని ఓడించిన వీరులుండేవారు. ఇవాళ తండ్రిని చావుదెబ్బ కొట్టిన వీరులు. అబ్బా! ఏమి దెబ్బ!

ఆనందం గుండెల్లో అగ్ని పర్వతం పేలింది. లావా ఎగజిమ్మింది.

శివుడు విషాన్ని మింగి గొంతులో ఆపినట్టు ఆనందం పైకి తన్నే లావాన్ని గొంతులో ఆపేశాడు. అది తన కన్న బిడ్డ మీద పడితే నాశనం అయిపోతాడు. అంతలో లావాని పరిమార్చి కన్నీరుగా మార్చాడు. కోపాన్ని ఏడుపులోకి తెన్గించాడు.

కన్నీళ్ళు తన్నుకొచ్చాయి.

భోరున ఏడవాలి. గుండె కాళీ అయేలా ఏడవాలి. గోదావరికి వరద తగిలేట్టేడవాలి.

ఎక్కడ?

ఇక్కడ కాదు.

ఎప్పుడు!

ఇప్పుడు కాదు.

యాభైయారేళ్ల బడిపంతులు పబ్లీకున ఏడిస్తే – ఎవరూ జాలిపడరు. నవ్వుకుంటారు. నవ్వుతారు, నవ్విపోతారు.

ఇది ఇంకా అవమానం.

ఎక్కడో చాటుకుపోయి కసిదీరా హాయిగా ఏడిచెయ్యాలి. గుండె బరువెక్కిపోతోంది. తడుస్తున్న దూది బస్తాలా. – తొరగా బరువు దించేసుకోవాలి. నీళ్ళలో ఉప్పు బస్తాగా మార్చి పారెయ్యాలి.

"నీ ఏడుపు ఎప్పుడేనా ఏడవచ్చు. ముందు నా ఏడుపు చూడు. ఆకలి... ఆకలి"

"ఒరే! ఒరే! నక్షత్రకుడా! ఏజంటు వెధవా... నీకేవన్నా బుద్ధుందిరా?... ఈ యేడుపు వాయిదా వేసే రకం కాదురా సన్నాసీ... కన్నకొడుకు – తండ్రిని పూలున్నరచేసి పూలు ముప్పావులా నవ్వాడురా... ఇటువంటి దెబ్బ... ఇటువంటి శిక్ష – పురాణేతిహాసాలలో చరిత్రలో కాశీమజిలీల్లో ఎక్కడా లేదురా. ఈ బాధ భరించలేనురా. నేను వాడి కడుపాకలి కోసమే రోడ్డుమీద రూపాయి కోసం

వంగామరా... అయినా వాడు నన్ను చూసి నవ్వి పోయాడురా... అమ్మబాబోయ్... ఓ ర్నాయనోయ్ ... ఏం బాధ, ఏం బాధ..."

"బ్రదర్! నీకంత కోపం అయితే వాడిని ఎడా పెడా నాలుగు లెంపకాయలు కొట్టి కోపం తీర్చుకో. ఒక్క రూపాయి డబ్బుల కోసం మళ్ళీ వంగు. మళ్ళీ వంగు... మళ్ళీ వంగు... ఇంకెక్కడైనా వంగు – చోరీ చెయ్యి, జేబులు కొట్టు. నాకన్నం పెట్టు. అంతేగాని, నీ దిక్కుమాలిన దుఃఖ సముద్రంలో హాయిగా ఈతకొడుతూ నన్ను మాడ్చి చంపకు. నీకా హక్కులేదు."

"దుర్మార్గుడా! నా వల్ల కాదురోయ్ ... మొగుడు చచ్చి ఇల్లాలు ఏడుస్తుంటే రంకు మొగుడొచ్చి రవికలో చెయ్యి పెట్టాట్ట! అలా వుందిరోయ్. కన్నీరుతో కడుపు చెక్కలయి పోయేలా వుందిరా... ఆ నీరు బయటికి పోతేగాని బతకలేనురా. హార్టెటాకు వచ్చేస్తుందిరా."

"నీకు హోర్డుంటేగా ఎటాకు రాటానికి. అదే వుంటే వాళ్ళకి ఫామిలీ గురించి, ఆకలి గురించీ ముందే ఆలోచించేవాడివి – వానజల్లు వట్టివేరూ, సుబ్బలక్ష్మి బుజాలూ కాదు."

"బాబ్బాయి. దెప్పకురా... ఒక్క నిమిషం. నేను గోదాట్లో దిగిపోతాను. నాలుగు మునుగులు మునిగి గబగబ ఏడిచేస్తాను... అనక నీ గులామును."

ఆకలేజంటు సమాధానం వినకుండా ఆనందరావు పరుగున గట్టు చివరకి వెళ్ళి చరచర మెట్లమీదినించి ఉరకలు పరుగులుగా దిగేసి గోదావరి రేవులో మొలబంటి లోతు దాటి ఆగాడు. బుడుంగున మునిగాడు.

శీతాకాలపు చలి...

చలికి ఒళ్ళు ఝుళ్ళు మంది.

గుండె జివ్వుమని బిగించుకుపోయింది. లోపల కన్నీళ్ళు – కళ్ళదాకా వచ్చిన కన్నీళ్ళు అయిసుగడ్డలయి ఆగిపోయాయి.

కొయ్యబారిపోయాడు.

బుర్ర పర్రయిపోయింది. ఎలా... ఈ అయిసు కరికించి కన్నీరుగా తెన్గించాలి... కార్చాలి... ఎలా ఓ కప్పు వేడి కాఫీ తాగితే –? ఓ పెగ్గు బ్రాందీ వేసేస్తే –? కాని చేదు. ఎప్పుడో స్టూడెంటు వయసులో వుండగా ఓ ఫ్రెండు పోయించాడో పెగ్గు. ఇంట్లో కంపు తెలిసింది. మావయ్య లెంపలు వాయించేశాడు. నిషా దిగిపోయింది. చెంపల నెప్పి దిగిపోయింది. దరిమిలా పెళ్ళాడి ప్రేమ నిషాలో జారి పోతే లేచేవేళకి ఐదుగురు పిల్లలు మిగిలారు... రేవులోకి కూనారం లాంచి వస్తోంది. అటు చూశాడు. లాంచి చెక్క మీద షావుకారు సుబ్బారాయుడుగారు నించున్నారు సంచి పట్టుకుని.

ఆయనకి తను మొత్తం 370 రూపాయలు బాకీ. చూశాడో నెత్తి మీద కాలేసి తొక్కేస్తాడు – బలి చక్రవర్తిలా

వెధవ ప్రాణం పోతే పోతుందిగాని – ఏడుపు కడతేరా ఏడవకుండా చస్తే? ఆ కోరిక మిగిలి – దెయ్యమైపోవాలి. లాంచి దగ్గరపడింది. ఆగింది. ఆనందరావు ఠంగున నీళ్ళలో మునిగాడు సుబ్బారాయుడు చూసేలోపల. ఊపిరిసలపడం లేదు.

ఏడుపూ ఏడుపూ రామ్మా... రెండు మూడు ఇనిస్టాలుమెంట్లుగానేనా రా. హామ్మో! ఇక వల్లగాదు. నీళ్ళలోంచి తలపైకెత్తి ఆ కేపు తిరిగి వూపిరి పీల్చాడు.

కొంచెం తలపక్కకి తిప్పి వెనక్కి చూశాడు. షావుకారు గమనించలేదు. కొంచెం అటుపక్కగా తడిగుడ్డలతో మెట్లెక్కుతున్న ఇల్లాలి జఘన సౌందర్యం చూస్తున్నాడు.

అబ్బ! ఎంత బావున్నాయి! ఇట్నించి చూస్తుంటే – కాని, గమత్తేవిటంటే – ఆవిడగారికి తెలీదు. తన వెనకవేపున పిరుదులు ఇంత ప్రాణాలు తీసేంత అందంగా వుంటాయని...

"ఒరే, పకీరూ కాస్త ట్రంకుపెట్టె గట్టుమీదకి చేర్చిపెట్టరా?" అన్నారెవరో.

అమ్మో! ఆ గొంతు శరభయ్యది... పోయిన శివరాత్రినాడు వాడు గోదాట్లో స్నానం చేస్తూ హర హర మహదేవ, శంభోశంకర అంటుండగా కరెక్టుగా పదును చూసి పాతిక రూపాయలు అప్పడిగాడు తను. దేవుడిని తల్చుకుంటూండగా అడిగినందుకు తిట్టిపోసి గట్టు మీద కెళ్ళగానే ఇచ్చాడు పాతికాను. శ్రీరామనవమి లోపల ఇచ్చేస్తానని నీళ్ళలో నిలబడి ఒట్టేశాడు. శ్రీరామ నవమి వెళ్ళిపోయింది. మళ్ళీ శివరాత్రి రాబోతూంది... వెనక్కి తిరిగి మునిగే టైము కూడా లేదు. ఉన్నపళంగా జఘన సుందరిని ఇంకొక్క క్షణం చూసేసి – ఉన్నచోటే మునిగి ఊపిరి బిగబట్టాడు. కృత త్రేత ద్వాపర కలియుగాలు పూర్తి అయిపోయాయి. యుగాంత జలప్రళయం వచ్చేసింది. అందర్నీ ముంచేస్తోంది.

"బ్బాబోయ్" అంటూ లేచాడు. అప్పటికే శరభయ్య రోడ్డెక్కిపోయాడు.

బ్రతుకు జీవుడా.

"ఆకర్రోయ్ ఆకలి!" అన్నాడు ఆకలేజంటు.

"ఛావు."

"నేను చావడమా? నేనంటే ఎవరు? వాల్మీకి ఫామిలీ... అంటే నీ పెళ్ళాం అయిదుగురుపిల్లలూ.... చావాలా?"

"ఇగో... ఇగో! వాళ్ళ జోలికి పోకు. వాళ్ళనలా బతకనీ"

"బతకనివ్వాలనే నా తాపత్రయం!"

ఎదర మెట్ల మీంచి ముగ్గురు కుర్ర వెధవలు దిగారు. చేతిలో సిగరెట్లు... వెధవలు సర్వెంటు వెధవలు! మామూలుగా తనని చూస్తే సిగరెట్లు వెనక్కి పెట్టి దాచేసి గజగజ వణికేవాళ్ళు కాని వాళ్ళలో ఇద్దరికి తమ రెండు పదులు బాకీ. ఇపుడు తనే గజగజ వణకాలి. గిరుక్కున వెనక్కి తిరిగాడు. లాంచి మీద ఇంకో ఇద్దరు యములాళ్ళు!

గభాలున మునిగాడు. ఈ రేవులో ఇక బతకలేం – మునుగుతూ లేస్తూ, తల ముంచుతూ తీస్తూ నీళ్ళలోనే జరుగుతూ రేవుకి దూరంగా నడిచాడు. ఇక్కడ జవంగాళ్ళు లేరు. గట్టుకేసి రెండడుగులు వేసి ఆగాడు. మోకాలు బంటి నీళ్ళలో వించున్నాడు. జరిగిన పరాభవం గుర్తుచేసుకున్నాడు...

రూపాయ బిళ్ళ అనుకుని రోడ్డుమీద సోడా బిళ్ళకోసం వంగాడు తను. నలుగురు వెధవలు నవ్వారు. సర్లే కుర్ర వెధవలు అని సరిపెట్టుకునేవాడే. కాని, అందులో ఒక వెధవ తన కన్నకొడుకు... చదువుకున్న వెధవ... తనని చూసి నవ్వాడు...

కోప్పడే సందర్భం కాదు. ఏడవాలి, ఏడుపా! రా! గుండె! బద్దలయిపో... కన్నీరూ! కారుతూ రా... జలపాతంలా కారు. జలపాతంగాదుమూత్రపాతం అంత కూడా కన్నీరు కురవ లేదు. ఈ కన్నీరంతా కిందకెళిపోయిందా?... అన్నట్టు ఇదో కొత్త బాధ. పొట్టపుబ్బి పగిలేలా వుంది. రోడ్డెక్కి ఏ గోడ దగ్గరో కూచుని ఏడవాలి... ఈ గోదాట్లో కన్నీట్లో చీకట్లో వెన్నెట్లో ఎట్లో అట్లు ఇక్కడే నించున్న పళంగా కానిచ్చేస్తే! కానివ్వడానికి తనెవ్వడు? అదే జరిగిపోతోంది. ఎంత హాయి! ఇన్ని కష్టాల్లో కూడా ఎంత సుఖం! ఎంత హాయి ఈ రేయి నిండెనో! ఎన్నినాళ్ళకీ బతుకు పండెనో... వో వ్వో! వాహ్వా! హు! అర సున్న వుంది. అరసున్నలు వాడకంలో లేవుట. హు! హు! హు!... కదిలి గట్టెక్కుతున్నాడు.

గోదావరి నిండా సుబ్బరమైన నీళ్ళున్నాయి. తిండెలాగూ లేదు. "కాసిని మంచినీళ్ళయినా పంపి చావకూడదూ?" అని గొణుక్కున్నాడు సొంత ఆకలి పురుషుడు.

"ఆ నీళ్ళు ఖరాబు చేశాను. అవి తాగడం ఎలా? నేనేం మురార్జీ దేశాయిని కాదు."

"అయినా బాగుండును. ఆయన వయసు 96, హాయిగా ఆరోగ్యంగా ఉన్నాడు."

"ఒరేయ్! సొంతాకలీ! నువ్వూ ఆ ఏజంటు గాడితో ఏకమై సాధిస్తున్నావా? నీ కిది ధర్మం గాదు."

"గోదాట్లో వుండగా మంచినీళ్ళడగడం కూడా తప్పేనా? మావాడేవన్నా గంగాజలం అడిగాడా? అయిసువాటరడిగాడా? నారాయణా అంటే బూతు మాటలా వుంది" అన్నాడు ఏజంటాకలి చిరాగ్గా.

"పరగడుపునే మంచినీళ్ళు పట్టిం చేస్తే ఆకలి ఛస్తుంది" అన్నాడానందరావు.

"ఆకలి చంపడమేగా మన కాంట్రాక్టు... లోకంలో ఏ హత్య అయినా నేరంగాని, ఆకలిని చంపడం ఒక్కటే మహాపుణ్యంగా పరిగణి స్తుంది. ధర్మశాస్త్రం – సొంతానిదైనా ఇంకోడిదైనా."

"వద్దులే – వికారం పెడుతుం దయ్యా... కాస్సేపాగు... ప్రశస్తమైన కన్నీళ్ళు పంపిస్తాను..."

"గుండె మంటలారిపే చన్నీళ్ళు కన్నీళ్ళు

ఉండమన్న ఉండవమ్మ ఊన్నాళ్ళు"

"పాటలోటి మన బతుక్కి –"

"కుషీ పొంగిపోయి గాదు – ఆ పాట పాడేది"



సరేగాని, ఆ పాటకర్థం తెలుసా? మహాకవి ఏమన్నాడో చూడు. కన్నీళ్ళు ఆర్పేది గుండెమంటల్నిట! ఆకలి మంటని కాదని ఆ పాట వల్ల మనకి అర్థం అవుతుంది. నువ్వేమో కన్నీళ్ళు పంపిస్తానని సముదాయిస్తున్నావు. అవి మాత్రం వుండిచచ్చినట్టు ఉంటే - ఇందాకా రోడ్డు మీద రూపాయి బిళ్ళ దగ్గరే ఒలికేవి. కన్నీళ్ళు పంపిస్తాట్ట... కన్నీళ్ళు. గొప్ప కామందు. భగీరథుడు -"

వాదించే ఓపిక లేక నోరు మూసుకున్నాడు ఆనందరావు. ఇందాకా రోడ్డు మీద కోపం మాత్రం తన్నుకొచ్చింది. కోపంలో ఏడవడం ఎలా? సమయం సందర్భం లేవు. వెధవని అనుకున్నాడు. అది మాత్రం సులువా?

సందుల్లో నడుస్తున్నాడు. చీకట్లో మొహాలు బాగా కనబడవు. తన పేరు కాకుండా ఇంకోడి పేరు చెప్పి - కాస్త రేచీకటున్నవాడి దగ్గిర అప్పడిగేస్తే -? నవ్వొచ్చింది పిచ్చి ప్లానుకి - ఛీ! ఏడిసినట్టుంది. కసిదీరా ఏడవాలనీ ఏడ్చి బరువు దించుకోవాలనీ ఏడుస్తుంటే - మధ్యలో నవ్వేకటా? - అపశకునంలా? ఛి!

రా! ఏడుపూ రా! కారు... కన్నీరూ! కారు. కురు, జలపాతంలా కురు.

నెత్తిమీద దోసెడు నీళ్ళు ఛెళ్ళున పడ్డాయి. "హాయ్" అంటూ అదిరిపడి పైకి చూశాడు.

పైన ఎవరో ఒకావిడ బాల్కనీలోంచి వంగి, తొంగి చూసింది. చేతిలో మరచెంబుంది.

"అయ్యో నా రాతా! బాబ్బాయి తప్పైపోయింది. నీళ్ళు తాగి కాసిని మిగిలినట్టుంటే పారబోశాను. ఎంగిలి కాదు బాబూ. ఎత్తిపోసుకునే తాగాను. కరచి పెట్టి కాదు. తల తడిసిందా?"

"తలేం ఖర్మ - బతుకే తడిసింది" ఆనందరావు చిరాగ్గా, అసహ్యంగా పైకి చూస్తున్నాడు. రావలసిన కన్నీళ్ళ బదులు సెన్సారు మాటలు ఎగజిమ్ముతున్నాయి, చిచ్చుబుడ్డిలో రవ్వల్లా -

"పర్లేదు. తల తడిసే వుందిలెండి." అంటూ తడి తలని తడిమి చూసుకుంటూ కదిలాడు.

రావే రావే కన్నీరూ

బావని పట్టుకు తన్నేరూ

ఛి... ఛి... ఛి... దారుణం. కన్నీరనే కరుణ రసం - తప్ప దిక్కుమాలిన మిగతా రసాలన్నీ తన్నుకొచ్చాయి. క్రోధం, కామం, మదం, చొంగ, చిరాకు, మురార్జీ, జుగుప్స, సమస్తం - అభిషేకం కూడా జరిగిపోయింది. కరుణ రసాత్మకమైన కన్నీరు మాత్రం కరుణించలేదు.

"రిచ్చా! ఐగార్రిచ్చా రమ్మంట్రాడైనారూ!"

"రిక్షావా? నాకా? ఎక్కడికి? మా యింటికా!" అన్నాడు పరాగ్గా.

"ఐ బాబూ! బలేవోరే! మనింటికైతే రిచ్చా అడుగుతానా? బలే వోరే!... మెరకీదికండి. కొత్త సమస్తరాదికి కొత్త సవర్తలండి. పచ్చనోటూ పైన పదార్రూపాయలూ... రిచ్చాకి మీ దయే" అనుకోకుండా హాస్యరసం కూడా గుమ్మరిల్లింది.

హు... హు... హు... హు... ఆనందరావు పొట్టచెక్కలయ్యేట్టు విరగబడి నవ్వసాగాడు. గిరగిర తిరిగి పోయాడు. గంతులేశాడు. ముసిలాడికి దసరాపండగ... హ హ హ హ... నవ్వి నవ్వి కంటనీరు తిరిగేంత పనయింది.

రానీ రానీ... ఈ రకంగానేనా కన్నీ(రానీ, వస్తే, దీంటోకి కరుణరసం కాలవని కలిపెయ్యొచ్చు. నవ్వులోంచో బాధలోంచో ఏడుపంటూ అసలు రానీ! దీని సెన్సారు... మొయ్య...

కాని – రాదే! దీని సెన్సారు తెగ... అదిగో వస్తోంది... కదిలింది కదిలింది గంగ...

"అమ్మో!" కోతి గంతులేస్తున్న ఆనందం కంగారులో గాజు పెంకు మీద కాలేశాడు. కసుక్కున దిగింది. ఓ కాలు పైకెత్తి పెంకును పీకాడు.

"ఏడుపూ! రా! రా! ఇదే సందు... ఇది మంచి సమయము! రా! రా! రా!"

రాలేదు... రాటం లేదు. ఆరాటం తప్ప...

ఒరే కాముడూ! కడుపులో కామేశ్వర్రావులూ! ఛి... ఆకలిగాడికి కాముడని పేరేమిటో! రెండూ ఆకళ్ళేనా? కాముళ్ళు పలకలేదు. వాల్మీకి ఏజంటూ, వాడి ఫామిలీ ఏజంటూ ఇద్దరూ కడుపులోని మంటల్లో దూకి చచ్చిపోయారు.

ఇపుడు ఆకల్లేదు. హాయిగా చల్లగా వుంది తనకి.

కాని – వాల్మీకి ఫామిలీ? వాళ్ళేం ఏడుస్తున్నారో – తిట్టుకుని శపిస్తున్నారో?

శపించరు. నాకు రూపాయి దొరకాలని దీవిస్తుంటారు. దొరికించమని దేవుడిని ప్రార్థిస్తుంటారు – ఆకలేసి చచ్చిపోయి నీరసం వచ్చింది.

అన్నట్టిదింకో రసం. నవరసాల్లో ... ఛి... కాదు... రసంగాని రసం నీరసం... నీరసం పూనేసింది పాకాలి ... డేకాలి... బరువెక్కిన కాళ్ళు రెండూ వూడదీసి బుజాన వేసుకున్నాడు... చేతులు రెండూ మడిచి జేబులో కుక్కేసుకున్నాడు... కుళాయి నీళ్ళతో కడుపులో జలప్రళయం పెట్టేశాడు. ఆకలీ, రోక! కూడా అందులో మునిగి చచ్చిపోయాయి – తనూ చనిపోయాడు.

ఇంటి దగ్గర తలుపు నెట్టగానే తెరుచుకుంది. రామరాజ్యం గదా! దొంగల భయం లేదు. తలుపులు గడియలుండవు... చెట్టు కింద డేరావాళ్ళకి తలుపులే వుండవుట! వాల్మీకి ఫ్యామిలీ అంత తలోమూల నిద్రపోతున్నారు.

జేబులు తడిమే పెళ్ళాం వుండదు. పొట్ట జూసే తల్లి వుండదు. బియ్యం తెచ్చారా అని చూసే పెద్ద కూతురుండదు. కాని, వాడు...? అదుగో, పెద్ద కొడుకు... యువరాజు. అయిదున్నరడుగుల పొడుగున తాటిబొందలా బోర్లగిలా పడుకున్నాడు.

వెధవా! ఎంత పని చేశావురా! కంచంలో సున్నంపెట్టి అన్నం తినరా అంటే నీ కెలా వుంటుందిరా! సోడా బిళ్ళని చూపించి రూపాయిలా కనిపించమంటావా? నన్ను వంగమంటావా? నన్ను చూసి నవ్వుతావా? గాడిదా! ఇంత పెద్ద అవమానం ఏ బిడ్డా ఏ తండ్రికీ చెయ్యలేదురా... నిన్ను... నిన్ను... నరికేసినా పాపం లేదు... వద్దు. నరికితే చచ్చే లోపలమేలుకొని – నాన్నా! అన్నం తెచ్చావా? అంటాడు.

తను చావాలి. చావు కన్న అర్జంటు – ఏడవాలి ఏడుపా! ఏడుపా!... రావే లాలీ రామస్వామీ లాలీ...

ఆనందరావు... అవులించింది... నిద్రాదేవత నిన్ను వరించెగదరా నిర్భాగ్య దామోదరా! 'నిర్భాగ్యం అప్పతచ్చు. అసలు తనే అప్పతచ్చు... పేద్ద తప్పు. ఇన్ని బాధల్ని – ఇంతాకల్నీ సర్దేసే నిద్రేసే. హా–య్ ర్హామచంద్ర...

నారాయణ నారాయణ అంటూ ఆ నలుగురూ తనని లేపేశారు. మోసుకు పోతున్నారు.'

పోనీలే – పించను డబ్బులు, సి.ఎఫ్.లో అప్పులుపోగా, మిగిలేవి వస్తాయి. 'వాల్మీకి ఫ్యామిలీ' నాలుగైదు నెల్లు, రెండు మూడు పూట్లాతింటుంది. ఆ లోపల ఇంటివాడూ, అప్పులవాళ్లూ బాధపడో – భయపడో వసూళ్ళకు పీక్కుతినరు. ఇంకో నాలుగైదు నెల్లుమాడినా ఆనక తనాఫీసులో పెద్దకొడుక్కి ఎల్డెండరు పని పడేస్తారు. స్వర్గానికి మెట్లమీద జఘనసుందరి... మెట్లెక్కుతోంది. వెనక నించి చక్కగా చూస్తున్నాడు. నీ కదేం బుద్ధి అని ఎవడూ అనలేదు. ఎవడికీ కనబడదుగా ఇదీ! పెద్దకొడుకు ఏడుస్తూముందుకు వంగాడు. మీదకు వంగాడు నిప్పు కుండతో.

గాడిద కొడుకా! నిన్న రాత్రి సోడా బిళ్ళ పడేసి నన్ను వెధవని చేసి నవ్వావు. ఇప్పుడు ఏడుపా? ఏది నిజంరా? రెండూనా? నాకు నువ్వు గర్భశత్రువ్వి రా... రా నవ్వుతో నా కడుపులో అరని చిచ్చు పెట్టావురా.

సుందరామారావు కుండలోని నిప్పులు తండ్రి పొట్ట మీద పోశాడు.

"తలకి కొరివి పెట్టాలిరా దరిద్రుడా... పొట్టమీద కాదు. పొట్టలో మంటలు బోలెడుంటాయి."

కడుపు భగ్గుమంది. దిగ్గున లేచి కూర్చున్నా డానందరావు.

కలన్న మాట... చావలేదు... ఇంట్లోనే వున్నాడు. ఆకలి మండిపోతోంది. అందరూ పడుకున్నారు. ఏదో తెచ్చుకు తినేసుంటారు. లేకపోతే, తనలా లేవరూ? దేకుతూ వెళ్ళి ఓ మూలనున్న మంచినీళ్ళ బిందెలోంచి నీళ్ళు తాగబోయాడు. గ్లాసు లేదు. చెయ్యి పెట్టి పురిషెడు తీసుకు రెండు గుక్కలు తాగాడు. వేడిగా వున్నాయి. వెధవ బిందె. ఇత్తడి బిందె బదులు మట్టి కుండలో నీళ్ళు చల్లగా వుంటాయి. గుండె మంటలారిపే కుండలో నీళ్ళు చన్నీళ్ళు.

అయినా బిందె పెట్టుబడిదారీ బుద్ధి. ఒక్క బిందెకి వంద కుండలు... హుఁ... ఇక్కడా అరసున్నా వుంది. ఇవాళ బిందెని అత్తారింటికి తోలెయ్యొచ్చు. రాత్రి బంగాళా దుంపలు వేపడం, కుర్ర వెధవకి ఆమ్లెట్టూ...

అన్నట్లు ఏడవాలిసిన పనోటుండిపోయింది కదూ... ఈ వెధవ చేసిన అవమానమేగా... ఇది మంచి సమయం... ఇదే మంచి సమయం... ఎవరూ చూడరు. కన్నీరు జలపాతంలా కురిసినా, నేల తడవకుండా బిందెలో... ఏడిసినట్టుంది. ఇందాకా గోదావరి ఖరాబు... ఇపుడు బిందా? ఛి... అయినా మురార్జీ జలాల కన్న కన్నీరు బెటరే... దీని వైద్యంపట్ల గురించి రీసెర్చి చెయ్యలేదేమో! కన్నీళ్ళు పవిత్రమైనవే... నా బొంద. మహాకవి చెప్పాడు అని కూడా టూ వెరైటీస్... ఏడ్చినా... నవ్వినా కన్నీళ్ళే వస్తాయి. ఏ కన్నీరెనకాతలేముందో తెలుసునా? నా కన్నీరెనకాతల ఏముంది? నాకే తెలీదు. ఏడుపా?... కాదు... అదే అయితే ఇందాకే కారేవి. ఇది కోపం బాపతు. కసి బాపతు. ఉడిరాటంలే... ఇవి ఆవిర్లా

ముక్కులోంచి సెగల్లా బైటికొస్తాయేమో!... ఏమో మరి... పర్లే రానీ – రానీ... కన్నీ్రానీ... మొహం వంచి ముక్కాడు. కన్నీ్రాలేదు.

గాజుల చప్పుడు – ఉలికిపడి పక్కకి చూశాడు. భార్య ముూడంకె వేసి పడుకుంది. మళ్ళీ చప్పుడు. తన భార్య కాదు. పక్కవాటాలోది. 'హుఁ వద్దు.'

"ష్"

"పిల్లల్లేస్తారు."

"పీకల్దాకా మెక్కారు. తాగుడుకన్న ఎక్కువ మత్తు తిండి... లేవరు..."

"ఛీ... పిల్లల్నిలా అంటానికి సిగ్గులేదూ?"

"లేదు –"

"హుఁ"

గాజుల చప్పుడు.

నాలుగేళ్ళనాటి అనుభవాలు. ఎంతటి మధుర క్షణాలు... పెద్ద పేద్ద గదుల్లో – ఎవరూ లేని తోటల్లో 'ఏడిస్తే' ఏడిసినట్టుంటుంది... కాని – పిల్లల్లేస్తారనే భయంతో పక్కవాటాలో వింటారనే సిగ్గుతో – ఆహా! సొంత పెళ్ళాలతో కూడా దొంగచాటు మైధునం! పెద్ద బంగళాల్లో వాళ్ళకీ అదృష్టం లేదు. అందుకే పెళ్ళాలు బోరుకొట్టి కలుపుగడ్డి మేస్తారు వాళ్ళు. కోటి రూపాయలు గుమ్మరించినా ఈ ఆనందం, థ్రిల్ రావు. దాంపత్యంలో త్రీడీ ఇఫెక్ట్ – ఆనందానికి ఊపిరి బరువెక్కింది.

ప్చ్... ప్చ్... ష్... ఉండండి... రైక చిరిగి పోతుంది. గాజులు చిట్లాయి. హబ్బ... గుచ్చుకుందా... ఫర్లేదు... నిట్టూర్పులో బరువైన నిట్టూర్పులు.

ఛి... దరిద్రం... కొండంత దుఃఖం దించుకుందికి (విసర్గలున్నాయి జాగర్త) ఏడవబోతే పక్కవాటావాళ్ళేమేడుస్తున్నారో, ఎలా ఏడుస్తున్నారో – తనకెందుకు? నీచపు చెవులు – చెవుల తప్పుకాదు. నీచబుద్ధి – చెవులూ కళ్ళూ బుద్ధియొక్క పరికరాలు మాత్రమే... ఇక్కడ లాభం లేదు. ఈ చప్పుళ్ళు వింటూంటే ఏడుపెలా వస్తుందిటా? తన కన్నీటి తపస్సుకి – ఏకాగ్రతకి ఈ విధువన కూజితాలు భంగం కలిగిస్తున్నాయి. ఇలా జాగుచేస్తే తెల్లారిపోతుంది. పిల్లల గోల – కాఫీ బాధ – పాల మనిషి వెటకారాలూ – అద్దెల పకీరు హడావుడి... అమ్మో! ఏడిస్తే ఇపుడేడవాలి... మిస్సయితే రేపంతా బోలెడు పనులు. ఇంకో గుక్కెడు నీళ్ళు తాగి, మెల్లిగా లేచి పెరట్లో తులసి కోట దాటాడు. బావి దగ్గర ముక్కాలి పీట మీద కూర్చున్నాడు. గొంతు సవరించుకున్నాడు. చేతుల్లో తల పెట్టుకున్నాడు డోక్కునే భంగిమలో. ఇక్కడ కొంచెం హాయిగా పైకే ఏడ్చినా పరవాలేదు. బావుంటుంది. వెక్కి వెక్కి కాదు. మంద్రస్థాయిలో ఏడవచ్చు. గుండెలవిసేలా – ఖాళీ అయిపోయేలా – కన్నీరయిపోయి నెత్తురు బొట్లు కూడా రాలేలా ఏడిచెయ్యొచ్చు. ఎంతవమానం, వు... హూ... హూ... హూ...

ఏడుపు రాదేవిటి? ఇందాకా తాగిన మంచినీళ్ళు కడుపులో దిగే బదులు గుండెల్లో ఒలికిపోయాయా? గుండె మంటలార్పేశాయా? కరుణ రస ఘట్టంలో కన్నీటికే కొరవేమిటి?... ఏమో... కన్నీరు కదల్టం లేదు... దీని దుంపతెగా... సరే కన్నీటి కథలు గుర్తుచేసుకుందాం. పురాణాల్లో చరిత్రలో – జీవితంలో మహోజ్వల

ఘట్టాలు జ్ఞాపకం చేసుకుందాం... వెలిసిపోయిన పెళ్ళాంతో సంసారంలో ఒక్కోసారి ఊపు తేకపోతే సినిమా తారలనీ – పరదారలనీ ఆవాహనం చేస్తారుట. అంత పూనుకుంటారుట. – 'పంచ' దారకన్న పరదార తీపిరా అన్నాడు మరో మహాకవి... ఇప్పుడు మనక్కావలసింది సెక్సోద్రేకం కాదు. కన్నీటిని కదిపే వేడి. హరిశ్చంద్ర చక్రవర్తి ఆలిని వేలం వేశాడు. ఏడుస్తూనే. ఆహా! ఎంత బాధాకరమైనది. యావదాంధ్రలోకం కన్నీరు మున్నీరుగా విలపించారు. డి.వి. సుబ్బారావుగార్ని చూసి – ధర్మరాజు అన్యాయానికి బలై, అడవుల పాలయ్యాడు. కళ్ళెదురుగా దుష్టులు పాంచాలి పైటలాగుతుంటే, ఏడుస్తూ వూరుకున్నాడు. ఓ ధర్మరాజా! ఆ బిగబట్టిన కన్నీళ్ళు కాసిని ఆనందరావుకి అప్పివ్వగలవా? ఏడుపు రాలేదు.

ఊహూ... పురాణాలు మరీ పాతవి. ఏడుపు తెప్పించలేవేమో! ఈ కాలపు ఘట్టాలు బోలెడున్నాయి... సాయంత్రం లైబ్రరీలో పాత పత్రికలు బోలెడు చదివాడు – ఆ!

హర్తాళ్ డ్యూటీ కెళ్తున్న పోలీసుని కౌగలించుకుని అతని భార్యాబిడ్డలు విలపించారు. మళ్ళీ చూస్తామో లేదో –

పాపం!

ఏడుపు రాలేదు.

మంత్రిగారి సన్మానసభ సగంలో వుండగా చావు కబురు వచ్చి సభ రసాభాసయిపోయింది.

ఛీ! నవ్వొచ్చిందేవిటి?

టీ.వీ. లలిత సంగీతం పెడదారి పట్టకుండా తన దారిలోనే వున్నందుకు రేడియో సంగీతం ఆనందించినా – అసూయతో విలపించింది నా గొంతుకి నీ మొహం కూడా తోడై –

హు... హు...

రైలు మంత్రిగారు ప్రమాణస్వీకారం చేస్తుండగా పెద్ద పేసంజరు రైలు నదిలో పడి 1500 మంది మరణించారని వార్త. మంత్రి దిగ్భ్రమ చెందారు – ఇంతలోనే రాజీనామానా! అని.

ఏడుపా!... జాలి పడేవా రావే... రావే...

తన బిడ్డల్లో కొందరు పరకామణిలో దొంగపనులు చేస్తుంటే ఏమీ అనలేక చూస్తున్న వెంకటేశ్వరుడి దీనగాథ...

లాభం లేదు... హు...

ఇది బెస్ట్... హోం మంత్రి చిన్నకొడుకు రేప్ చేసిన పోలీసు భార్య దీనగాథ... చివరకామె భర్తనే అరెస్ట్ చేసి, జైలుశిక్ష వేసి, రద్దు చేసి, ప్రమోషన్ యిచ్చి – ఆవిడకి ఎం.పి. (మహాపతివ్రత) బిరుదునిచ్చి...

దిక్భ్రమ? – కాని, ఏడుపు రాటంలేదు.

చిత్తశుద్ధిగల జర్నలిస్టు చెత్త సినిమాని పొగుడుతూ, మాంచి సినిమాని తెగడుతూ ఒకే పేజీలో రాయవలసిన దుస్థితి ఏర్పడి – పెన్నుతో పొడుచుకుని ఆత్మహత్య చేసుకోబోయాడు.

కొక్కొరోక్కొ.

ఆ!... అప్పుడే తెల్లారిందా? – తోందా. కాని, నీ వల్ల కాదు. నీ ఏడుపు కోసం నా పాట ఆగదు, నీ ఏడుపు సాగదూ, నా ఆ పాట ఆగదూ దూ.. దూ... దూ.. దూ... దూ..

కాక్కొరోక్కో.

అమ్మా! ఆకలి.

వెధవా! నోర్మూయ్.

పాలమ్మా! పాలు.

నీకేం బుద్ధుందా? ఆడంగులు నీళ్ళోసుకుంటూంటే చూస్తావా? దున్నపోతా?

కౌసల్యా సుప్రజా రామా... అంబా...ఠంగ్... ఠంగ్... గుడిగంటలు... ఈలపాట... అత్తయ్యా! చూడండా పిల్లాడు – బూతు పాటలు పాడుతున్నాడు. పాటెక్కడే – ఈలే కదా? పాట వరసే కదా... బలెవారే.. దాంటో వచ్చే మాట వరసలన్నీ పచ్చి బూతులు... అలాగా... ఏరా పుండాకోర్! ఏదిటా కూతలు? కాఫీ అయిందా?

గోవిందా – గోహో... విందా అంటూ ఎండి పోయిన ఎర్రబడ్డ కళ్ళతో ఇంట్లోకి నడిచాడు ఆనందరావు.

ఇత్తడి బిందెను కుండల బదులు 170 రూపాయిలకు గుట్టుగా తెగ్గించి బంగాళా దుంపలూ, ఉల్లిపాయా, కోడిగుడ్లూ కొని, చాటుగా ఇల్లు చేర్చి, సగర్వంగా ఇల్లాలికి వప్పగించాడు. ఉల్లిపాయల మధ్య ఓ పావలా మల్లెపూలుంచాడు. జీవితం బండి కదిలింది. బజారెక్కి ఆఫీసుకు చేరబోయాడు.

మేడ మూడో అంతస్తు బాల్కనీలో పిల్లాడిని ఎగరేసి ఆడిస్తున్న తండ్రి తూలాడు. పిల్లాడు కింద పడ్డాడు. 'అరె' అంటూ తండ్రీ, 'ఏవండీ' అంటూ భార్యా పడ్డారు.

"గవర్నమెంటు కూడా తక్షణం పడిపోవాలి" అన్నారు అపోజిషన్‌లో మాజీ మంత్రులు –

"ఎందుకు దిగాలి. మాకేం బట్టే?" అన్నారు పొజిషన్‌లో వున్న ఈజీ మంత్రులు.

"చూడండి. మీ రాజ్యంలో తిండి, నీరు లేక ఒక కుటుంబం యావత్తూ మేడ మీంచి దూకి ఆత్మహత్య చేసుకుంది."

"యావత్తు దూకలేదు... ప్రైవాటాలో అత్త మామలూ, ఇంకో ఇద్దరూ పిల్లలూ వున్నారు."

"వాళ్ళూ దూకేస్తారు... లేదా మేం దూకిస్తాం... తోసేస్తా, ఇవి ఆత్మహత్యలే."

"అదే నిజమైతే ఆ పాపం మీదే. మేం నిన్నగాక మొన్నే పవరులోకొచ్చాం – ఈ కుటుంబాలు మీ హయాంలో మలమల మాడి చావాలని నిశ్చయించుకున్నాయి. ఇప్పుడు అమలుచేస్తున్నాయి. మా పాలనలో చావాలని ఆలోచించుకున్నా మీ పాలన రాగానే, ఇహ అస్సలు ఆశ లేదని చావు నిర్ణయం అమలుచేశాయి."

"అయినా, ఇకపైన ఎవరూ మేడ దూకి చావరు. బల్రాం జాకర్ గారి దగ్గర గడ్డిమిషన్లు అద్దెకు తెచ్చి గడ్డి మొలిపించింది మేడలు చుట్టూరా గడ్డి పరుపు వేయిస్తాం. సూయిసైడ్ కుటుంబాలు ఇంక చచ్చినా చావలేవు. హ"

"మీ రందరూ డౌన్... డౌన్."

జనం పరిగెడుతున్నారు. లారీ ఆటోని పచ్చడి చేసింది. బస్సువాళ్ళకి కోపం వచ్చి ఎక్కడ బస్సులు అక్కడ అడ్డదిడ్డంగా ఆపేసి ట్రాఫిక్ జాం చేసేశారు. అయ్...హాయ్... బడిలేదు - అని గెంతారు పిల్లలు.

మళయాళం పిక్చరు మార్నింగు టిక్కెట్లు బ్లాకులో అమ్ముదామని - గంటకి పది పైసలు వడ్డీ కప్పు తెచ్చి బ్లాకుగా కొనేసిన పకీరుకి టిక్కట్లు చెల్లక అప్పిచ్చిన మార్వాడీని కొట్టాడు. ఇద్దరూ బీటుపోలీసుకి రెండూ ఐదూ చొప్పున ఇచ్చారు. ఇద్దరు ముగ్గురొచ్చినా షో వెయ్యాలంటూ ఇద్దరు హాలు అద్దం మీద రాళ్ళేశారు... వెంటనే ఎదురుగా హోటల్‌లో పూటుగా టిఫిన్ తిన్న జనం "అరెరె! గూండాలు! గూండాలు!" అని కేకలేస్తూ అక్కడున్న మైసూరు పాకులతో లడ్డూలతో కొట్టుకున్నారు. చోటు చాలక బైటకెళ్ళిపోయారు. పోతూ పోతూ క్యాషియర్ చొక్కా పట్టుకుని బయటకీడ్చి పారేశారు. గల్లా పెట్టె ఖాళీ చేశారు.

డిస్కౌంటు బట్టల షాపులో ఎవడో గుడ్డల మీద బీడి వేశాడు. "ఫైర్ ! ఫైర్!" అంటూ జనం లోపలకొచ్చి లోపల గుడ్డలన్నీ రోడ్డు మీద పారేశారు. నూటికి నూరు డిస్కౌంటు మీద గుడ్డలన్నీ చెల్లిపోయాయి. "భయపడకు నీకేం భయం లేదు" అంటూ అగ్ని ప్రమాదంలో చిక్కుపడ్డట్టున్న సేల్స్ గరల్స్‌ని చాలా మంది కాపాడారు. చిట్లిన గాజులూ, నగలూ అవీ గుచ్చుకున్నాయి. పాపం... అంబ్యులెన్స్‌కి ఫోన్ చేస్తే పోలీసువాను వచ్చి వైద్యం చేసింది. వాళ్ళ పిల్లల్ని దుబాయ్ వాళ్ళు కొనేశారు హోల్‌సేల్ రేటు మీద.

అంబ్యులెన్సులో హార్టెటాకుతో ఆస్పత్రి కెళ్తున్న ప్రముఖ నాయకుడు ట్రాఫిక్ జాంలో ఇరుక్కుపోయి గుటుక్కుమంటున్నాడు. హెలికాప్టర్ వచ్చి వారి దేహాన్ని పైకి లాక్కుంది. 'అమర్ రహే'... 'జిందాబాద్' అంటున్నారు జనం.

కొత్త టీ.వీ. వంద రూపాయలు - రెండొందలకు మూడు టీ.వీ.లు, జాంగ్రీ పది పైసలు - పాంటు షర్టు పాతిక రూపాయలు... మార్కెట్ కోలాహలం "ధరలు బాగా తగ్గిపోయాయి... ఇది మా కృషి ఫలితం" అన్నారు మంత్రి పార్లమెంటులో. రూపాయిన్నర లడ్డు పది పైసలు... విరిగిన జాంగ్రీపది పైసలు.. ఆఫీసులూ షాపులూ బంద్ అన్నారు... నాయకులు... షట్టర్లు దిగిపోయాయి.

"గంటన్నరసేపు హర్తాళ్ విజయవంతంగా జరిగింది. కాబట్టి గవర్నమెంటు రాజీనామా చెయ్యాలి" అది అపొజిషన్.

"ఇది భయపెట్టి చేయించిన బలవంతపు హర్తాళ్. ఇందుకు మేం ఇప్పుడింకో హర్తాళ్ చేయిస్తాం కాసుకోండి" అంది పొజిషన్.

లేస్తున్న షట్టర్లు జారిపోయాయి. 'హర్తాళ్ జయప్రదం - అపొజిషన్ వాళ్ళంతా రాజకీయ సన్యాసం పుచ్చుకుని అడవుల్లోకి పోవాలి" అన్నారు మంత్రులు.

"రేప్పొద్దున్న మేం 48 గంటల బంద్ జరిపిస్తాం.. అది గెలిస్తే మంత్రులు మాజీలయి మాతో కలిసిపోవాలి" అన్నారు మాజీలు.

"మేం 96 గంటలు బంద్ చేయిస్తాం"

"మేం 192 గంటలు."

"మధ్యలో ఆదివారం వస్తుంది."

సాయంత్రం అయింది. ఆనందరావు గోదారొడ్డుకి చేరాడు నీరసంగా.

బంగాళాదుంప కూరలో నిమ్మకాయ పిండమని చెప్పడం మర్చిపోయాను - అనుకొన్నాడు రేవులోకి దిగుతూ. వెళ్ళేటప్పుడు కొనుక్కుపోతే సరి... జేబులో వుంచుకుని అది పిండుకోడం మర్చిపోతే?

నవ్వుకున్నాడు.

రేవులో పడవలు, లాంచీలు, పంట్లు, వరసగా గోదావరి లోపలిదాకా కట్టేసి వున్నాయి. ఎక్కి చిట్టచివరి పడవదాకా వెళ్లాడు. గట్టుకి చాలా దూరంగా వుంది. కాళ్ళు వేలాడేసి కూర్చున్నాడు. నిర్మానుష్యంగా వుంది. గాలీ, నీరు, ఆకాశం... నేల లేదు. బావుంది. చాలా బావుంది. అన్నట్టు తాను ఏడవాలనుకున్నాడు గదూ? - అవునవును. రాత్రి కుదరలా. పలగంతా గొడవలు - ఆఫీసు జోకులు నవ్వులు - టైపిస్టు పిల్లలు - బడ్డీలు పకోడీలు - టీలూ... సిగరెట్లు... ఉర్తాళ్ళు... హర్తాళ్ళూ... అంతా హడావిడి... బాగుంది.

అవునూ... హాయిగా కూచుని పాడుకోవాలను కోకుండా ఏడవాలనుకోడం ఏవిటి?

"ఇంతకీ ఎందుకేడవాలనుకున్నాను చెప్మా?" అనుకున్నాడు ఆనందరావు.

★ ★ ★

# కథాభి రమణీయం

## కృతజ్ఞత



ముందు వేసవి కాలంలో ఒక రోజు రాత్రి, వెన్నెల ముమ్మరంగా కాస్తోంది. పెదపంతులుగారి లోగిలిముందు అరబైటవేసిన తెల్లటి పక్కల మీద ఆ వెన్నెల విరగబడి నవ్వుతూ పొర్లాడింది.

వెండికొండపై పరమేశ్వరుడివలె ఆ తెల్లటి పక్కవేసిన మంచంమీద పెదపంతులు గారు సభాభిముఖవదనులై మందహాసముతో నీలి ఆకాశాన వెలిగిపోతున్న చంద్రుణ్ణే చూస్తున్నారు. కొంచెం దూరంలో ఒక రైతు బంగారయ్య గొంతుకిలా కూచుని పొలం సంగతులు చెపుతున్నాడు. అరుగు చివర దూరంగా నిల్చున్న పాలేరు ముల్లకర్ర పిడిమీద పెట్టుకున్న చేతిముణుకులమీద గడ్డం ఆనించి కబుర్లు ఆలకిస్తున్నాడు.

సుబ్రహ్మణ్యంగారి సతీమణి కామేశ్వరి, పెదపంతులుగారి భార్య సుందరమ్మా గుమ్మం మెట్లమీద కూర్చున్నారు. వాళ్ళు తలలో తురుముకున్న మల్లె చెండ్లూ, మరువం పరిమళాలు గుబాళిస్తున్నాయి.

హఠాత్తుగా ఒక పెద్దగావుకేక గాలిని బద్దలుచేస్తూ వినవచ్చింది. అందరూ ఉలికిపడ్డారు.

"ఆగరా! ఆగు! విశ్వాస ఘాతకుడా! సిగ్గులేదూ! ఆగు" అంటూ అరుస్తూ మహావేగంతో పరిగెత్తుకొచ్చాడు వెర్రి వెంకన్న. పంతులుగారి ఇంటిగుమ్మం ముందు కొచ్చేసరికి ఆగిపోయాడు వగురుస్తూ.

వెంకన్న నెత్తికి తలపాగా చుట్టాడు. ఒక నల్ల చింకికోటు తొడుక్కున్నాడు. గోచీ పెట్టుకున్నాడు. చేతిలో చింతబరికె వుంది.

గభాలున వెంకన్న రోడ్డు మధ్య మఠం వేసుకుని కూచున్నాడు. ఎదురుగా అతని నీడ పడుతోంది. నీడతో చెప్పటం మొదలుపెట్టాడు. తన గోల–

"చూశావుటయ్యా! అదీ సంగతి. అప్పుడా గజేంద్రుడు పెట్టిన గోలకి, లక్ష్మీదేవితో చదరంగం ఆడుతున్న విష్ణుమూర్తి అదరిపడ్డాడు. చెవులు గింగుర్లెత్తిపోయాయి.

అప్పుడేం చేశాడో తెలుసోయ్? సిరికింజెప్పడు శంఖచక్ర యుగ్మమున్ – ఆగాగు, అక్కడాగు, ఏవిటీ! మళ్లా అను ఆ ముక్క – సిరికింజెప్పడూ? అవును వాడిష్టం మధ్య నీదేమిటోయ్ సిరికేకాదు, గిరిక్కూడా చెప్పడు. అల! చెప్పడు. వాడేం వాడి సొమ్ముతిన్నాడా ఏమన్నానా! అంచేత చెప్పడంటే చెప్పడోయ్ ఊఁ! తరవాత శంఖచక్ర యుగ్మమున్ చేదోయి సంధింపడే పరివారమున్ జీరడు. ఆగాగు అలా అగు. జీరడ మేవిఁటీ ఎవర్ని జీరడం? పరివారాన్నే!? హారి ఎందుకురా పాపం వాళ్ళు వెట్టిచాకిరీ చేసినందుకు జీరమంటావా? విశ్వాసం వున్నవా డెవడేనా ఆ పని చేస్తాడాఅంట. అసలు విష్ణుమూర్తెవరనుకున్నావ్? సాక్షాత్తు దేవుడు. అంచేత అతడు జీరతాడా? జీరడని తాత్పర్యం. ఎంత దేవుడైనా అతగాడికి విశ్వాసం ఉంది. మా నేస్తం కామోజీ గాడికి విశ్వాసం లేదు. వాడు నాకు ద్రోహం చేశాడు. మోసం చేశాడు. నన్ను తన్నేడు. పదేళ్ళ స్నేహం మంటగలిపేశాడు దౌర్భాగ్యుడు. ఒరేయ్ కామోజీ నువ్వు బాగుపడవ్, నీళ్లు పుట్టవారేయ్, అగు వస్తున్నా అట్టే అట్టే అగు. నీక్కాదూ...." అంటూనే జింకని తరిమే పులివేగంతో ఎవర్నో తరుముకుంటూ పరిగెత్తుకుపోయాడు.

ఎవరికీ నవ్వు రాలేదు–వెంకన్న వెర్రి వేదాంతానికి. ఎందుకో భయం వేసింది. అతని వాక్శుద్ధికీ, ఈ స్థితికీ సంబంధం అంతుపట్టలేదు. పెద పంతులుగారు కూడా ఎపుడూ అతన్ని చూడలేదు. అందరూ జాలిగా చూశారు పరిగెడుతున్న వెంకన్న వైపు.

దూరంగా నించున్న పాలేరు కొంచెం సందేహంగా నవ్వాడు. అందరూ వాడివంక చూశారు. తుపుక్కున పక్కకి ఉమ్మివేసి ఉషారుగా వాడికి తెలిసింది చెప్పబోయాడు. "యీడి పేరు యెర్రెంకడు బాబయ్యా. బ్యామ్మలాయనేటండి. అయితేనేం మతి సెడ్డది. దుళ్లసంతకాడ తూమ్మీదకూకుని ఓ పద్దేలు సదివేత్తాడు. ఓడినో అమ్మా అలిచేసి తిడతాడండి. ఏ వూరోడో ఒరికీ తెల్దు. ఎర్రి నంజకొడుకు థూ."

రైతు బంగారయ్య గసిరికొట్టాడు. "ఛీ యెదవా–యెదవా అని నువ్వలాగుండెహె. పెద్దోరిముంగల ఏటెరా ఆ మాటలు. ఎదవ నోటికొచ్చిందల్లా పెడపెడా ఓగేయడమే? చుర్దీబద్దం నేదు నోటికి. యెదవా యెదవాని."

"వాణ్ణి తిట్టకయ్యా. పాపం వాడికి తెలిసిందేదో చెప్పాడు. తప్పేముందిలే" అన్నాడు సుబ్రహ్మణ్యంగారు.

పెద పంతులుగా రావలిస్తూ తమ అభిప్రాయం వెళ్ళబుచ్చారు. "పాపం... ఎవళ్లో ...బదిగి చెళిళవాళయి యుళ్లాడు... హాయ్... స్నేహితుడెవడో..హమ్మ... స్నేహితుడెవడో నమ్మించి ద్రోహం చేశాడు గావును. మతిపోయుంటుంది."

"అంతేమరి. స్నేహితులన్నాక ఆ మాత్రం విశ్వాసం వుండద్దూ. సాయం చెయ్యా చెయ్యాలి పొందా పొందాలి. పాలిచ్చిసాకిన ఎదుట్టొమ్ముని పొడిచిన వెధవలు బాగుపడతారా అని" అన్నది కామేశ్వరమ్మగారు జనాంతికంగా.

సుందరమ్మ అందుకుంది. "మనిషన్నాక ఆ మాత్రం బుద్ధుండద్దూ, కుక్కకుంది విశ్వాసం. ఛీ..."

"అంతేనండంతేనండి" అంటూ వంత పలికాడు బంగారయ్య.

సుబ్రహ్మణ్యంగారు తలగడా కిందనించి పొగాకుతీసి తుంపడం మొదలెట్టారు చుట్టనిర్మాణానికి నాందిగా.

అందరూ ఏకగ్రీవంగా ఛీత్కరించిన ఈ మహద్విషయంతో తనకేం సంబంధం లేనట్లుగా, కేవలం చుట్ట చుట్టుకోవడం ఒక్కటే జీవిత పరమావధి అన్న ధోరణిలో తలవంచుకొని ఏతత్కార్య నిర్వహణైక లక్ష్య నిమగ్నులై ఉన్న సుబ్రహ్మణ్యం గారి ముభావం పంతులుగారికేం నచ్చలేదు. తక్కిన జనం, అంటే, యిద్దరుస్త్రీలూ, రైతూ పాలేరూ కూడా యిదే అభిప్రాయంలో ఉన్నారని రూఢిచేసుకొని ఇంక ఉండబట్టలేక అడిగేశాడు పంతులుగారు: "ఏమండీ బావగారూ మీరే మంటారు? నేనన్నది రైటేనా అని."

సావధానంగా వంచిన తల యెత్తకుండా సుబ్రహ్మణ్యంగారు తిరుగు ప్రశ్న వేశారు "నువ్వనేది ఏమిటి అసలు?" అని.

"రెడ్డొచ్చె మొదలాడమన్నారట" అంది కామేశ్వరమ్మగారు నవ్వుతూ.

"రెడ్డి మొదటనించి యిక్కడే ఉన్నాడుగా ఎటొచ్చి అతని కర్థం కాలేదంతే. పోన్లే మొదటొస్తేనేం మధ్యనొస్తేనేం – రెడ్డి నాటకం చూడాలంటే మళ్లీ అడొచ్చుగా" అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

"మీ కవిత్వాలు నాకు రావు బాబూ, ప్రతిదానికీ సవాలక్ష చదువుతారు" అన్నదావిడ.

"పోన్లే నీకు రాకపోయినా మన పంతులి కొచ్చటలే. ఏదో చెప్తున్నాడుగా, మానవుడూ, కృతజ్ఞతా, స్నేహం – అని..." అంటూ ఛలోక్తి విసిరారు సుబ్రహ్మణ్యంగారు, చుట్టంటిస్తూ.

పంతులు కోపం బుస్సుమంది. "కవిత్వాని కేవుందండి. ఉన్నమాట అన్నాను. మనిషన్నాక విశ్వాసం వుండాలంటాను. వెధవది కుక్కకి ఉందికదండీ కృతజ్ఞత!"

చిద్విలాసంగా పొగవదిలి, నెమ్మదిగా నోట్లో చుట్టతీసి, శ్రద్ధగా దాని కొడి దులిపారు సుబ్రహ్మణ్యంగారు. అర్థనిమీలితనేత్రులై పది క్షణాలు మౌనం వహించారు. తరువాత తాపీగా జవాబిచ్చారు.

"చూడు పంతులూ. మనుష్యుల బతుకులు సూత్రాలమీద నడవ్వు. నువ్వు నాకు మహోపకారం చేశావనుకో, నేను విశ్వాసం కొద్దీ నీకో వెయ్యి రూపాయలు దొరికే ఛాన్సు ఇప్పించాను. నావల్ల నీకు డబ్బొచ్చిందన్న విశ్వాసంతో నువ్వు నాకు వంద రూపాయలిస్తావు. నా పరిస్థితుల కొద్దీ "ఛా వీడు నాకు వందే ఇచ్చాడు కృతఘ్నుడు." అంటాను నేను.

"చూశావా వీడికి వంద కరుకులు దోసిట్లోపోస్తే అవి పుచ్చుకొని నన్ను తిడుతున్నాడు" అంటావు నువ్వు. నా దృష్టిలో నీకు విశ్వాసం లేదు. ఇలాంటివి ఇదమిద్ధమని చెప్పలేం."

"నిబద్దేనండి ఆ ముక్క" అన్నాడు బంగారయ్య.

పంతులుగారు ఆలోచనలో పడ్డారు.

"కథ చెప్తారు విను సుందరమ్మా" అంది కామేశ్వరమ్మగారు నవ్వుతూ.

సుబ్రహ్మణ్యంగారు మంద్రస్థాయిలో ప్రవచించారు.

"నీ కళ్ల ఎదట మంచివాడు అపర్దిష్టపాలై అడుక్కు తింటూంటే – ఒకొక్కసారి నువ్వే ఆ మంచివాడవయితే నీకీ కృతజ్ఞతలో నమ్మకం పోతుంది. మా వూళ్లో సింగారం, దీక్షితులూ యాభైఏళ్ళనించి స్నేహితులు. సింగారం పెంపుడు కుక్క విశ్వాసం లేకుండా ఆ స్నేహితుల మధ్య అపోహలు కల్పించింది. మరి అన్నేళ్ల స్నేహం ఏ గంగలో కలిసిందో కానీ ఇద్దరూ ఇపుడు పరమ శత్రువులు, పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. వాడు వెధవంటాడు సింగారం. సింగారం వెధవన్నర అంటాడు దీక్షితులు.

చూడు పంతులూ ఇలాంటివి చూస్తే కృతజ్ఞతనే మాటలో అర్థం కనిపించదు. స్వార్థం కనిపిస్తుంది. దానికోసం వెతకడం కన్నా ఆంధ్రుల్లో ఐకమత్యం సాధించడం సులభమేమో అనిపిస్తుంది. నవ్వకు, సింగారం కథ వింటే నువ్వల్లా నవ్వవ్. చెప్తాను విను. చిన్నదేలే. ఈ చుట్టయ్యేలోగా పూర్తిచేస్తా."

(సుబ్రహ్మణ్యేన ఉవాచ ఇతి కథా ప్రారంభః)

"అనగనగా మీకు తెలీని ఊళ్లో, ముత్యాలమ్మగుడి వీధిలో దీక్షితులని ఒక సద్బ్రాహ్మణు డుండేవాడు. సంత బజారులో జవహర్లాలు కాఫీ హోటలు పొరుగున సింగారం అనే వణిగ్వరుడుండేవాడు. పరమ నిష్ఠాగరిష్టులు, బహుశ్రుతులు, పరేంగితజ్ఞులు అని పేరందిన సద్వంశంలో జన్మించాడు దీక్షితులు. దీక్షితులు తాత పువ్వు లమ్మినవాడు, సింగారం తాత కట్టెలు అమ్మేవాడు. ఇపుడు దీక్షితులు కట్టెలమ్ముతున్నాడు. సింగారం పువ్వులు విరజిమ్మగల స్తోమత సంపాదించాడు.

ఈకథ నాంది ఏమిటంటే – ఈ బ్రాహ్మడికీ, ఆ కోమటికీ పొత్తు కుదరటం. ఇందులో ఒక విచిత్రం ఉంది. వాళ్ళ పొత్తు పోట్లాటతో ప్రారంభమయింది. నేనూ దీక్షితులూ గోచీలు పెట్టుకుని గోళీ లాడుకుంటున్నాం ఒకరోజు మధ్యాహ్నం. మాకు పదేళ్ళుంటాయేమో అప్పుడు. సింగారం నా క్కొద్దిగా తెలుసు. ఎక్కడ్నించో వచ్చినుంచుని మా ఆట చూస్తున్నాడు. బొడ్డుకిందకి చెడ్డీకట్టుకుని, బొజ్జ బైట పడేసుకుని, బండబ్బాయిలా ఉండేవాడు సింగారం. ఆ వేళ బెల్లపు జీడి తింటున్నాడు.

దీక్షితులు ఆట ఆపి వాడివంక చూశాడు. జీడి చూడగానే నోరూరింది. మట్టిచేతులు పిర్రలకి తుడుచుకుంటూ, సింగారం దగ్గర కెళ్ళాడు. ఎగాదిగా చూశాడు. నిర్లక్ష్యంగా జీడి చీకుతున్నాడు సింగారం.

"ఈ చెడ్డీ నీది గాదు" అన్నాడు దీక్షితులు.

"నాదే" అన్నాడు సింగారం శ్రద్ధగా జీడిని చూస్తూ.

"నీది కాదు మీ తమ్ముడిది."

"కాదు నాదే. నాకు తమ్ముడు లేడు."

"అయితే నీ చిన్నప్పటిది."

"పోన్లే. నా యిష్టం" అన్నాడు సింగారం. కొంచెం అవతలగా నించున్న అంబోతుని చూస్తూ.

దీక్షితులి కింక ఏం చెప్పాలో తోచలేదు. సింగారం జేబులోంచి జీడితీసి నావేపు చూశాడు.

"జీడి కావాలా సుబ్బులూ?"

"అక్కర్లేదు. కానీ నీ యిష్టం. ఇస్తే ఇయ్యి" అంటూనే జీడి అందుకున్నాను నేను. దీక్షితులికి మరీ నోరూరింది–

"జీళ్లు బాగుంటాయి" అన్నాడు గుడ్లు మిటకరించి.

సరే అపుడు సింగారం యింకో జీడి తీసి, "నీ క్కూడా జీడి కావాలా?" అన్నాడు.

అవునని తల పంకించాడు దీక్షితులు. జీళ్లు తింటూ గోళీకాయలాట సాగించాం. సింగారం నుంచుని ఆట చూస్తున్నాడు. దీక్షితులి గోళీకాయ ఒకసారి సింగారం కాలిదగ్గర కొచ్చి ఆగింది. చిరునవ్వుతో చిద్విలాసంగా ఆ గోళీని కాల్తో తన్నాడు సింగారం.

ఆట మధ్యలో చెడిపినందుకు దీక్షితులికి వళ్ళు మండిపోయింది. పిడికిళ్లు బిగించి సింగారం మీదకెళ్ళాడు. "ఎవఁడ్రా నిన్ను తన్నమన్నది. పెద్ద పానకంలో పుడకలాగ" అన్నాడు.

సింగారం వెకిలిగా యికిలించాడు నా వంక చూసి. "నేను జీడి పెట్టాగా, ఆ మాత్రం గోళీ తంతే ఏం?" అన్నాడు.

"పోన్లేరా దీక్షితులూ వదిలెయ్. జీడి పెట్టాడుగా" అన్నా నేను. దీక్షితులు వదిలేశాడు. "జీడి పెట్టావుగానీ లేపోతేనా" అంటూ చూపుడు వేలుతో సింగారం బొజ్జమీద పొడిచాడు. ఆట ఆడేశాం.

ఇళ్ళకివెళ్ళే సందర్భంలో దీక్షితులు గండుపిల్లిలా మొహం పెట్టి వీడ్కోలు చెప్పాడు. సింగారం రెండడుగులు వేసి కొండముచ్చులా మొహం పెట్టి – "హేఁ" అన్నాడు.

కానీ ఆ సాయంత్రం పది జీడి కడ్డీలు తెచ్చాడు సింగారం వాళ్ల నాన్నకి తెలీకుండా. స్వయంగా దీక్షితుల్ని పలకరించి వియ్యపురాలి జీళ్లూ బెల్లపుజీళ్ళూ కూడా ఇచ్చాడు. చీకటిపడేసరికి ఇద్దరూ చెట్టాపట్టాలేసుకుని తిరిగారు. చూశావూ పంతులూ – పదో ఏట వాళ్లకి పొత్తు కుదిరింది. రోజు రోజుకీ వాళ్ళ స్నేహం దృఢతరమైంది. కలసి ఆడుకున్నారు. కలిసిచదువుకున్నారు. కష్టం సుఖం చెప్పుకున్నారు. దరిమిలాను వాళ్ళు పెద్దవాళ్లయ్యారు. ఈ విధంగా యిద్దరూ కలిసి నాలుగు పుష్కరాలు చూశారు. ఊళ్లోవాళ్లకెంతో చిత్రంగా వుండేది వాళ్ళ స్నేహం. దీక్షితులు బీదవాడయినా నోరువిప్పి సింగారాన్ని ఏనాడూ కానీ అడుగలేదు. సింగారం కూడా – కావాలా అని అడగడు. తనే తెలుసుకుని డబ్బో దస్కమో సంభారాలో పంపేవాడు ఇంటికి.

దీక్షితులికి పిత్రార్జితమైన లోగి లొకటి మిగిలింది. అది వినా పొలం గిలం లేదు. ఆ యింటి వెనకున్న దోసెటి పెరట్లోనూ దోసకాయలో పొట్లకాయలో కాపించి సంతకి పంపేవాడు. పోతే ఏదో అచ్చెన్నా బుచ్చెన్నా పోట్లాడుకుంటే వాళ్ళ మధ్య దూరి తగవు తీర్చి అయిదో పదో తెచ్చుకునేవాడు. అదీ ఇదీ లేకపోతే రామమందిరంలో కూర్చుని చౌదరికీ నాయుడికీ సలహాలు చెప్పేవాడు. సాయంత్రం మట్టుకు సింగారం గుడివేపు రాగానే, ఇద్దరూ కలసి పొలాలవైపుపోయి లోకాభిరామాయణం మాట్లాడుకునేవారు. సింగారాన్ని ఆకర్షించినది దీక్షితులి ఋజువర్తనా, సౌజన్యమూనూ. ఊళ్లో వాళ్ళుకూడా ఇందుకే అతన్ని గౌరవించేవారు. అతని మాట

పాటించేవారు. ఈవిధంగా ఏళ్ల తరబడి సాగింది వాళ్లస్నేహం. ఊళ్ళోవాళ్ళకెంతో చిత్రంగా వుండేది వీళ్ల ధోరణి.. చూశావూ పంతులూ, ఇళ్ళూ, వేషభాషలూ, మనస్తత్వాలూ, ఆఖరికి పెళ్లాలూ కూడా రోజు రోజుకీ మార్చేస్తున్న ఈ పాడు రోజుల్లో వీళ్లు కేవలం ఇంత సక్రమంగా, బొత్తిగా ఇంత కల్తీలేని ప్రేమతో స్నేహితుర్ని మార్చుకోకుండా బతుకుతున్నారంటే చిత్రంగాదూ ఎంత స్నేహమయినా, మరీ బొత్తిగా అన్నాళ్లా! పల్లెత్తుపొల్లుమాట కూడా వాళ్ళనోటంట దొల్లలేదంటే నమ్ము బంగారయ్యా!"

"మంచోళ్ల నోట మంచిమాట రాక యింకేటొస్తదండి బాబయ్యా" అన్నాడు బంగారయ్య చతికిలబడుతూ.

"ఎందుకు రావయ్యా? మనిషిలో వుండే చిత్రమే అది. మంచీచెడూ కలిస్తేనే మనిషి – ఏడు రంగులు కలిస్తే తెలుపయినట్లు. "అనగనగా ఓ రాజా రాణీ ఉండేవారూ – వాళ్ళకి కొడుకూ కూతురూ పుట్టారూ – రాజ్యం సుభిక్షంగా వుండేదీ – రోజులు హాయిగా వెళ్లేవే కానీ యిలా వుండగా ఒక నాడేమయిందంటే–" అవటాని ఎన్నివేల కథలు చెప్పకుంటామయ్యా అదంతే భగవద్విలాసమే అంత. ఏదో ఓ నాడేదో పోటీ జరుగుతుంది; చిన్న అపశ్రుతి పలుకుతుంది ఆ జీవితమనే వీణమీద. ఒక్కోసారి ఆ అపశ్రుతి దిద్దటం జరిగి పాట సాఫీగా సాగిపోతుంది. కానీ – ఏది చూశావూ – కానీ ఒక్కోసారి ఆ అపశ్రుతి దిద్దటంలో తీగ తుపుక్కున తెగి వూరుకుంటుంది. అపుడా వీణ వాయించే ఆసామీకి చిరాకేసి వీణమీద కోపం వచ్చి దాన్ని తోసేస్తే అది భగ్నవీణవుతుంది. అయినా ఇదంతా మనకెందుకులే – ఏదో కవులూ గట్రా పుస్తకాల్లో రాసుకేడిచేది – కథ కానిద్దాం ... ఒరేయ్ పాలేరబ్బాయి – నీపేరేమిటోగానీ అలా ఎంత సేపు నించుంటావ్ – కూచో కూచో – అం పరేనయ్యా – ఆ విధంగా రోజులు సాఫీగా జరిగిపోతున్నాయి. ఒక రోజు పొద్దున్నే దీక్షితులు వంటింట్లో కూచుని, కూరతరగడం రూపేణా పెళ్లానికి వంట సాయం చేస్తున్నాడు. బయటనించి కేక వినపడింది. దీక్షితులి భార్య వెళ్లి తలుపు తీసింది. ఆ వచ్చిన మనిషి సరాసరి వంటింట్లో జొరబడిపోయాడు.

"ఏవండోయ్. దీచ్చితులుగోరూ – చింగారంగోరు తమర్ని వున్నపడంగా లగేసుకు రమ్మన్నాడు" అన్నాడు.

"ఏమిట్రా కథా?" అన్నాడు దీక్షితులు ఆశ్చర్యంగా. సింగారం ఎన్నడూ ఈ విధంగా యింటికి కవురంపలేదు. దీక్షితులు భార్యకి తమ స్నేహం రుచించదని అతనికి బాగా తెలుసు. అసలే ఆవిడ గయ్యాళి. కాకి నలుపంటే కాదు తెలుపనే రకం.

ఈ కబురు వినగానే ఆవిడ గంయ్యిమంది. "అయ్యో హయ్యో నీకేం పోయేకాలం వచ్చిందిరా అంట వెధవా – శూద్రాడివలా వంటింటి మీదికొచ్చి పడిపోతే ఎలాగా. నా మడి మంటిగడ్డలైనట్టే వుంది. నవ్వుతావేమిట్రా నీ నవ్వు నట్టేట కలవా. ముందవతలకి నడువు రాలుగాయి వెధవా అని... అన్నా మరీ బరితెగించి పోయారమ్మా..."

కబురు తెచ్చిన తొందర్లో సరాసరి వంటింట్లో కొచ్చేసిన అసిరయ్య నవ్వుకుంటూనే వీధి గుమ్మంలో కెళ్ళాడు. వాడికీ ధోరణి బాగా అలవాటే.

కంద దుంపలు చెక్కు తీసి చెయ్యి కడుక్కొస్తున్న దీక్షితులిగారి మీదకి తిరిగిందావిడ విసురు. "ఇంకేం – దయచెయ్యండి దర్బారుకి. జోడు గుర్రాల బండి బయట కాస్కుందిగావును. వెళ్లండి వంటా వార్పూ అఖరికి కూర తరగకుండా... నేనే చేసుకేడుస్తాను. రవ్వంత జాలిలేదు కదా మనిషికి" అంటూనే దీక్షితులి కంటి ముందరే ఆవిడ పెద్దపెద్ద అంగలేస్తూ వాకిట్లోకి బయల్దేరింది.

దీక్షితులు గోచి సవరించుకుంటూ ఆవిడ వెనకాలే వచ్చాడు. "అవునే ఒసే నువ్వుండవే. నేను కనుక్కుంటాగా ఏవిటో, ఏవిట్రా అసిరయ్యా? ఏవిట్రా సంగతి? సరిగ్గా చెప్పి ఏడు" అన్నాడు.

"ఏంటేంటి బాబుగోరూ బోలెడుండది. నిన్న రేత్రి చింగారంగోరు మామూలుగానే బువ్వతిని తొంగున్నారంట మూడు జాములపుడు కామోసు – ఏడుకొండలయెంక టేశ్వరులోరు ఆ పడాన్న కల్లో కాపడి ముందరయ్యగోర్ని యాడ్చి లెంపకాయ కొట్టారటండి. అకాడ్నుంచి "ఎదవా నీకు బుద్దుందా? నా కొండకొత్తానని మొక్కున్నావుగందా. ఎగదొబ్బుదామని ఎత్తేశావుగానీ సంపేత్తా కబడ్దార్. ఇపుడు నెగిచి నాకూడా రారా" అంటా జబ్బ గట్టిగా ఒట్టుకుని నిల్దీసినారంటండి. అయ్యగోరు పెద్ద పెద్ద కేకలేసి ఎంటనే తెలివి తెచ్చుకుని, మమ్మల్నందర్నీ లేపి కల సెప్పి, ఎంటనే కాళ్లూ మొగం కడుక్కుని రేపే కొండకొత్తానని సామికి దణ్ణెట్టారండి. పొద్దు పొడిచేవరకూ మా కోరికీ కంటిమీద కునుకు నేదండి. ఆ ఎంకన్న మాత్తెం గురించి ఊసులాడుకుంటూ కూకున్నామండి అదీ సంగతి – అయ్యగోరు ఇయ్యాల్నే ఉప్పుడు కొండకి బయల్దేరినారండి అంతా అరిజంటు" అంటూ ఒగర్చి "అమ్మా కూసిని మంచీ లొయ్యండి చల్లని తల్లి" అన్నాడు అసిరయ్య.

దీక్షితులు భార్య పూర్తిగా చల్లబడి పోయింది. "పరగడుపున మంచినీళ్లేవిట్రా వెర్రివెధవా" అంటూ లోపలికెళ్ళి అన్నంవార్చిన వేడి గంజిలో కొంచెం ఉప్పూ, మజ్జిగా వేసి తెచ్చింది. ఈలోగా దీక్షితులు నీర్కావిపంచె కట్టి, విభూది తీర్చిదిద్ది, అంగవస్త్రం కప్పుకుని, పంచాంగం చంక పెట్టుకుని కిర్రు చెప్పులు తొడిగి బయలుదేరాడు సింగారం ఇంటికి.

ఎకాయెకిని సింగారం ఇంటికి చేరేసరికి, గుమ్మంలో రెండెడ్లబండి పూన్చి సిద్ధంగా ఉంది. సామాన్లు సర్దేశారు బండిలో. సింగారం అతని పెళ్ళాం ఆవిడ ముసలితల్లీ ముగ్గురూ పసుపుబట్టలు కట్టుకున్నారు. సింగారం పట్టెవర్ధనాలు తీర్చి దిద్దాడు. దుకాణం నౌకరు గుమ్మంలో నించున్నాడు చేతులు కట్టుకుని. ఇరుగూ పొరుగులు సింగారం భార్యచేతికి వాళ్ళ వాళ్ళ మొక్కుబడులూ అవీ తెచ్చిస్తున్నారు. కొందరు తిరపతి పటాలూ పటిక బెల్లం తెమ్మని డబ్బు లిస్తున్నారు.

దీక్షితులిని చూడగానే సింగారం పరమానందభరితుడు అయిపోయాడు. "రావయ్యా రా నీ కోసమే అగాను ముహూర్తం మించిపోతోంది రైలుకి వేళయిపోతోంది. మరేం లేదు, నీతో ఒక్కముక్క విన్నపం... ఒక్క ప్రార్థన చెప్పుకోవాలి. రెండు ముక్కల్లో చెప్పేస్తా. నా గదిలోకి రా... ఒరేయ్ అసిరీ సామాన్లన్నీ బండిలో పెట్టరా. పెరటి

తలుపులూ అవీ కూడా చూసిరా" అని హెచ్చరిస్తూ దీక్షితులు చెయ్యి పట్టుకుని లోపలికి పిలుచుకు వెళ్ళాడు.

"సరే ఇంక అసలు సంగతి చెప్పవయ్యా" అన్నాడు దీక్షితులు.

సింగారం తటాలున దీక్షితులు రెండు చేతుల్నీ పట్టుకున్నాడు. "దీక్షితులూ ఇవి చేతులుకావు కాళ్లు అనుకో. మన ఏభై ఏళ్ళ స్నేహం గుర్తుకు తెచ్చుకో నేను నీకు చేసిన ఉపకారాలు అన్నిటికీ బదులుగా ఇవాళ నువ్వు నాకు ఒక్కసాయం చెయ్యాలని నా ప్రార్ధన. ఆ సహాయం చేస్తావనే నమ్మకంతోనే నేను నీకు ఈ జేబు గడియారం బహుమానం చేస్తున్నా. నీకు ఎప్పటినుంచో దానిమీద మనసుందని నాకు తెలుసు. ఇదేకాదు నేను తిరిగి వచ్చేవరకూ మాయింటి పాడి ఆవు మా లక్ష్మిని తోలుకెళ్ళి పాడి కమ్మగా భోంచెయ్యి, మేత పాలేరు తెచ్చి పెడతాడు మన స్నేహం అంతా..." అంటూ మళ్ళా మొదలుపెట్టాడు.

దీక్షితులు ఉబ్బి తబ్బిబ్బులయిపోయాడు – సింగారం ప్రేమకి. అతనికికూడా ప్రేమ పెల్లుబికింది. "సింగారం చెప్పరాదుటోయ్ నీ కన్న నాక్కావలసిన వాళ్లు ఎవరున్నారు చెప్పు? నీ మాట నేను త్రోసిరాజంటానా... నా ప్రాణం అర్పించినా నీ ఋణం తీర్చుకోగలనోయ్... చెప్పుసంగతి" అన్నాడు.

సింగారం కంట నీరెట్టుకున్నాడు. "నాకు తెలుసు దీక్షితులూ మన స్నేహం వృధా కాదని. నాకు తెలుసు. కాని ఈ పని కష్టమైనది. ఇది నువ్వే చెయ్యగలవు. నువ్వే చెయ్యాలి. వాగ్దానం చెయ్యి" అన్నాడు.

దీక్షితులికి ఓర్పు తగ్గిపోయింది. ఆరాటం ఎక్కువైంది. గాయత్రి సాక్షిగా చేస్తాను అని ప్రమాణం చేశాడు. అయినా సింగారం ఉపోద్ఘాతం పునఃవర్ణించాడు. "చంపకచెప్పవయ్యా. నేచేస్తానన్నాగా" అన్నాడు దీక్షితులు.

సింగారం రెండు క్షణాలు ఆగి, నిశ్చలంగా దీక్షితులు కళ్ళలోకి పరీక్షగా చూసి చెప్పేశాడు. "ఏం లేదు. నేను తిరపతి నించి తిరిగి వచ్చే వరకూ నా ప్రాణతుల్యమూ, నా బిడ్డవంటిదీ అయిన "టైగర్"ని నీ కళ్లలో వత్తులు పెట్టుకు కాపాడాలి. ఈ భూప్రపంచంలో నా పరోక్షాన దాన్ని పాలించి రక్షించేవాళ్ళు ఇంకెవ్వరూ లేరు. టైగర్ ఎంతో పెంకిది. కాస్త అజాగ్రత్తగా ఉంటే అది ఓఘాయిత్యప్పనులు చేసి ప్రాణం మీదికి తెచ్చుకుంటుంది. నీకు తెలీందేముంది" అన్నాడు.

దీక్షితులికి మతిపోయింది. తల గిఱ్ఱున తిరిగింది."

కథ వింటున్న జనం పెళ్ళున నవ్వారు. "వీడిల్లు బంగారంగానూ ఇదటయ్యా వీడు అడిగింది ఇంత గొడవా చేస్తే?" అన్నాడు పంతులుగారు.

"అదిగో సరిగ్గా ఆ ముక్కే దీక్షితులు అనుకున్నాడు – సింగారం కోరిక వినగానే. అతనికి ప్రాణం ఉసూరుమనిపించింది. అవమానించబడ్డట్లయింది. సింగారం కోరబోయేది అదెంత పెద్దకోరికో అని అంచనాలు వేసుకున్నాడు. శిబి దధీచి బలి కర్ణుడూ మొదలయినవాళ్ళకు మల్లె తనుకూడా మహాత్యాగం చేసే అవకాశం లభిస్తుందని ఉవ్విళ్లూరి పోయాడు. చివరికి "కుక్కని పెంచు వెధవాయీ" అని అతను అడిగే సరికి దీక్షితులు ముఖం పాలిపోయింది. నోట మాటరాలేదు. కళ్లు తేలేశాడు.

దీక్షితులు జావగారి పోయిన విధం చూసి, సింగారం శతవిధాల కంగారుపడి, గబాగబా దీక్షితుల్ని అపార్థం చేసుకోడానికి ఉపక్రమించాడు– "హే మిత్రమా, ఈ ముద్దు చెల్లింపవా" అంటూ.

దీక్షితులు బుద్ధిమంతుడు, పరేంగితజ్ఞుడు. అందువల్ల తక్షణం చిరునవ్వుతో సింగారాన్నూరడించాడు. "నీ యిల్లు బంగారంగానూ ఇదిటయ్యా నువ్వడిగింది; ఏం పెద్దకోరికో అనుకున్నాను. చేస్తానుగానీ నా మాట కొంచెం విను ఈ కుక్కని ప్రేమించేవాళ్లు యీ లోకంలో నువ్వు తప్ప, నేను మినహా, ఇంకెవ్వరూ లేరు. దీన్నిచూస్తే మండిపడేవాళ్లలో మొదటిది నా పెళ్లాం. బద్దవైరం వాళ్లిద్దరికీ. ఇపుడు నేను ఈ "టైగర్"ని వెంటేసుకెడ్తే నాకు మా యింట్లో తీర్థంచుక్క పుట్టదు. కానీ సింగారం – నీ కోరిక నేను తప్పకుండా చెల్లిస్తాను ఒకేమాట – ఒకే పత్ని – ఒకే బాణం అన్నారు. అదీగాక శత్రుని మిత్రుడు నీకు శత్రువైనట్లే మిత్రుని మిత్రుడు నీకు మిత్రుడే అని కూడా అన్నారు. సింగారం – ధైర్యంగా వుండు. టైగర్ని నేను కాపాడ్తాను. నువుమాత్రం తొరగా రా అంతవరకూ నేను నిద్రహారాల్లేకుండా దీన్ని కనిపెట్టుకుంటూ. నువ్వు నిశ్చింతగా పోయిరా" అంటూ దీర్ఘోపన్యాసం చేశాడు కృతజ్ఞతా, జేబు గడియారం, టైగర్, దాంతోపాటు తన హృదయం అప్పగించాడు సింగారం దీక్షితులికి. ఇద్దరూ గుమ్మంలో కొచ్చారు. దీక్షితులి కింక అక్కడుంటానికి మనసొప్పలేదు. టైగర్నెలా కాపాడాలో మళ్లా మళ్లా చెపుతూ సందు మొగ దాకా వెళ్ళాడు సింగారం.

"సరే నే ఉంటా సింగారం – క్షేమాన పోయి, లాభాన రా, ఏడుకొండలవాడికి నా దండాలందచెయ్యి" అన్నాడు దీక్షితులు. దమయంతిని వీడిపోయే నలుడిలాగా, చంటిపిల్లని పొరుగింటావిడకి అప్పగించి సినిమాకెడుతున్న తొలిచూలు బాలింతరాల్లాగా తిరిగి తిరిగి టైగర్వంక చూస్తూ సింగారం బరువెక్కిన గుండెల్తో తన యింటిముందున్న బండివేపెళ్ళాడు – చెమ్మగిల్లిన కళ్లని తుడుచుకుంటూ.

దీక్షితులు టైగర్ని తీసుకుని ఇంటివేపు బయల్దేరాడు. ఇక దీక్షితులి జీవితంలో దుర్దశ ప్రారంభించిందయ్యా! ఇంటికి నడుస్తున్నాడు కానీ మనస్సు పరిపరివిధాల పోయింది. టైగర్ కూడా శాయశక్తులా అతన్ని పరిపరి విధాలుగా లాగుతోంది. అడ్డమైన ప్రతి ఊరకుక్కనీ పలకరించడం, ఆ తరువాత కంయ్ బొంయ్మని తాండవమాడిపోడం, దీక్షితులు దాన్ని అదుపు చెయ్యలేక తిప్పలు పడడం – ఈ భాగోతం చూసి జనం విరగబడి నవ్వడం. ఇంక చూశావూ – ఆ ఊరకుక్కలున్నాయే అవి లోకువ కట్టేశాయి. "టైగర్"ని దీక్షితులు ఎలాగా వదలడూ అన్న ధీమాతో అవి మరీ పేట్రేగిపోయి బంధుమిత్ర బలగంతోసహా మొరుగుతూ పదిగజాల దూరంలో వెంబడించాయి. ఒక చిన్నసైజు రాజుగారూ పరివారమూ ఊరేగినంత వైభవంగా జరిగింది ఆ దృశ్యం. నాలుగు వీధులూ తిరిగేసరికి కుక్కలూ, జనం కూడా విసుకెత్తి ఎవరి పనులమీద వాళ్లు వెళ్ళిపోయారు. మొత్తానికి దీక్షితులు కొంపకి చేరేసరికి గుడ్లు గూట్లోకొచ్చాయంటే నమ్ము.

హరిశ్చంద్రు డంతటివాడికే కష్టాలొచ్చాయి. వసుదేవుడు స్వయంగా గాడిదకాళ్లు పట్టుకొన్నాడు. దీక్షితులూ సింగారంపట్ల ప్రేమ కొద్దీ, మిత్రధర్మం దృష్ట్యా, ఓ

పాడుకుక్కని పట్టుకుని ఊరేగాడు అని తన్ను తనే ఓదార్చుకుంటూ ఇల్లు చేరాడు దీక్షితులు.

అసరికే దీక్షితులు భార్యకి, ఊళ్లోప్రజలు అంచీలమీద కబురందించేశారు. దీక్షితులుగారు ఊరకుక్కలవెంట ఊరేగుతున్నారనీ.

తెనాలిరామకృష్ణుడు పాలూ పెరుగూ కలిపి జమిలిగా తాగిపారేసిన సందర్భంలో కోపం వచ్చి కాళికపెట్టిన పోజులో, రౌద్రరూపిణియై గుమ్మంలో నుంచుంది దీక్షితులు భార్య.

రాగానే పతిదేవుడికి స్వాగతం చెప్పింది.

"అయ్యో హయ్యో నా బ్రాహ్మణీకం బొగ్గులవా. ఈ పాడు కుక్క మీ కెక్కడ దాపరించిందండీ. ఇదేం బుద్ధొచ్చిపడిందండి మీకూ? హవ్వ ఎవరన్నా చూస్తే చెప్పతీసి కొట్టిమరీ వెలివేస్తారండీ. ఆ వెధవ చెప్పా – మీరు దాన్ని తేనూనా."

దీక్షితులు అనుకున్నంతా అయింది. కానీ రోటిలో తలదూర్చి రోకటి పోటుకి వెరవనేల? అంచటా అని ధైర్యం చిక్కబట్టుకుని కొద్దిగా సకిలించి ఏదో చెప్పూ మెల్లెక్కబోయాడు.

సరిగ్గా సమయం చూసి ఆ యొక్క టైగర్ విజృంభించింది అవిడ మీదికి బొంయ్‌మంటూ.

దీక్షితులు గొలుసు బిగించిపట్టి కిందికి దిగిపోయాడు.

అవిడ ఈమాటు భర్తమీదా టైగర్‌మీదా ద్విగుణీకృతమైన కోపంతో దుమ్మెత్తి పోసింది. "ఆ వల్లకాట్లో కుక్కని వాడి ఎదాన కొట్టి రండి. నేను మాలకూడు తినలేను. కాదూ కావాలీ అంటే అదీ మీరూ ఈ ఇంట్లో కాపురం చెయ్యండి. నేను మా అన్నయ్యగారింటికి వెళ్లిపోతాను" అంటూనే ఏడుస్తూ భళ్లున తలుపుమూసి లోపలికి పోయింది. ఇంతసేపూ మొరుగుతున్న టైగరు ఆగి, మెట్లమీద పడుకుని విశ్రాంతి తీసుకోడానికి ఉపక్రమించింది.

దీక్షితులికి కంట నీరు తిరిగింది. ఉసూరుమంటూ దానిపక్కనే కూర్చున్నాడు. పదిగంటలైంది. ఆకలివేసింది. ఇంటోకెళ్లేదోవ కనబడటంలేదు.

"ఛీ – ఈ వెధవకుక్క...." అనుకుంటూనే నాలిక కరచుకున్నాడు. తుళ్లిపడ్డాడు, టైగర్ ఏదీ? తను పరాగ్గావుంటే తప్పించుకుపోయింది. లేచి అటూ ఇటూ చూశాడు. పెరటివేపు వెళ్ళాడు.

హరహర అంటూ నెత్తి కొట్టుకున్నాడు. తను పెంచిన కూర మొక్కల్నీ, పూలమొక్కల్నీ, కొత్తిమీరనీ నాశనం చెయ్యడం పూర్తి చేసింది టైగర్.

ఆలోచన మెరిసి కిటికీలోంచి లోపలికి చూశాడు. తన భార్య వీధితలుపు చిల్లులోంచి బయటికి చూస్తోంది – తనకోసం కాబోలు!

ఇపుడు వెనక్కొచ్చి పెరట్లో జరిగిన ఘోరం చూస్తే తనకి పుట్టగతులుండవు. పై ప్రాణాలు పైన పోయాయి. గబుక్కున టైగర్ గొలుసు పట్టుకుని బరబర ఈడ్చుకుంటూ రోడ్డునపడి నడక సాగించాడు.

సంత రోడ్డుదాటి కాలవగట్టు చేరేసరికి పొరుగూరునించి వచ్చే నావ రేవు

చేరింది. పక్క ఊరిలో ఉంటున్న దీక్షితులి దూరపు చుట్టం గున్నయ్య నావ దిగాడు సంచీ, ఓ కూరలబుట్టా పట్టుకుని.

"ఓహో బావగారు... ఏవిషి ఏవిషి. ఆడబోయిన తీర్థం ఎదురయింది. వెదకబోయిన తీగ కాలికి తగిలింది. షికారుగా వచ్చారు కామోసు. అయినా యిదేమిషండీ – కుక్కని వెంటబెట్టుకొని తిరుగుతున్నారు? అక్కగారు కులాసేనా?" అంటూ లక్ష చదివాడు.

దీక్షితులు జవాబివ్వలేదు. బిక్కమొహంలో చలనం లేదు.

గున్నయ్య విస్తుబోయాడు.

"ఏవిషండీ బావగారు మాట్టాడరు. అంతా క్షేమమేనా?" అన్నాడు కంగారుగా.

"ఆఁ క్షేమమే"అన్నాడు దీక్షితులు నీరసంగా.

"మరయితే ఒచ్చినపని చెబుతా వినండి. ఇహ చల్లకొచ్చి ముంత దాచనేల! మరేవీలేదు – మా పొరుగింటి శాస్త్రుర్లుతో తగాయిదా ముదిరింది పెరటిగోడ విషయమై. దావా పడేశాను. రేపు కోర్టులో హాజరు కమ్మన్నారు. తవఁరి అనుమతి లేకుండా సాక్షిగా వేశాను. మరోలా అనుకోకుండా... అయినా ఇంటికి దయచేయండి. వివరాలు చెబుతాను. అక్కగారికిష్టమని మాంఛి నవనవలాడే వంకాయలూ అవి కూడా తెచ్చాను. "

దీక్షితులు కొంచెం కంగారుపడ్డాడు. "కాదులే గున్నయ్యా ఇంటికి వద్దు అవిడ విశ్వరూపం ఎత్తి వుంది. ఈ పళాన వచ్చేస్తా తిరుగు నావకి పోదాం" అన్నాడు.

గున్నయ్య బ్రహ్మానందపడిపోయాడు. "బావగారి కేవిఁదయ ఏవిఁదయా! అల్లాగే కానీండి. నేను అనుకున్నాన్సండీ, తమరు నా మాట కాదనరని.. ఆఁ... తిరుగునావ మధ్యాహ్నం రొండు ఘంటలకి బయలుదేరుతుంది.. అంతవరకూ" అంటూ నసిగాడు.

"ఏం లేదు. అలా సంతవేపు పోయి నాలుగు ఫలాలు తిని మళ్లా వచ్చి ఇక్కడే పడుందాం – అన్నట్టు గున్నయ్యా ఈ కుక్క ఉంది చూశావూ – దీన్ని ఓ మిత్రుడప్పగించి తిరుపతెళ్ళాడు. అతను వచ్చేవరకూ దీన్ని కంట్లో గుడ్డులా కాపాడాల్సిన బాధ్యత నామీద ఉంది. మరి – నేను నీతోవస్తే దీన్ని వెంటబెట్టుకెళ్లాలి మనం."

"ఎంత మాటెంత మాట అవశ్యం అలాగే చేద్దాం. మరోటి బావగారూ – తమరి శ్రమ ఊరికే ఉంచుకోను – ఇదుగో – ఇది చిల్లర ఖర్చులకి ఉంచండి – అందాకా..." అన్నాడు గున్నయ్య రొంటినుంచి రెండు పదులు తీసిస్తూ.

రెండుగంటలకి నావవాడి కాళ్ళా వేళ్లాప్రాధేయపడి కుక్కా, దీక్షితులూ, గున్నయ్యా నావ ఎక్కారు. కబుర్లమీద దీక్షితులు "అసలు ఎందుకయ్యా మీకూ మీకూ పోట్లాట?" అన్నాడు.

"ఆఁ బావుంది. అది లేకపోతే మా గొప్పేముంది?" అన్నాడు గున్నయ్య నవ్వుతూ.

సరే సాయంకాలానికి గున్నయ్య ఊరు చేరారు. కుక్కకి జాగ్రత్తగా నీళ్లు పోసి పాలు అన్నం పెట్టి బుజ్జగించి బబ్బోబెట్టాడు దీక్షితులు.

ఆ రాత్రి టైగర్ పెట్టిన పోరుకి దీక్షితులు పడిన యాతన ఇద్దరికే తెలుసు. ఒకడు దీక్షితులు – రెండోవాడు పరమాత్ముడూనూ.

ఆ ఊళ్ళో కుక్కలన్నీ ఆ రాత్రి దీక్షితులు మంచందగ్గర జాగారం చేశాయి టైగర్ ఆగమనంపట్ల నిరసన ప్రకటిస్తూ. చామాలమ్మజాతర కూడా అంత సందడిగా ఉండి ఉండదు. ఏ కుక్క ఏక్షణాన మీదపడి కరుస్తుందో అని దీక్షితులు ప్రాణా లుగ్గపట్టు క్కూచున్నాడు.

చాలీచాలని జీతంతో యాతనపడే గుమస్తాపాలిట ఒకటో తారీఖు వచ్చినంత ఆలస్యంగా తెల్లవారింది దీక్షితులకి. స్నానంసంధ్యా కానిచ్చుకుందికి కాలవకి వెళ్ళాడు దీక్షితులు. టైగర్‌ని వీధి అరుగుమీద స్తంభానికి కట్టి మరీ వెళ్ళాడు. కానీ తిరిగి వచ్చేసరికి టైగర్ అక్కడలేదు. ఉట్టి గొలుసుంది. గుండె గుభేలుమంది.

ఒక్కమాటుగా లోపలకి పరిగెత్తాడు. "టైగర్! గున్నయ్యా! ఏదీ గున్నయ్యా టైగర్ఏదీ?" అంటూ.

సరాసరి పెరట్లోకెళ్ళేసరికి టైగర్ గదమాయించి మొరుగుతోంది పక్కింటి పెరట్లో.

తగాయిదా ఉన్న గోడకానుకుని వినోదం చూస్తున్నాడు గున్నయ్య. "రండి బావగారు రండి త్వరగా" అన్నాడు. దీక్షితులు గోడదగ్గరకు వెళ్ళి ఆ వెంపు చూశాడు.

చూడచక్కటి దృశ్యం గోచరమైంది పక్క పెరట్లో.

పొరుగింటి శాస్తుర్లుగారికీ, టైగర్‌కీ అత్యున్నత స్థాయిలో తీవ్రతమ సంఘర్షణ జరుగుతోంది.

సంధ్యావందనం ముగించుకుని, నీళ్ళ తులసికోటలో పోసి లోపలికి వెళ్ళబోతున్నారు శాస్తుర్లుగారు. చివరివిషయంలో టైగర్ శాస్త్రులుగారితో ఏకీభవించలేకపోయింది. ఆయన దారి కడ్డుగా కూర్చుంది.

గావంచా కట్టుకుని, చేతిలో పంచపాత్ర పట్టుకుని ధుమధుమలాడి పోతున్నారు ఆయన. టైగర్ జోరుగా మొరుగుతోంది.

గోడవతల, తన శత్రువు గున్నయ్యా టైగర్ యజమాని దీక్షితులూ నించుని తనని చూడడం గమనించిన శాస్తుర్లు గంగవెర్రులెత్తిపోయాడు. టైగర్‌ని దుమ్మెత్తిపోశాడు.

"ఛీ ఛీ! వెధవకుక్కా–అడ్డులే... డొక్కవాలికలు చేసేస్తా నేమనుకుంటున్నావో ఏవిటో – భడవా.. ఎవడో వెధవ ఉసికొల్పితే. వాడి ఉచ్చిష్టం కతికి, నామీద పడతావూ..వాడికి బుద్ధిలేకపోతే నీకన్నా ఉండొద్దూ... లేవ్వేం... ఇదుగో చెబుతున్నాను కోపం వస్తే నేను మనిషినిగాను, ముప్పతిప్పలా పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించేస్తా కబడ్దార్ – మరి చూస్కో నా తడాఖా."

టైగర్ ఒక్కక్షణం, వేదాంతిలా ముఖంపెట్టి తలపక్కకివంచి శాస్త్రుల్ని చూసింది మొరగడం ఆపి. వెంటనే విజృంభించింది మళ్ళీ. మొరుగుతూ ఒక్కడుగు ముందుకు వేసేసరికి శాస్త్రి కంగారు పడిపోయాడు. "అయ్ అయ్ వెధవా అక్కడే ఆగు – అడుగు ముందరికి వేశావా చంపేస్తా – ఈ చెంబుతో కొడతా" అన్నాడు.

"పిన్నిగారూ – ఒళ్లు నిప్పారవ్వేడతారూ?" అంటూ వచ్చిన పక్కింటి పూర్వ సువాసిని రాజమ్మ కొయ్యబారిపోయింది. – శాస్త్రిమాటలు వినగానే.

ఆవిడ మొహం చెక్కు తీసిన కందగడ్డలా అయిపోయింది. "ఔరా హారా ఎంత మాటన్నావు" అంటూ విజృంభించింది.

గంభీరమైన ఆ గొంతు వినగానే టైగర్ బెదిరిపోయి శాస్త్రివైపు రెండడుగులేసింది.

టైగర్ కరవడాని కొస్తోందన్న దురభిప్రాయంతో శాస్త్రి "హు" అని గర్జించాడు.

"నీకేం పోగాలంవచ్చిందయ్యా, చెట్టంతమొగాడివి. నా మీద అలా విరుచుకుపోతావ్ – ఛీ" అంటూ తిరిగి పోయిందావిడ.

ఈలోగానే శాస్త్రి "హు" అని ఇంకోమాటు గర్జించాడు. టైగర్ శాస్త్రిని పూర్తిగా అపార్థం చేసుకుంది. పైగా వెనకనించి రాజమ్మగారు "ఛీ" అంది. పౌరుషంతో ముందుకు లంఘించింది టైగర్.

శాస్త్రి పంచపాత్ర పారవేశాడు. బారుమంటూ పిట్టగోడ ఎక్కి ఊడిన గోచి లెక్కచేయకుండా అవతల రోడ్డు మీదికి దూకి పరుగు లంకించుకున్నాడు.

మురిడేలు, కమ్మలూ తగిలించుకుని, నల్లకోటు వేసుకుని, వెండి పొన్నుకర్రపట్టుకుని, చెమికీచెడావులు తొడిగి. విలాసంగా కులుకుతూ, హొయలుతో, చిరునవ్వుతో మీసాలు మెలేసుకుంటూ, నీళ్లు పట్టికెడుతున్న సాతాని పిల్లవంక తళుకులు విసురుతూ రీవిగా నడుస్తూవస్తున్న నాయుడ్ని సరాసరి ఢీకొన్నాడు శాస్త్రి – ఇద్దరూ రోడ్డుమీద పడ్డారు.

నాయుడు తటాలున లేచిపోయాడు. శాస్త్రిని తిట్టడానికి క్కూడా టైములేదు. దుమ్ము దులుపుకుని సాతానిపిల్లని మాలీసు చెయ్యడానికి తిరిగి రీవితో నడక సాగించాడు. అయిదారడుగులు వేసేలోగా అపుడేగోడదాటిన టైగర్ నాయుడి నల్లకోటు చూసి ముచ్చటపడి, అతని మీదకి లంఘించింది. నాయుడు బెంబేలెత్తి పోయాడు. దెబ్బతో పొన్నుకర్రా రీవి వగయిరా వదిలేసి కాలికి బుద్ధి చెప్పి సరాసరి చౌదరిగారి పెద్దరుగెక్కి పోయాడు. ఆ కంగారులో అతడు అరుగుమీద ఉండుకున్న అరటిపండు తొక్కని చూసుకోక పోవడం వల్ల దానిమీద కాలువేసినవాడై, ఆ సమయానికి తరుముతూ అరుగు కిందకి వచ్చివున్న టైగర్ మీదే పడ్డాడు. టైగర్ కంయ్యోమంటూ నాయుడుమీద మోజుతగ్గిపోయి అప్పటికి లేచి పరిగెత్తుతున్న శాస్త్రిని వెంబడించింది. తృటిలో శాస్త్రిమీద పడి పిక్క మీద తేలిగ్గా కాటేసింది.

శాస్త్రి లబోదిబో మన్నాడు రక్తం చూసుకుని.

ఈలోగా దీక్షితులు పరిగెత్తుకువచ్చి, టైగర్ని పట్టుకుని దానిమెడకి గొలుసు కట్టి గబగబా కొంప జేరాడు. గున్నయ్యకి కాటు విషయం తెలీగానే గుండె గుభేలుమంది.

"ఏమయ్యా దీక్షితులూ – కుక్కని మనమే ఉసికొలిపామని శాస్త్రి మనమీద క్రిమినల్ దావా పడెయ్యడు గదా" అన్నాడు.

"ఏం ఖర్మమో ఏమిటోనయ్యా. నా ప్రాణానికొచ్చిందంతా, నాకు పిచ్చెత్తుతోంది" అన్నాడు దీక్షితులు.

టైగర్ పక్క గదిలో మొరిగింది. ఇద్దరూ ఒక్కమాటు పరిగెత్తారు. గున్నయ్య

పట్నంనించి తెచ్చుకున్న పట్టు తలగడాతో హోరా హోరీ పోట్లాడి ఆ దిండుని తునకలుచేసి అపుడే విజయ గర్జన చేస్తోంది టైగర్.

దూటబిళ్ళల్లాంటి ఆరు కరుకు రూపాయిలుపోసి తెచ్చిన పట్టు తలగడా నాశనం అయిపోవడం చూడగానే గున్నయ్య వీరావేశం ఎత్తిపోయాడు.

"నీ కుక్క నాశనం అయిపోనూ! నీ పిండం పిల్లులు తినా! నా కర్మకాలి నిన్నెందుకు తెచ్చుకున్నానయ్యా సాక్ష్యానికి, డబ్బిచ్చి తద్దినం తెచ్చుకున్నట్టూ..నాదీ వెధవబుద్ధి హాఁ!" అంటూ నెత్తికొట్టుకున్నాడు గున్నయ్య. అక్కడితో ఆగలేక టైగర్ మీద కురికాడు 'వెధవ కుక్కా నా దిండు నీ ఎదాన పెట్టుకుంటావా' అంటూ.

సంప్రదాయం దృష్ట్యా ఏదో మాటవరసకి కొంచెం మొరిగి గున్నయ్య పిక్కపట్టుకుంది టైగర్. దీక్షితులు తాత్కాలిక స్వంతదారుని ధీమాతో రంగభూమి కురికాడు. "టైగర్! దా! దా!" అంటూనే దాని పీక పట్టుకోబోయి తొందర్లో తోకపట్టుకున్నాడు.

వెంటనే టైగర్ తన వంతుగా దీక్షితులి చెయ్యట్టుకుంది.

సద్బ్రాహ్మణు లిద్దరూ పెంకు లెగిరిపోయేట్టు గావుకేకలు పెట్టారు. గున్నయ్యభార్య వంటింటిలోంచి పరిగెట్టుకొచ్చింది, పోపు గరిటెతో సహా. "హయ్యో! నేనేం చేతునమ్మో – నా మొగుణ్ణే మాయదారి కుక్క కరచిందర్రోయ్! హయ్యోదేవుడోయ్" అంటూ అందుకుంది.

టైగర్ బెంబేలెత్తిపోయింది. ఆవిడ మీద కొచ్చింది. తక్షణం ఆవిడ జాగర్తపడి, ఎర్రగా కాలి, మరుగుతూన్న నూనెతో వున్న ఆ యొక్క పోపుగరిటెతో టైగర్ పొట్టమీద కొట్టింది.

టైగర్ హృదయ విదారకంగా ఒక్క కేకపెట్టి వీధివైపు పరిగెత్తింది – "ఓ యజమానీ నువ్వు నన్ను వదలబట్టి గదా – నేను ఇన్ని హింసలపాలయ్యాను" అని.

కుక్క కరచిన నెప్పికన్నా ఈ అరుపువిని, టైగర్‌బాధ ఊహించుకున్నాడు దీక్షితులు. ఇది తెలిస్తే తన మిత్రుడు సింగారం పడేబాధ తలపుకి తెచ్చుకునేసరికి దీక్షితులికి కడుపు తరుక్కుపోయింది.

"టైగర్! నేనుండగా నీకు భయంలేదు. తొందరపడకు – ఆగు – నే రక్షిస్తా" అంటూ అతను వీధిలోకి పరిగెత్తాడు.

వీధిలో ఇంటిముందు పాతికమంది కర్రలూ కత్తులూ పట్టుకుని కదం తొక్కేస్తున్నారు.

నల్లకోటు నాయుడూ, అంగోస్త్రంతో శాస్త్రులూ శివమెత్తి ఆడి పోతున్నారు. గున్నయ్య పొరుగూరినించీ దెయ్యాలమారిగాణ్ణే తెచ్చి, వాడి కుక్కచేత తన శత్రువుల్ని కరిపించేస్తున్నాడన్న వార్త ఊళ్ళో అపుడే పాక్కిపోయినందువల్ల రకరకాల పార్టీలవాళ్ళు, నాయుడు కమతగాళ్ళూ, శాస్త్రిచుట్టపక్కాలూ, సందుదొరికితే సరదాకి కొట్టేవాళ్లూ, రకరకాల జనాభా, ఒక కనిస్టేబుా తయారయ్యారు.

గంగవెర్రులెత్తిపోయిన టైగర్ జనం మీద పడింది. అందిన కాడికి తలో ఇంజక్షనూ ఇచ్చింది.

దీక్షితులు ఆ గగ్గోలులో, తొక్కిడిలో టైగర్‌ని పట్టుకుందికి ప్రయత్నించాడే కానీ వలకాలేదు.

ఐదు నిముషాల్లో జనం నిలదొక్కుకుని చిన్నవలయంగా ఏర్పడ్డారు.

మరణించిన టైగర్ మధ్య పడివుంది.

చితక పొడిచేశారు దాన్ని. "పిచ్చి కుక్క"ని చంపినందుకు జనం "హమ్మయ్య" అనుకున్నారు.

పారిపోయి దూరంనించి చూసిన దీక్షితులు రెండు కన్నీటిబొట్లు విడిచాడు– మిత్రుడు సింగారాన్ని తలచుకొని.

ఈడిగాడు వచ్చి కుక్కని ఈడ్చుకుపోయాడు.

దీక్షితులు బరువెక్కిన హృదయంతో పడవలరేవుచేరి నావ ఎక్కాడు. గున్నయ్య పరుగు పరుగున ఒగరుస్తూ వచ్చి, బయలుదేరిన నావని ఆపి, చెడామడా తిట్టాడు దీక్షితుల్ని. "నీమూలాన నా కోర్టుదావా తగలడింది. శనివెధవా. దయచెయ్యి – నాకు చేసింది చాలుకానీ నా డబ్బు నాకిలా తగలేయ్" అంటూ దీక్షితులు రొంటిన ఉన్న పందొమ్మిది రూపాయల ఆరణాలనీ ఊడలాక్కుని మరీ నావ దిగాడు.

"అన్నట్టు నా గడియారం నా గడియారం గున్నయ్యా" అన్నాడు దీక్షితులు.

"నీ గడియారం రోడ్డుమీద పడి జనం కాళ్ళ కిందపడి చితికిపోయింది. ఈడిగాడు పట్టుకుపోయాడు. వెళ్లి తెచ్చుకో" అంటూ వెళ్లిపోయాడు గున్నయ్య.

కుక్కనీ, గడియారాన్నీ, మంచిపేరునీ, స్నేహాన్నీ పోగొట్టుకున్నందుకు ఏకధారగా ఏడ్చాడు దీక్షితులు.

సాయంత్రానికి ఇల్లు చేరాడు.

మొగుడివాటం తీరూ చూసి అప్పటికే బెంగటిల్లిపోయిన అతని భార్య భోరున ఏడ్చి ఉపచర్యచేసి, దాహం ఇచ్చి పడుకోబెట్టి విసురుతూ చెడామడా తిట్టింది – తనని యిలా రాచిరంపాన పెడుతున్నందుకు.

బెదిరిపోయిన దీక్షితులికి దీపాలవేళకల్లా అంపకంపాలతో జ్వరం వచ్చేసింది. ఘనవైద్యుడు దేవరగారువచ్చి, చేదుమందు పోసి చెడామడా చీవాట్లు పెట్టిపోయాడు. బంగారంవంటి బ్రాహ్మడికి ఊరకుక్కల సహవాసం బెడిసికొట్టిందన్నారు ఇరుగూ పొరుగూ. దీక్షితులి భార్య పొరిగింటి బామ్మగారిచేత దిష్టి తీయించి చారెడు ఉప్పూ, గుప్పెడు మిరపకాయలూ కణకణలాడే నిప్పుల్లోపోయించి, ఊహో శత్రువుల్ని దుమ్మెత్తిపోసింది.

ఆ రాత్రి దీక్షితులికి పీడకలలొచ్చాయి. టైగర్, గున్నయ్యా, నాయుడూ, సింగారం అందరూ కనబడ్డారు. టైగర్ తన మీద చాడీలు చెప్తోంది సింగారంతో. చీటికి మాటికీ ఉలికులికిపడి కలవరించాడు దీక్షితులు. తెలివి తెచ్చుకుని భోరున ఏడిచాడు తన అశక్తతకి. ఆ పట్టు పట్టు ఐదుపూటలు కటికలంకణం చేశాడు. మూడోనాడు ఉదయం లేచి కూచుని నాలుగు చారుమెతుకులు ఎంగిలిపడ్డాడు.

"ఔనే అమ్మీ – నిన్నా మొన్నా నాకోసం ఎవరేనా ఒచ్చారటే" అన్నాడు నీరసంగా.

"ఏం? కచ్చేరీ కెళ్లాలా, దయచెయ్యండి. ఈ బోడి కచేరీలే నా కొంపకి తిప్పలుతెచ్చాయి. వాడి అవునికూడా తోలాడె నా కొంపకి. దాన్ని కూడా తీసుకుపొండి... ఇంతోటి పాడికీ నేనేం మొహం వాచలేదు" అందావిడ.

"దీచ్చితులుగోరూ! చింగారం గోరొచ్చేసినారండి. తవర్నెంటనే టైగర్నెట్టుకుని రమ్మన్నారండి. పెసాదం అదీ ఎడతారంట" అంటూ లోపలి కొచ్చేశాడు సింగారం నవుకరు.

గుండె గుభేలుమంది దీక్షితులికి.

"దయచెయ్యండి, దూత సిద్ధమయ్యాడు" అంటూ గసురుకుంది దీక్షితులి అర్ధాంగి.

ఒక్కక్షణం ఆలోచించాడు దీక్షితులు. "సరే వెళుతున్నా. ఒరేయ్ పెరట్లో ఆవుంది తోలుకుపోరా" అంటూ అంగోస్త్రం భుజాన వేసుకుని బయల్దేరాడు.

ఆవిడగారు కొయ్యబారిపోయారు.

సింగారంగారి చావిడి సందడిగా ఉంది. వాళ్లూ, వీళ్లూ, మునసబూ, కరణంగారి తమ్ముడూ, నాలుగైదుగురు బ్రాహ్మలూ, ఇతరత్రా కొందరూ, తిరుపతి ముచ్చటలు విని ప్రసాదాలూ అవీ పుచ్చుకొంటున్నారు. గుమ్మంలో నీరసంగా నిర్జీవంగా జంకుతూ నించున్న దీక్షితుల్ని చూడగానే సింగారం చెంగున గెంతేశాడు.

"టైగరేది దీక్షితులూ? దాదా – అలా పాలిపోయావే. వంట్లో కులాసా? టైగర్ బావుందా – ఏది–" అంటూ శరవేగంతో ప్రశ్నలు వేశాడు.

దీక్షితులు నివ్వెరబోయాడు. మనసు కలుక్కుమంది. శవమల్లేవున్న తన సంగతి అడక్కుండా ముందు టైగర్ సంగతడిగాడు – సింగారం. ఇదా వీడి ప్రేమ అనుకున్నాడు. ఈలోగా సింగారం తాండవ మాడేస్తున్నాడు టైగర్ భజనతో.

జనం అందరూ మాటలు మానేసి గుడ్లప్పచెప్పి ఈ దృశ్యం చూస్తున్నారు.

గుండె దిట్టంచేసుకుని చావు కబురు చల్లగా చెప్పేశాడు దీక్షితులు. "సింగారం – కోప్పడకు – టైగర్ మరణించింది. నాకు చావు తప్పి కనులొట్టోయింది. నన్ను కూడా కరిచింది."

సింగారం ఇంకేం వినలేదు.

గొల్లుమన్నాడు భొయ్యిమన్నాడు బారుమన్నాడు భోరుమన్నాడు ఒక్క నిముషం ఊరుకున్నాడు. అంతా నిశ్శబ్దం.

తిరిగి ఒక్క మాటుగా మహా కసితో అసహ్యంగా అడిగాడు.

"నా ఆవేదీ? దాన్ని కూడా చంపావా?"

"లేదు ఇపుడే మీ నౌకరుకి అప్పజెప్పాను."

"నా చేతి గడియారం ఏది?"

"లేదు, జనం టైగర్ని కొడుతూ ఉంటే నేను కాపాడబోయి కిందపడ్డాను. ఆ గోలలో కిందపడి జనం కాళ్లకింద పడి చితికిపోయింది."

"సద్బ్రాహ్మడివనీ, సజ్జనుడవనీ, సన్మిత్రుడవనీ నిన్ను నమ్మి టైగర్ని అప్ప చెప్పాను. దానికి ముడుపుగా వంద రూపాయల గడియారం ఇచ్చా, ఆవుని ఇచ్చా. దాని పాడి తాగి, గడియారం అమ్ముకుని, ఇన్నేళ్లుగా నా సాయం పొంది, నువ్వు నాకు చేసిన ఉపకారం ఏవిటయ్యా అంటే – నా కుక్కని చంపించడం. కృతజ్ఞత అంటే నీదేనయ్యా – వినండయ్యా పెద్దమనుషులూ – పాలిచ్చిన ఎదుర్రొమ్ముగుద్దిన వీరుడి గాథ – సరేలే దీక్షితులూ – నీకు నీతిలేదుగాని నాకు వుంది. నువ్వు వెళ్లు. ఇంకెపుడూ నా మొహం చూడవద్దు. నా గుమ్మం తొక్కకు.

నీకూ నాకూ టైగర్‌తోనే ఋణం తీరిపోయింది. దయచెయ్. నీకూ, నీ పెద్దలకీ ఓ నమస్కారం" అన్నాడు సింగారం.

దీక్షితులు కొయ్యబారిపోయాడు. నోటమాట రాలేదు. తల తిరిగిపోయింది. జనంలోంచి నిట్టూర్పులూ, హూహూలు, ఛీఛీలూ వినబడ్డాయి. ఇంక తనేం చెప్పినా లాభంలేదు.

ఇక్కడా అక్కడా కూడా పుణ్యాని కెళ్లితే పాపం ఎదురైంది. అతనికి మనస్సు విరిగిపోయింది. ఆత్మ విశ్వాసం పర విశ్వాసం నశించాయి. హృదయం శతఛిద్రాలయిపోయింది.

తల వంచుకుని ఇంటికి నడిచి వెళ్లిపోయాడు. అప్పుడే కాదు – ఇప్పుడూ – ఎప్పుడూ – అంతే – అతను మళ్లా ఎన్నడూ తల ఎత్తి నడవలేదు.

కృతజ్ఞత పొందవలసిన తనని, సింగారం, అతనితోబాటు లోకం కృతఘ్నుడంది. అంచేత అబ్బాయ్ – అది అంతే. లోకం అంతే.

నీతి చెబుతా విను. ఈ భూ ప్రపంచంలో ఎదటివాడిలో కృతజ్ఞతకోసం ఆశించేకన్న ఆంధ్ర రాజకీయనాయకుల్లో ఐకమత్యాన్ని ఆశించు. ఆంధ్రుల్లో కార్యశూరత్వాన్ని ఆశించు.

నువ్వు సఫలీకృతమనోరథుడవడానికి అవకాశాలు లేకపోలేదని నేను అనబోడం లేదు."

★ ★ ★

# చండీదాసు హితోపదేశ

నిదానంగా ఆలోచించలేని రోజుల్లో దానయ్య ఒక జానకమ్మని వరించి, ముచ్చటకొద్దీ చాంద్‌బీబీ అని పిలుచుకునేవాడు. పెళ్ళయిన కొన్నాళ్ళలోనే పేరు పొరపాటుని చటుక్కున గ్రహించి 'చండిక' అని పిలవాలని ఉబలాటపడ్డాడు. కానీ అనాటికే ఆమె చేతిలో కీలుబొమ్మ అయిపోయాడు. దరిమిలా చండీదాసు బిరుదాంకితుడయ్యాడు. చాంద్‌బీబీ ఉరఫ్ చండిక నిద్రలేచే సరికి స్నానాదికాలు ముగించి కాఫీ చేసేస్తాడు దానయ్య. ఆమె ముందులేస్తే దానయ్య పూర్వాపరాల గురించి అష్టోత్తర శతనామావళి అంత అనర్గళంగా చదివేస్తుంది. అందువల్ల అతనే ముందరలేస్తాడు.

కందా మామిడికాయ వగైరా జాతి కూరలకి దానయ్య చెక్కుతీసి పెడతాడు. పూర్వం చండిక ఒకసారి ఇటువంటి బండపని చేసేసరికి చేతులు కందిపోయాయి. ఒకసారి బొటనవేలు తెగింది. ఆ రోజున చండిక వేసంగి సూర్యుడిలా పేట్రేగి పోయింది. దానయ్య ఆ రోజున ఉపవాసం, ఆ మర్నాడు లంకణం చేశాడు. మొదటిరోజు తరిగి రెండవరోజున వండిన కూరను చండిక బలవంతం మీద మూడోరోజున ఆరగించాడు.

"ఈ కూరని వెయ్యి నాలుకలున్నవాడు కూడా మెచ్చుకోలేడు" అన్నాడు, అప్పటికి రెండు నాలుకలతో మాట్లాడనేర్చిన దానయ్య. అతనికి రెండు నాలుకలూ దురద పెట్టాయి. మొదటేది కందకూర ప్రభావం వల్ల. రెండోది రెండు రోజులు తిండి లేదు గదా అని చండిక కాస్త మంచిగా ఉండటం వల్ల.

కందకూర తింటూ వెయ్యి నాలుకలున్నవాడు కూడా దీన్ని మెచ్చుకోలేడని దానయ్య అన్న మాటలలో రెండర్థాలు కనపడి చండిక మండిపడింది.

ఆ తరవాత దానయ్య నోట్లో నాలికలేని వాడయిపోయాడు. తెల్లవారకుండా నిద్రలేవడం, స్నానాదికాలు ముగించడం, కందా కాకరకాయ వంటి కూరలన్నీ దురదా చేదూ అనకుండా నోరు మూసుకు ఆరగించడం వంటివెన్నో అలవరచుకున్నాడు.

కొన్నాళ్ళకి కొడుకును కన్నాడు. ఆ కొడుకు పాతికేళ్ల వరకూ అమ్మ చెప్పుచేతుల్లో బంగారు తండ్రల్లె బాచాలకొండల్లె పెరిగి, హఠాత్తుగా ఒకనాడు పెద్దవాడై, అమ్మనెదిరించి, కాలేజీలో ఓ అమ్మాయిని ప్రేమించిమరీ పెళ్లి చేసుకున్నాడు. దరిమిలా బస్తీలో కొలువు కుదిరి కాపరం పెట్టాడు. దానయ్య అడపాతడపా బస్తీవెళ్లి కొడుకు సంసారం తీరుతెన్నులు చూచి, భార్యకా బోగట్టా చెబుతూ వుండేవాడు. కొత్తలో దానయ్య, 'జానకమ్మ ఉరఫ్ చాంద్‌బీబీ అనే చండికల' సంసారంలాగే అన్యోన్యత కనబడింది. దరిమిలా కనపడటం మానేసింది. ఏడాది తిరిగేసరికి

కొడుకుదే పై చెయ్యిగా చెలామణి అవుతున్నట్లు ఊహాతోచింది. దానయ్యకి వింతగా కనపడింది.

ఒకరోజున 'చండీదాస మండలి'లో ఈ ఊహ బయటపెట్టాడు. చండిక వంటి భార్యలు కలవారంతా ఈ మండలిలో సభ్యులు. తమ భార్యలు ఎలా రాసి రంపాన పెట్టేదీ వెళ్లబోసుకుంటారు. ఈ గోష్ఠికి రాగలగడం ఒక సుఖం. కాబట్టి, ఈ సౌఖ్యానికై తామెంత కష్టపడేందీ చెప్పుకుంటారు. మండలి సభ్యులపేర్లు (గోష్ఠిలో మాత్రమే) చండీదాసు, ఉమాపతి, రమాపతి, సీతాపతి మొదలైనవి. అన్నీ భార్యల పేర్లను బట్టి ఏర్పడుతాయి. ఒక చండీదాసు చెప్పే కష్టాలువిని, మిగతావారిలో కొందరు సానుభూతి, ధైర్య సాహసోపేతులైనవారు సలహాలూ ఇస్తారు– పెళ్లాలకు తెలిస్తే తెలిసిందిలే అన్న ధీమాతో.

దానయ్య ఒకనాటి గోష్ఠిలో తన కొడుకు కాపరం ముచ్చట చెప్పి, "ఏడాది తిరిగినా మావాడిదే పైచెయ్యి సుమండీ" అన్నాడు. సదస్సులంతా ఇది సాధ్యమా, సంభవమా అని విస్తుపోయారు– మానవాళి భవిష్యత్తుకి అది మంచిదో చెడ్డదో ఎవరూ నిర్ధారణ చెయ్యలేకపోయారు.

"మా ఆవిడని కనుక్కొని రేపు చెబుతాను" అన్నాడు దానయ్య చివరికి.

ఆ రాత్రి అతను ఇంటికి వెళ్ళేసరికి ఆవిడ ఎన్నడూ లేనంత ఆదరంతో అన్నం పెట్టింది.

"అబ్బాయివచ్చి వెళ్లాడు" అంది.

"ఎప్పుడూ" అన్నాడు దానయ్య.

"ఎప్పుడేమిటండీ నాబొంద. సాయంత్రం మీరు ఊరేగేదాకా రాలేదని మీకు తెలుసు కదా. ఇప్పుడు మీరొచ్చాక నేను చెబుతే ఎప్పుడూ అంటూ అడుగుతారేమిటండీ. అయినా దృష్టి ఇక్కడుంటేనా" అంది ఆవిడ.

దానయ్య ముహూర్తబలం అనుకూలంగా లేదని గ్రహించి నోరుమూసుకున్నాడు.

"కోడలు పిల్లవాణ్ణి రాసి రంపాన పెడుతూందట. నిత్యం పోరేనట. కుర్రాడు దాంతో వేగలేక చిక్కి సగమైపోయాడు. కాంపుకెళ్తూ ఇక్కడ ఆగి ఇవన్నీ నాతో చెప్పుకు ఊహూ ఇదైపోయాడు కుఱ్ఱ నాగన్న. వాడు యతి అంటే ప్రతి అంటుందిట. వాడేం మొగుడనుకుందో నౌకరీ వెధవనుకుందో" అంది జానకమ్మ ఉరఫ్ చండికేశ్వరి.

తనకళ్లకి వీరాధివీరుడిగా కనపడ్డ కొడుకు నిజంగా అంతటివాడు కాదని భార్యవల్ల గట్టిగా తెలుసుకోగానే తన అంచనాలు వేసే శక్తి ఎంతగా దెబ్బతిందో, ఆలోచనాశక్తి ఎంత కుదించుకుపోయిందో దానయ్యకు కొంత స్ఫురించింది.

'అన్యోన్య దాంపత్యం' స్థిరపడడానికి తన కొడుకు ఇంకా అన్ని ఘట్టాలూ దాటలేదని తట్టింది. దాటించేయడం ఎంతసేపులే అనుకున్నాడు.

దానయ్య ఆవకాయముద్ద ఒకటే నమిలి మింగేలోగా ఆవిడ, "రేపే మీరు బస్తీ వెళ్లండి. వెళ్ళి దానికి మొహం వాచేట్లు చివాట్లు వెయ్యండి" అని రెండు ఆజ్ఞలు

'లేకపోతే నేనే బయల్దేరి దాని సంగతి కనుక్కుంటా' అని ఒక హెచ్చరిక జారీ చేసింది.

వెళ్లినపుడు నడిచివెళ్ళమంది. వచ్చేటపుడు పడవమీద రావడానికి కేవు డబ్బులిచ్చింది. దానయ్య మర్నాడు తెల్లవారుతూ ఉండగానే తరవాతే అన్నం తినేసి, కండువా భుజాన వేసుకుని, ధైర్యం, కాఠిన్యం మొహాన పులుముకుని పట్నం బయల్దేరాడు. కాలవ వొడ్డు చేరగానే శుభ్రంగా మొహం కడుక్కుని ప్రయాణం కొనసాగించాడు. ఉదయం ఎనిమిది వేసేసరికి అడంగిచేరి తలుపుతట్టాడు.

కోడలికి మావగారంటే ఎంతో గౌరవం. తన తండ్రి అంత మంచివాడని మంచి నమ్మకం. అందుకని, తలుపుతీసి మళ్లా నిద్రపోకుండా వెంటనే మొహం కడుక్కొని కాఫీచేసి ఆయనకిచ్చింది.

దానయ్యకి కాఫీ అంటే పంచప్రాణాలూనూ. ఆరోజుదయం తరవాణి దాహం పుచ్చుకుని బయల్దేరాడు. అయినా సరే కాఫీ తాగి, కోడలిని కుశలం అడిగాడు: "మా వాడసలే పెంకి వెధవమ్మ. సరిగ్గా ఉంటున్నాడా?" అన్నాడు.

కోడలు సంతోషపడి సోదె విప్పింది.... ఆయన అస్తమానం విసుక్కుంటారు. పొద్దున ఎనిమిదయినా అవకుండా నిద్రలేవాలంటారు. యతంటే ప్రతంటారు...

"ఒకటేమిటి. రాసిరంపాన పెడుతున్నారనుకోండి మావయ్యా. నేను కాబట్టి సర్దుకుని పొరపొచ్చెం లేకుండా రోజులు వెళ్ల బుచ్చుతున్నాను" అంది.

దానయ్య గుండె కరిగి నీరైపోయింది.

"రాలుగాయ వెధవ. రణపెంకి వెధవ. నిన్నిలా బాధలు పెట్టే, నిన్న మాయింటి కొచ్చి మీ అత్తగారితో నీమీద చాడీలు చెబుతాడూ, తప్పుకాదూ.. మొగుణ్ణే కొట్టే మొగసాలెక్కినట్టు.... అమ్మడూ చూడు. ఈ ముక్క నేనన్నట్లు మళ్లా ఎక్కడేనా అనేవు సుమా" అన్నాడు.

"అనను మావయ్య ఒట్టు. కాపరం చక్కపెట్టుకునే మార్గం చెప్పండి మావయ్య" అంది కోడలు ప్రాధేయ పూర్వకంగా.

"మార్గాలు నాకు తెలీవు కానీ నేను గడించిన ముప్పైఏళ్ళ అనుభవం చెబుతా. కొంచెం కీలకం తెలిసి మసులుకుంటే మీ ఇద్దర్నీ చిలకాగోరింకలంటారు నలుగురూ. అన్యోన్య దాంపత్యం అంటారు. ముచ్చటైన కాపరం అని ముచ్చట పడతారు" అంటూ దానయ్య తన 30 ఏళ్ల సాంసారిక జీవితానుభవాలను చెప్పాడు.

"వేయేల నమ్మా మీ అత్తగారినీ ఆదర్శంగా తీసుకో. మా కాపురం చూసి కీలకం తెలుసుకో" అని హితోపదేశం చేశాడు.

కోడలమ్మ నోరూరగ చెవులు బుట్ట వింది.

రాత్రి దానయ్య ఇల్లు చేరగానే "గట్టిగా చివాట్లేశారా" అనడిగింది భార్య.

"మొహం వాచేలా. నెల తిరగనీ" అన్నాడు దానయ్య కఠిన స్వరంతో. ఆ పూటకి అట్టే మాట్లాడటానికి చండిక కూడా ఒక్క రవ్వ జంకింది.

☆ ☆ ☆

నెల తిరిగేసరికి కొడుకూకోడలూ ఇంటికి వచ్చి రెండు రోజులున్నారు. వాళ్ళ కాపురం పొరపొచ్చెం లేకుండా సాగిపోతున్నదన్న సంగతి ప్రతిమాటలోనూ కనపడింది

చండికకు. కొడుకు ప్రయోజకుడై పెళ్ళాన్ని అదుపాజ్ఞల్లో పెట్టినందుకు మొదటిరోజు సంతోషించిందావిడ. రెండోరోజు వీళ్ళిద్దరూ ఒక్క తాటిమీద ఎలా నడవగలుగుతున్నారు చెప్మా అనుకుంది. మూడోరోజున కోడలు పట్నం వెళ్ళిపోదామంది. అంతకుముందే మరో రెండు రోజులుంటానన్న కొడుకు అర్జంటు పనుంది అన్నాడు!

☆ ☆ ☆

ఆరోజు రాత్రి చండిక అన్నం వడ్డించి దానయ్యను యీ విషయమై కదిపింది. దానయ్య గంభీరంగా నవ్వి "చూశావా నా చివాట్ల ప్రభావం. కోడలు పిల్ల పిల్లిపిల్లయి పోయింది" అన్నాడు.

చండిక పెదవి చప్పరించింది.

"ఏమో సుమండి. అబ్బాయి కోడలుతో మాట్లాడినపుడు వాడి మొహంలో మీ ఛాయలే కనపడుతున్నాయి. ఉన్నమాట చెప్పాలంటే ముమ్మూర్తులా మీలాగే తయారయ్యాడనిపిస్తుంది" అంది.

కీలకం బయటపడిందనగానే దానయ్య మొహం ఒక్కరవ్వ బిక్కవోయింది.

"ఇదా మీరు చేసిన నిర్వాకం" అంది చండిక గుట్టు కనిపెట్టేసి.

దానయ్య ఆ రోజు అర్ధాకలితో పడుకున్నాడు. మర్నాడు ఉపవసించాడు. మూడోనాడు లంకణం చేశాడు.

☆ ☆ ☆

★ ★ ★




'అమ్మయ్య' అనుకున్నారు భీమశంకరంగారు.

'శుద్ధదండుగ' అనుకొంది కాంతమ్మగారు. 'హాయ్ హాయ్. బలే బలే' అనుకొన్నాడు రాధాయ. 'నాన్నెప్పుడూ ఇంతే' అనుకున్నది సీత.

రైలు రావడానికి ముందే ప్రయాణీకులతో కిటకిటలాడుతున్న స్టేషను చూసి ధుమధుమలాడారు భీమశంకరంగారు. కొంపలు మునిగిపోతున్నట్లు ఇంతమందికీ ఇవాళే ముహూర్తం కుదరాలా? నువ్వెందుకయ్యా రైలెక్కావని నిలదీసి అడిగితే ఒకడూ జవాబివ్వలేదు.

ఇంత రద్దీలో తన పెళ్ళాం బిడ్డలతో, బోలెడు సామానుతో మూడవ తరగతి పెట్టెలో ఎక్కడం కష్టసాధ్యం అనిపించింది. భీమశంకరంగారికి. డబ్బు వుండగా కష్టసాధ్యమైన పనులను కష్టపడి సాధించడానికి ఇష్టపడటం అలవాటు లేదు ఆయనకు. వెధవ డబ్బుపోతేపోయిందని ఇంటరుక్లాసు టిక్కెట్లు కొన్నాడాయన.

కాంతమ్మగారు కసురుకొంది "ఎలాగో సర్దుకోవాలిగాని ఉహూ ఇలా డబ్బుతగలేస్తే కొంప గుండమౌతుంది." అంటూ. సీత సమాధానం చెప్పింది "నీకు తెలీదులే నువ్వూరుకో అమ్మా!" అని.

రైలొచ్చింది. కూలీ సామానులు ఇంటరుక్లాసులోకి ఎక్కిస్తున్నాడు. సీత, రాధాయ లోపలికెక్కారు. హఠాత్తుగా భీమశంకరంగారిలో అంతర్యుద్ధం ప్రారంభమైంది. – 'ఈ పెట్టెలో ఎక్కడమా మానడమా?' అని.

ఆ ఇంటరుక్లాసు పెట్టెలో నలుగురే వున్నారు ప్రయాణీకులు. భీమశంకరంగారికి వాళ్లను చూడగానే భయమేసింది. కారణం ఏమంటే – వాళ్లు నలుగురూ అందంగా వున్నారు. వాళ్ళ వయసులు ఇరవైపైనా, పాతికలోపూ ఉంటాయి. మంచి కుటుంబాలనుంచే వచ్చారని, సుగుణ విద్యా సంపన్నులనీ వాళ్ళ ముఖవర్చస్సు

భీమశంకరంగారి చెవిలో ఉద్ఘాటించింది. కాని ఆయన ఆరాటం తగ్గలేదు. అందులోనూ, ఒక మూలకూర్చున్న నున్నటి క్రాఫింగు అబ్బాయి చాలా అందంగా వున్నాడు... పద్దెనిమిదేళ్లపైబడ్డ సీత వంటి అల్లరి పిల్లతో, ఈ పెట్టెలో ప్రయాణం చెయ్యటం ఏమంత తెలివైన పని అనిపించలేదు ఆయనకు.

భార్యవైపు చూశారు. సామానులు లెక్కపెట్టే మహాకార్యంలో తీవ్రంగా నిమగ్నమై ఉన్నది ఆవిడ. ఈ విషయంలో ఆవిడ అభిప్రాయాలను తీసుకోటానికి వాటిపై వాదించటానికి టైము లేదు. భీమశంకరంగారు కార్యశూరుడు.

"ఒరేయ్. కూలీ!"

"ఏం బాబూ!"

"సామాను దింపేసి ఈ పక్కపెట్టెలో ఎక్కించు."

"అది సెకండుక్లాసు బాబు."

"తెలుసులేవోయ్... చెప్పినట్టు చెయ్యి... ఒసేయ్ సీతా! ఇలారండే!... ఇదుగో ఈ పెట్టెలో ఎక్కండి నేను టిక్కెట్లు మార్చుకొని వస్తా."

రైలు కదిలింది. మళ్లీ స్టేషన్ వచ్చేవరకు ఇంకెవ్వరూ ఎక్కరు. భీమశంకరంగారి సంసారానికి ఆ చిన్న సెకండుక్లాసు పెట్టె చక్కగా అమరింది. కింద రెండు బెర్తుల మీద ఆయన కాంతమ్మగారు పడుకొన్నారు. పై రెండు బెర్తుల మీద ఒకటి సీత, ఒకటి రాధాయ ఆక్రమించారు. సీత పెంకి ఘటం.

'అమ్మయ్య' అనుకున్నారు భీమశంకరంగారు. ఆయన మనస్సు కుదుటపడింది. వెధవ డబ్బు పోతే పోయిందిగానీ, చీకూ, చింతా లేకుండా బెజవాడ చేరవచ్చు. ఆ ఇంటరులో ఆ అల్లరి కుర్రాళ్ళతో సీతలాటి పెంకిపిల్లను వేసుకొని ప్రయాణం చేస్తే నిద్రకు నీళ్ళు ధారపోయవచ్చును. రోజులు మరీ గడ్డుగా వున్నాయి. ఆడా మొగా క్షణాలమీద ప్రేమించేసుకుని, ఉత్తర క్షణాలలోనే పెళ్లాడేసి, అంచెల మీద లేచిపోతున్నారు... "అమ్మయ్యేది. బాబయ్యేది. అమరమైన ప్రేమకన్నానా?" అంటున్నారు.

ఆయన ఆలోచనలకు హఠాత్తుగా అంతరాయం కల్గింది. పాతికేళ్లక్రితం కాంత విషయంలో తను ఎలా ప్రవర్తించాడో గుర్తుకు వచ్చింది. తనకు ఇరవై రెండేళ్లు అప్పుడు. ఏలూరు వెళుతున్నాడు. రైల్లో... తనెక్కిన పెట్టెలో... ఒక అందమైన అమ్మాయి, వాళ్లనాన్న ప్రయాణం చేస్తున్నారు. ఔను... చూడగానే కాంత అందాన్ని మెచ్చుకొన్నాడు తను. వాళ్లనాన్నతో అదీ ఇదీ మాట్లాడుతున్నంతసేపు ఆ అమ్మాయి తన వేపు చూస్తూనే వుంది. కాస్సేపుండి ఆయన నిద్రపోయారు. పెట్టెలో ఇంకెవ్వరూ లేరు. తను పిచ్చెత్తినట్లు చూశాడు. ఆ అమ్మాయి రెప్ప వెయ్యకుండా చూస్తూంది. "నీ పేరేమిటి" అన్నాడు తను. సిగ్గుపడుతూ చెప్పింది... ఆ అమ్మాయి తండ్రి నిద్ర లేచాక తను నిర్భయంగా శుభ్రమైన తెలుగులో చెప్పాడు. "ఏమిటి ఇది" అంటూ కాంతంకేసి చూశాడు ఆయన. సిగ్గుతో తలవంచుకొని పెదిమలు బిగించి చిరునవ్వు దాచుకొంది. ఆయన తిరిగి తనకేసి చూశాడు... ఫకాలున నవ్వాడు. – "భలేవాళ్ళురా! కలియుగ స్వయంవరం బావుంది," అంటూ.

భీమశంకరం కుటుంబ గౌరవం, ముఖంలో వర్చస్సు చూసి ఆయన అంగీకరించారు. "తరువాత సంప్రతింపులు జరిగాయి. ఆ పైన పెద్దల ఆశీర్వచనంతో ఒక శుభముహూర్తాన కాంతను పెళ్లి చేసుకున్నాడు.

కాంతను ఇప్పుడందరూ 'కాంతమ్మగారు' అంటారు. తనకు మాత్రం 'కాంత' అంటేనే బాగుంటుంది...

భీమశంకరంగారు తలతిప్పి, పక్క బెర్తుమీద పడుకొన్న కాంతమ్మగారిని రెప్ప వేయకుండా చూస్తూ, ఆమె ప్రత్యంగ సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నారు... కాంత ఇప్పటికీ ఎంత బావుంటుంది. ఆమె చెంపలమీద తేలికగా, తాకీ తాకనట్లు ముద్దుపెట్టుకొంటే?....

భీమశంకరంగారు చిన్నగా నవ్వుకున్నారు.

కాంత కళ్ళు తెరచి చూచింది. రెండు క్షణాలు ఆగి, చిర్నవ్వుతో చక్కని ప్రశ్న అడిగింది, "ఎందుకండి అలా చూస్తారు నావైపు" అని.

ఔను ఎందుకు? పాతికేళ్ళుగా తనతో సంసారం చేస్తున్న కాంతను ఎందుకు తను అలా కొత్తగా చూస్తాడు? క్షణక్షణం ఆమెలో ఏ అందాలు, ఏ వెలుగులు, తనను అంత ముగ్ధుణ్ణి చేస్తున్నాయి? భీమశంకరంగారికి సమాధానం దొరకలేదు. చిలిపిగా చూశాడు.

"చాల్లెండి. పిల్లలు మేలుకొని వున్నారు" అంటూ నవ్వింది కాంతమ్మగారు. నవ్వుతూనే బద్ధకంగా ఒళ్ళు విరుచుకొంది. చల్లగాలికి తట్టుకోలేక కాబోలు మూడంకెవేసి పడుకొంది.

భీమశంకరంగారు మాట్లాడలేదు. ముగ్ధుడై కాంత అందంలో మునిగినవాడై ఒళ్ళువిరుచుకొన్న ఆమె విల్లువంటి ఒంటి మెరుపు తీగవంటి వెలుగు భరించలేక, తన్మయానందంతో కళ్ళు మూసుకొని కలలు చూడబోయారు.. ఔను తను ఎందుకు కాంతవంక అలా చూస్తాడు?

☆ ☆ ☆

"శుద్దదండగ" అనుకున్నది కాంతమ్మగారు బండికదలగానే. ఇలా డబ్బు దుబారా చేస్తే కొంప గుండమై పోదూ?... అసలిది సంసారి లక్షణమేనా అని. ఇంటరు టిక్కెట్లుకొంటేనే తనకు దండుగ అనిపించింది. అది చాలక మళ్ళీ సెకండుక్లాసుకి మార్చటం మరీ దండుగ... ఆ డబ్బు పెడితే తనకో చీరో, లేకపోతే సీతకు రెండు పేటల గొలుసో వచ్చును. పెళ్ళీడు వచ్చిన పిల్ల వంటిమీద నగానట్రా లేదన్న ఆలోచన లేదు మాయదారి మనిషికి... అసలు ఇంత భాగోతానికి సీతే కారణం... ఆ ఇంటరు పెట్టెలో కుర్రాళ్ళను చూడగానే బేజారెత్తి ఆయనీ పని చేశారు...

మరీ పిచ్చికాకపోతే – ఇదేమైనా అడివా? అరణ్యమా? ఊరికే ఆయన భయంగానీ!

కాంతమ్మగారికి కూడా తమ పాత కధ గుర్తుకొచ్చింది... తన సంగతో...

ఔను. పాతికేళ్ళ క్రితం తను రైల్లో వెడుతూండగానే కదూ... ఆయన తనను పెళ్లాడతావా? అని అడిగారు. ఎంత తెగింపు మనిషికి! అసలందుకే ఆయనకింత భయం, కుర్రాళ్ళు సీత నెగరేసుకుపోతారని.

సీత చాలా బావుంటుంది. ముమ్మూర్తులా తన పోలికే అంటారంతా... ఔను తన కూతురుగాదూ!... తను చిన్నప్పుడు సీత అంత అందంగా ఉండేది. అందుకే ఆయన అలా తెగించారు. కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్న కాంతమ్మగారు మెల్లిగా కళ్లు తెరచి భీమశంకరంగారి వైపే చూసింది. ఆయన తనవైపు చూస్తూన్నాడు రెప్పవెయ్యకుండా!

రాను రాను మరీ కుర్ర చేష్టలవుతున్నాయి ఆయనవి. ఏమిటో ఇంత వయసొచ్చాక ఆయన తనను అలా చూస్తుంటే సిగ్గుతో ఒళ్ళు జలదరించింది. కాంతమ్మగారు అందంగా తీయగా అడిగింది, "ఎందుకండీ అలాగ చూస్తారు. నావైపు" అని. ఆయన జవాబివ్వకుండా చిరునవ్వుతో కళ్ళు మూసుకొని నిద్ర కుపక్రమించారు.

ఆయన ఎంత బాగుంటారు అనుకొన్నది కాంతమ్మగారు. జరిగిన రోజులు తిరిగివస్తే...

☆ ☆ ☆

'హోయ్ హోయ్, బలే బలే' అనుకొన్నాడు రాధాయ తన రైలు టిక్కెట్టు చూసుకుంటూ. (వాడికి ఎనిమిదేళ్లు. మీరడిగితే పద్దెనిమిది అంటాడు) ఇదేమి మామూలు రకం కాదు. సెకండు క్లాసు. బెజవాడలో దిగాక టిక్కెట్టు తీసుకోకుండా ఇంటికి వదిలేస్తే ఆంజనేయస్వామికి రెండొందల కొబ్బరికాయలు కొడతాడు.

ఇప్పటికే తను (శ్రీ) ఆంజనేయస్వాములవారికి పది లక్షల ఇరవై వేల రెండు వందలు కొబ్బరి కాయలు బాకీ వున్నాడు. ఈ టిక్కెట్టుతో ఇంటికి వదిలేస్తే ఫ్రెండ్సందరికీ చూపిస్తాడు... ఈ సెకండు క్లాసురైలు టిక్కెట్టు ఒక పదిరోజులు తన దగ్గర వుంచుకొని సరదా తీరేవరకు బతిమాలించుకొని సీనుగాడి దగ్గరున్న అంజలి ఫోటోకి ఇది బదిలీ ఇస్తాడు... నాన్న భలే మంచివాడు. ముందర ఇంటరుకొని మళ్ళా అదిమార్చి, దర్జాగా సెకండుక్లాసు టిక్కెట్లు కొనేశాడు. అమ్మకేం తెలీదు బొత్తిగా... అస్తమానం "డబ్బు దండగా డబ్బు దండగ" అంటుంది. తను పెద్దవాడైతే సెకండు క్లాసులోనే వెడతాడు. సెకండు క్లాసేమిటి? ఆ మాటకొస్తే ఇంజన్ డ్రైవరైపోతాడు – ఇంజనుడ్రైవరై స్పీడుగా రైలు నడుపుతుంటే ఎంత బావుంటుందో అనే విషయంపై వింత వింత కలలు చూసే నిమిత్తం రాధాయ నిద్రపోయాడు.

☆ ☆ ☆

"నాన్నెప్పుడూ ఇంతే" అనుకొన్నది సీత. హాయిగా ముందెక్కిన ఇంటరుక్లాసులోనే ఉండిపోతే ఎంత బాగుండును?... నాన్న మరీను, అర్థంలేని భయాలు, అంతకన్నా అర్థంలేని పనులూనూ... హాయిగా ఇంటరులో వెళితే...

సీత స్వంతంగా ఆలోచించడం మానేసింది. పక్కమీద వున్న కథల పత్రిక తెరచింది.. అదివరకే ఎవరో ఆలోచించి, అచ్చువేసి అందంగా అందించిన "ప్రేమవాహిని" అనే కథను చదవటం ప్రారంభించింది.

☆ ☆ ☆

భీమశంకరంగారికి విపరీతమైన కలలు రాసాగినవి. లేచి కూర్చుని సిగరెట్టు అంటించి, జేబులో నోటుబుక్కు తీసి పద్దులు వేసుకోటం మొదలెట్టారు.

స్టేషను వచ్చింది. రైలు పది నిముషాలాగింది. ఇంకెవ్వరూ ఆ పెట్టెలో ఎక్కకుండా వుండాలని మొక్కుతున్నారు భీమశంకరంగారు. రైలు కదిలింది. దేవుడికి వందనాలు అర్పించడానికి ఉపక్రమిస్తున్న భీమశంకరంగారు తుళ్లిపడ్డారు.

ఇరవై రెండేళ్ల వయస్సుగల మన్మథుడు ఒకడు పరుగున వచ్చి ఈ పెట్టెలో ఎక్కిపోయాడు.

"అమ్మయ్య" అనుకొన్నది సీత.

"దేవుడెప్పుడూ ఇంతే" అనుకొన్నారు భీమశంకరంగారు. అనుకొని వూరుకోలేదు. చాలా దూరం ఆలోచించారు.

ఎందుకేనా మంచిదని ఆ మన్మథుణ్ణి మాటల్లోకి దింపి అతగాడి పేరు, తండ్రిపేరు, ఇంటిపేరు, వృత్తి, చిరునామా, (శాశ్వతం, తాత్కాలికం కూడా) కులం, గోత్రం ఆస్తి మొదలైన వివరాలు యావత్తు అడిగి తెలుసుకొని కంఠస్థం చేసుకొన్నారు భీమశంకరంగారు.

* * *



# జలప్రళయం



## ప్రళయవార్త

త్వరలోనే జలప్రళయం సంభవిస్తుందని ప్రళయజ్ఞులు రూఢిగా చెప్పడంతో పిపీలికా ప్రపంచంలో పెద్ద సంచలనం బయలుదేరి, చలనం సర్వమూ ఆగిపోయి, జగతి అంతా స్తంభించిపోయింది. వినగానే రెండు చీమలు నిర్ఘాంత 'పోయాయి;' మళ్లీ రాలేదు. మరికొన్ని, బతికుంటే ఎలాగైనా చావవచ్చునని కొండలెక్కిపోయాయి, తీరా అక్కడ చేరేసరికి లావా (లేత బెల్లపు జీడిపాకం) కరిగి, కుతకుత ఉడుకుతోన్నందువల్ల మాడి చచ్చిపోయాయని పారిపోయి వచ్చిన చీమలు చెప్పాయి. ప్రళయానికది చిహ్నమని ప్రళయజ్ఞులు మరింత సంబరపడిపోయారు. తాము చెప్పిన విధంగా జరగబోతోందని వారు ఉప్పొంగిపోవడం ఏమాత్రం బాగులేదనీ, అలా నిజంగా జరిగితే ఆనక గర్వపడిందికి వారుగాని, చప్పట్లు కొట్టిందికి మరెవరూగాని వుండబోరన్న విషయం కూడా జ్ఞాపకం చేసుకు మరీ ఆనందించడం మంచిదని కొందరు విమర్శకులు విమర్శించారు.

దేశానికి ఆహారం కొరత కాకుండా కొత్త ప్రాంతాలలో వెదకి వచ్చేందుకు వెళ్లిన సాహసికులలో, పంచదార, నూకలు, బెల్లం వగయిరాలు భారీఎత్తున ఉన్న స్థలాలు కనుక్కున్న కొందరు అప్పుడే విజయగర్వంతో తిరిగి వచ్చారు. ఒక దండుతో యాత్రచేసి, అవి పట్టించుకువచ్చి పుట్టలో జారవేస్తే సన్మానం జరుగుతుంది. ఈలోపుగా ఈ ప్రళయాలకు తొందరేమిటని వారు చిరాకుపడ్డారు.

మీరు తెస్తే మటుకు సన్మానం చేసేదెవడిక్కడ, అవతల పుట్ట మునుగుతూ వుంటే అని ఛీత్కరించాయి అసూయాగ్రస్తలైన చీమలు కొన్ని.

"మేము అవి తెచ్చాక పుట్ట మునిగేదీ లేనిదీ, ప్రళయం వచ్చేదీ రానిదీ ఖరారుగా తెలీదుగాని, మేము తేకపోతే, తీరా ప్రళయం రాకపోతే అప్పుడు కరువు కాటకాలు మటుకు ఖాయం అవుతాయి."

"మహాబాగు, ఇలా కాకపోతే అలా చచ్చిపోతాం. వెధవది ప్రళయం వచ్చేస్తుందని భయపడి చావుకు సిద్ధమై కూచున్న తరువాత తీరామోపి అది కాస్తా రాకపోతే మటుకు ఏం బావుంటుంది? తెల్లమొహం వేసుకు కూచోవాలి" అన్నదో చీమ, మొహం మిరపతొక్కలా చేసుకుని.

## సంరంభము

"'ఏదో ప్రళయంట.. వస్తుందని చెప్పకుంటుంది చిమాభా అంతా. గగ్గోలుగా ఉంది" అంది మంత్రి చీమ. రాజు మొహంలోకి పరీక్షగా చూస్తూ.

రాజు మొహంలో చావంత భయమూ కనబడగానే మంత్రిగారికి కర్తవ్యం తెలిపోయింది. వెంటనే గంభీర స్వరంతో ఆయన అంతా వివరించారు. రాజుగారికి భయం కలిగింది. ధైర్యానికి వేదాంతులను పిలిపించారు.

## సృష్టిప్రకారము

"స్వామీ, ఈ జగతి కథ ఏమి? ఎందుకు పుట్టేను, ఎందుకు గిట్టేను? మన చరిత్ర ఏమిటి?" అన్నాడు రాజు చిన్ననాడే ఇవన్నీ తెలుసుకోనందుకు తొలిసారిగా (తుదిసారిగా కూడా) చింతిస్తూ.

స్వామి చెప్పాడు:

"మన ప్రపంచం మధురమైనది. ఇందులో 23747564, 790 గృహాలున్నాయి; అంతకు నూరింతలు జీవులున్నాయి. ఆకాశాన్నంటే గిరి శిఖరాలు, పాతాళాన్నంటే లోయలూ వున్నాయి. బెల్లపుకొండ అయినందువల్ల ఎప్పుడూ కొండలమీద లావా కుతకుత ఉడుకుతూ ప్రవహిస్తూ వుంటుంది పూర్వం ఆ ప్రవాహంలోనే కమ్మటి నువ్వులబండలు వచ్చేవి. ఇప్పుడు అయిపోయాయి. మన చిమాభా పెరుగుదల ప్రకారం, ఈ జగతిలో ఆహారం తీరిపోయేందుకు ఇంకా నూరేళ్ల వ్యవధి వుంది కాని ఆ చివరి రోజుదాకా ఉంచడం గిట్టక ఈశ్వరుడు ఇంతలోనే మనకి ముగింపు ఏర్పరిచాడు.

ఓ రాజా! ఇలాటివే ఈ సృష్టిలో ఎన్నో విశ్వాలు వున్నాయని శాస్త్రజ్ఞులు చెబుతారు. మనది మధురమైనది. కొన్ని చప్పగా వుంటాయి. కొన్ని మట్టివి.

మన లోకం ఏర్పడిన తెరగు విను. పూర్వం సూర్యుడినుండి ఒక శకలం విడిపోయిపోయి ఒక చోట ఆగి చల్లబడింది. అదే భూమి. అందులో సముద్రాలూ, నదులూ, పర్వతాలూ, లోయలూ వున్నాయి. ఎన్నో దేశాలున్నాయి. ఒక దేశంలో ఒక రాష్ట్రంలోని ఒక బస్తీలోని ఒక ఇంట్లోని ఒక వాటాలో చిట్టి అనే బాలికకి జ్వరం వచ్చిందిట (చిట్టి బాలిక కాదని, బాలుడని కొందరు పరిశోధకులు వాదిస్తారు.

రెండూ కాదనీ, శక్తి స్వరూపమని ఇటీవల తేలింది) ఇంట్లో ఆ పిల్లని ఏమీ తినవద్దన్నారు. చిట్టి జీళ్లు కావాలని ఏడిచిందిట. వాళ్లమ్మ పావలా యిచ్చి జ్వరం తగ్గాక కొనుక్కు తిందుగాని అని బుజ్జగించింది. ఆ పూట, అంతా నిద్రబోతూ వుండగా చిట్టి నెమ్మదిగా వీధిలో జీళ్లు అమ్మేకొచ్చేసరికి వెళ్లి పావలా పెట్టి పదహారు బెల్లపు జీళ్లు కొంది. కాని తన గదిలో తింటే అంతా చూస్తారని, డాబా మీదకు వెళ్లిపోయి గోడవారన ఎండలో నిలబడి హాయిగా తింటోంది. అంతలో వాళ్ల చిన్నక్క అక్కడికి వచ్చి చిట్టిని తిట్టి ఎండలో ఏం చేస్తున్నావంది. ఆ పళంగా చిట్టి భయపడి తన చేతిలోని పన్నెండు జీళ్లూ వెనకబాటుగా డాబామీంచి పడేసింది. అవి లుంగచుట్టుకుని పడుతూ పడుతూ ప్రహరీగోడమీద వచ్చి ఆగిపోయాయి. పాకం కరిగి వున్నందువల్ల అలాగే నిలబడి పోయాయి. నూరేళ్లనాడు మీ ముత్తాతవారు, ఈ చీమసీమకు ఈ సకల ప్రపంచానికీ వ్యవస్థాపకులు, అటువచ్చి ఆ జీళ్లగుట్టలోనే పుట్టను స్థాపించారు. ఈ ప్రపంచం నాలుగు తరాలు "చిరస్థాయిగా" నిలుస్తుందని ఆనాడే ప్రళయజ్ఞులు చెప్పారు" అన్నాడు స్వామి.

"ఇది ఎన్నో తరం" అని రాజుగారు అడగలేదు.

## ప్రళయ సంభవ ప్రకారము

"ఇపుడీ జలప్రళయం ఎలా సంభవించబోతున్నట్లు? దాని ప్రకారమేమి?" అన్నారు రాజుగారు.

స్వామి చెప్పారు.

"మన ప్రపంచానికి నూరు యోజనాల పైగా భూలోకవాసులు ఇంటి డాబా వుంది. అక్కడే మన విశ్వం ఆవిర్భవించింది గదా. ఆ యింటి చిన్న దొకర్తి డాబామీద పూలకుండీలకు నీళ్లు పోయడానికి ఒక పెద్ద బాల్చీతో నీళ్ళు తెస్తుంది. (ఈ పేర్లన్నీ ఏమిటని అడగకండి. బాల్చీ పరిమాణం మన ఊహాకందదు) ఆమె నీళ్లు మోసేటప్పుడే మన లోకంలో తుఫానులూ అవీ వస్తూంటాయి.

ఆ డాబాకి పక్కనే మరో డాబా వుంది. అక్కడికీ ఓ చిన్నది ఓ బాల్చీ నీళ్లు తెస్తూంది. వీరిద్దరూ డాబాలమీదుగా రోజా హాస్యాలాడుకొంటారు. తగువులాడుకొంటారు. ఒకరిమీద ఒకరు నీళ్లు జల్లుకుంటారు. ఈ సరసాల వల్లనే ఉపద్రవం వాటిల్లవచ్చునని ప్రళయజ్ఞుల నమ్మిక" అని ముగించాడు స్వామి.

## ప్రళయోత్పూర్వము

రాజుగారు కూడా కనుక్కున్నారనీ, ప్రళయం ఖాయమని ఆయనే భయపడుతున్నారనీ తెలిసి పుట్ట అంతా పాకంలా కుతకుత ఉడికిపోయింది.

డాబామీద తోటకి చెంబులతో నీళ్లు పోస్తే బాగుండునని, పక్క డాబా పిల్లతో సరసాలకు గోళ్లతో నీళ్లు చిలకరిస్తే దివ్యంగా ఉంటుందని చీమలన్నీ అభిప్రాయపడ్డాయి. తీర్మానాలు చేశాయి.

ఒక రాయబారి వర్గం బయల్దేరి వెళ్లింది కాని, వీరి భాష వారికీ వారి భాష వీరికీ బోధపడలేదు. పైగా అల్పజీవులన్న తేలిక భావంతో చిట్టి అక్కగారు ఈ రాయబార వర్గాన్ని చీపురుతో తుడిచివేసింది.

రాజుగారు బాధపడ్డారు. ప్రజలంతా చిన్నబుచ్చుకున్నారు. వాళ్లకి మీసాలు నెత్తికెక్కాయన్నారు. మనకి దారి తెలీదనుకుందా? అన్నారు.

మేడమీద అడపడుచు ఆ బాల్చీ పట్టుకుని డాబాగోడ దగ్గరికి వచ్చినప్పుడు పాదాలను కుట్టేసి మన బలం చూపాలని కొందరన్నారు. అందువల్ల మనకే ప్రమాదమనీ, ఆ కంగారులో ఆ పిల్ల ఏ అఘాయిత్యానికి ఒడిగట్టినా చిక్కేనని అన్నారు. చూస్తూ సహించలేమన్నారు. హింస ఎంతమాత్రం తగదన్నారు. తగితే మటుకు మనమేం చెయ్యగలమన్నారు.

బెల్లపు జీళ్ల రాజ్యంలో నిర్వేదం వ్యాపించింది. శ్రీమంతులంతా తాము గుప్తంగా దాచుకున్న పంచదార పలుకులను తిన్నంత తిని, మిగతావి అందరికీ చూపించి తినమన్నారు. తిందామనుకున్నవారు వద్దన్నారు. తగాదాలు, చోరీలు ఇతర నేరాలు పోయాయి... న్యాయ పాలకులు, దండనాధికారులూ నిరుద్యోగులయిపోయారు. నేరాలు వర్ధిల్లాలి అని నినాదాలు చేస్తూ ఊరేగింపులు జరిపారు.

ప్రేమికులు పెళ్లిళ్లు చేసుకున్నారు. శత్రువులు మిత్రులయిపోయారు. త్యాగాలు చేయాలి అని చిరకాలముగా ముచ్చటపడుతూ వచ్చినవారు ఆ ముచ్చటను తీర్చుకున్నారు. పెళ్లి అంటే భయపడుతూ వచ్చినవారు ఎలాగా ప్రళయం వస్తోంది కదా అని తెగించి పెళ్లిళ్లు చేసుకున్నారు. అంతలో –

## ప్రళయం సంభవించిన విధము

– ఒకరోజు సాయంత్రం డాబామీద చిన్నది బాల్చీలో నీళ్లు తెచ్చి పిట్టగోడమీదపెట్టి, పొరుగు డాబామీది పిల్లమీదికి నీళ్లు జల్లబోయే వరకు మోచెయ్యి తగిలి బాల్చీ ఒరిగిపడి, అందులోని జలజలధి ప్రళయ సన్నిభ గర్జనతో విశ్వవిధ్వంసక శక్తితో...

★ ★ ★

# సెరిబ్రల్ సినేమియా



"స్ప్లాట్ ఐరిష్ షాట్ అన్నాడండి. విచ్చు రూపాయట. మసక వెన్నెల్లో రోడ్డుమీద మెరిసిందట. తల కుడికీ ఎడమకీ 'పాన్' చేశాడట. లాంగ్ షాట్‌లో స్తబ్దంగా ఉన్న ప్రకృతి. వణికే చేతుల్తో ముందుకు వంగాడట..." అన్నాడు శంకరం.

అభివర్ణన వింటున్న ఇంటాయన విశ్వనాథంగారు విరగబడి నవ్వాడు. "వణికే చేతుల్తో వంగడం ఏమిటోయ్" అన్నాడు.

"మీ రిలా పేళనచేయడం భావ్యం కాదండి. జ్వరంతో ఉన్నాడు కాబట్టి, మీకు వైద్యం తెలుసు కాబట్టి మందేమన్నా ఇస్తారని మీకు మనవి చేశాను" అన్నాడు శంకరం తాపీగా.

"పాయింటే అనుకో. కాని, నాకూ మనసు బాధగా వుంది. అద్దేమన్నా ఇస్తాడేమోనని చాలా రోజుల్నించి చూస్తున్నాను."

"ఇప్పుడు అద్దె అడిగితే నేనేం చెప్పలేనండి. అతనికి ఒంటి మీద స్పృహలేదాయె. అలా కలవరిస్తున్నాడాయె."

"అది కూడా పాయింటే. అయినా మందివ్వడానికి, బోర్డు కట్టినా నేను వైద్యం చెయ్యటం లేదోయ్. అయినా కాకపోయినా సెరిబ్రల్ సినేమియాకి మందులేదు. ఈ కేసులు నాకేం కొత్తకాదు. ఈ గదిలో అద్దెకున్న 'సినీమానియాక్'లలో ఇతను నాలుగోవాడు. రేపు జ్వరం తగ్గగానే గది కాళీచేసి వెళ్ళమను. అద్దె కట్టక్కర్లేదు" అంటూ విశ్వనాథంగారు లోపలికి వెళ్లిపోయారు.

"ఏవండోయ్, మాట" అన్నాడు శంకరం.

"ఏవండీ?"

"ఇతను మీ యింట్లో ఎన్నాళ్లనించి అద్దె కుంటున్నాడు?"

"నాలుగు నెలలు, రెణ్ణెల్ల అద్దె బకాయి."

"మీ రన్నట్లు, పాయింటే. అయితే ఇంకో పాయింటు కూడా వినండి. ఇతను నాకు మావయ్యకొడుకేమీ కాడు. ప్రాణమిత్రుడూ కాడు. ఒకరోజు పరిచయం అంతే," అన్నాడు శంకరం.

"అయితే ఏమంటావు?"

"ఏం లేదు. అంతే" అంటూ గదిలో గ్లాసు తీసుకుని కాఫీ తేవడానికి వెళ్లిపోయాడు శంకరం.

"పాయింటేస్మి" అనుకున్నాడు ఇంటాయన విశ్వనాథంగారు సాలోచనగా.

శంకరం కాఫీపట్టుకు తిరిగి వచ్చేసరికి గదిలో ఆనందరావు లేడు.

ఇంటాయన ముసిముసినవ్వులు నవ్వుతూ నించున్నాడు.

"ఇప్పుడే, రెండు నిముషాలైంది వెళ్ళి" అన్నాడాయన.

"ఎలా వెళ్లాడు జ్వరంతో" అన్నాడు శంకరం విస్తుపోయి.

"ఎలా వెళ్లాడు? డిస్టెంట్ లాంగ్ షాట్‌లో కాబోలు."

శంకరం మొహం ముడుచుకున్నాడు.

"అతని గురించి మీరు నాతో పరాచికాలాడటం బాగుండ లేదండి. జ్వరంతో తూలుతూవస్తుంటే చూచి, ఇక్కడ దిగబెట్టడానికి వచ్చాను అంతే" అన్నాడు శంకరం.

"జ్వరం ఎక్కడుంది. అతన్ని పీడించేది సినేరియాటిసీ. అంటే సెరిబ్రల్ సినేమియాలో ఒకరకం జబ్బు. ఊహ సినేరియోలు రాసెయ్యాలని ఉబలాటం అన్నమాట. సాయంత్రమే పెద్ద 'ఛాన్సు' తప్పిపోయి షాక్ తిన్నాట్ట. అదీ సంగతి. అందుకని, నేను కాస్త కాఫీ పట్టించి, కాసిని ఆశలు తినిపించాను. ఝూంమని లేచి, మళ్లీ వేటకెళ్ళిపోయాడు."

"రాత్రిపూటా?"

"లేడికి లేచిందే పరుగు. కోలుకుంటాడని నేను కాస్త ఆశపెట్టాను. నాకు తెలిసిన ఒక సినిమా ఆయనికి రికమెండేషన్ రాసిచ్చాను. ఆ ఉత్తరం పట్టుకు ఝూంమని వెళ్ళాడు."

"మీరు చాలా మంచివారండి" అన్నాడు శంకరం.

"పాయింటే... ఎటొచ్చీ మనమందరం మరిచిపోతాం ఆ సంగతి, ఆంజనేయుడు వంటివాళ్లం" అన్నాడు ఇంటాయన.

☆ ☆ ☆

ఆనందరావు హుషారుమీద ఎక్కి సరాసరి స్టూడియో గేటు దాకా మూడు మైళ్ళూ నిరాఘాటంగా వెళ్ళిపోయాడు. అక్కడ ఠాప్‌మని ఆగిపోయాడు.

కబంధహస్తం వంటిది అడ్డుపడింది. ఉత్తరక్షణంలో గూర్ఖావాడి కఠిన వదనం కనబడింది, గర్జించింది.

"క్లోజప్ కట్" అనుకున్నాడు ఆనందరావు, క్షణంలో సగంలో ఆ సన్నివేశానికి సినేరియా ఊహిస్తూ.

తన హుషారు, ఆశలూ సర్వం కట్ అయిపోయాయి.

జేబులో ఉత్తరం తీసి, చూపించి, తెలుగుభాషలో సంగతి అంతా చెప్పి; 'హై' అన్నాడు చివర.

ఆనందరావు భాషా వైదుష్యానికి గూర్ఖా ముగ్ధుడు కాలేదు; సరిగదా వాడిభాషలో అజ్ఞవంటి పాడిముక్కలు రెండన్నాడు. అంతలోనే కారేదో ఎక్కణ్ణించో వచ్చింది.

'హరో' అంటూ పక్కకి నెట్టి గేటు తీసి సలాం కొట్టాడు. కారులోని తార ఆనందరావుని చూచీ చూడనట్టుగా చూసి, నవ్వీ నవ్వనట్టుగా నవ్వుకుంది. కారు వెళ్లిపోయింది. ఆనందరావు పేకమేడ కూలిపోయింది. అతడు తొడుక్కున్న ఆశలచొక్కా పిగిలి చిరిగిపోయింది. తాను వ్రాయబోయే కథతో ఎవరో తియ్యబోయే చిత్రంలో ఆ తారే హీరోయిన్ కావాలని కోరుకుంటున్నాడు. పదిరోజులు ఆవిడ ఇంటి చుట్టూ తిరిగి, ఒకరోజు ఎలాగో దర్శనం సంపాదించి ఆ ముక్క ఆవిడతోనే చెప్పి వచ్చాడు.

నవ్వింది.

'చాలా అందంగా' అనుకున్నాడు ఆనందరావు. పూర్వాశ్రమంలో చదివిన సినిమాపత్రికల విజ్ఞానం జ్ఞాపకం వచ్చింది. కాఫీయా టీయా ఓవల్టీనా హార్లిక్సా అని అడుగుతుందని అనుకుంటూ, యేం జవాబివ్వాలో ఆలోచించుకుంటూ ఉండగా 'వస్తా, పనుంది' అని లేచి వెళ్ళిపోయింది.

"మరే! కాదుమరీ, పాపం" అనుకున్నాడు ఆనందరావు.

ఇవాళ తనని చూచి పలకరించలేదు. పైగా, ఆవిడ యెదుట పరాభవం జరిగిపోయింది. నాకానికి బయల్దేరిన నక్క అనుకుంటుంది కాబోలు. కథ, సినేరియో, పాటలు రాయడంలో, తనకున్న ప్రతిభ; నటనలో, డైరెక్షన్‌లో తన సామర్థ్యం గురించి తనకున్న ఆత్మవిశ్వాసం సంగతి ఆవిడకి పిసరంత కూడా తెలియదు గదా!

ఆనందరావుకి ఏడు పొచ్చింది, గూర్ఖావాడిమీద, గేటుమీద, కారుమీద, అందులో తారమీద, ప్రతిభకన్న డబ్బుకి ప్రాధాన్యమిచ్చే ఈ ప్రపంచం మీదా భారీయెత్తున కోపం వచ్చింది. ఇందరి నిర్లక్ష్యానికీ నిర్దయకూ గురి అయిన ఆనందరావు అనే భావి 'ఫలానా' మీద జాలి కలిగింది. తక్షణం సినేరియో ఊహించాడు.

"క్రేన్ షాట్. స్టూడియో గేటు. అవతల కళ్ళకు గంతలు కట్టుకున్న నటీ నటులూ, డైరెక్టర్‌లూ, ప్రొడ్యూసర్‌లూ, పనికిరానివాళ్ళూ, అడ్డమైనవాళ్ళూ తిరుగుతూ ఉంటారు. గేటు ఇవతల సిద్ధహస్తుడు, ప్రస్తుతానికి 'మసిపూసిన మాణిక్యం' అయిన ఆనందరావు నిలబడి వుంటాడు. గూర్ఖావాడు గెంటివేస్తూ పోతాడు. కట్... లాంగ్ షాట్‌లో ఆనందరావు... తలచుట్టూ విష్ణుచక్రం. క్రమంగా ఫేడౌట్."

బ్రహ్మాండంగా ఉంటుందనుకున్నాడు ఆనందరావు. అనుకొని, గిర్రున వెనక్కి తిరిగి గబగబ సందు చివరకి వెళ్ళి కాఫీ హోటల్లో మూల కూర్చున్నాడు నీరసంగా.

సర్వరు పలకరించాడు.

పరాభవాన్ని నెమరువేస్తున్న ఆనందరావు 'హుఁ' అన్నాడు.

హుఁ అంటే ఏమిటో సర్వేశ్వరరావుకి బోధపడలేదు. ఆ సంగతే చెప్పాడు.

"కాఫీ" అన్నాడు ఆనందరావు, మేలుకొని. మళ్లా వెంటనే వాలిపోయాడు బల్లమీదకి, మత్తుగా.

మత్తుగానే ఇంకా ఆలోచిస్తున్నాడు ఆనందరావు...

...ఇవాళ స్టూడియో గేటు దగ్గర పరాభవం పొందిన ఆనందరావు ఒకానొక రోజున సుప్రసిద్ధ ఫలానా అవుతాడు. ఈనాడు తనని గుర్తించని తార ఆనాడు హీరోయిన్‌గా బుక్ అవుతుంది.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లు గుర్తు సార్" అంటుంది సెట్ మీద కొచ్చాక. డైరెక్టర్ ఆనందరావు మందహాసం చేస్తాడు.

"195 డాష్ సంవత్సరం ఫలానా నెల ఇన్నో తేదీన ముసురుగా ఉన్న వేళ మీరు కారులో స్టూడియోకి వెళ్తూ వుండగా గేటులో మాసిన బట్టలు వేసుకున్న ఒక ఆసామిని గూర్ఖా 'హరో' అని డబాయిస్తున్నాడు. ఆనాటి అవమానితుణ్ణే మీరు చూసీ చూడనట్టు, నవ్వీ నవ్వనట్టు..."

"కాఫీ సాపడు సార్" అన్నాడు సర్వరు.

ఆనందం అదిరిపడి మేలుకొని ఇకిలించాడు.

కాఫీ చల్లారుస్తున్నాడు సుప్రసిద్ధ సినీ హీరో 'ఆనంద్.'

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అన్నాడు పెద్ద ప్రొడ్యూసరు.

"కాలచక్రం... 195 డాష్ నెలా ఫలానా తేదీన ఇన్ని గంటలకు సినేరియోాదస్త్రం చేత బట్టుకొని, ఒక స్టూడియో గేటులో నిలిచి పరాభవం పొందిన ఆనందరావు... ఈనాడు బాక్సా..."

"మురుపో, అప్పనే, అండవా" అంటూ లేచాడు ఆనందం ప్రక్క కుర్చీలో కూర్చున్న ఎవడో.

ఆనందరావు మేలుకుంటున్నాడు... కాజాలని రచయితగా, దర్శకుడుగా, కెమెరామెన్‌గా, ఎవడుపడితే వాడుగా!

బయట వాన పడుతోంది. ముసురుపట్టింది. ఆనందరావు కాఫీ గడగడ తాగేసి సిగరెట్టు ముట్టించాడు.

కాదలచుకున్న హీరో ఎవరో కాఫీ తాగి పోతూపోతూ ఆనందాన్ని చూసి సలాం కొట్టిపోయాడు.

"ప్రమాదో ధీమతామపి" అనుకున్నాడు ఆనందరావు. 'చుప్ నోరుముయ్' అని వెంటనే అనుకున్నాడు. అతను తనకి పొరబాటున సలాం కొట్టలేదు. ఏ డైరెక్టరుతోనో, ప్రొడ్యూసరుతోనో చూసి వుండాలి. తనంటే పడిచచ్చే వరహాలు లేడూ?

ఎందుకు లేడు? బోలెడున్నాడు. లావుగా, ఆరడగుల రెండు అంగుళాల ఎత్తున...

అంతలో వరహాలు లోపలికొచ్చాడు. రొప్పుకుంటూ. "దండం బాబూ" అన్నాడు.

సినిమావాళ్లంతా ఆనందం చెబితే వింటారని వరహాలు నమ్మకం, వరహాలు దగ్గరున్నప్పుడు ఆనందానికీ అదే నమ్మకం.

"రావోయ్ వరహాలూ" అన్నాడు ఆనందం.

వరహాలు వచ్చాడు.

"షూటింగు కెల్తారా బాబూ? ఇయ్యాల జైలు షూటింగంట" అన్నాడు.

"మరే, వెళ్లాలోయ్, ఇవాళ సినేరియోని ఓ ప్రొడ్యూసరు చూస్తానన్నాడు. తీరిక చేసుకు వస్తానన్నాను" అన్నాడు ఆనందరావు హుందాగా.

"మరింకేటి? ఎల్దారి నెగండి. నా కియ్యాల ఎలాగేనా రాడే యేసం ఇప్పించాల."

"నీ దగ్గిర డబ్బెంతుంది చెప్పు. ఆ గూర్ఖావాడికి కాస్త పారెయ్యాలి, పిల్లలవాడు, నాలుగుసార్లడిగాడు" అన్నాడు ఆనందం గబుక్కున.

"ఏం లేదు బాబూ, మా సిట్టి ఇంకా పంపలేదు. బేడ్డబ్బులుంటే ఈడకి నడిసొచ్చా" అన్నాడు వరహాలు. ఆనందం నవ్వాడు.

ఇద్దరూ బయల్దేరారు. వచ్చే కార్లు పోయే కార్లూ, చూసే పెద్దలూ, చూడని పెద్దలూ, చూడలేని పెద్దలూను. ఆనందానికి ఒళ్ళు చచ్చిపోయినట్లయింది, తను అలా రోడ్డునపడి నడుస్తున్నందుకు. రోజూ నడుస్తున్నా, ఏ రోజు కారోజే ఒళ్లు చచ్చిపోయినట్లవుతూ ఉంటుంది అతనికి.

"బాబూ" అన్నాడు వరహాలు.

"ఏం?"

"ఇయ్యాల పొద్దుటేల మా ఇంటికాడ పిచ్చర్ కంపెనీకెల్లానండి. అంతవరకు ఇత్తానిత్తానని ఇయ్యాల ఎగేసి, నేదన్నారండి. అడిమాట నమ్మి, నేను మా సిట్టికి ఉత్తరం రాసేసినాను."

"ఈ సినిమా వాళ్ళంతా ఇంతేనోయ్, మాట నిలకడ లేదు ఒకడికీ. నా సంగతి చూడూ" అన్నాడు ఆనందరావు.

ఆనందరావు సంగతి అచ్చ తెలుగులో చెప్పాలంటే లాటరీ కొట్టడం. అతను శాంపుల్ సినేరియోలు రాస్తాడు. ఎవర్నో అడుగుతాడు. వాడు చూస్తానంటాడు. చూడడు. చూసే అర్హత కలిగిన రోజున, 'ఎవడేనా కథ రాస్తాడు కాని, ఆలూ చూలూలేకుండా సినేరియో రాయట మేమిటండీ? పొండీ, మీరు బొత్తిగా అన్యాయమండీ" అంటాడు.

నిజానికి ఆనందరావు కొత్తలో వేషాలు సంపాదించడానికి ప్రయత్నించాడు. అది కలిసిరాక, అసిస్టెంటు డైరెక్టరు అవుదామని ఆశపడ్డాడు. రద్దీ ఎక్కువ. టెక్నికల్ సైడు "ట్రై" చేశాడు. అంబ పలకలేదు. అదీ ఇదీ అన్నాడు ఏదీ సాగిరాలేదు. చివరికి "సిన్మా కథలు" రాయడానికి సిద్ధపడ్డాడు. నాలుగైదు రకాల హీరో పాత్రలూ, వాటికి వ్యతిరేక లక్షణాలుండే హీరోయిన్ పాత్రలూ, విలన్, హాస్యగాళ్ల, వాళ్ల ప్రియురాళ్ల వేషాల లిస్టు రాసుకున్నాడు. ఒక్క బిగిని డజను కథలు రాసుకుని సంచిలో వేసుకుని, సరికొత్త ఆశల చొక్కా ధరించి, గొప్పవాళ్ళ తొలిచరిత్రలను స్మరించి, సిగ్గూ, లజ్జా విస్మరించి జైత్రయాత్రకు బయల్దేరాడు.

'కాదు', 'ఒద్దు' 'నా దగ్గర కొల్లలున్నాయి', 'కొత్తరకం కావాలి', 'ఆయన ఇంట్లోలేరు.' 'వారికి తీరికలేదు', 'చేతికి డబ్బువస్తే, సినిమా తీస్తే చూస్తాం' వంటి జవాబులు ఎదురయ్యాయి. ఈ కథ పాతదే. ఇది నాకు తెలుసు. డైరెక్టరు బావమరిదికి బాగులేదు. అయినా కాకపోయినా కథ ఒకడు రాయడమేమిటి? నలుగురం కలసి తయారుచేస్తాం. హీరో అభిప్రాయం, హీరోయిన్ అభీష్టం చూస్తాం. నువ్వేం శరత్‌బాబువా, షేక్స్పియర్‌వా? అయినా వాళ్లకే దిక్కులేదు.

నా మాట విని సినేరియో తయారు చెయ్యి. అది చేతనయితే పోయి. వీలైతే రకరకాల పాటలు రాయి. రెడీమేడ్ సినేరియాలైతే కంటి కానుతాయి. నలుగురూ కలసి చంపడానికి నీదన్న కథలేదు కాబట్టి ప్రాణానికి హాయి.

...ఇదిగో ఇలా చూడు. నా మాట విని బాగుపడు. సాధ్యమైనంత నిరాశపడు. ఝామ్మని ఇంటికి నడు..."

ఆనందరావు నిరాశపడలేదు. ఇంటికి నడవలేదు. పాయింటేస్కి అనుకున్నాడు. పెద్దల అడుగుజాడల్లో బయల్దేరాడు. ప్రాబ్లెం, సొల్యూషన్ మూడు ముక్కలు రాసేసి, క్షణంలో ఎవరికైనా తెలిసేలా మూడున్నర ముక్కల్లో కథ రాసుకున్నాడు. దీనికి సినేరియోలు దస్తాలకొద్దీ ఉత్పత్తి చేశాడు.

ఈ వ్యవసాయాచరణ సాగిస్తున్నంతకాలం అతనికి జరుగుబాటు ఎలా పొసగిందో అతనికి తెలియదు. తరుచుగానే భోజనం వంటిది చేస్తూ ఉండేవాడు. ముప్పూటలా ఆశలు మాత్రం సుష్టుగా పీకమొయ్యా భోంచేసేవాడు. బస్సుకి డబ్బు లేనప్పుడల్లా ఊహాలెక్కి సవారి చేసేవాడు. పరాభవం పొందినపుడల్లా వరహాలుని కసిరికొట్టి ఓదార్చుకునేవాడు....

"వరహాలూ, అదీ కథ, చూశావుగా నా సంగతి? సంచి నిండా కాగితాలు, వాటెనిండా మనుషులు. రకరకాలవాళ్లు, దుర్మార్గులు, మంచివాళ్లు, అందగాళ్లు, అమాయకులు, చాణక్యులు, చంద్రగుప్తులు, నాగేశ్వరరావులు, రామారావులు, రంగారావులు, రేలంగి వెంకట్రామయ్యలూ, వాళ్లమీద నా ఆశలూ, వాటిమీద సౌధాలూనూ..."

"మరి నా మీద రాయలే దేమిటి? నేను లేనా అందులో?" అన్నాడు వరహాలు.

ఆనందరావు పకపక నవ్వాడు. "సారీ, నువ్వులేవు వరహాలూ. నేను సృష్టించిన పాత్రలన్నీ హీరో హీరోయిన్ మొదలైన పెద్ద తరహావి, కథలు అమ్మచూపినపుడు ఇవే ముఖ్యం అన్నమాట. నీవంటి చిన్న చిన్న పాత్రలు తరువాత ఎక్కిస్తాం అన్నమాట" అన్నాడు.

"నేను పెద్ద ఏసాలు ఎయ్యలేనంటావా? అసలు అట్టాంటెయి మనకు దొరకవా?" అన్నాడు వరహాలు దిక్కుమొహం పెట్టి.

"ఛ ఛ! అలా బెంగెట్టుకుని అంతలోనే అలా అయిపోతే ఎలా? నే చెప్పలే... ముందర చిన్న చిన్న వేషాలు వేస్తారు. ఎవరయినా సరే, ఎంత పెద్ద యాక్టరేనా సరే నన్నమాట. ముందర చిన్న ఎక్స్ట్రావేషాలు కట్టాల్సిందే. నీవంటివాళ్లున్నారనుకో..."

"ఉంటే ఏటవుద్ది?"

"చూడు వరహాలు, నువ్వు ముందర బాగా మాట్లాడ్డం నేర్చుకోవాలి. ఏటవుద్ది అనకూడదు. ఏమవుతుంది అనాలి. అలా అంటేనే సినిమాలో ఛాన్సు."

"పోవయ్యా నువ్వు మరీని. సినిమాలో అయితే మాత్రం రౌడీలు ఏటవుద్ది అనకుండా పెద్ద బాస మాట్లాడితే ఏటవుద్ది? రసాబాసం అవుద్ది – నెగెస్... ఈడు అసలు రౌడీయే కాదు. ఏసం ఏశాడు ఏసం అంటారు" అన్నాడు వరహాలు.

'నమస్కారమండి' అన్నాడు ఆనందరావు దూసుకుపోయిన కారుని చూసి మందహాసం చేస్తూ.

"ఏ టది?" అన్నాడు వరహాలు.

"ఎవరో నాకు తెలిసిన డైరెక్టరులే."

అంటూ, ఆగి కాస్త దర్జాగా సిగరెట్టు తీసి ముట్టించాడు ఆనందం. వరహాలు దిగాలుగా నిలబడ్డాడు.

"చూడు వరహాలు! అలా దిగులుగా ఉండకు. నువ్వు అమాంతం ఎలా గొప్పవాడి వవుతావో చెప్పనా?"

"చెప్పండి మరి."

"నువ్వు ఎక్స్ట్రా వేషం వేశావనుకో. ఓ సినిమాలో హీరో ఏడుస్తూ గంభీరంగా పెద్ద డైలాగు చెబుతూ ఉన్నపుడు, నీ వంటి వాళ్లంతా గుంపుగా చుట్టూ ఉంటారు. హీరో యాక్షన్‌కి నువు రియాక్షన్ చూపిస్తావు, నీకు తెలియకుండానే. తరువాత ఏ డైరెక్టరో, ప్రొడ్యూసరో ఆ సినిమా చూస్తూ ఉంటే, నీ మీద దృష్టిపడుతుంది. 'ఆ లావుపాటి అతను ఎవరు చెప్మా, డైలాగు లేకపోయినా అంత చక్కగా నటిస్తున్నాడు' అనుకొంటాడు. వరహాలూ, దాన్నే స్టీలింగ్ ఎ సీన్ అంటారు. అప్పుడేమవుతుందో తెలుసా? క్షణాల మీద టెలిఫోను మీద అంచీల మీద వాకబు చేసేస్తాడు. నిన్ను బుక్ చేస్తాడు. అంతే. అదే మొదలు. నెల తిరిగేసరికి నువ్వు పెద్దస్టార్‌వి అయిపోతావు. అప్పుడు నిన్ను చూసి కథలు రాస్తారన్నమాట" అన్నాడు.

"అప్పుడు రౌడీ యేసాలు ఎయ్యొచ్చు గదా"? అన్నాడు వరహాలు హుషారుగా.

"ఒక్క రౌడీ ఏమిటి, అడ్డమైన వెధవ్వేషాలూ వేసెయ్యొచ్చు. హీరో, విలన్, హాస్యగాడు వెయ్యొచ్చు. నీకు సరదాగా ఉంటే, సాధించలేనా అనుకుంటే హీరోయిన్ గూడా వెయొచ్చు. నీ పలుకు వేదం అవుతుంది. నువ్వు బాక్సాఫీస్ పిచికవి అయినపుడు నీ మాటకి అడ్డెక్కడ, నీ కీర్తికి ఒడ్డెక్కడ...?"

వరహాలుకి ఇదేం నచ్చలేదు.

"అయ్యన్నీ నాకు తెల్దుగాని, నాకు రౌడీయేసం కావాల. రౌడీ అంటే మంచోడన్నమాట, ఒవరన్నా నలుగురు ఎదవ రౌడీలున్నా రనుకో, ఆ నాయాళ్లు ఓ పడుచు తిన్నంగ ఎల్తుంటే, దాన్ని అటకాయించి ఆపాల. యేదవేసాలేత్తా రనుకో, అప్పుడు ఓ మంచోడు – అసలు అణ్ణందరూ రౌడీ ఎదవ అనుకుంటూ ఉండాలన్నమాట... అప్పుడు ఆ మంచి రౌడీ ఏం సేత్తాడంటే–"

"తెలుసు లేవోయ్ – ఆ నలుగురిని పట్టుకు చావమోది, ఆ పిల్లని 'తల్లీ' అంటాడు, అంతేగా! ఎప్పుడూ ఉన్నదేగా మన పాట" అన్నాడు ఆనందం విసురుగా, విసుగ్గా.

వరహాలు చిన్న బుచ్చుకున్నాడు. "అలా కరవొత్తే నేనేటి సెప్పేది బాబూ? నేను అలాటి ఏసం ఏత్తే సూడాలని మా సిట్టికి మనసు. అందుకే గంధా వచ్చింది" అన్నాడు.

ఆనందం మాటాడలేదు.

వరహాలు రెండుసార్లు పలకరించి, కోపం వచ్చిందని గ్రహించి నోరు మూసుకున్నాడు...

లావుగా పొడుగ్గా ఉన్న వరహాలూ, కాస్త బొద్దుగా ఓ మోస్తరు పొడుగ్గా ఉన్న 'భవిష్యత్తులానా' ఆనందరావూ చెట్టా పట్టాలేసుకు స్టూడియో గేటు దగ్గర కొచ్చేసరికే, కాబోలనుకునే హాస్యగాడొకడు, పకాలున నవ్వి 'తేసా బద్దా' అని మళ్లీ పకాలున నవ్వాడు.

వరహాలు చిన్నబుచ్చుకున్నాడు. ఆనందరావు మాత్రం పట్టలేక, 'తొక్క' అన్నాడు ఆ హాస్యగాణ్ణి చూచి.

గేటవతల దూరాన ఓ జూనియర్ ప్రొడ్యూసరు కనబడ్డాడు. ఆయన్ని చూడగానే ఆనందానికి ప్రాణం లేచొచ్చింది. ఆనందరావు కథని సినిమా తీస్తానని, కథగా వీల్లేకపోతే, ఒక డాక్యుమెంటరీ అయినా తీసిపారేసి గవర్నమెంటు వాళ్లకి అమ్మిపారేస్తానని ఆయన బెదిరిస్తూ వచ్చాడు.

"నమస్కారం అండీ" అన్నాడు ఆనందం. అంటూనే, చొరవగా, గేటుదాటి లోపలికి ఎదురేగాడు. అతని వెంటనే వరహాలు చొచ్చుకెళ్లిపోయాడు.

"జూప్రా" గారు స్టూడియో రోడ్డు ప్రక్కన ఓ చెట్టుకింద ఉసూరు మన్నారు. శుభసూచకం అనుకున్నాడు. ఆనందరావు – ఆయన ఆగడం చూసి. అనుకోడం, తన కథ సంగతి అడగడం, ఆయన ప్రతిభ పొగడటం క్షణాలమీద జరిగిపోయాయి.

"ఆం, ఏమయ్యా నీ సొద? ఇపుడు కాదు నీ కథ" అన్నాడాయన విసుగ్గా.

ఆనందం అపార్థం చేసుకున్నాడు – పొగడ్తడోసు చాలలేదని.

తన దుస్థితి, ఆవేదన టెక్నికలర్‌లో చిత్రించలేకపోయాననీ అనుకున్నాడు. అనుకుని మళ్లీ పుంజుకున్నాడు.

"అన్నీ విచిత్రమైన పాత్రలండి. విచిత్రమైన కాంబినేషన్ అండి. మంచి మెలోడ్రామా ఉందండి. మీరు తప్ప ఇంకోడు న్యాయం చెయ్యలేడు."

వరహాలుకి ఓపిక తగ్గుతోంది. అవతల వేషం పోతుందని బాధ.

"ఆనందం! ఎల్దాంరా?" అన్నాడు మెల్లిగా.

"ఉండనయ్యా, నువ్వూ నీ సొదాను!" అన్నాడానందం.

జూప్రా ఒక్కసారి మట్టగిడసలా తన్నుకున్నాడు. ఉత్సాహ అభినయసూచకంగా 'నమస్తే నమస్తే' అంటూ చేతులు ఎగరేశాడు స్టూడియోలోంచే వస్తున్న ఓ కారుని చూసి.

ఆ కారులో ఓ ప్రొడ్యూసరున్నాడు. అతని చేతులో పలుకుబడి, దాని క్రింద స్టార్ వాల్యూగల హీరో హీరోయిన్ విలన్‌లూ ఉన్నారు.

వాళ్ళలో ఏ ముగ్గురి – కనీసం ఏ ఇద్దరి లేదా ఏ ఒకరి సంతకం ఉన్న కాంట్రాక్టు సంపాదించినా, డిస్ట్రిబ్యూటరు సులభంగా పెట్టుబడి పెడతాడు. పెట్టుబడి మినహా ఉత్సాహం, ఉబలాటం, ఉద్రేకం మొదలైన ఇతర హంగులన్నీ ఉన్న జూప్రా గారికి హఠాత్తుగా ఈ ఊహ తోచింది. గిరాకీ ఉన్న 'స్టార్స్' సులభంగా దొరకరు. చేత డబ్బులేనప్పుడు కాస్త పలుకుబడి ఉన్నవాళ్ల సిఫార్సులు కావాలి. ఆ క్షణానికి ఇంకో జూప్రాకి కూడా అలాటి ఊహే తోచినట్లు ఈయనకి తెలిసింది. అతగాడు ఈ పెద్ద ప్రొడ్యూసర్ని బ్రతిమాలి బామాలి సిఫార్సు సంపాదించడానికి శపథం పట్టి, ఆయన ఇంటిదగ్గర కాసుకు కూర్చున్నాడట. అందుకని, ఈయన్ని దార్లోనే అటకాయించి, ఆ సిఫార్సు వరం ఇస్తానని ఒట్టేయించుకోవడానికి ఈయన తహ తహలాడుతున్నాడు. స్టూడియోలోనే చూచాడు గాని, అక్కడ ఇంకా నలుగు రున్నందువల్ల, ఆలోచించి, కొంచెం ఇవతలగా దారి కాశాడు.

కారు ఆగింది. "నమస్తే" అన్నాడు జూప్రా మళ్ళా – తనకోసం కారు ఆపినందుకు మురిసిపోతూ. కారులో ఆయన ఊహాలు మరో పంథాలో నడుస్తున్నాయి.

కారు ఆపి డ్రైవరు పరిగెత్తాడు వెనక్కి. కారులోనివారు కూర్చునే నవరసాలూ అభినయించేస్తున్నారు.

"మీతో ఒక అర్జెంటు సంగతి మనవి చెయ్యాలి" అంటూ పాఠం మొదలుపెట్టాడు జ్రాప్రా కారులోకి తలదూర్చి...

"... అన్నీ విచిత్రమైన, విశిష్టమైన కారెక్టర్సండి. బాక్సాఫీస్ హిట్ కావడం గారంటీ... మీరు ఆ యిద్దర్నీ గనక ఒప్పించి కాంట్రాక్టు రాయిస్తారా... మేలు మరిచిపోను... మీరు చెబితే వాళ్ళు కాదనరు..."

కారులో ఆయన వినేస్థితిలో లేడు. అద్దంలోంచి వెనక్కి చూస్తున్నాడు. 'ఊ' కొడుతూనే. ఉండుండి హఠాత్తుగా తలవంచి ఆలోచన అభినయిస్తున్నాడు.

జ్రాప్రా ఆత్రుతగా చూస్తున్నాడు, 'పండా కాయా' అని.

"చూడండి. ఓ ఉపకారం చేస్తారూ?" అన్నాడు కారులో ఆయన, మళ్ళా ఓసారి వెనక్కి చూసి.

జ్రాప్రా ఎగిరి గంతేసి 'ఎంత మాట!' అన్నాడు రెండుసార్లు. అవశ్యం చెప్పండి అన్నాడు.

"ఏం లేదు ఒక్క సిగరెట్టు వుంటే అర్జంటుగా ఇవ్వండి. మా డ్రైవరు ఇంకా రావటం లేదు."

జ్రాప్రా కొయ్యబారి పోయాడు. సిగరెట్లు తన దగ్గిర లేవన్న సంగతి గుర్తుకొచ్చి నీరుగారిపోయాడు.

ఒక్క సిగరెట్ మీద ఆధారపడి వుంది తన అదృష్టం అంతా. వెనక్కి తిరిగి రెండడుగులు వేశాడు. నాలుగడుగులు అవతల నించున్న ఆనందం, 'ఏదో గిరాకీ' అనుకున్నాడు. "సినేరియో చూపించమన్నారాండి?" అంటూ దస్త్రం విప్పబోయాడు ఆశగా.

"సినేరియూ కాదు నా బొంద. సిగరెట్టుంటే తగలెయ్యండి. మీరూ, మీ వెధవ సినేరియోలూనూ" అన్నాడు జ్రాప్రా వుద్రేకంతో వణికిపోతూ.

"మీరిలా అంటారనుకో లేదండి. అసలు చూడకుండానే వెధవా బోడీ అని పేర్లు పెడితే ఎలా?... అన్నీ విశిష్టమైన పాత్రలు, చక్కటి మెలోడ్రామా వుందండి."

"సిగరెట్టుండీ! సిగరెట్టుందా? కొంపలు మునిగిపోతున్నాయి, ఆయన అసలే తిక్క మనిషి" అన్నాడు జ్రాప్రా మండిపడుతూ.

"సిగరెట్టు లేదండి, ఐ మీన్ అయిపోయాయి. యిందాకే ఒకటుంటే..."

జుట్టు పీకేసుకోవాలని జ్రాప్రా హృదయం ఘోషించింది. ఒక్క సిగరెట్టు లేక తన సముజ్వల భవిష్యత్తు చల్లారిపోతుంది. సిగరొట్టోయ్ అనుకున్నాడు పళ్ళు గిట్ట కరుచుకుని. ఆ డ్రైవరు ఈలోగా తెచ్చేస్తే తన అవసరం ఉండదు. కారు వెళ్ళిపోతుంది. తన ఛాన్సు పోతుంది.

ఇంకో రెండడుగుల అవతల ఉన్న వరహాలు వంక చూశాడు.

వరహాలు బీడీ కాలుస్తున్నాడు సాలోచనగా.

విధి దుర్విధీ, గతి దుర్గతీ గిణం తధీగిణాం అనుకొని, మతి దాదాపు పోగొట్టుకొని

జ్రాప్రా మళ్ళా కారువంక తిరిగాడు. బిక్కమొహం పెట్టిన డ్రైవరు కారు స్టార్టు చేస్తున్నాడు. లోపలనున్న ప్రొడ్యూసరుగారి కోపంతో కారు భగ్గున మండుతోంది.

"ఆ ఇద్దరికీ చెప్పి ఒప్పిస్తారుగా... మిమ్మల్నే నమ్ముకున్నాను" అన్నాడు జ్రాప్రా.

"అబ్బే! అదెక్కడ కుదురుతుందండీ! డబ్బుతో పని. మీరే చూసుకోండి" అని జవాబొచ్చింది.

జ్రాప్రా 'ఐసీ' అనుకున్నాడు. అతనికి వైరాగ్యం వచ్చేస్తోంది.

అవతల విచారంగా నిల్చున్న ఆనందం ఇంకొక్క ప్రయత్నం చేశాడు. "చూశారూ, మంచి క్యారెక్టర్స్ చూపిస్తే డబ్బు లేకపోయినా కొండమీద కోతులు దిగొస్తాయండి. నా దగ్గిర అలాంటి ఎరలు అద్భుతమైనవి..."

"అబ్బాయ్, లాభం లేదు. అదేం కుదరదు. ఇది డబ్బుతో పని. యింకెక్కడైనా చూసుకో" అన్నాడు జ్రాప్రా. అని విసురుగా వెళ్ళిపోయాడు.

ఆనందరావుకి ఏడుపు రాబోయింది. అవతల దమ్మిడీ అంత మొహం చేసుకు నిల్చున్న వరహాలు నెమ్మదిగా భయంతో సమీపించాడు.

"బాబూ... ఎల్దారా సూటింగ్‌కి. అళ్ళు మళ్ళా ఇంకెవళ్ళనైనా తీసుకుంటారేమో" అన్నాడు.

"నువ్వెళ్ళవోయ్ నా ప్రాణం తియ్యక. ఇది డబ్బుతో పని. ఎవణ్ణో పడితే వాణ్ణి తీసుకోరు. నువ్వే పోయి చూసుకో" అన్నాడు ఆనందం మహదురుసుగా.

వరహాలుకి ఏం పాలుపోలేదు. ఎటూ కాలాడలేదు. అంత లావు అంత పొడుగు మనిషి బిక్క చచ్చిపోయి గోళ్ళు కొరుక్కుంటూ నిలబడిపోయాడు. కదిలినా మానినా ఆనందానికి ఇంకా కోపం వస్తుందని భయం.

సిగ్గుతో అభిమానంతో కుమిలిపోతూ ఉన్న ఆనందరావుకు, మామూలుగానే కోపం వచ్చేసింది. అతన్ని ఓదార్చడానికి—

"పోవయ్యా పో... నా దగ్గిరెందుకు భయం? ఇక్కడ ఎవరికెవరవుతారు? ఈ లోకంలో దయకీ ప్రేమకీ తావులేదు. నీ దారి నీదే. పతివ్రత వేషాలెయ్యకు. నాకు ఒళ్ళుమంట" అన్నాడు.

వరహాలు దీనంగా ఒకసారి చూసి, తల వంచుకుని నెమ్మదిగా సెట్స్‌వేపు బయల్దేరాడు. చెట్టుమీద కాకి ఆనందంమీద రెట్టవేసింది. తలపైకెత్తి చూశాడు ఆనందం. నలభైరెండు వాద్యాల నౌషద్ సంగీతం చెవిలో హోరెత్తింది. చక్కని సన్నివేశం చిత్రించవచ్చు ననుకున్నాడు.

తల వంచుకు వెళ్ళిపోతున్న వరహాలు, చక్కని హీరోయిన్ కావచ్చు.

ఆనందరావు ఆ సన్నివేశానికి నాయకత్వం వహించవచ్చు...

ప్రేమ బెడిసికొట్టిన సందర్భం అన్నమాట... "పో పో... నా దగ్గర నీకు భయమెందుకు? ఈ లోకంలో దయకీ ప్రేమకీ తావులేదు. నీ దారి నీదే, పతివ్రత వేషాలెయ్యక అవతలికి పో" అంటాడు హీరో.

పరిదీనవదన అయిన సుందరి తల వంచుకుని, దుఃఖపడుతూ నెమ్మదిగా వెళ్ళిపోతుంది. నలభైరెండు వాద్యాల సంగీతం భూనభాలని అదరకొట్టేస్తుంది. గుండె

రాయి చేసుకున్న హీరో ఆనందరావు, ప్రపంచాన్ని చూడలేక రపీమని తలపైకెత్తి ఆకాశం వంక చూస్తాడు. డిస్టెంట్ లాంగ్ షాట్...

గాజుల గలగలలు వినబడగానే, ఆనందరావు సినీలోకంలోంచి భూలోకంలోకి దిగి వచ్చాడు.

వర్ధమాన తార ఒకామె కంటే కానింది. ఆనందానికి తెలిసిన అమ్మాయే. 'సుబ్బులూ' అని పిలుస్తాడు. "కాదు, కామినీ అనాలి" అంటుంది నవ్వుతూ.

"ఏమిటి, చెట్టుకొమ్మల వంక అంత శ్రద్ధగా చూస్తున్నారు? ఛాన్సు యివ్వకపోతే ఈ కొమ్మకి వురేసుకుంటానని ప్రొడ్యూసర్లని బెదిరిద్దామనా?" అంది కామిని.

"తాడు కొనడానికి డబ్బెక్కడ తేను?... నేను గొప్పవాణ్ణయేలోగా నువ్వు పెద్దస్టార్‌వి అయిపోతే, ఈ చెట్టెక్కి దూకేసి..."

"అయితే విల్లూ గట్రా రాసి సిద్ధపరచుకోండి. నెల తిరిగేసరికి నేను మీ రన్నంతదాన్నీ అవుతాను. నాకు అమ్మమ్మ దొరికేంది. ఒట్టు" అంది.

"ఎప్పుడూ? ఎలా? ఎక్కడా?" అన్నాడు ఆనందం కళ్ళు పెద్దవిచేసి.

"ఈ ఊళ్ళోనే లెండి. ఇంక చూస్కోండి, అదృష్టం ఎలా తిరుగుతుందో" అన్నది కామిని.

అమ్మమ్మ గార్డియన్‌గా వున్న వాళ్ళందరికీ అదృష్టం చప్పున పడుతుందనీ, అతి త్వరగా తారాపథంలో కారెక్కి ఊరేగవచ్చుననీ ఆ పిల్ల శ్రేయోభిలాషి ఎవరో గట్టిగా నచ్చజెప్పి, అందుకు ప్రత్యక్ష నిదర్శనాలు చూపించాడు.

కామినికి ఆ బాపతు బంధువు లెవరూ లేరు. వుంటే, సిరి వస్తుందని ఆశ. అందుకని వెతికి వెతికి, మనవరాళ్ళూ గట్రా లేక అవస్థపడుతున్న ఓ అమ్మమ్మని మాట్లాడి కుదుర్చుకుంది.

"ఊహ మంచిదే" అన్నాడు ఆనందరావు మందహాసం చేస్తూ. చూసి చూసి గట్టిగా నవ్వి హేళన చేయడానికి మనసొప్పలేదు అతనికి.

"అమాయకత్వంవల్ల నీ అందం మరింత శోభిస్తోంది సుబ్బులూ" అన్నాడు కాస్త ఆగి.

"మీరు బలేగా మాట్లాడతారు. ఇక్కడ వర్ణించకపోతే, అవన్నీ డైలాగులుగా రాసి ఎవరికన్నా చూపించరాదూ?" అంటూ కిలకిల నవ్వింది కామిని.

"నువ్వు బలేగా నటిస్తావు- లోపల నకనక ఆకలేస్తున్నా ఎంత కులాసాగా వున్నావు!"

"మీకేమన్నా ఆకలేస్తుందా చెప్పండి. డబ్బు లిస్తా" అంటూనే రొంటినున్న బొందుసంచి తీసింది కామిని.

"అదేవిఁటి సుబ్బులూ? పల్లెటూరి సంచీ నువ్వూను."

"ఓస్...ఫాషనుగా తిరిగేవాళ్ళు పట్టుకు తిరిగే ఎరకల బుట్టల వాటికేం తీసిపోదు లెండి! ఎంత కావాలి చెప్పండి. నా దగ్గర అరణాలున్నాయి" అంది.

"అబ్బే! నాకేం వద్దు, ఊరికేనే అన్నా."

"పోవయ్యా! నా దగ్గర మొహమాటం ఏమిటి? బేడ తీసుకుని కాఫీ తాగు... కష్టార్జితంలే. అన్యాయం డబ్బు కాదు" అంది కామిని

ఆనందం ఆమె వంక చూశాడు. కామిని కళ్ళు సూటిగా వాడిగా నిష్కల్మషంగా అతని వంక చూశాయి.

పక్కున నవ్వింది. "మీరు చాలా మంచివారు. నేను పెద్ద స్టారునై, చాలా డబ్బు సంపాదిస్తే..." అంటూ బేడ అతని జేబులో పడేసి చరచర నడిచి వెళ్ళిపోయింది, కామినీ కుమారి.

"సుబ్బు లిచ్చిన డబ్బులు..." సినిమా కథకి చక్కని పేరు. మంచి కథ అల్లవచ్చు. చక్కని సినేరియో రాయొచ్చు. బ్రహ్మాండమైన పిక్చరు తియ్యొచ్చు. ఆనందరావుకి మతిపోయింది. అర్జెంటుగా సినిమా తియ్యాలనుకున్నాడు. అంతకన్న ముందు కథ రాయాలిగా! సినేరియో, పాట స్టూడియో కాంటీన్‌కి వెళ్ళి కాఫీ తాగేశాడు గబగబ.

☆ ☆ ☆

గబగబ హుషారుగా తిరిగేసి ఇట్టే రూపాయి అప్పు సంపాదించాడు. దస్తా కాగితాలు; పెట్టె సిగరెట్లు కొనుక్కొని ఇంటికి బయలుదేరాడు. సందు మొగలో కిళ్ళీకొట్టు బడ్డీకి బాకీ అర్ధరూపాయి చెల్లించి, స్వేచ్ఛగా గాలి పీల్చి, చకచక గదికి వెళ్ళి కథ రాయడం మొదలుపెట్టి సాయంత్రం దీపాలవేళకి ముగించి అవతల పారేశాడు.

☆ ☆ ☆

ఇంటాయన విశ్వనాథంగారు తొంగి చూశాడు. "ఏమిటి బాబూ, చెడ రాసేస్తున్నావు?" అన్నాడు నవ్వుతూ.

"కథండీ, అద్భుతమైన కథ! అత్యద్భుతమైన పాత్రలండి... చూస్తారా, చెప్పనా..." అన్నాడు ఆనందరావు.

"నా కెందుకోయ్! ఏనాడూ వాటి జోలికి పోనివాణ్ణి. నా సిఫార్సు ఇచ్చావా?"

"లేదండి – పొద్దున ఒక కథ పట్టుకు బయలుదేరాను. దారిలో ఇది తోచింది. సరే ఇది రాసి చూపిద్దామని వెనక్కొచ్చేశా" అన్నాడు ఆనందం.

విశ్వనాథంగారు నవ్వి వెళ్ళిపోయారు.

ఆనందం తల దువ్వుకుని, కాగితాలు చేతపట్టుకుని బయలుదేరాడు.

గంటలో గబగబ తిరిగొచ్చాడు. అతను కలుసుకున్న ఆసామి విచారం వెలిబుచ్చాడు. ఆర్నెల్ల తరువాత కనబడితే తప్పకుండా ఆలోచిస్తానని హామీ ఇచ్చాడు. అప్పటికీ కాస్త కాఫీ కూడ యిచ్చాడు. నాయనా! ... ఆయన వ్యాపారదక్షుడు కాడు... కాని వాళ్ళకివి రోజులు కావు.

ఆయనమీద కొండంత ఆశ పెట్టుకు వెళ్ళిన ఆనందరావు బోలెడు జాలిపడి కన్నీరు కారుస్తూ ఇంటికి చక్కా వచ్చి, సిఫార్సుత్తరం ఇచ్చిన విశ్వనాథంగారికి ఆ ముక్క కాస్తాచెప్పి తలవాల్చి నిల్చున్నాడు.

"ఫరవాలేదు లేవోయ్, నేను కనుక్కుంటాలే... నాకు ఈ ఫీల్డుతో ప్రమేయం లేకపోయినా, తెలిసినవాళ్ళు కొందరున్నారు. కనుక్కుంటాలే, భయపడకు" అన్నాడాయన.

☆ ☆ ☆

ఆనందరావు గుమ్మంలో కొచ్చేసరికి వరహాలు కనబడ్డాడు. మెట్ల దగ్గర నిల్చున్నాడు విచారంగా మీసాలు దువ్వుకుంటూ.

ఆనందానికి తనమీద కలిగిన జాలి యావత్తూ వాత్సల్యం అయిపోయి, వరహాలు మీదికి మళ్ళింది.

"ఏం వరహాలూ, అలా ఉన్నావ్? దా, లోపలికి. వేషం ఇవ్వలేదా?" అన్నాడు ఆప్యాయంగా.

ఆనందం కోపం తగ్గినందుకు వరహాలు మురిసిపోయి లోపలికొచ్చాడు.

"లేదు బాబూ, దొంగలసీను సూటింగయిందండి. రౌడీ యేసం అసలు నేదన్నారు. పోనీ దొంగోడి యేసమేనా ఇమ్మంటే నేదు పొమ్మన్నారండి! కావలిస్తే లావుపాటి పోలీసోడి రోలు లుచ్చుకోమన్నారండి."

"ఏడవకపోయారు! లావుకాపోతే, సన్నపాటి వాడి వేషం నీకెలా యిస్తారు?" అన్నా డానందం నవ్వుతూ.

"అసలది కాదండి. దొంగోడి యేసం అయితే డైలాగు లేకపోయినా కొంత యాక్సన్ సెయ్యొచ్చు. ఇదేటేది బొమ్మలా నిల్చునేది? అది సరే. యేసం లేకపోవడం సాలక యేలాకోలం గూడా ఆడారండి. నేనంట... లావంటా..."

"కాదు మరీ" అన్నాడు ఆనందరావు నవ్వుతూ.

"మరంటా...నాకు దొంగోడి యేసం ఇత్తే జైలు సెట్టింగు అసలే పట్టదంట."

"పోన్లే అదే పోయిరి. ఇలాటి వాటికి ఖాతరు చెయ్యకు. నీకు మంచి వేషం నేనిప్పిస్తా" అన్నాడు ఆనందం.

"నాకు రౌడీ యేసం కావాలి. మంచో డన్నమాట. దారంట ఎళ్లే ఓ యాడపడుచుని నలుగురు ఎదవ నాయాళ్ళు అల్లరి పెడతారనుకో..."

"మరే, మరే, అప్పుడు నువ్వు వాళ్ళని చావగొడతావు."

"అద్దదీ... మళ్ళా సూత్తానికి నేను రౌడీలాగే ఉంటా..."

"అలాగే ఉందుగాని, తందుగాని...పద, అలా వెళ్ళొద్దాం" అన్నా డానందం.

☆ ☆ ☆

రోడ్లని అరగతీసే వాహనాలకి సర్కారువారు పన్ను వసూలు చేస్తారట. ఆనందం వాహనం అకుజోళ్ళు. సినిమా కంపెనీలూ, డైరెక్టరూ, నటీనటులూ ఉండే రోడ్ల వెంట తిరిగి తిరిగి అరిగిపోవడంతోపాటు కొన్ని రోడ్లను అరగతీశాయి! గవర్నమెంటువారిది గమనించలేదు. గమనిస్తే చాలామందికి జరిమానా వేసి, పోషించవలసి వస్తుందిగదా అని. లావుపాటి వరహాలు అలాగే రౌడీ వేషం కోసం రొప్పుతూ తిరిగి తిరిగి అలిసిపోతున్నాడు.

ఆనందం అద్దెకున్న ఇంటాయన విశ్వనాథంగారు కూడా, ఆనందానికి సహాయం చేయడం కోసం పాపం ముప్పూటలా పని కలిగించుకుని ప్రదక్షిణాత్రయం సాగిస్తున్నారు. 'సినిమా ఫీల్డు మంచిదేస్మీ' అన్న ఊహ కలిగిందాయనకి క్రమంగా.

☆ ☆ ☆

హఠాత్తుగా ఒక రోజున ఆనందరావు ముఖం చాలారోజులు తరవాత తొలిసారిగా ఆనందపూరితం అయిపోయింది. ఒకానొక రోజున స్టూడియో చెట్లక్రింద అతన్ని అక్కర్లేదు పొమ్మన్న చిన్నసైజు ప్రొడ్యూసరుకి అర్జంటుగా కథ కావలసొచ్చి ఆనందరావుది తీసుకున్నాడు.

ఆనందరావు పరమానందరావయిపోయి, కొంతసేపు అలాగేవుండి, మళ్ళా మానేసి యథాస్థితికి వచ్చాడు.

ఈ ప్రొడ్యూసరికి ఇంకో ఆసామి అన్నివిధాలా అడ్డొస్తూ ఒస్తూ, ఒకసారి పరాభవంచేసి అవమానించాడట. అపుడు అతగాణ్ణే ఇతగాడు పబ్లిక్కున అవమానించి శాస్తి చేయదలచాడట.

వరహాలుని పిలిపించాడు. "వేషం ఇస్తా. ఫలానావాణ్ణి పబ్లీకున తంతావా?" అన్నాడు.

"శ.శ—విందుకు? నా వల్లగాదు, అలాటి యెదవ పనులు" అన్నాడు వరహాలు.

జూప్రొగారి ప్రయత్నాలు కలిసిరాలేదు. కిరాయికి రౌడీల్ని వాడుకోవడం అంటే ఆయనకి భయం. ఆలోచించుకోమన్నాడు. వరహాలు ఆలోచించి అదే జవాబిచ్చాడు.

కథ ఈ దశలో ఉండగా జూప్రొగారికి ఆనందరావు తటస్థపడ్డాడు. ఆనందం ఊఁ అంటే వరహాలు సై అంటాడని ఆయనకీ తెలిసింది. ఆనందం కథ సినిమా తీస్తానంటే, ఆనందం ఊఁ అంటాడని బాగా తెలుసు.

కాని, తీరా ఆనందాన్ని పిలిచి, కథ తీసుకుంటానని ప్రకటన చేసి, అసలు సంగతి చెప్పేసరికి అతను ససేమిరా అలా కుదరదనగలిగాడు.

"అతను పట్టి వెర్రిబాగులాడండి గోవంటివాడు. మధ్యన అతన్నెందుకు ఇలాటిదాంట్లో దింపడం" అన్నాడు.

జూప్రొ శతవిధాలా బ్రతిమిలాడాడు. వరహాలు ఖూనీలేం చెయ్యక్కర్లేదన్నాడు. ఊరికే వాడి ఒంటిమీద చెయ్యేసి అవమానిస్తే చాలన్నాడు. ఆపైన ఏమైనా వస్తే తన ప్రాణం అడ్డొడ్డుతా నన్నాడు. చేతి కొచ్చిన అవకాశం చెడనాడుకో వద్దని కూడా ఆనందాన్ని హెచ్చరించాడు. ఫిలింఫీల్డు చరిత్రలో ఇటువంటి పనికి ఇదే తొలిసారి కా దన్నాడు.

ఆనందరావు మెల్లగా, మెల్లి మెల్లిగా కరిగిపోయాడు. "సరే చూదాం" అన్నాడు.

అవతల గదిలోనే వరహాలున్నాడు. ఆనందం అక్కడికి వెళ్ళేసరికి పాతికేళ్ళ కుర్రాడొకడు వరహాలుని "అసిస్టెంట్ డైరెక్షన్" చేసేసి నానా అవస్థా పెట్టేస్తున్నాడు. రేయాన్ లాగు, డెకరాన్ స్లాక్ షర్టు తొడుక్కున్నాడు ఆ కుర్రాడు. ఖరీదైన చలవ కళ్ళజోడు తగిలించడంతో 'డైరెక్టోరియల్ లైను'కి అర్హత సంపాదించేసుకున్నాడు.

వరహాలు మీసాలు రౌడీ వేషానికి చాలవని అతగాడు డబాయిస్తున్నాడు.

ఈ రకంవాళ్ళు చాలా మందిని ఆనందం ఎరుగును. ఉబలాటంతోపాటు, ఖరీదైన గుడ్డలు కూడా ఉంటే, సినిమా కథా రచన దగ్గర్నించి, ఫిలింప్రింట్లు తియ్యడం వరకూ అన్నీ తెలిసినట్టేనట.

"వరహాలు, మాట" అన్నాడు ఆనందం.

"రిహార్సల్సు జరుగుతున్నాయి; ఇప్పుడు వీల్లేదు" అన్నాడు అసిస్టెంట్ డైరెక్టర్.

"నువ్వు డైరెక్షన్ చెయ్యడం నేర్చుకోవడానికి అతగాడే దొరికాడా?... పంపించు" అన్నాడు జాఫ్రా, ఆ గది గుమ్మంలోకి వచ్చి.

అసిస్టెంట్ డైరెక్టర్ 'స్టయిలిష్‌గా వెధవ మొహం' వేసి, 'ఆల్ రైట్ కట్' అని గొణుక్కున్నాడు.

ఆనందరావు వరహాలు చెయ్యి పట్టుకుని పెరటి వేపున ఉన్న చెట్టు దగ్గరికి తీసుకెళ్ళాడు.

రెండు నిముషాలసేపు కర్తవ్యం తేల్చుకోలేక అవస్థ పడ్డాడు ఆనందరావు. వరహాలు తన మాట వింటాడు. గోతిలో దూకమంటే కళ్ళుమూసుకు దూకేస్తాడు. అలా దూకితే ఇప్పుడు తనకి లాభం, వరహాలుకి దెబ్బ తగలొచ్చు. తగుల్తుంది. అప్పుడు తను ఆదుకోలేడు. అమాయకుణ్ణి ఇలా వాడుకోవచ్చునా అని బాధపడ్డాడు-ఆనందం. మార్గాంతరం లేనప్పుడు వాడుకోక తప్పదు. దీనివల్ల తనూ, తనవల్ల అతనూ కూడా బాగుపడతారు.

ఉత్తిది. వట్టి అబద్ధం. మోసం. తను టోకరా తింటున్నాడు. తింటూ, తింటూ ఆ సంగతి తెలుసుకుంటూ వరహాలుకి టోకరా తినిపిస్తున్నాడు.

"ఏటి బాబూ, ఆలోచిస్తున్నారు?" అన్నాడు వరహాలు ఉండబట్టలేక.

అక్కడితో ఆనందం ఆలోచనలు అంతమయ్యాయి. మంచో చెడ్డో, ఏమయినా సరే అని తెగించాడు.

"చూడు వరహాలూ, నువ్వు రేపు ఫలానావాణ్ణి స్టూడియోలో తన్నాలి. ఎందుకని అడక్కు..."

"ఎందుకు బాబూ ఊరికినే తన్నడం? ప్రొడ్యూసరుగారు కూడా ఇందాకా ఇదే సెప్పారు."

వరహాలుకు నచ్చజెప్పడానికి అట్టేసేపు పట్టలేదు ఆనందానికి.

"చూడు వరహాలూ! నేను చెప్పిన మనిషి మంచివాడు కాడు. ఆడపిల్లల్ని నానా అవస్థలూ పెడుతున్నాడు. నువ్వు కనుక ఇప్పుడు 'మంచిరౌడీలా' వాణ్ణి తన్నితే, ఈ ప్రొడ్యూసరుగారు చూస్తే, వారికి నీ యాక్షన్ సంగతి యిట్టే తెలిసిపోతుంది. అప్పుడు నీకు యిట్టే వేషం దొరుకుతుంది. చూసుకో మరి" అన్నాడు గంభీరంగా.

వరహాలుకి ఆనందం చెప్పిన మాటల్లో రెండు పాయింట్లూ బుర్రకెక్కాయి.

"తన్నినప్పుడు జాగర్త సుమీ! నువ్వు ఆడవాళ్ళను అల్లరి పెడుతున్నావుటగా అందుకు తంతున్నాను అని చచ్చినా అనకూడదు. ఇంకేదేనా వంకపెట్టి తన్నాలి. తెలిసిందా?" అని హెచ్చరించాడు ఆనందం.

వరహాలు తల ఊపాడు. కథ ఎలా నడపాలో కూడా మప్పి పంపాడు ఆనందం.

☆ ☆ ☆

కథ సగం వరకూ సవ్యంగానే నడిచి, ఆపైన బెడిసికొట్టింది.

ఆనందం, అతన్ని ఆశపెట్టిన ప్రొడ్యూసరూ, అతని తైనాతీలూ కబుర్లాడుతూ ఉండగా, తన్నబడవలసిన ఆసామి సిగరెట్టు కాలుస్తూ, ఆలోచిస్తూ ఆ పక్కగానే నడుస్తున్నాడు. ఆ పక్కగానే కాసుకున్న వరహాలు అడ్డుపడి తనకి రౌడీవేషం ఇచ్చే

విషయం ఏమైందన్నాడు. ఆయన నవ్వి ఊరుకున్నాడు. ఆనందం దగ్గిర తరిఫీదై వచ్చిన వరహాలు రెట్టించాడు. ఆయన విసుక్కున్నాడు.

"ఏటయ్యో. ఇత్తాను ఇవ్వను అని సెప్పరాదూ? ఇసుక్కోవడం ఎందుకు? ఎవడి గొప్పోడిదే. నీ గొప్ప నీ యింటికాడే. జాగర్త మరి!" అన్నాడు.

ఆయన మరింత విసుక్కున్నాడు.

"జాగర్త గీగర్త అంటున్నావు. ఏం గిరాకీ? ఏం చేస్తావు? తంతావా పెద్ద? ఒళ్ళు జాగర్త!" అన్నాడు.

"తన్నడం ఏం బెమ్మయిద్దె అనుకున్నా వేటయ్యా? ఇదిగో తంతున్నా ఏం చేత్తావేటి?" అంటూనే వరహాలు ఒక్క చెంపకాయ వేశాడు.

జరగాల్సినంత రభసా జరిగింది. ఆయన తిరుగు దెబ్బ కొట్టాడు. నలుగుర్నీ పిలిచాడు. వచ్చినవాళ్ళు వరహాల్ని హడలేసి, చెంపలు వాయగొట్టి బయటికి నెట్టించారు.

వరహాలు బిక్కచచ్చిపోయాడు. కంట నీరు తిరిగింది. వాచిన చెంపలు అరచేతులతో ఒత్తుకుంటూ, కన్నీటి పొరలలోంచి ఆనందం ఉన్నవేపు దీనంగా చూశాడు.

అతని ప్రాణానికి ఎవరూ ఏమీ అడ్డొడ్డలేదు.

ఆనందం మొహం చెల్లక, ముందుకు వచ్చే ధైర్యం లేక, చెట్టు చాటున తలదాచుకున్నాడు... జాప్రొగారి మొహం ఓ మోస్తరుగా వికసించింది.

"కొంప మునగలేదుగా. ఎందు కలా ఇదౌతారు?" అన్నాడు ఆనందాన్ని చూసి.

"అబ్బెబ్బే, ఏం లేదండీ" అన్నాడు ఆనందం నవ్వు తెచ్చుకుని.

☆ ☆ ☆

ఆనందం తెచ్చి పెట్టుకున్న ఆ నవ్వు ఆ రోజు సాయంత్రం వరకూ జెలగలా పట్టుకు కూచుని ఠాప్‌మని రాలిపోయింది. ఆశపెట్టిన ప్రొడ్యూసరు, డబ్బు పెడతానని అతన్ని ఆశపెట్టిన డిస్ట్రిబ్యూటరు, 'నేను నటిస్తానని' మాట యిచ్చిన నటుడు, 'అలాగే' నన్న హీరోయిన్ గార్డియన్ కారులో వచ్చిన ఇంకో యిద్దరూ కలిసి ఆనందం మొహం ముందు అతని కథని తిరగేశారు, మరగేశారు, వాతలు పెట్టారు. కథలో కొందరిని చంపారు. చచ్చిన వాళ్ళని బ్రతికించారు. కొందరిని పుట్టించి, ఠపఠప చంపారు. చివరికి యావన్మందినీ మళ్ళీ ఆఖర్న బతికించారు.

"ఈ హీరోకి గిరాకీ లేదు. అవారా మార్కు హీరోలు ఉంటేనే బాక్సాఫీస్ కోటని జయిస్తాం" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"మరే! నా ఊహ అంతే" అన్నాడు నటుడు.

"అంతేనా?" అన్నాడు ప్రొడ్యూసరు, ఆనందంవంక తిరిగి – 'పాయింటే' అన్నాడు ఆనందం బాధగా.

"ఈ హీరోయిన్ ఏర్పాటు బాగులేదండి. ఖరీదైన కాస్ట్యూమ్ వేసుకోడానికి ఒక ఛాన్సుకూడా ఉన్నట్టులేదు" అన్నాడు హీరోయిన్ గార్డియన్.

"మరే! లేనట్టుంది. అయితేనేం, డ్రీం సీక్వెన్సు పెడదాం" అన్నాడు ప్రొడ్యూసరు.

"ఏదో ఉద్ధరించినట్టు ఒక్క సీక్వెన్సేనా?"

"దానికేముంది నాలుగైదు పెడదాం. ఒకటి హీరో కల, ఇంకొకటి హీరోయిన్ కల, మరొకటి విలన్ ది, నాలుగోది...."

"ఈ కథలో హీరో చివర్న చచ్చిపోవడం నాకు నచ్చలేదు" అన్నాడు నటుడు.

"దానివల్ల ఆ పాత్ర మరింత రాణిస్తుంది. ఒక లక్ష్యంకోసం త్యాగం..."

"నాన్సెన్సు! చివర్న చచ్చే హీరో రోల్సు ప్రిన్సిపుల్ కి విరుద్ధం."

"పాయింటే నండి" అన్నాడు ఆనందం నీరసంగా.

☆ ☆ ☆

కథమీద కాన్ఫరెన్సు ముగిసింది. టెలిఫోనుమీద ఓ కవి వచ్చాడు.

స్థూలంగా కథ చెప్పి హీరో హీరోయిన్లను ఎలా అంతం చెయ్యాలో 'పెద్దలు' ఖరారు చేసేలోగా, మూడు వంతులు కథ సవివరంగా తయారు చేయవలసిందని ఒప్పగించారు.

"మరి నేనో?" అన్నాడు ఆనందరావు.

"తరవాత మాట్లాడదాం, ఉండ"మన్నాడు ప్రొడ్యూసరుగారు.

అంతా వెళ్ళిపోయిన తరవాత, 'అమ్మయ్య!' అన్నాడు. ఆర్నెల్లలో తను ఇంకో సినిమా తీయదలచాననీ, అప్పుడు గనక ఆనందరావు కనబడితే తప్పకుండా ఎంకరేజ్ చేస్తాననీ మాట ఇచ్చాడు.

"ఈ కథో?" అన్నాడు ఆనందం.

"ఏ కథ? ఇప్పుడు తయారైనది నీదికాదుగా, అది మేమంతా నిర్మించాం... ఇది డబ్బుతో పని. మీరు బాధపడతారని. మేం సాహసించి ఏమీ చెయ్యలేం" అన్నాడు ప్రొడ్యూసరుగారు.

"పాయింటే" అన్నాడు ఆనందరావు. అతనికి ఈసారి బాగా ఏడుపు రాలేదు, పాయింటు తెలుసుకోగలిగాడు కాబట్టి. అయినా ఏడుపుకన్న చిరాకు, కోపం ఎక్కువ వచ్చాయి. ఒకరకం రోత పుట్టింది.

☆ ☆ ☆

"ఛీ" అనుకున్నాడు రోడ్డున పడిపోతూ. అలవాటుకొద్దీ, పరాకుగా ఇంకో సినిమా కంపెనీలోకి చొరబడ్డాడు.

"ఏం బాబూ?" అంటూ వరహాలు ఎదురవడంతో స్పృహ వచ్చింది. ఆనందానికి గుండె గతుక్కుమంది వరహాలు ఏమంటాడో, ఏంచేస్తాడోనని.

"ఆరికి నచ్చిందా బాబూ? యేసం ఇత్తారా మనకి?" అని అడిగాడు వరహాలు కొండంత ఆశతో.

ఒక క్షణం ఆశ్చర్యపడ్డాడు ఆనందం వరహాలు మంచి మనసు చూసి. ఆప్యాయంగా అతని భుజాన చెయ్యి వేసి, "రా వరహాలు, పోదాం పద – మన ఊరికి" అన్నాడు బయటకు నడుస్తూ.

"యేసం ఇవ్వమన్నారా?"

"ఇచ్చినా మనకొద్దు. మనవంటి వాళ్ళకి నీతీ జాతీ లేనిచోట చోటులేదు" అన్నాడు ఆనందం కసిగా.

వరహాలు విస్తుపోయి నిల్చున్నాడు.

"ఎవరుబాబూ, నువ్వేనా అంత చక్కనిమాట అన్నావు?"

ఆనందం తుళ్ళిపడి పక్కకి చూశాడు.

కామిని, ఆమె గార్డియన్ అమ్మమ్మ అక్కడ నిల్చున్నారు.

"సుబ్బులూ!" అన్నాడు ఆనందం.

"నా పేరు కామినీదేవి. అది సరేగాని, నువ్విప్పుడన్నమాట ఇంకెప్పుడూ అనబోకు. తెలిసిందా?" అంది కామిని.

"ఏం, మధ్య నీకేం?"

"నాకే కావాలి. నేను దీనిమీద ఆశపెట్టుకున్నాను. పదిమందికి అన్నంపెట్టే ఉపాధిని, పదిమంది నమ్ముకున్నదాన్ని ఎన్నడూ తిట్టకు. నువ్వు ఒరుగుతుందనుకున్నదేదో వచ్చి పడకపోతే, నోటి కొచ్చినట్టు... ఇదుగో, మీ వూరెళతానంటావు కదూ నిక్షేపంలా వెళ్ళు. వెళ్ళేముందు ఒకసారి నువు అద్దెకున్న ఇంటి నెత్తిమీద ఏముందో చూడు" అనేసి చర చర వెళ్ళిపోయింది కామిని – వాళ్ళ 'అమ్మమ్మ' రెక్క పుచ్చుకుని 'రాపోదాం' అంటూ.

"సుబ్బులూ!" అన్నాడు ఆనందం....

☆ ☆ ☆

వరహాలు, ఆనందం తలవంచుకుని ఆలోచిస్తూ బయల్దేరారు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు.

ఆనందం ఇంటికి వెళ్ళేసరికి, ఇంటాయన విశ్వనాథంగారు హడావుడిగా ఉన్నారు.

చూరుకి కొత్తబోర్డు వొకటి వేలాడతీసి వుంది.

ఇంటాయన పేరుకింద, సినిమా పరిశ్రమకి అక్కడ ఏమిచేసి పెట్టబడునో రాసి వుంది. అందులో కథలూ, పాటలూ రాసి పెట్టబడడం దగ్గరనుంచి నటించి పెట్టబడడం మొదలైన అనేక అంశాలు ఉన్నాయి. ఆయన ఫలానా ఫిలింలో బుక్ అయిన వైనంకూడా ఆ బోర్డులో ఇమిడ్చి ఉంది.

"ఏటి బాబూ ఈ బోర్డు యవ్వారం?" అన్నాడు వరహాలు కొంచెం ఆశ్చర్యంతో.

"సెరిబ్రల్ సినేమియా" అన్నాడు ఆనందం, ఆ బోర్డునే మళ్ళీ మళ్ళీ చదువుతూ. బుర్ర గిర్రున తిరిగింది...

"సూపర్ ఇంపోజ్. నుదురు క్లోజప్. అందులో గిర్రున తిరిగే రైలుచక్రాలు...కట్" అనుకున్నాడు ఆనందరావు.

☆ ☆ ☆

"వరహాలు!" అన్నాడు ఆనందం.

"బాబూ!"

"మనం ఊరి–కే వెళ్ళొద్దు."

"ఇక్కడే ఉండిపోదారా?"

"ఔను మరే! నాకు మళ్ళీ ఓ మంచి ఐడియా వచ్చింది. మళ్ళీ కథ రాస్తాను. ఓ ప్రొడ్యూసర్ చూస్తా నన్నాడు...."

"మరి నాకు యేసం ఇత్తాడా?"

"ఆ పూచీ నాది."

"యేసం అంటే రౌడీ యేసం... మంచోడన్న మాట...."

"మరే, చూట్టానికి 'రౌడీలా ఉంటాడు."

"అంతే, అంతే... ఓ పడుచు పొకత్తి తిన్నంగా ఎల్తావుంటుంది... అపుడేమో నలుగురు రౌడీనాయాళ్ళు......"

★ ★ ★

# సరదా రమణీయం

## ప్రాప్తి

మంగళవాయిద్యాలతో సహా ఫెళ్లుమంటూ పెళ్లయేసరికి భళ్ళున తెల్లారింది. వాయిద్యగాళ్ళు వాద్యాలు మూటగట్టి సద్దుతున్నారు. మెత్తటి నిశ్శబ్దం ఏర్పడింది. తెల్లటి ఉదయాన చల్లటిగాలి వస్తూంటే పెళ్లి జరిగిన ఆ తోటలో కళ్యాణశోభ వెల్లివిరిసింది. పిల్లలు నిద్రలేచారు. పెళ్లిమంటపం శుభ్రం చేసి తరువాత కార్యక్రమానికి సన్నాహాలు సాగిస్తున్నాడు వియ్యన్నగారు.

అందరూ ముఖాలు కడుక్కుని కొందరు స్నానాలుచేసి మళ్ళా పందిట్లోకి చేరేసరికి ఫలహారాల ఆకులు పరిచివున్నాయి. పెద్దవాళ్ళు పెద్దరుగుమీద విడిగా కూర్చున్నారు – పెళ్ళికొడుకుతో మాట్లాడుతూ. పెళ్ళికొడుకు తమ్ముడు నరసు అక్కడికి చేరాడు కానీ వాళ్ళ మావయ్య గసిరాడు, “పెద్దవాళ్ళమధ్య నువ్వెందుకురా సత్రకాయవెధవా” అని.

పందిట్లో కూచున్న చిల్లర సత్రకాయలు ఫకాలున నవ్వారు. నరసుకి ఉక్రోషం వేసుకొచ్చింది. ఒక్కమాటు ఇటూ అటూ చూశాడు. అరున్నొకటి ఆలాపించాడు. కాళ్లు నేలకేసి బాదుతూ గట్టిగా, అస్పష్టంగా తిట్టుకుంటూ వంటింటికేసి బయలుదేరాడు. పెద్దరుగు చివరనే కూర్చున్నారు సుబ్రహ్మణ్యంగారు. పక్కనించి పోతున్న నరసు చొక్కా పట్టుకుని దగ్గరికి లాక్కున్నాడు. “లేదుబాబు, ఏడవకూడదు. మొగాళ్లు పైకి ఏడవరు. ఇక్కడ కూచో” అంటూ తనపక్క కూర్చోపెట్టాడు.

అరుగుమీద కూచున్న అరుగురు పెద్దలూ పెళ్లికొడుకూ బ్రహ్మాండం బద్దలయ్యేట్టు నవ్వారు – రిహార్సల్ వేసుకుని నవ్వుకి సిద్ధంగా వున్నట్టు.

నరసు ఏడుపుమాని బిత్తరపోయి చూశాడు. వాడికి సందేహం వచ్చింది – ఇప్పుడు వాళ్లు నవ్వింది తనని చూశా, సుబ్రహ్మణ్యంగారు ఏదో అన్నదానికా అని. ఏమైతేనేం, తను పెద్దాళ్లమధ్యన కూచున్నాడు. గర్వంగా చూశాడు పందిట్లో సత్రకాయలకేసి. కానీ వాళ్లంతా ఇడ్లీలోకి చట్నీ ఎక్కువ వేయించుకొనే గొడవలో పడివున్నారు. మళ్లీ సుబ్రహ్మణ్యంగారివేపు చూశాడు. ఆయన్ని చూస్తే దేముడు జ్ఞాపకం వచ్చాడు. దేముడు మంచివాడు. దేముడు అందరికీ సాయం చేస్తాడు. ఆ మాటకొస్తే అసలు అన్నీ ఇచ్చేది దేముడే.

నీరుకావిపంచె కట్టుకున్నాడాయన. కోలగా దోసకాయలావున్న పెద్దముఖం, వాలి గుబురుగావున్న మీసాలు. చక్కగావున్న పళ్లు, కళ్లుకూడా చాలా నచ్చాయి నరసుకి. సుబ్రహ్మణ్యంగారు ఎప్పుడూ ఏడవరుగామోసు. ఆయన ఏడిస్తే, కోప్పడితే ఎలా

వుంటుందో వాడికి తోచలేదు. ఎప్పుడూ నవ్వుతూ పలకరిస్తున్నట్టుంటాయి ఆయనకళ్లు.

అరుగుమీదకూడా ఇడ్డెన్లు వచ్చాయి. మడిగట్టుకున్న వంటబ్రాహ్మడు తెచ్చాడు, వేరే 'ఫెషల్' గిన్నెలో. ఆకులువేసి మంచి, మంచి ఇడ్డెనులు విరిగిపోనివి పెట్టాడు. పచ్చడికూడా చాలావేశాడు. వాళ్లన్నయ్యకి మాత్రం వెండిప్లేటులో పెట్టాడు. నరసు అన్నకేసి చూశాడు. వాడు తనకేసి చూడలే. అబ్బో వాడికెంత గొప్ప! ఎలాగయితేనేం వాడొక్కడికే పెళ్లయినట్టు.

సుబ్రహ్మణ్యంగారు వీపుతట్టారు. "ఊ! కానీ" అంటూ. అందరూ తింటున్నారు. వంటబ్రాహ్మడుమాత్రం వాగుతున్నాడు "అయ్యా మీకండీ-- అయ్యా మీకు-- ఒక్క జత--- అయ్యా మీకండి సుబ్రహ్మణ్యంగారు-- మొహమాట పడకండయ్యా--- అహఁ. మీరు పారేసినా సరే వేసి తీరతా--- ఎలా పారేస్తారో."

సుబ్రహ్మణ్యంగారు నవ్వారు. "ఎందుకయ్యా ఆ బలవంతం. కావాలని ఏడుస్తున్న కుర్రవెధవలకెయ్యరాదూ! నాకు చాలు."

నరసు ఎడంపక్కనుండి నవలబడుతున్న ఇడ్డెనుగల నోరు ఏదో అంది. నరసు చూశాడు పక్కకి – సినిమాపాటలు రాశానని చెప్పే జులపాలకవి. పూర్వాశ్రమంలో ఈయనది పొరుగూరే. హఠాత్తుగా మాయమైపోయాడు. తరువాత పట్నంలో సినీమా కంపెనీలో అన్నయ్యకు కనపడ్డాడు; పెళ్లికొడుకు ఫ్రెండు. చాలామంది తనవేపు చూడగానే జనపాలకవి ఇడ్డెను మింగేసి అన్నాడు, "ఆ మాట నిజమేనండి."

"ఏమాట?" అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

"అదే. అదే. ఇప్పుడు మీరన్నది."

"నేనేమన్నాను?" సుబ్రహ్మణ్యంగారు చాలా అమాయకంగా అడిగి, మంచినీళ్లు తాగుతున్నారు.

"హిహి-- హి--- అదేనండి మొహమాటం సంగతే. మీరన్నది నిజమేనన్నా."

అందరూ సుబ్రహ్మణ్యంగారివేపు చూశారు ఏమంటారోనని. నెమ్మదిగా గ్లాసుకిందపెట్టి ఆయన అన్నారు "నేనన్నది నిజమేనని నువ్వంటానంటావ్".

"ఆ! అంతేనండి" అన్నాడు కవి.

"ఐతే ఇపుడు నేనన్నది నిజం కాదన్నదెవరు?".

అంతా గొల్లున నవ్వారు. నరసుకూడా నవ్వాడు. కవి సకిలించాడు. పెళ్లికొడుకు మంచినీళ్ల గ్లాసు అడ్డం పెట్టుకున్నాడు కాబట్టి నవ్వాడో లేదో నరసుకి తెలీలా.

రోజా పేపరు చదివే పంచాయితీ బోర్డుమెంబరు ఆవలిస్తూ అన్నాడు–

"హఁ! ఏవిడోశంఠ్లి! హాయ్! మనం ఉన్నవాళ్ళం తిన్నంతతిని పారేస్తున్నాం. లేనివాళ్ళు మనం పారేసినంత దొరికితే చాలని ఏడుస్తున్నారు. ఏవిడో! మరీ కరువొచ్చిపడిపోయిల్డి--- న్యెప్రూ ఏదో చదువుతాడు ప్రణాళికలు."

ఎవరూ మాట్లాడలే.

జులపాలాయన ఏదో అనబోయాడు. కానీ అందరూ సుబ్రహ్మణ్యంగారివేపు చూస్తున్నారని వూరుకున్నాడో, లేకపోతే ఏమీ తట్టక ఊరుకున్నాడో? మొత్తానికి ఊరుకుని వేళ్ళాడుతున్న జనపాలకేసి చూచుకుంటున్నాడు.

సుబ్రహ్మణ్యంగారిలో విజ్ఞత వుందని అందరికీ తెలుసు. ఆ వెలుగు ఆయన కళ్ళల్లో అందరూ యిప్పుడు చూశారు.

ఈ సంగతి సుబ్రహ్మణ్యంగారు గ్రహించారు. అదే ఆయన గొప్పతనం. అడిగించుకొని మరీ చెబుతాడు.

పంచాయితీ మెంబరు కొంచెం జంకాడు, జనపాలాయనకి జరిగిన సన్మానమే తనకి జరుగుతుందని.

సుబ్రహ్మణ్యంగారన్నారు "ఆఁ! అదేం మాటలెండి. ఉన్నవాళ్లు వున్నది తిన్నదాకా నమ్మకమేది! ఇంగ్లీషువాడు అననే అన్నాడు – చేతిముద్ద నోటికెక్కడాని కెన్ని అవాంతరాలో అని. ప్రాప్తం వుండద్దండీ – ప్రాప్తం!"

కొందరు "హుఁ" అన్నారు ముక్కుతో. ఇద్దరు పెదిమలు విరిచారు. ఇద్దరికిలించారు.

షావుకారు శేషయ్యగొంతుక వినబడింది. ఏమిటా! అని నరసు కుడివైపు చూచాడు. పెళ్లికూతురు అత్తయ్య గొంతుక అది. ఆవిడ కాఫీ తెస్తూ సుబ్రహ్మణ్యంగారి సూక్తులు విన్నదై, ఓపిక తెచ్చుకున్నదై ఈ విధంగా అన్నదైనది:

"హుఁ! అంతే బాబూ! ప్రాప్తం ఉండద్దూ – ప్రాప్తం!" సున్నితంగా అనాల్సిన వాక్యంకాస్తా పెళ్లి గోలలో వెలుగు రాచుకుపోయిన గొంతుక కోమటిశేషయ్యని గుర్తుకు తెచ్చింది. ఏమనుకుందో, ఆవిడ ఆ వాక్యం ఆపేసి "కాఫీ పుచ్చుకోండి బాబూ" అంది రహస్యం చెబుతూన్నట్టు.

సుబ్రహ్మణ్యంగారు ధనియాల కాఫీ తీసుకొన్నారు. రెండుగుక్కలు తాగి శూన్యంగా చూశారు. లేకపోతే ఆలోచనలో వున్నారో!

పంచాయితీ మెంబరు నసిగాడు.

సుబ్రహ్మణ్యంగారన్నారు: "ప్రాప్తం వుండొద్దూ. జ్ఞాపకం వుందోలేదో మీకు. ఆమధ్య అన్నిటి మీద కంట్రోళ్లు – పప్పుల దగ్గర నుంచీ కరువు. ఆఖరికి ఇడ్లీకూడా 'బాన్' చేశారు. మొహం వాచాం ఇడ్డెనుకీ, మినపరొట్టెకీని. యుద్ధం రోజుల సంగతి నేచెప్పేది. అప్పుడు పట్నంలోవున్నా. పదిరోజులు పనిమీద వెళ్ళా. మా మేనత్త తోటికోడలు మొగుడు అక్కడ పని చేస్తున్నాడు. వాళ్లింట్లో బస." కాఫీ చల్లారిందేమో గడగడ తాగేశారు. పెళ్లికొడుకూ జనపాలాయనా సిగరెట్లు ముట్టించారు. నరసు హఠాత్తుగా లేచిపోయాడు. తోటలో వాళ్లబావ బీడీ తాగుతూంటె చూడడానికి. బావ మంచివాడు.

"ఆయ" అన్నాడు పంచాయితీ ఆయన పంచె బిగించి.

"అతగాడిపేరు రామావతారం. అవతారం అనేవాళ్ళం. ఏదో గుడ్డల కంపెనీలో పని చేసేవాడు. ఒఠి వెర్రిబాగులవాడులెండి. అతగాడిపెళ్లాం శాంతమ్మవుందే మహాయిల్లాలు. చల్లటివేళ తలుచుకోవాలి–" సుబ్రహ్మణ్యంగారు ఒక పట్టు లాగారు. పంచాయితీ ఆయన మరో పట్టడిగి మంచి చేసుకున్నాడు.

కాఫీ తెచ్చిన పిన్నిగారు చిన్నరుగుమీద కూచుని "హుఁ! అంతేనండి" అని బొంగురు గొంతుకతో ఆఫ్రికా కోకిలలాగ అన్నది. నరసు వాళ్లబావ బీడీ కాల్చడం పూర్తిగా చూసేసి గాలిదుమారంలావచ్చి సుబ్రహ్మణ్యంగారి దగ్గర కూచున్నాడు. ఆయన వాడ్ని దగ్గరకు తీసుకొని జుట్టు నిమురుతూ అవతారం కథ సాగించారు:

"పాపం, ఏం చేసేదో ఎలా తెచ్చేదో అన్నపూర్ణదేవిలాగ సుష్టుగా అన్నం పెట్టేది. నేనో పదిరోజులున్నాలెండి. కరువా కాటకమా అన్నారు. ప్రతిదానికీ కంట్రోళ్లే. మాంచి యుద్ధంరోజులు-- నిజంగా అబ్బాయ్! చెబుతా విను. తెల్లవాళ్లూ తెల్లవాళ్లూ చేసుకునే యుద్ధం పట్నంలో వున్న బియ్యం, మినపప్పు, కిరసనాయిలుతో కాదుగదా అనిపించేది. కొన్నాళ్లపాటు హోటళ్లలో కూడా ఇడ్డెన్లు లేక ప్రాణానికి మహా ఇదైపోయేది సుమా--- నేను వచ్చేసే ముందర కాబోసు. ఏదో పండుగొచ్చింది. పండుక్కి పొద్దున్న ఇడ్డెనలు, మధ్యాన్నం మినపరొట్టీ, అవడలూ తిని తీరాలన్నాడు అవతారం. వాడిపెళ్లాం నవ్వింది "ఏదో శాస్త్రం చెప్పినట్టుందండీ" అంటూ.

అవతారం ధీమాగా నవ్వాడు.

"హు! నీకేం తెలుసే. సాయంత్రానికి అడ్డెడు మినుములు తేపోతే చూడు. మా ఆఫీసులో అందరికీ చెప్పేను. నాలుగైదు దుకాణాలవాళ్ళకీ ఇద్దరు హోటలు వాళ్ళకీ. ఆ! ఎల్లుండి పండక్కి నువ్వు మినపరొట్టె చేస్తావు - నేను తేనె ముంచుకుని తింటాను" అన్నాడు గుడ్లెగరేస్తూ.

"ఐతే బ్లాకులో తెస్తావుటోయ్?" అన్నా నేను.

"అబ్బెబ్బే. పలుకుబడిలెండి" అన్నాడవతారం మళ్ళీ గుడ్లెగరేస్తో.

అవతారం పెళ్లాం అంది తిప్పుకుంటూ "ఆ! పలుకుబడికేంలెండి, చాలావుంది గాని డబ్బుతగలేసి కొనబోకండి. నేను శేరుకొన్నాను నిన్న సాయంత్రం."

అవతారం మూర్ఛబోయినంత పని చెయ్యబోయి ఆఫీసుకి టైమవుతోందని కోటేసుకుంటూ చేతనైనన్ని వాక్యాల్లో పెళ్లాన్ని ఎడాపెడా పొగిడేసి బయటికి పోయాడు. నేను బజారు కెళ్లాను - ఏదేనాకొందామని. ఆ మూడోనాడే పండగ.

చంకలెగరేసుకుంటూ ఆఫీసు కెళ్ళాడవతారం. సరే ఒంటిగంటకి హోటలు కెళ్లాడట టిఫిను తిందామని. రెండుగంటలకి ఆఫీసుకొచ్చేసరికి అతగాడి బల్లమీద ఓ డాల్డాడబ్బా వుందట. ఆఫీసులో తోటి ఉద్యోగులు అవతారం స్నేహితులు ఆ డబ్బా చుట్టూ నుంచుని ఊహా మురిసి ఇదైపోతున్నారు. అవతారం రాగానే అందులో ఐదారుగురు బండితోలేవాడి చప్పుడు చేశారు.

"కొట్టావయ్యా ఛాన్సు - మినపరొట్టె ఛాన్సు."

అవతారం తెల్లబోయి చూశాడు. పెద్ద మనిషిలా కనబడే మరో ఆయన అన్నాడు: "ఏమయ్యా ఎవరికో చెప్పావుటగా - మినుములు కావాలని. తెచ్చిపెట్టిపోయాడు. డబ్బుకి తరువాత వస్తాడట. నాకు సగంయిద్దూ" అని. అవతారం సంతోషాశ్చర్యసంభ్రమావ తారాలను వరుసక్రమంలో దాల్చాడు. ఇంట్లో మినుములున్న సంగతి వాళ్లకి చెప్పేసి ఇవి అమ్మేద్దామనుకున్నాడు. కానీ నోరురాలే. చవటనవ్వు నవ్వాడు అవతారం. "ఆ! ఇవ్నాళ్లనించి మినపరొట్టికి బెంగెట్టుకున్నాయన మనకెందుకిస్తాడులే?" అన్నాడాయన. అంతా వాళ్ల వాళ్లపనులకి సర్దుకున్నారు.

సాయంత్రమయింది. డబ్బా చంకనెట్టుకుని బయల్దేరాడింటికి. బస్సుస్టాండు దగ్గర నించున్నాడు. అవతారం పొరుగింటాయన హఠాత్తుగా తటస్థించాడు. ఆయన "ఏమండోయ్ అంటే ఈయన 'ఏవండీ' అన్నాడు తరవాతాయన 'ఏమిటెవిశేషా'లంటే ఈయన 'ఆ! ఏముంటాయ్ విశేషా' లన్నాడు. ఇద్దరూ 'ఊఁ" అన్నారు.

ఊరుకున్నారు. ఆయన్ని చూస్తే అవతారానికి ప్రేమ ప్రకోపించింది. సినిమాల్లో ఇరుగుపొరుగులపాట గుర్తుకొచ్చింది. తనకెలాగా యింట్లో మినుములున్నాయికదా! ఇప్పుడు తన డబ్బాలో రెండు శేర్లుంటాయి. ఇంటి దగ్గరవి యీయనకిస్తే— పిల్లలవాడు పాపం తింటాడు. అయినా వూరికేనాదుగా.

అవతారం అడిగాడు "ఏమండీ మినుములు కావాలా" అని. తృప్తిపడ్డాడు ఆయన. ఆయనపేరు రామారావు. అవతారం వివరించాడు. 'ఈ డబ్బాలో అడ్డెడున్నాయండి. ఇంటిదగ్గర ఓ శేరున్నాయి. మీక్కావలిస్తే ఆ శేరు తీసుకోవచ్చు.' రామారావుగారి కృతజ్ఞత కళ్లంట కారిపోయింది.

బస్సొస్తోంది. ఎవడో ఇంతలో అవతారం కోటట్టుకుని లాగాడు. వెనక్కి తిరిగాడు అవతారం. వాడన్నాడు "మీతో ఒక్కమాట."

అవతారం సందేహించాడు.

"చాలా అర్జంటు."

అవతారం బస్సువేపు చూశాడు. రామారావు బస్సులో వున్నాడు. "మీరెళ్లండి నేనొస్తా వెనకసించి" అన్నాడవతారం. బస్సు వెళ్లింది.

"ఊఁ! ఏమిటయ్యా?"

"అహ— వేరేంలేదు. మీదగ్గర మినుములు నాకు అమ్ముతారా అని."

ఛర్రుమన్నా డవతారం. "నేనెందుకమ్మాలయ్యా? అమ్మడం ఎందుకు. ఎందుకమ్మటం?" అని.

అంతా అనచిచ్చి వాడన్నాడు: "రెండుశేర్లకి అయిదురూపాయలిస్తా. డబ్బాకి పావలాకూడా."

పాతిక్షణాల్లో అవతారం ఆలోచించాడు. ఎలాగైనా అయిదురూపాయి లయిదు రూపాయిలే! రామారావుగారికి ఎగేసి ఇంట్లో శేరుతోటి తాను మినపరొట్టె తినొచ్చు. ఈ అయిదూ మరోకందు కుంటాయి.

"ఊఁ!" అన్నాడు.

అవతలవాడు అయిదురూపాయిల కాయితమిచ్చి డబ్బా పుచ్చుకున్నాడు. వెంటనే బస్సెక్కాడు.

అవతారం కాఫీతాగొచ్చి బస్సెక్కాడు.

ఆరుగంటలయింది అవతారం యిల్లు చేరేసరికి. నేనరుగుమీద కూర్చున్నాను. గుమ్మంలో కాలెట్టగానే ఆవిడడిగింది.

"ఏమండీ మినుములేవీ?"

"మినుములేమిటి?" ఠక్కమొహం పెట్టాడవతారం.

"అదేనండీ! మీకాఫీసులో ఎవరో యిచ్చిపోయిన అడ్డెడూనూ"

"నీకెవరు చెప్పారు?"

"పొరుగింటి రామారావుగారు మీకు కనబడ్డార్టగా బస్సుస్టాండులో! ఇంటిదగ్గర శేరూ యిస్తానన్నారట. పాపం వచ్చి అడిగాడు. 'అమ్మా! ఆయనెప్పుడొస్తారో ఏమిటో ఆ గింజలిప్పుడేయిప్పిస్తే బాగుచేయించి నానేయిస్తాను' అన్నాడు. సరే ఆ శేరూ యిచ్చిపంపాను— తీరా ఇద్దైపోయాడు వెర్రిబాగులాడు. పాపం పిల్లలు వాడాయె."

అవతారం అముదం తాగిన మొహం పెట్టాడు. తక్షణం తాగినకోతిలా తందనా లాడాడు. కోటు చింపేసుకోబోయి ఎందుకులే అని వూర్కుని పర్సు చొక్కాజేబులో పెట్టుకుని కోటు కిందపారేశాడు. "అడిగి తెచ్చెయ్ వాడ్ని మినువులు" అన్నాడు. "అసలు ఆడాళ్లతో వచ్చిమాట్లాడ్డానికి సిగ్గుండద్దా" అన్నాడు.

అతికష్టం మీదా ఆవిడా నేనూ వూర్కోబెట్టాం – "తప్పయ్యా వాళ్లు వింటేబావుండదు–– అసలు యిచ్చింది మళ్లా పుచ్చుకోడం మన వంశంలోనే లేదు" అని.

అవతారం వుపసంహరించుకున్నాడు––––– ఇడ్లెన్నూ, ఆవడలూ గారెలూ – ముఖ్యంగా మినపరొట్టీ అన్నీ హూత్! పండగ ఎండగైంది."

సుబ్రహ్మణ్యం గారాగారు. అందరికేసీ చూశారు అవతారం బాధ ఎవరెవరర్థం చేసుకున్నారోనని. అందరూ అఖండంగా అర్థం చేసుకున్నారు. తలకాయ లాడించారు. చ్చొ! చ్చొలు కొట్టారు. పంచాయితీ మెంబరు మాత్రం తన సానుభూతిని వాక్యీకరించాడు "రెంటికీ చెడ్డరేవడు పాపం!" అంటూ.

సుబ్రహ్మణ్యంగారు నవ్వారు. ఆయన నవ్వులో విజ్ఞతా, గర్వం పొంగిపొర్లాయి. "మీకిది మహాచిత్రంగా వుండచ్చు. ఇలాటివి నేను చాలా చూశాలెండి." అన్న అనుభవశాలిహోదా వెల్లివిరిసింది.

సుబ్రహ్మణ్యంగారు కథ సాగించారు:

"అక్కడితో అయిందీ! అవతారం పండుగనాడు మతిపోయినవాడిలా అయిపోయాడు. తెల్లవారుజామున పక్కింట్లో పిండిరుబ్బిన చప్పుడు అవతారానికి మేలుకొలుపు. పిల్లల రాగాలు ఉపశ్రుతులు. ఇతగాడు ఊహూ పెరట్లోకెళ్ళడం యింట్లోకి రావడం. పదింటికి గారెలు చుంయ్యి చుంయ్యి మన్నాయి పక్కింట్లో.

అవతారం మరోమాటు పెళ్లాంమీద కంయ్యిమన్నాడు. పన్నెండింటికి మళ్ళా రోలుగొడవ. అవతారం విసుక్కున్నాడు. ఏమిటి వెధవ గొడవ. ఇల్లు ఖాళీచేసి పొమ్మను వాణ్ణి అని. రెండింటికి మినపరొట్టి సన్నాహాలు ప్రారంభం. అందులోకి ఏది నంచుకోవాలన్న విషయంపై యింటిల్లిపాది మధ్యా వాగ్వివాదాలు సాగుతున్నాయి. అవతారం మండిపడ్డాడు. 'ఎలాగయితేనేం చేశారు మినపరొట్టి. దానికి పెద్దగొడవా!' అన్నాడు. వెధవసొద అన్నాడు. వాళ్లకి తనమీద కసి అన్నాడు. అసలిదంతా తన భార్యా, పక్కింటాయనా పన్నిన కుట్ర అన్నాడు. "అమ్మా, నాకు తేనెకావాలి" అంటూ ఓ కుర్రవెధవ పక్కింట్లోంచి గావుకేక పెట్టాడు. దాంతో అవతారం నరసింహావతారం ఎత్తాడు. హఠాత్తుగా ఏదో జ్ఞాపకమొచ్చి సామాను గదిలోకి వెళ్ళాడు. బీరువా తలుపుతీసి తనివాళ తినవలసివున్న మినపరొట్టిలోకి నంచుకునేందుకు తెచ్చుకున్న తేనెసీసా చూశాడు. గొల్లుమన్నాడు. బావురుమన్నాడు. నానా ధ్వనులూ చేశాడు. ఎలా అయితేనేం పెళ్ళాం బలవంతాన నాలుగు చారుమెతుకులు ఎంగిలిపడ్డాడు."

పాపం! అన్నారయిదుగురు జాలిగా. ఇద్దరావలించారు. నరసుకి మాత్రం భలే కోపం వచ్చింది. 'వాళ్ళుకాస్త పంపకూడదా ఏం' అన్నాడు.

"అదీ అయింది! వాళ్ళు పంపిందిససేమిరా తిననన్నా డవతారం. అతగాడొద్దన్నాడని

అవిడా, వాళ్లిద్దరూ వద్దన్నారని నేనూ, ఆ కాస్త అలా వుంచేసాం" అన్నాడు సుబ్రహ్మణ్యంగారు విషాద స్వరంతో.

☆ ☆ ☆

మళ్లీ కథ సాగించారు:

"సరే మర్నాడవతారం ఆఫీసుకెళ్ళాడు. అందరూ అడిగారట మినపరొట్టెలావుందని. ఈ గొడవంతా వాళ్ళకెందుకు చెప్పడం అని అవతారం తన చిన్నపుడు కవిత్వం యావత్తూ గుర్తుకు తెచ్చుకుని మినువుల్తో చేయబడుతున్న, చేయబడబోయే, చేయడానికి వీలుగా వున్న వివిధరకాల పిండివంటల వివరాలు వర్ణించాడు. పుట్టతేనెతో, పంచదారతో, ఆవకాయతో మినపరొట్టె ఎంతెంత బావుంటుందో ధారాళంగా వర్ణించాడు. హఠాత్తుగా ఆగి వెనక్కి చూశాడు, ఎవరో చిరునవ్వు నవ్విన అలికిడయి. మళ్లా యిటు తిరిగాడు, యిటెవరో నవ్వారని. ఒక్కమాటుగా చుట్టూవున్న తోటి ఉద్యోగులంతా పగలబడి నవ్వారు."

సుబ్రహ్మణ్యంగారు ఆగి, వూపిరి పీల్చుకుని నెమ్మదిగా అన్నారు – "కిరాతార్జునీయం చదివారూ? ఈశ్వరుడూ అర్జునుడూ కూడా ఒక్కమాటే గురిచేసి వేసిన బాణాలు వరాహాని కెడాపెడా తగల్లంతోటే ఆయొక్క వరాహం నొప్పికన్నా యెక్కువయిన ఆశ్చర్యం తట్టుకోలేకా, నొప్పిసంగతి దేముడెరుగూ అసలు బాణం ఎటునించొచ్చిందో కనుక్కోవాలని అటూ యిటూ, యిటూ అటూ, మళ్ళా అటూ యిటూ మహావేగంతో తలతిప్పి చూసిందట. ఆ పుస్తకం రాసిన కవి అంటాడూ ఆ సమయంలో గనకా ఏ శోధనాద్రయినా చెట్టెక్కి చూసినట్టయితే ఆ పందికి రెండు తలలున్నాయని ఆశ్చర్యపోనూ అని–– అదిగోనయ్యా అదే! సరిగ్గా అంతే. ఆవేళ అడివిలో ఆ వరాహం, యివాళ మళ్ళా ఆఫీసులో అవతారం, తల సమాన వేగంతో ఆడించారు. అందరూ నవ్వుతున్నారని నిర్ధారణకాగానే అవతారం తల ఆగింది. బిత్తరపోయి చూశాడు. పెద్ద గుమాస్తా అన్నాడు చివరికి – "చాల్లేవయ్యా అవతారం! మరీ పోకడలు పోతున్నావు మినపరొట్టె కవిత్వంలో. నీకసలు మినువు లెక్కడ దొరికాయంట? ఆవేళ డబ్బాలో పోసి నీ కిచ్చినవి మినువులు కావని యింటికెళ్ళగానే తెలీలా? మేమే దాంటో గంద్రిసుక పోసిచ్చాం తమాషాకి. మామీదే కవిత్వం వెలిగిస్తున్నావ్" అంటూ నిల్దీసి అడిగాడు.

అవతారం ఏడవబోయి నవ్వేశాడు గబుక్కున.

★ ★ ★

# కౌటిల్య రమణీయం



## ప్రయోజకుడు

“శ్రీరస్తు శుభమస్తు కళ్యాణమస్తు, సర్వసద్గుణసహిత సౌభాగ్యమస్తు” అంటూ, ఉప్పొంగే ఆ ప్రేమని ఆశీర్వచన రూపేణా ఉచ్చారణ చేశారు సుబ్రహ్మణ్యంగారు పద్మావతి నమస్కారం స్వీకరిస్తూ.

“రాజంటి మొగుణ్ణి పెళ్ళాడి పండంటి పిల్లల్ని కని వర్ధిల్లు తల్లీ!”

“పార్వతీ-పరమేశ్వరులవంటి వృద్ధ దంపతులు–మీ నోటిమాట చలవని ఏదో...” అంటూ ఊహూఁ మురిసిపోయింది సూర్యకాంతమ్మగారు ఆవిడ తమ్ముడు రాజువేపు చూస్తూ.

తాళ ప్రమాణాన లేచారు సుబ్రహ్మణ్యంగారు.. “చూశావే పిల్లా! నీతోపాటు నన్నూ ముసలాణ్ణిచేసి పారేసింది వదినగారు... కిమ్మనవేం? చెప్పు?” అంటూ భార్య కామేశ్వరమ్మగార్ని మోచేత్తో పొడిచారు.

కామేశ్వరమ్మగారు విసుక్కుంది. “బాగుంది సరసం––మరీ రోజురోజుకి కుర్రచేష్టలు ఎక్కువయిపోతున్నాయి. ఇదెక్కడి అల్లరమ్మా!

చిన్నాపెద్దా, సమయం సందర్భం లేకుండా? ఏదో శాస్త్రం చెప్పినట్టుంది... పెళ్ళీడుపిల్ల ముందర ఏమిటా మాటలు? మరీ ఇది కాపోతే...”

చిలిపిగా వెలిగాయి సుబ్రహ్మణ్యంగారి కళ్ళు. “చూశారూ వదినా.. మా కాముడుందే... స్వతహా చాలా మంచిదేసుమండీ– ఏదో అప్పుడప్పుడు కొంచెం తిక్క– అస్తమానూ నన్ను ఇలా రాసి రంపాన పెడుతుందనుకునేరు” అన్నారు, సూర్యకాంతమ్మగారితో. ముసిముసి నవ్వులతో అటు తిరిగి తన భర్తవైపు చూసింది సూర్యకాంతమ్మగారు. ఈ గొడవలతో సంబంధం లేనివాడల్లే ఆయన సావకాశంగా చుట్టకాల్చుకుంటూ, గబగబా పేపరు చదువుకుంటున్నాడు.

మళ్ళా ఇటు తిరిగింది.

"ఏదో బాబూ! మీ నోటి చలవన మా పద్మకి మా రాజిగాడు మూడు ముళ్ళూపడేస్తే.. ఏవంనుకున్నా గానీ వాడికి పద్మంటే పంచప్రాణాలూను. ఇది చూస్తే సవాలక్షగంథం చదువుతుంది వాడిమీద" అంది – దూరంగా బంగారుతంట్రల్లే బాచాల కొండల్లే కూర్చున్న రాజును చూస్తూ.

సుబ్రహ్మణ్యంగారి సతీమణి కామేశ్వరమ్మగారు అందుకుంది. "ఆc! మీకు పిచ్చిగాని, దాని కిష్టమే ఉంటుంది. – బావనికాదని ఇంకెవడ్ని చేసుకుంటుందండీ – కాపోతే సిగ్గు – పిచ్చితల్లికి"

"ఆc! చాల్లెద్దూ! కబుర్లకెక్కడకిలే–ఈ కాలం పిల్లలు మీ కన్నా నాలుగాకులు ఎక్కువ చదివారు. "ఫలానా మొగుడే" కావాలనీ ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పగలరు తెలుసా! సిగ్గూ బొగ్గూ కుదరదు. నిన్ను నా కిచ్చి కట్టేసినట్టనుకున్నావా ఏం?" అంటూ పద్మవంక చూశారు సుబ్రహ్మణ్యంగారు.

సరిగ్గా అదే సమయానికి పేపరు చదువుతున్న పెద్దమనిషి–పద్మతండ్రి–మందహాసం చేశారు. తిరిగి చుట్టనోట్లో పెట్టుకుని పేపరు తినటం మొదలెట్టాడు.

"పద్మ పేర్లేగిపోయింది" అనేవాళ్లు ఆ క్షణాన పద్మ అన్నమాట – ఎవరైనా పరాయివాళ్ళు వినివుంటే! నిజమే!! పద్మ అన్నదిది–

"రాజుగాణ్ణీ, గీజుగాణ్ణీ నేను చచ్చినా పెళ్లాడను. నేను అప్పారావుని పెళ్ళాడుతా. నాన్నగారు కూడా సరే అన్నారు" అని.

"అవ్వ హవ్వ!" అన్నది సూర్యకాంతమ్మగారు.

తుళ్ళిపడ్డాడు పద్మ తండ్రి.

కామేశ్వరమ్మగారు విస్తుపోయింది.

సుబ్రహ్మణ్యంగారు హాహాకారాలతో నవ్వటం ప్రారంభించారు.

ఆయన అంత హృదయపూర్వకంగా నవ్వి చాలా కాలం అయింది. ఆ నవ్వుకి పచ్చగా దోసకాయవలె, వెండి మీసాలతో నిండుగా వున్న ఆయన ముఖం ఎఱ్ఱగా అయిపోయింది. ఫాలభాగాన కణతల మీద రక్తనాళాలు ప్రస్ఫుటంగా కనబడ్డాయి. కంటనీరు తిరిగింది.

కామేశ్వరమ్మగారు కంగారుపడిపోయింది. బెంబేలెత్తిపోయింది. "ఏం ఓఘాయిత్య పుమనిషమ్మా?– ఏమొచ్చినా చిక్కే" అంటూ సుబ్రహ్మణ్యంగారికి గాలి విసరటం ప్రారంభించింది.

నవ్వునించి సుబ్రహ్మణ్యంగారు త్వరగానే తేరుకున్నారు. అందరి మనస్సులూ తేలికపడ్డాయి.

"కంగారు పడ్డావుటే కాముడూ?" అన్నారు సుబ్రహ్మణ్యంగారు, "చూడండి వదినా– మా కాముడికి నేనంటే యంత ప్రాణమో! సీతాసావిత్రీ–సువర్చలా–సుబ్బారావుగారి ఎంకీ మా కాముడు ముందు తీసికట్టే."

ఈ కొత్త ధోరణి ఎన్నడూ కనీవినీ ఎరుగని కాంతమ్మగారు కొద్దిగా కంగారుపడింది. పండు తమలపాకు వంటి కామేశ్వరమ్మగారి శరీరం ఆపాద మస్తకం జలదరించింది. సంధ్యా సమయాన, ఎర్రని కాంతులతో వెలిగే ఆకాశ ఫలకాన సూర్యబింబంవలె, సిగ్గుతో కందిపోయి ఎర్రబారిన ఆమె విశాలమైన నుదురుపైన వెండిరూపాయంతటి కుంకుమతిలకం ప్రకాశించింది. పండబారిన ఆమె శిరోజాలు ఆ అరుణరాగంలో

పాలిపోయాయి. పాతిక సంవత్సరాల క్రితం తొలిసారి సిగ్గుతో వాలిన ఆమె సుందర, సువిశాల నేత్రాలు, ఆనాడు ఆమెలో తను చూచిన దేవతల అందం తిరిగి, ఈ క్షణాన, ఒకే ఒక ముహూర్తకాలంపాటు సుబ్రహ్మణ్యంగారికి గోచరించాయి.

క్షణంకాలం ముగ్ధుడైపోయాడాయన–తన భార్యసౌందర్యం చూసి. "చాల్లెండి–ఎవరన్నా నవ్వి పోయేరు" అన్నది కామేశ్వరమ్మగారు–చెంపకు చారెడున్న కళ్ళని సాగసుగా వాల్చుకుంటూ.

పక పక నవ్వారు సుబ్రహ్మణ్యంగారు–నోరు తెరచుకుని ఆశ్చర్యంగా తన వంక చూస్తున్న పద్మవంక చూస్తూ.

"ఏం పద్మతల్లీ–రేపు నీ మొగుణ్ణి ఇలా గసిరిపారేస్తావే నువ్వూనూ?"

పెంకెఘటం పద్మ.

"లేదు తాతా..మంచి మొగుడు దొరుకుతే గసరనులే. రాజుబావలాటి వాడు దాపరించాడా– గసరడం కాదు గదా, తంతాను కూడా" అంది.

"సిసలయిన ఆడదానివే నువ్వూ.. నీ మాట నెగ్గించుకోవాలి గాని..." అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

పద్మతల్లి కొంచెం చిరాకుపడింది ఈ ధోరణి చూసి. ఇక లాభం లేదు. "ఏమే పిల్లా! ఓ నీళ్ళు పోసుకేదుద్దాం–ఓ జడ ఏడుద్దాం...లేకపోతే కాఫీ చెంబులు తొల్చి లోపల పడేద్దాం అని లేదుగదా.. ఊహూ పెద్దాపేరక్కలాగ తయారూ! తగుదునమ్మా అంటూ–చిన్నా పెద్దాలేకుండా– ఊఁ! కదలవేం?"

పద్మ కదిలే సూచనలేం కనపడలేదు. వాళ్ళనాన్న కేవలం ధూమానంద స్వామివలె చుట్టకాలుస్తూ, తనలో తనే నవ్వుకుంటున్నాడు.

సుబ్రహ్మణ్యంగారు చిన్న చిన్న కలహాలు పుట్టించడంలో అందెవేసిన చెయ్యి. సమయం చూసి చిట్కా వేశారు చమత్కారంగా. "ఏవమ్మోయ్ వదినా! కుర్రకుంక– దాన్నంటావేం! అదుగో వెనుకనుంచి భాగవతం ఆడించేది మీ ఆయన. అతగాణ్ణి అడుగు నిలేసి.. ఏమయ్యా ధూమానందస్వామీ!... ఏం కథ?.."

"అలా గట్టిగా అడగండి బాబూ..అలా అడగండి..."

ధూమానందస్వామి చిరునవ్వు ప్రచురించాడు.

ఛర్రునలేచి వంటింట్లోకి పోయింది. సూర్యకాంతమ్మగారు బాష్పవేదం పఠిస్తూ. పద్మ కిలకిల నవ్వింది.

సుబ్రహ్మణ్యంగారికి గుర్తుకొచ్చింది.

"ఔనే కాముడూ..మన సుబ్బులు పోలికలేదే పద్మకి?... లేకపోవడమేమిటి! అంతా అదేనాయె! కనుముక్కు తీరూ కట్టూ బొట్టూ మాట తీరూ–ఎటొచ్చీ పేరు తేడా అంతే..!"

కథకి ఉపక్రమించే సూచనలు కనబడ్డాయి సుబ్రహ్మణ్యంగారిలో కామేశ్వరమ్మగారికి.

"పనీపాటూ లేదా ఏమిటి మీకు–రైలు దిగి కథ మొదలెట్టారపుడే. కబుర్లు కట్టిపెట్టి స్నానానికి లేవండి."

కొంటెగా భార్యవేపు చూసి. కన్ను మీటి ఏం జరగనట్టే రామదాసు వైపు తిరిగారు. "ఏమోయ్! ఓ రామదాసుపంతులు! ఓ ధూమానంద స్వాములూ,

ఇంకో చుట్టముక్క పట్టుకునిక్కడకు రావయ్యా—కథ చెప్తానూ, మా సుబ్బలక్ష్మి అచ్చం నీ కూతురులాగే వుంటుంది. చిత్రంగా అయిందిలే దాని పెళ్ళి."

రామదాసుగారు దగ్గిరకు జరిగారు ఉషారుగా. పద్మ బాసెంపెట్టి వేసుకూర్చుంది శ్రద్ధగా.

'నేను లోపలకెడతా—మీరు కథలు చెబుతారో కచేరీలు చేస్తారో కానీయండి బాబూ' అని సాగదీసుకుంటూ లోపలకి సాగిపోయింది కామేశ్వరమ్మగారు.

మంచినీళ్ళ బిందె భుజాన పెట్టుకుని లోపలకొస్తున్న రామదాసుగారి తల్లి, కథ అన్నమాట వినబడగానే నిలబడిపోయింది.

"ఎప్పుడూ రాక బాబూ, అంతా కులాసేనా? ఉత్తరం రాశారు గాదు.. అవునుగానీ పట్టపగలు కథ చెప్పకుంటే పట్టపురాజు చచ్చిపోతాడు. ఒక్క క్షణం ఉండు బాబూ" అంటూనే బిందె దింపి పట్టపు రాజుని భద్రంగా కొంగులో ముడేసుకుని బిందె పట్టుకు చక్కా పోయిందావిడ, "ఓ సూరీడూ ఏం చేస్తున్నావే" అంటూ.

ముసిముసి నవ్వుల్తో చుట్ట అంటించి పడక్కుర్చీలో సాగిల పడ్డారు సుబ్రహ్మణ్యంగారు. ఇటు రామదాసుగారూ, అటు పద్మా కూర్చున్నారు శ్రోతలుగా.

"అసలతగాడు రావడమే ఒక పెద్ద గాలీవానా వంతుగా వచ్చాడు వూళ్ళోకి" అంటూ కథ మొదలుపెట్టారు. అర్ధ నిమీలితనేత్రులై పొగను చూస్తూ.

"వాడెవడూ? ఎక్కడకొచ్చాడూ? ఎందుకొచ్చాడూ? సరిగ్గాచెప్పవయ్యా" అన్నారు రామదాసుగారు.

"అదే. ఏముందీ, నీ కూతురి పెళ్ళి సంగతి కదయ్యా మనం ఇప్పుడు గొడవపడుతున్నదీ? నీ పెళ్ళాం— రాజుకిస్తానంటుందీ. నీ కూతురు టెయిలరు అప్పారావంటుంది. నువ్వు మౌనేన కలహం నాస్తి అంటావు—ప్రయోజకుడని నువ్వనుకున్నవాడు దొరికేవరకూ. ఇంతకీ అంత ప్రయోజకుడైన వాడొస్తే నువిచ్చే దేవిటయ్యా? వాడే ఎగరేసుకు పోతాడు. నీ కూతురు వెంటపడుతుంది. అంచేత నేననేదేమిటంటే ఆ రాజూకాదు ఈ అప్పారావూకాదు. బ్రహ్మనిర్దేశించిన ఇంకో శోభనాద్రి ఊడిపడతాడు. డేగలా ఎగరేసుకు పోతాడు నీ కూతుర్ని."

"ఆ శోభనాద్రి బావుంటాడా?" అంది పద్మ.

"దేవుడు కలగచేసుకుంటే నీ ఆట లేమీ సాగవులే" అన్నాడు సుబ్రహ్మణ్యంగారు.

"ఆ వచ్చినవాడు బావుండకపోతే తన్ని తగలేస్తా వాణ్ణి" అంది పద్మ.

"అదుగో, అదుగో! సరిగ్గా సుబ్బలక్ష్మి అంతే. సుబ్బలక్ష్మి తెలీదయ్యా జగన్నాథం కూతురూ? ఇలాగే వాగేది కుండ పగలకొట్టినట్టు. చితకలాటి మొగుడు దొరికాడు దానికి. బతక నేర్చినవాడులే! బహులౌక్యుడు.. అదే. ఆ కుర్రాడున్నాడే. వాడు రావడం రావడం గాలివాన తంతు వచ్చాడూళ్ళోకి. నేను పొలంపన్లమీద అప్పటికే వారం రోజుల క్రితమే ఆ వూరెళ్ళాను. రెండు నెల్లు బిచాణా వేశానులే. మరి కథ విను చెప్తా..."

(సుబ్రహ్మణ్యేన ఉవాచః ఇతి కథా ప్రారంభః)

"ఆ ఊళ్ళో – ప్రతి తెలుగు వూళ్ళోలాగ – మెడమీద తల ఉన్న ప్రతి ఆసామికీ, వాడికి ఉండుకునే ఆ యొక్క భార్యకీ, కొడుక్కీ, కూతురికీ, ప్రతి

రెండో మనిషి జీవిత చరిత్రా కంఠతాపట్టి వల్లెవేస్తుంటేగానీ తోచదు. అందరూ కవులే! పోతన్నగారిని తల దన్నిన అసామీలే కవిత్వంలో. తెలిసిన కబురికి నగిషీలు చెక్కి రంగులువేసి మరీ ఇస్తారు పక్కవాడికి. నేను రెండునెలలు పూర్తిగా ఓచాణా వేశానక్కడ... అదే–నేను దిగిన వారం రోజుల్లో కామోసూ – రంగధాము డొకడు ఊళ్ళో దిగాడని వదంతులు లేచాయి.

అతిథి మర్యాదలు చేసే నిమిత్తం బయలుదేరాం ఒక తండా. బెహరావారోటేలు పక్కన ఇంట్లో దిగాడన్నారు వార్తాహరులు. పోయి చూదుంకదా, కృష్ణమూర్తిగారి కొడుకు సుందర్రావు. పదేళ్ళ క్రిందటే కృష్ణమూర్తి పోయాడు. అతగాడు ఆస్తి కన్న అప్పులు మిగిల్చి వెళ్ళాడు. అప్పటికి పన్నెండేళ్ళుంటాయి సుందర్రావుకి. పట్నం పోయాడు మేనమామతో...

నోరు మంచిదైతే వూరు మంచిదన్నారు – వాళ్ళనీ వీళ్ళనీ మంచి చేసుకుని చదువూసంధ్యా నేర్చుకుని నాలుగు రాళ్లు తేవడం మొదలుపెట్టాడు పద్దెనిమిదో ఏటికే."

"ప్రయోజకుడైనాడందూ..స్వయం శక్తితో" అన్నారు రామదాసు పంతులుగారు శ్రద్ధగా.

"నాలుగు రాళ్ళంటే ఎన్ని రూపాయలు తాతా..మరి ఇంటికి చాలేవీ?" అంది పద్మ కళ్ళు పెద్దవిచేసి.

సుబ్రహ్మణ్యంగారు సాగిపోయారు.

"ఇల్లేముంది, ఒంటిపక్షి అయిపోయాడుగా..ఇదుగో ఎంత ప్రయోజకుడైనాడయ్యా అంటే. రెండేళ్ళకిందట తిరిగి స్వగ్రామం వచ్చి అప్పులాళ్లెగరేసుకుపోయిన భూములు తిరిగి కొన్నాడయ్యా... అదే! ప్రయోజకత్వం అంటే అదీ!...సరే... మేమంతా వెళ్ళాంగా–పలకరించాం– మళ్ళా ఆ భూముల్ని కౌలుకిచ్చి ఓ నెల ఇక్కడ కాలక్షేపం చేసి పోదామని ఒచ్చాట్ట–పట్నం విసుగేసి. "ఆవకాయ, మాగాయ, మామిడిపండు తినాలని మనసుపోయిందండి. పోతే– నా అన్నవాళ్ళు మీ వంటివారిమధ్య నాలుగు రోజులు గడిపి పోవాలనుంది అవటా అన్నాడు. కుర్రాడు చూస్తే దీపంలా వున్నాడు. ఆ యొక్క వినయం, ఆ వందనం, ఆ మాట ఒద్దిక– ఓహో! ఎన్నికైన కుర్రాడయ్యా!"

"ఏం చదివాడేం" అన్నాడు రామదాసుగారు.

"ఎలా వుంటాడేం" అంది పద్మ.

"చామనచాయ. కాస్త పొడుగనే చెప్పాలి. బక్క పలచగా వుంటాడు. అందాలరాశి అననుగానీ మొగతనంలో వుండే ఆకర్షణ వుంది ఆ కుర్రాడిలో..కళ్ళున్నాయే కళ్ళు. కళ్ళజోడు వెనక నుంచి చూస్తే ఆ కళ్ళలో ఆర్ద్రత గోచరిస్తుంది. కొద్దిగా, విశాలమైన నుదురు. నూగుమీసం. సరే పట్టువాసపు క్రాపుజుత్తు. కళ్ళజోడూ, రిస్టువాచీ, కమామీషూ ఉన్నాయనుకో... ఆడదాని కేడువారాల నగలన్నారు. ఇతగాడు ఏడు వారాలకీ ఏడురెళ్ళు పద్నాలుగు జతల చొప్పున బట్టలు మారుస్తాడు ఓ! పరిమళాలు గుబాళించిపోతాయి. జోళ్ళే ఓ చిన్న దుకాణం ఏర్పాటు ఉన్నాయి. భట్రా జనుకునేవు సుమా నన్ను!... రామదాసూ–ఒక్కటి చెపుతా విను.. నీ వంటి

సంసారి ఆ సమయంలో అతగాడిని చూశాడా – దుబారా దివాణంలా వుంది వ్యవహారం... అనేవాడు."

"పోన్లే ఇప్పుడు వింటున్నానుగా, ఇప్పుడంటూ – శుద్దదుబారా వ్యవహారమే..." అన్నారు రామదాసుగారు చుట్ట ఆర్పేస్తూ.

"నువ్వు అనేదేమిటోయ్! అనాల్సిన వాళ్ళంతా అదివరకే అనేశారు. ఆ కుర్రాణ్ణి స్టానానికి వదిలేసి మేం బయటికొచ్చేసరికి గొల్లుమన్నారు – మా తండావాళ్ళు ఏకగ్రీవంగా.

☆ ☆ ☆

"జోరుగా వుందే వ్యవహారం కుర్రాడిది" అన్నాడు అవధాన్లు కళ్ళుమీటుతూ.

"జోరా జోరున్నరా! కాకపోయినా అదేమిటోయ్ మరీ ఇదిగాపోతే – ఆ ట్రంకు చూశావూ – ఓ పాతిక జతలుండవూ గుడ్డలూ?" అన్నాడు జోగినాధం.

"జోళ్ళోయ్! జోళ్ళు! జోళ్ళమాట మర్చిపోయారు! రామరామ! అదొక బూటా – అదొక కాభోలీ జోడా– అదొక స్లిప్పానా– అదొక స్లిప్పరా –" అంటూ దండకం ప్రారంభించాడు – జోళ్ళ వివరాలు తెలుసుకున్న కోదండరావు.

"అవన్నీ సరేకాని – నాకు చిర్రెత్తిందెక్కడయ్యా అంటే... వంటవాణ్ణి తెచ్చాడయ్యా, వంటవాణ్ణి. ఇదేమైనా సంసారి లక్షణమేనా అని?.. వాళ్ళ నాన్న బతికున్నప్పుడు ఎంతపొదుపూ? ఎంత పొదుపూ?.. గుట్టుగా వెళ్ళబుచ్చాడు కాలం" అన్నాడు జగన్నాధంగారు.

"రామదాసూ! ఇదీ ధోరణి! నాకు జాలేసింది సుమా.. రాక రాక కుర్రవాడు సొంత ఇంటికొస్తే.. పరోక్షాన్నే అనుకో... ఇలా దుయ్యబట్టం నచ్చలేదు నాకు.

"ఏమయ్యా వాడికి వంటరాబోతే నువ్వు వండి పెడతావా?" అన్నాను నేను.

"మహారాజులా! సోలెడు బియ్యం పడేసే నాధుడే లేడా ఇక్కడ?" అన్నాడు జోగినాధం.

అవధాని తగుల్కున్నాడు, "చాల్లేవయ్యా – దక్షతకి నిన్నే చెప్పకోవాలి ముందర. కబుర్లకేం తియ్యగా చెప్పొచ్చావ్–" అంటూ.

జోగినాధం మండిపడ్డాడు. "ఫోవయ్యా! మహానాడు సవ్యంగా మాట్లాడేవూ... పోన్లే... నేను మాటేనా అన్నాను... నువ్వాదీ లేదుగా. ఇంతకీ ఎవడేడ్చినా కుర్రవాడు డబ్బు దుబారా చేసుకుంటే చిప్ప చేతి కొస్తుందనీ, వీడు మన కిష్టమూర్తి కుర్రాడనే నా ఇది."

"అందరి ఇది అంతేనయ్యా! ముందు ముందు పెళ్ళీగట్రా చేసుకుంటే, కొంపాగోడూ కట్టుకేడిస్తే ఈ ఎత్తున తూగగలడా అని" అని అన్నాడు జగన్నాధంగారు.

"ఏవఁయ్యోయ్! జగన్నాధం! పిల్లనిగానీ ఇవ్వాలనుకుంటున్నావేమిటి ఈ కుర్రాడికి? ఎర్రగా బుర్రగా ఉన్నాడని మురిసి బోర్లాపడేవు" అన్నాడు జోగినాధం.

"అబ్బే! జగన్నాధం కూతురు – సుబ్బులయ్యా అది! అది మొగుణ్ణమ్మేస్తుంది తెలుసా!" అన్నా డవధాన్లు."

కామేశ్వరమ్మగారు లోపల్నించి ధనియాల కాఫీ తెచ్చింది. సుబ్రహ్మణ్యంగారు కథ ఆపారు.

"సుబ్బులు పెళ్ళి సంగతా?" అందావిడ.

"చిత్తం..ఏం శలవండి..." అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

"బావుంది; నోరెత్తడం భయంగా ఉంది బాబూ ఈ మనిషి దగ్గర. ఆ కాఫీ తాగి గ్లాసిలా పారేయండి. తొరగా తెముల్తే నీళ్ళు తోలుపుతాను" అన్నదావిడ.

గ్లాసిచ్చి కథ సాగించారు సుబ్రహ్మణ్యంగారు.

"వింటున్నావే పద్మా!... ఆ సుబ్బులుందే – అది నీలాటిదే శుద్ధ మొండిఘటం. లాకాయి లూకాయి మనిషి దానికి పనికిరాడు... ఉభయగోదావరి జిల్లాలలోని మన్మధులందరిలో ఒక్కడు కూడా నచ్చలేదు తెలుసా దానికి? ప్రతివాడికీ ఒంకపెట్టేది – అంత ఆడది అది... సరేనయ్యా రామదాసూ! ఏవిటి చెప్తున్నానూ – ఆ – అదే మా గుంపు నలుగురూ ఆ సుందర్రావుని పట్టుకు ఏకిపారేశారు. సరే మెల్లిగా అందరం బెహరా హోటలుకి చేరాం. బెహరా హోటలు ఇడ్డెన్లకి ప్రసిద్ధి. పెసరట్టుకు పెట్టిందిపేరు – కాఫీ నాటురకం అనుకో. వరండాలోకి చేరాం అయిదుగురం – ఒక్కడికి – ఒక్కడికీ పనీ పాటూ లేదాయె, తిని తిరగటం మినహా. ఉద్యోగం పురుషలక్షణం అన్నారు. కాబట్టే చదరంగం ఆడతారు వాళ్ళు. నాకు రాదనుకో. చూడ్డం బాగా వచ్చు. సరే ఇద్దరు చదరంగానికి కూర్చున్నారు. మిగతా ఇద్దరూ సుందరావు ఆస్తి, ఆదాయవ్యయాల అంచనాలు వెయ్యటం ప్రారంభించారు. నేను ఇడ్డెనలు ఆరగింపు మొదలెట్టాను. ఐదో ఇడ్డెను మొదలెట్టబోతున్నాను. అయ్యరు ఊళ్ళోగోల ఏకరువు పెడుతున్నాడు.

తెల్లని సిలుకు చొక్కా వేసుకొని, గ్లాస్కో పంచ గూడకట్టు కట్టుకుని, చక్కగా తల దువ్వుకుని, సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె పట్టుకుని వచ్చాడు. సుందర్రావు. స్నానం గీనం చేశాడేమో – నవనవలాడి పోతున్నాడు జేగురుపాడు వంకాయలాగా, హోటలుకి పాలేరు కుర్రాడు దారి చూపించాడు కాబోలు, వాడికి వో అణాకాసు ఇచ్చాడయ్యా. అంతే, ఇటు తిరిగి చిరునవ్వుతో పాకలోకి రాబోయినవాడల్లా – కొయ్యబారిపోయాడు. కారణం ఏమిటని అడగవేం?... విను... బురదరోడ్డు మీద పరుగెత్తే పాత లారీకి సడన్ బ్రేకు వేసినప్పుడు సంభవించే శబ్దంతో సరితూగ్గలిగినంత గట్టిగా కేరుతూ ఆశ్చర్యం ప్రకటించారు... అవధానులూ, జోగినాధమూ జమిలిగా. ఆ యొక్క శబ్దం విని జగన్నాధం, ఆ యొక్క దృశ్యం చూసి సుందర్రావూ, అతనిని చూసి నేనూ వరుస క్రమంలో ఆశ్చర్యపోయాం. అరనిమిషం తరువాత జోగినాధం బొయ్యిమన్నాడు – "ఆ పాలేరు వెధవకి నువ్వు అణా ఎందుకిచ్చినట్టయ్యా పంతులూ.." అన్నాడు కనిష్టేపు గొంతుకతో, సుందరం గ్రహించాడు కథ. నవ్వాడు. "అఁ, పనిమల్లే నా కూడా వచ్చి దారి చూపించాడని, ఏం తప్పా?" అన్నాడు అమాయకంగా. పాక అదిరేటట్టు నవ్వారు అందరూ జోగినాధం జోరు హెచ్చింది.

"పాలేరాళ్ళందరికీ ఇలా అణాలు పారేస్తూ – "తప్పా" అని అడుగుతావూ? – తప్పూ ఒప్పూ ఎవడిగ్గావాలయ్యా! రేపు చేతికొచ్చేది–"

"ఛప్ నోరు ముయ్యి" అంటూ జగన్నాథంగారు చేతిలో వున్న శగటుని జోగినాథం నోట్లో పెట్టేశారు... సుందరం మనస్సు చివుక్కుమంది అనుకున్నాను, చినబోయిన అతని మొహం చూసి.

"రావోయ్! రా! ఇదంతా మామూలే... ఫరవాలేదు రా" అన్నాను నేను మహాపాతకాపయినట్టు. జోళ్ళు గుమ్మంలో వదిలి లోపలికి వచ్చి కూర్చున్నాడు సుందరం. మా వాళ్ళకి రెండు కళ్ళు చాలటం లేదు. అతన్ని చూడ్డానికి. అంచేత వాళ్ళని వీళ్ళూ, వీళ్ళని వాళ్ళూ ఎరువుచ్చుకుని మరీ చూసేస్తున్నారు. చొంగలు కారుస్తూ.

అయ్యరు ఇడ్లీ తెచ్చి పెట్టాడు సుందరం ముందు. "వారికి కూడా తెండి" అన్నాడు సుందరం, ఇడ్లీలు ముట్టుకోకుండా. మా చతుష్టయంలో చలనం కలిగింది. చిరునవ్వులు కూడా ఒలికాయి.

"అబ్బే, ఎందుకు సుందరం బాబూ; డబ్బు దండుగా" అన్నాడు జోగినాథం.

"వృధా వ్యయం కాదండోయ్!"

"మేం పుచ్చుకున్నాం."

"అదీకాక మేం ఎలాగా భోంచేస్తాంగా"

"మేం భోంచేస్తామండి – ఎలాగా" అన్నాడు సుందరం మహా వినయంగా, ఆ తరువాత అందరూ కలిసి బ్రహ్మాండంగా నవ్వేరు. నవ్వు పూర్తి అయ్యేసరికి అయ్యరు ఇడ్లీలు వడ్డించడం, అందరూ ప్రోక్షించి మొదటిముక్క నములడం జరిగిపోయింది.

"పెసరట్టు కాల్చనా బాబూ!" అన్నాడు అయ్యరు బేరం తగిలిన ఉషారుతో.

"నాకు ఉల్లిపాయ వద్దు. కాని అల్లం, పచ్చిమిరపా బాగా దట్టించండి" అన్నాడు అవధాని తక్షణం.

"నాకు మిరప వద్దయ్యోయ్? కారం పడదు. ఉల్లిపాయ బాగా తగిలించు."

"చూడయ్యరూ! నాకు పెసరట్టొద్దుగానీ, మళ్ళా ఇడ్లీయే పట్రా దాని బదులు..."

"అయ్యా! రామదాసు పంతులుగారూ! ఇత్యాదయః" అంటూ పకపక నవ్వడం ప్రారంభించారు సుబ్రహ్మణ్యంగారు.

పద్మ మాత్రం రఘీమని నిర్మొహమాటంగా ప్రశ్నవేసింది. "మరీ మీరు నవ్వేస్తున్నారుగాదా – ఆ సుందరం అనేవాడు రావడానికి ముందు మీ రిడ్లీలు తినేస్తూ వాళ్ళకిప్పించలేదేం?" అంది.

రామదాసుగారు కళ్ళెర్ర చేసి చూశారు పద్మవైపు. సుబ్రహ్మణ్యంగారు నవ్వుతూ జవాబిచ్చాడు: "బాగా అడిగావమ్మా. చెబుతా విను. నే నావూరొచ్చిన రోజునే అయ్యరు దగ్గర ఖాతా పెట్టడం – వీళ్ళని మేపడం జరిగింది. ఆ తరువాత మాటల్లో చెప్పేశాను. "మొహమాటం క్షేమన్నాస్తిః సుబ్రహ్మణ్యేన సన్నిధౌ" అంటూ అని. "ఏమయ్యోయ్! నేను వూరికే బతిమాలలేనూ, మీకు కావల్సిందల్లా నిస్సందేహంగా పుచ్చుకోండి" అన్నాను. నాల్రోజులు కామోసు మామూలుగానే పుచ్చుకున్నారు."

"ఏమిటో! మీచేత ఇలా బోలెడు వ్యయం పెట్టించడం మాకేం బావులేదు" అన్నారొకరోజుని బ్రేవున తేనుస్తూ.

"దానికేముందయ్యా! నాకు లేని రోజున మీరు పెడుదురుగాని. అంటే ఇపుడు మీకు లేదనికాదు... పోనీ మీ కంత "మరీ" యిదిగా వుంటే రేపొద్దుటి నించీ మీరు

నాకు పెట్టండి! మనలో మనకేమిటయ్యా! అన్నదమ్ములంటివాళ్ళం –" అన్నాను. మర్నాడు వాళ్ళు రాలేదు. తరవాత వచ్చినా పుచ్చుకోడం మానేశారు. రేపొద్దున్న నిజంగానే నాకు పెట్టాల్సొస్తుందేమోనని వాళ్ళ భయం. అంతే. నేను మళ్ళా బతిమాల్లేదు సుమీ.."

"అయ్యో సుబ్రహ్మణ్యంగారు! మీరు మరోలా అనుకోవద్దు, కుర్రదేదో అంది" అని సద్దెయ్యబోయారు రామదాసుగారు.

"బావుందయ్యోయ్! అంటే మాత్రం తప్పేముంది? మనిద్దరి కంటే నయం. ఉన్నమాటంది. కానీలే కథ విను – సరే కాఫీలయ్యాక చదరంగం మీద సరదాపడ్డాడు సుందరం. ఆట మీద కబుర్లలో మా వాళ్ళు విషయం కనుక్కున్నారు. సుందరం బియ్యే దాకా చదువుకున్నాట్ట. ఏదో చిన్న వర్తకం పెట్టి బాగుపడ్డాడు. కష్టపడి పైకొచ్చాడు కాబట్టి యిప్పుడు వీలైనంత సుఖపడ్డానికి ప్రయత్నిస్తున్నాడేమో ననిపించింది నాకు. "నా" అన్నవాళ్ళు లేరు. ఏదో ఉన్న వూరుచూసి, సొంత కొంపలో నాలుగురోజులుండి పోదామని వచ్చాడట. అః! ఇదీ కథ. ఈ కథ చెప్పేలోగా అతని సిగరెట్టుడబ్బాలో ఇరవై సిగరెట్లు ఉఫ్ మన్నాయి. "మొత్తంమీద ఎలాగేనా గోల్డుఫ్లేకు బహు పరిమళమయింది సుమండీ" అన్నాడు అవధాన్లు డబ్బాలోంచి మరొకటితీసి నోట్లోనూ మరో రెండు జేబులోనూ పెట్టుకుంటూ, సాయంత్రానికి చెరువుగట్టునా, రచ్చబండ దగ్గిరా, కరణంగారి అరుగు మీదా ఈ రంగధాముడి విషయమై అత్యున్నత స్థాయిలో వాగ్వివాదాలు జరిగాయి. జోగినాథం, జగన్నాథం, అవధాన్లు, కోదండంతో కూడుకున్న చతుష్టయం కూడా ఈ చర్చల్లో పాల్గొంది. తీవ్రంగా నిరసించారు సుందరం పోకళ్ళని. ఇలా తమందరికీ యిడ్లీలూ కాఫీలూ యిప్పించడం, తమచేత సిగరెట్లు తగలేయించడం ప్రయోజకత్వం కాదన్నారు. బాగుపడి పైకొచ్చే లక్షణం సుతరామూ కాదన్నారు.

తమాషా ఏమిటంటే మర్నాడు పొద్దున్న నేను బెహరా హోటలు దగ్గర కెళ్ళేసరికి జోగినాథం, సుందరాన్ని – యింటికెళ్లి పిల్చుకొచ్చాడు, స్వయంగా. అందరం చేరాం. తిరిగి ఇడ్లీ వ్యవహారం – కథా కమామీషూ ప్రారంభం అయింది. సరే ఆ పైన చదరంగం. రెండాటల తరువాత డబ్బుల మీద ఆట ప్రారంభం అయింది. చతుష్టయం నలుగురూ వరసగా ఆడారు సుందరంతో, ఆటకి పావలా చొప్పున. కాఫీలకు రూపాయి. పందేలకి రూపాయి ధారపోసుకున్న సుందరం, నవ్వుతూనే యింటికెళ్లడం చూసి చతుష్టయానికి చిర్రెత్తుకొచ్చింది.

"చూశావోయ్, వాడికి ఎంత నిర్లక్ష్యం! ఎంత నిర్లక్ష్యం!!" అన్నాడు అవధాని.

"నిర్లక్ష్యం అంటా వేవిటోయ్! పొగరను – పొగరు!"

"ఇంకా మెల్లిగా అంటా వేమిటి?"

అయిన కాడికి డబ్బుగెల్చి వాణ్ణేలా తిట్టుకున్నారు. నాకు వళ్ళు మండింది సుమీ!

"మెల్లిగా అనకపోతే గట్టిగా అంటాడయ్యా? ఒకవేళ వింటే ఆ కుర్రాడు రేపు రాడేమో!" అన్నాను. ఛర్రుమని లేచాడు జగన్నాథం – "మేం అన్నదాంట్లో తప్పేముందండీ? తన సత్తా ఎదురుసత్తా తెలిపి ఆడద్దూ? డబ్బులున్నాయని ఊహూఁ ఎగబడ్డమే!" అని.

జోగినాథం అందుకున్నాడు "చూశాను చూశాను - మూడుపావలాలు పోయాకయినా కళ్ళు తెరుస్తాడేమో, ఆట మానేస్తాడేమోనని. అబ్బే!"

"అవి పావలాలనుకున్నాడో చింతపిక్కలనుకున్నాడో" అన్నాడవధాని. ఏమనుకుం టేనేం, మర్నాడు ఇడ్లీలకీ కాఫీలకీ అంతా తయారయ్యారు. పైగా జోగినాథం బావమరదీ, అవధాని మేనల్లుడూ కూడా వచ్చారు.

"అబ్బే! వాళ్ళకెందుకండీ - చద్దివణ్ణం తిన్నారు" అన్నారు యుగళంగా. సుందరం నవ్వాడు—

"వెర్రివెధవ —" అనుకున్నారు పెద్దలు.

మళ్ళా చదరంగం ఆడారు. సిగరెట్లు విరివిగా వెలిగాయి. జోగినాథం డక్కను పెట్టి పట్లీకున పెట్టేశాడు - ఎవడూ ముట్టుకోడనే ధీమాతో. సుందరం చిత్తుగా ఓడిపోయాడు నాలుగుపావలాలూ.

ఊరు గగ్గోలెత్తిపోతోంది - రోజు అలా రెండు రూపాయలు తగలవేసే రంగధాముణ్ణి గురించి. ఇంతేకాదు సుందరం గురించి, ఘోరాతి ఘోరమైన పుకార్లు ప్రచారంలోకొచ్చాయి - ముష్టివాళ్ళకి అణా బేడా యిచ్చేయ్యడం, యాయవారం అయన్ని సుష్టుగా మేపి, పైగా యింటికి పప్పులూ ఉప్పులూ పంపడం, పాలేరాళ్ళకీ బడిపంతుళ్ళకీ చొక్కాలూ పంచెలూ ఇచ్చెయ్యడం వంటివి.

"నాకు ఆవకాయ చాలా యిష్టం" అన్నాడు సుందరం ఓనాడు. జగన్నాథంగారు ముందు కురికి, చవకలో మాగాయి, ఆవకాయి, మెంతికాయ, నిమ్మకాయ వారి ఆడవాళ్లచేత పెట్టించి యిచ్చేశారు. ఈ హడావుడిలో, రాకపోకలలో, సుందరం సుబ్బలక్ష్మిని చూడ్డం, పలకరించడం జరిగిపోయింది.

గొల్లుమంది యావత్ప్రజానీకం ఈ వార్త విని. జగన్నాథంగారి సుబ్బులు సుందరాన్ని పెళ్లాడుతుందని వార్తలు బయలుదేరాయి. నీలాటి రేవుదగ్గరా, నూతి చప్టాల చుట్టూ, సోమయాజులుగారి చావిట్లో బహిరంగ సభలు జరిగాయి. పడకగదుల్లో దంపతులు కష్టసుఖాల బదులు సుబ్బలక్ష్మీసుందరీయం ప్రబంధపఠనం చేసుకునేవారు, సుబ్బులుని తమ తమ కొడుకులకి చేసుకుందామని ఆశలు పెట్టుకున్నవాళ్ళు మండిపడ్డారు. "ఈ పెళ్ళెలా జరుగుతుందో చూస్తాంగా" అన్నారు పెద్దలు.

"కులంగోత్రం సరిపోతే మాత్రం, మనవాడికన్న వాడేం పొడిచేవాడంట?" అన్నారు.

"డబ్బు స్వామీ డబ్బు; ధనమూలమిదం జగత్" అన్నారు.

"ఆఁ! ఏం డబ్బులెద్దూ! వెధవడబ్బు, డబ్బుటయ్యా శాశ్వతం! కుక్కని తంతే రాల్తుంది డబ్బు" అన్నాడు ఉమ్మాయి.

"అంతే అంతే! మాట శాశ్వతం. హరిశ్చంద్రుడి కంత పేరెందుకొచ్చిందీ? మాట-డబ్బు కూడా పట్టికెళ్ళాడా ఏం?" అన్నాడు తుమ్మాయి.

"తగ్గవోయ్! ఆ మాటకొస్తే హరిశ్చంద్రుడు పేరుమాత్రం మూటకట్టుకు పోయాడా? డబ్బు ఇక్కడే వుండిపోయింది. పేరూ ఇక్కడే వుండిపోయింది" అన్నాడు రణపెంకి జగ్గాయ్.

"రాలుగాయి వెధవా! ఎంత మాటన్నావ్!" అన్నారు ఉమ్మాయీ, తుమ్మాయీ. మర్నాడు జగ్గాయి పట్నంలో పెద్దాసుపత్రి కెళ్ళాడు - విన్నావా రామదాసూ!

ఇంక ఇటు చూస్తే పెంకిభడవా, సత్యభామా, దొరసానీ, గయ్యాళి గంపా అనే నామాంతరాలు గల సుబ్బలక్ష్మి– అదేం చిత్రమోగానీ – సుందరాన్ని చూస్తే సిగ్గుపడ్డం మొదలెట్టింది! ఆ మధ్య బావున్నవాళ్ళే – ఇద్దరు ముగ్గురు హృదయాలూ అవీ సమర్పించబోతే నడికుప్పెక్కి ఆడి పోయింది. "అప్రయోజక వెధవా" అని మొదలుపెట్టి యిటు మూడు తరాలూ అటు మూడు తరాలూ ఆడిపోసింది. సుబ్బుల్ని చేస్కోడానికి ప్రద్యుమ్నుడో వాడిబాబు అర్జునుడో లేక మెత్తగా తన్ని నెగ్గకు రాగల ప్రయోజకుడు ఏ మారీచుడో శిశుపాలుడో దిగి రావాలి అనుకునే వారంతా. వాళ్ళమ్మా నాన్నా బోల్డు బెంగపడేవారు. అంతేగాదయ్యా మరీ! పెళ్ళీడు పిల్లా! గుండెల్లో కుంపటీ అన్నారు. ఇటు దానికి చూస్తే ఉభయగోదావరి జిల్లాల్లోని ఆంధ్ర వీర యువకుల్లో ఒక్కడూ నచ్చడాయె. అα! అదుగో అలాటి సుబ్బులు కాస్తా పట్టం నుంచి ఊడిపడ్డ సుందర్రావుని చూసి సిగ్గుపడ్డం మొదలెట్టిందంటే చిత్రంగాదూ! అతగాడిలో ఏం ప్రయోజకత్వం కనబడిందో ఆవిడకి! పైగా అక్కడితో అక్కుండా వాళ్ళింట్లో వంకాయకూరో, మామిడికాయ పప్పో ఏదో వోటేచేసి రోజూ సుందరం ఇంట్లో ఇచ్చొచ్చేది.

రానురాను జనం ఈ విషయంలో రెండు పార్టీలయిపోయారు. అయితేగియితే ఈ వివాహం అమోదించే వాళ్ళొకపార్టీ, కూడదనే వాళ్ళు రెండోపార్టీ – ఏదీ ఓ చుట్టందుకో రామదాసూ – చేబ్రోలు పొగాకా ఏమిటి?"

చుట్టంటించి ఒక్క నిమిషం ఆగి ద్విగుణీకృతోత్సాహంతో కథ సాగించారు సుబ్రహ్మణ్యంగారు.

'చివరికి పరిస్థితులెలా పరిణమించాయంటే – ఆ పార్టీల వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు తన్నుకునేందుకు సిద్ధమయారు రహస్యంగా. గూఢచారిణులు కూడా బయల్దేరారు. కామాక్షమ్మ సుబ్బులూ, సుందరం మాట్లాడుకోడం చాలామాట్లు వింది. ఆవిడని చాలా నిరుత్సాహపరచాయవి. ఆవకాయ – జగన్నాథం నిద్రా, లేసులల్లిక, అనపకాయ హల్వాగురించి వాళ్లు మాట్లాడుకునేవారు – పెదవి విరిచిందావిడ నీలాటి రేవులో.'

హఠాత్తుగా పిడుగువంటి వార్త వచ్చిపడింది. దాంతో జనం నిద్రాహారాలు వర్జించారు. అందరికీ మతులు పోయాయి. దీన్ని గురించిన కబుర్లతోటే ఏకాహాలూ సప్తాహాలూ జరిగాయి. కొట్టుకోడానికి సిద్ధమైన రెండు పార్టీలవాళ్ళూ ఈ దెబ్బతోటే ఏకాభిప్రాయానికొచ్చేసి స్నేహితులైపోయారు. ఎవరో కవి అన్నట్టూ. "వెయ్యేల?" – ఆ వూళ్ళో పిల్లామేకా, తాతా అవ్వా, రాయీ రప్పా కూడా ఏకమై. జాతి మత, ధనిక దరిద్ర. స్త్రీ పురుష సత్ అసత్ విచక్షణ ఎంతమాత్రం లేకుండా ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేశారు.

"సుందరం వెర్రివెధవా, నిష్ప్రయోజకుడూ కాబట్టి చిప్పచేతికొచ్చి తీర్తుంది! అంచేత సుబ్బుల్నివాడికివ్వకూడదూ" అని. రామదాసూ, ఇంతకూ అంతటి ఘోరమైన ఆ వార్త ఏమిటని అడగవేం? చెప్తావిను ఆ వార్త యిది: "సుందరం తుమ్మాయికి ముప్పావలా అప్పిచ్చాడు." నవ్వకు నవ్వకు తుమ్మాయంటే ఎవడో నీకేం తెలుసు. వూళ్ళో వాళ్ళ నడుగు చెబుతారు.

వార్త వినగానే, "అవ్వ హవ్వ" అన్నారంతా, సుందరంమీద జాలిపడ్డారు. అతన్ని

అసహ్యించుకున్నారు. వేళాకోళం చేశారు. జోగినాథం, అవధానీ, కోదండం, సుబ్బలక్ష్మి తండ్రి జగన్నాధం తాండవమాడిపోయారు. వార్త వినగానే "మా పరువు మంట కలిసిం" దన్నారు. జగన్నాథం హుటాహుటిని సుందరం యింటికెళ్ళి మండిపడ్డాడతని మీద.

"ఏమండీ అంత తప్పా ఇవ్వడం!" అన్నాడు సుందరం అమాయకంగా.

"తప్పా! తప్పన్నరా! రామ రామ! చూస్తో చూస్తో వాడికెలా యిచ్చావయ్యా? తిరిగి ఇస్తాడనే?" అన్నాడు వెనకనే వచ్చిన జోగినాథం.

"ఎంతో కష్టంలో వుండి అడిగాడు – ఎందుకివ్వడేం?"

"ఆ మాత్రం మాకు తెలీదయ్యా? ఈ వూళ్ళో ఒక్క పిట్ట – ఒక్క గింజ, వాడికి అప్పివ్వద్దు తెలుసా? తుమ్మాయి అప్పులెగేస్తాడనే విషయం ఈ ఊరి పాపాయిలకూ్కడా తెలుసు."

"ఎవ్వరూ అప్పివ్వలేదుకదా: వాడు తిరిగి తీర్చడని మీ కెలా తెలుసు?" అంటూ అడ్డు ప్రశ్న వేశాడు సుందరం.

"తిమ్మన్న పేరు వేరే చెప్పాలా ఏమిటయ్యా! మొహం చూస్తే తెలీదూ! హవ్వ వాడు నీకు అప్పు తీరుస్తాడూ! వేశాడులే టోపీ. తిలోదకాలిచ్చుకో సద్బ్రాహ్మడిని పిలిచి."

సుందరానికి పౌరుషం రేకెత్తుకొచ్చింది.

"సరేలెండి. అందరూ ఇవ్వకపోయినా నేను యిచ్చానన్న విశ్వాసంతో నాది నా కిచ్చేస్తాడు" అన్నాడు.

"ఆఁ! ఇస్తాడిస్తాడు" అని వెక్కిరించాడు కోదండం.

"సుందర్రావు పంతులూ! వాడు నీకు తిరిగి ఆ ముప్పావలా అప్పుతీర్చేస్తే నా కుడి చెవి కోసిస్తా" అన్నాడు జోగినాథం.

"నీ కుడి చెవి నాకెందుకు" అన్నాడు సుందరం.

ఈలోగా అవధాని వెక్కిరించాడు; "ఒస్సీ! చెవి కోసిచ్చేవాడివి నువ్వేనయ్యా! చేవుంటే డబ్బు కాయి పందెం.... ఏమయ్యోయ్! సుందరం! – కబుర్లు కాదు. నువ్వు గాని వాడి దగ్గర ఆ అప్పు వసూలు చేస్తే నేను రెండు రూపాయలు పందెం ఓడిపోతా. ఇందుకు సాక్షి సుబ్రహ్మణ్యంగారే." అంటూనే రెండు రూపాయలు నా చేతిలో పెట్టాడు. సుందరం పక పక నవ్వి "సరే కాసీండి" అన్నాడు.

ఈమాటు జోగినాథం బెదిరించాడు. "ఓడిపోతావు సుందరం. మానుకో నీ పందెం, లేకపోతే నేనుకూడా కాస్తా" అంటూ.

"కాయండి. ధైర్యమున్న వాళ్ళంతా కాయండి. చేతనైనంత కాయండి" అన్నాడు సుందరం.

"అప్పు వసూలు చెయ్యడాని కాఖరురోజు పౌర్ణమయ్యోయ్! ఇవాళ సప్తమి. జ్ఞాపకముంచుకో." అంటూ జోగినాథం మూడు రూపాయలూ, కోదండం మూడు రూపాయలూ కాశారు.

"చూడు సుందరం! నువ్వు కుర్రాడివి. ఏదో నిన్ను వెర్రివాణ్ణి చేసి డబ్బు దోచుకోడం నాకు సుతరామూ ఇష్టంలేదు. కానీ నీకు నీతి పాఠం చెప్పడానికి నేను కూడా కాస్తున్నా. అయిదు రూపాయలు. సుబ్రహ్మణ్యంగారూ!– ఇంటి కెళ్ళి డబ్బు

తెచ్చిస్తా" అన్నాడు జగన్నాధం. ఈలోగా కబురందుకున్న కరణంగారు రెండ్రూ, మునసబుగారు మూడ్రూ, జగ్గయ్య పావలా తెచ్చారు పందేనికి."

చుట్ట కొంచెం ఘాటుగా పీల్చి అవతల పారేశారు సుబ్రహ్మణ్యంగారు. గొంతు సరిచేసుకున్నారు.

"రామదాసూ! చేసిన పాపం చెబితే పోతుందంటారు. అణా డబ్బులకి గొల్లుమనే పల్లెటూర్లో రూపాయిలకి రూపాయలు ఇంతమంది పందెం కాసేస్తూంటే నాకూ మనసు పుట్టింది సుమా! "నేనో రూపాయి కాశాను సుందరం" అన్నా జంకుతూ. పందాలు మొత్తం పదహారుంబావలా చేరింది నా దగ్గరికి. సుందరం వెంటనే లోపలికెళ్ళి, పదహారుంబావలా తెచ్చి, నా దగ్గర ముడుపుంచాడు – అనక పేచీలు రాకుండా.

ఊళ్ళో ఊసుపోని వాళ్ళందరికీ ఉషారు హెచ్చింది. తుమ్మాయి బహు జాగ్రత్తగా తిరుగుతున్నాడు సుందరానికి మొహం చాటేస్తూ. సుందరం మాత్రం నిర్విచారంగా పూలరంగడల్లే నిశ్చలంగా తిరిగేవాడు. మామూలుగానే బెహరా హోటలు, చదరంగం తతంగం సాగిపోతోంది. అంతకన్న మామూలుగా సుబ్బులొస్తూ పోతూ వుంది సుందరం ఇంటికి.

అంతా బావుందిగానీ, ఈ చివరిది ఎవరికీ నచ్చలేదు. ఏది – ఈ సుబ్బులుకి సుందరంమీద మోజు. "ఇదంతా అసలు జగన్నాధం దగ్గరుండి సాగిస్తున్నాడు." అన్నారు పెద్దలు. ఓనాటి సాయంత్రం కరణంగారి అరుగుమీద పేకాట సందర్భంలో జగన్నాధాన్ని నిలేసి అడిగేశారంతా. "ఏమయ్యోయ్. నీ కూతుర్ని ఆ పూలరంగడికిస్తావనుకుంటున్నారు ఊళ్ళో. నిజమా ఏమిటి కొంపతీసి!" అని.

తారాజువ్వలా లేచాడు జగన్నాధం:– "ఎవడన్నాడయ్యా! అసలు అన్నదెవడూ అంట. వాడిది గుండా చెరువా? ఏమయ్యోయ్ ఒకటే లెక్క నా కూతుర్ని పాలేరాడికిస్తే ఇంకా సుఖపడ్తుంది. చూసి చూసి ఈ మిడి మిడి రంగడికా ఇచ్చేది నేను! నిష్ప్రయోజకుడు. కానీ దాచుకోడం చాతకాదూ! పైగా ఆట రాకపోయినా పెద్దాళ్ళతో చదరంగం ఆడి పందేలు కూడానూ! పోన్లేవయ్యా. అవన్నీ వదిలెయ్. ఆ తుమ్మాయిని – ఆ దగుల్బాజీ తుమ్మాయిని నమ్మి ముప్పావలా అప్పిచ్చిన వెంగళాయిని నా అల్లుడుగా చేసుకుంటానూ! చూసి చూసి! – పావలా! అర్ధా! ముప్పావలా ఆయె!" అంటూ చిన్న కథాకళీ నృత్యం చేశాడు.

అంతవరకూ నిరాహారంతో పరితపిస్తున్న ఆ వూరి ప్రజలు పథ్యం పుచ్చుకోడం ప్రారంభించారు ఆ రోజునుంచి – సుబ్బలక్ష్మిని సుందరానికివ్వడం కల్ల అనే ధీమాతో, ఇంక తుమ్మాయి కధకూడా తేలిపోతే నిద్రకూడా పోవచ్చు. ఆ యొక్క వాన చినుక్కోసం నోరు తెరుచుక్కూచున్న ముత్తెపు చిప్పలాగా, గడువురోజు పౌర్ణమి కోసం జనం ఎదురుచూడసాగేరు.

"వేయికళ్ళతో కనిపెట్టి చూసేవారు తుమ్మాయి రాకపోకల్ని. సుందరం తుమ్మాయి ఇంటికెళ్ళనే వెళ్ళడు. ఓరోజు సుందరం షికారుకు బయల్దేరాడు. ఓ సందుమలుపు తిరిగేసరికి ఆ సందులోనే ఒక ఇంట్లో నుంచి బైటికొస్తున్నాడు తుమ్మాయి. సుందరాన్ని అల్లంత దూరంలో చూడగానే పులిని చూసిన లేడల్లే ఛంగున పరిగెత్తాడు. సుందరం తరిమాడు. ఇద్దరూ కలిసి బోల్డు సందులంబడ

పరిగెత్తారు. శివాలయం దగ్గర కొచ్చేసరికి సుందరం అలసిపోయి ఇంటి దారి పట్టాడు తరమడం మానేసి.

కళ్ళు మూసుకు పరుగెత్తుతున్న తుమ్మాయి మాత్రం శివాలయం చుట్టివచ్చి అనుకోకుండా, హఠాత్తుగా ఆ సందుమొనలో సుందరాన్ని ఢీకొన్నాడు. ఇంక పరుగెత్తడానికి వీల్లేదాయె. అడా మొగా అరుగులమీద కెక్కిపోయి చూస్తున్నారు. దొమ్మరిసాని గారడీ చూసినట్టు. జగన్నాథంగారు శివాలయం గోడమీద కూచుని గుడ్లు మిటకరిస్తున్నారు.

"ఏవండోయ్ సుందరంగారు! నమస్కారం! ఎక్కడికి బయల్దేరారు? షికారు కాబోలు – హెహ్హె......!" అన్నాడు తుమ్మాయి– అప్పుడే సుందరాన్ని చూసినట్టు.

"నమస్తే" అన్నాడు సుందరం నిశ్చలంగా.

"కులాసేనా?" అన్నాడు తుమ్మాయి యథాలాపంగా.

"ఆ! కులాసాయే. మీరు కులాసాయేనా?"

ఏడుపుమొహం పెట్టాడు తుమ్మాయి. "ఏవిటోనండి ఏం కులాసో! వంట్లో చూస్తే బాగులేదు. కీళ్ళవాతం! అడుగుతీసి అడుగెయ్యలేకపోతున్నా! ఇంటో చూస్తే ఆవిడకి జ్వరం. పిల్లలకి కురుపులు. బియ్యపు గింజలేదు. అయ్యా! ఏం చెప్పమన్నారూ! ఇంక అటు చూస్తే మామిడితోట అపుడే పండు ముఖం పట్టింది. దొంగ భయం. పక్షి భయం. అయ్యా! ఆ పండు మిగల ముగ్గిలోగా దింపాలి– అమ్మాలి. ఇంట్లో పొయ్యిమీద కుండ ఎక్కాలి."

"అయ్యో పాపం!" అన్నాడు సుందరం.

"ఎంత మాటెంతమాట! హిహిహ్హి – సుందరం బాబూ వయసుకి చిన్నయినా ఘనమైన మనసు బాబూ నీది. ఎంత దయ! ఎంత దయా! అచ్చం ముమ్మూర్తులా మీ తండ్రి క్రిష్ణమూర్తిగారిని పోలావు. చచ్చి స్వర్గాన్నున్నాడు మహరాజు, ఏవిటో!.... అఁ! అన్నట్లు చూడుబాబూ నీకు గుర్తుందో లేదోగాని నాకుంది సుమీ. అహర్నిశలూ నిద్రపోను. నేనూ మా ఆవిడా వ్యూహా ఒకటే ఇదై పోతూవుంటాం మీ ఇది తల్చుకుని. అఁ! చూడుబాబూ! తెలుసునా సంగతి? మరేం లేదు! కూలీల్ని మాట్లాడాను, ఒక్క మూడురూపాయలప్పిస్తివా– అది వాళ్ళ ఎదాన్న పారేసి పండు దింపించేసేస్తే పట్నం పంపిస్తా అమ్మకానికి. చేతికొచ్చిన కూడు చెడిపోతూంటే మనసొప్పుతుందా బాబూ మరీ? మరోకటి పట్నం నుంచి డబ్బొచ్చేదాకా నువ్వాగక్కర్లేదు. బాగా పండబారినపళ్ళు ఒక వంద ఏరి, ఈ ఊళ్ళోనే నీ కళ్లెదురుగుండా అమ్మిపారేస్తా. నీ డబ్బు నీకు పువ్వుల్లో ముడిచి యిచ్చేస్తా. బాబ్బాబు ఈ సారికాదుకో! నా తండ్రి నా తండ్రి" అంటూ ప్రాధేయపడ్డాడు తుమ్మాయి.

ఒక్కక్షణం ఆలోచించాడు సుందరం. ఇటు చూస్తే దీనావస్థలో ఉన్న తుమ్మాయి. అటు చూస్తే తనవంక ఆత్రుతగా – తన జవాబుకోసం ఎదురు చూస్తున్న అశేష ప్రజానీకం... బుద్ధుడు గుర్తుకొచ్చాడు. హామ్లెట్ కనపడ్డాడు.... అటా ఇటా? ఇటా అటా...,

"గబుక్కున జేబులో చెయ్యి పెట్టి మూడు రూపాయలూ తీసి తుమ్మాయి చేతిలో పెట్టేశాడు. చూస్తున్న జనానికి "హా" అనడానికి కూడా ఓపిక లేకపోయింది."

తుమ్మాయి అందరికన్నా ఎక్కువ ఆశ్చర్యపోయాడు. తక్షణం స్తుతివాక్యాలు

ప్రారంభించాడు. "సరే మీరు ఇంక వెళ్ళండి. పళ్ళు దింపగానే నాకు డబ్బు మాత్రం ఇచ్చెయ్యండి" అంటూ చక్కా పోయాడు సుందరం. ఆ రోజు ఆ వూరి చరిత్రలో చెప్పుకోదగిన రోజు. జనం విరగబడి నవ్వారు. విమర్శించారు. వెయ్యిందాల తిట్టుకున్నారు.... ఏదో సామెత చెబుతారు చూడూ—ముప్పావలా కోడిపిల్లకి దిష్టి తగిలిందని మూడున్నర ధరచేసే పంది పిల్లని దిగదుడిచాడట ఎవడో, సుందరాన్ని శుద్ధ వెఱ్ఱివెంగళాయిగా జమ కట్టేశారు జనం. ఇది జరిగింది నవమినాడు.

దశమి ఉదయాన చదరంగం బల్ల దగ్గిర తమాషా జరిగింది. అంతవరకూ రోజూ ఓడిపోతున్న సుందరం ఆవేళ జగన్నాథం దగ్గిర పావలా గెలిచాడు. మళ్ళీ ఆడి ఇంకో పావలా ఓడిపోయాడు జగన్నాథం. తరువాత మిగతా ముగ్గురూ తలో మూడేసి ఆటలూ ఆడి మూడేసి పావలాలు ఓడిపోయారు. సుందరం చదరంగంలో తమని గెలవడం ఏమిటని బోలెడు కోప్పడి పోయారు వాళ్ళు. పట్టుదలకి మధ్యాహ్నం వేశారు ఆట.

సాయంత్రం చీకటిపడేసరికి నాలుగు రూపాయలు గెలుచుకున్నాడు సుందరం.

జగన్నాథాది చతుష్టయం ధోరణి మారింది. వాళ్ళ చిరునవ్వు హరించిపోయింది. ఊళ్ళో కూడా సద్దుమణిగింది. జనం చిరాగ్గా ఉన్నారు.

ఏకాదశినాటి ఉదయం మధ్యాహ్నం కూడా ఒక్క ఆట పోకుండా నలుగురినీ గెలిచాడు సుందరం. సుందరం ఆవాళ సంపాయించింది ఏడున్నర

జోగినాథానికి వేడెక్కిందిం; అవధానికి ఏడుపొచ్చింది. జగన్నాథం జోరుతగ్గింది. కోదండం కంగారుపడ్డాడు.

ద్విగుణీకృతమైన పట్టుదలతో ద్వాదశినాడు కూర్చున్నారు ఆటకి. ఊరి పెద్దలంతా ప్రేక్షకులుగా వచ్చారు. తాగిన కోతులల్లే తందనాలాడిపోతున్నా చతుష్టయాన్ని టకటకలాడించి పారేశాడు సుందరం. ఇట్టే ఆట కట్టేవాడు. సాయంత్రానికి మరో ఎనిమిది రూపాయలు ఒడేసి పుచ్చుకున్నాడు.

జనానికి ఏం చెయ్యాలో తోచలేదు. చూసి చూసి చప్పట్లు కొట్టడానికి మనసు రాలే దెవ్వరికీ.

"అసలీ సుందరం ఎవడు?"

"ఇంత ఆట ఎక్కడిదయ్యా వీడికి!"

గత ఎనిమిది రోజులుగా, ఆట పేరుచెప్పి రూపాయీ. కాఫీ సిగరెట్లకి ఇంకో రూపాయీ— మొత్తం రోజుకి రెండు రూపాయల చొప్పున. ఎనిమిది రెళ్ల పదహారు రూపాయలు వాడికి నష్టం అయిందనుకో. అయితే మొన్న, నిన్న, ఇవాళ కలిసి వాడు మన దగ్గిర గెలిచిన మొత్తం పందొమ్మిదిన్నరా. వీడిదుంపదెగా! నిముషాలమీద ఆటకట్టి పారేస్తుంటేనే! మతిపోగొట్టేస్తున్నాడాయె!

"ఉద్దండుడిలాగే ఉన్నాడే చూస్తే!" అన్నాడు జోగినాథం.

"ఎలాగేనా గడుసు బుఱ్ఱే సుమా!...." అంటూ సాగదీసుకున్నాడు కోదండం.

"నాకు మతిపోయింది" అని బాహాటంగా ప్రకటించాడు అవధాని.

అదేముక్క అందరూ విడివిడిగా అనుకున్నారు.

త్రయోదశి తెల్లవారింది. కాలవకి నీళ్ళకెళ్ళిన వంటవాడు, తుమ్మాయి మామిడి పళ్ళు బళ్ళకెత్తించి పట్టం పంపించబోతున్నాడని చెప్పాడు– పరుగునవచ్చి సుందరంతో
పొద్దున్నే పనికట్టుకుని పదిమందినీ పిలిచి వచ్చింది సుబ్బలక్ష్మి తల్లి– "మా యింటికి పసుపుకుంకానికి రండి" అని.

నాకు అంతుచిక్కలేదు. ఆశ్చర్యంవేసి – జగన్నాథంకోసం బయలుదేరాను. అతగాడు, పొలంనించి ఇంటికే కొస్తున్నాడు. ఇద్దరం కలిసి కాలవవడ్డుకి వచ్చే సరికి తుమ్మాయి మామిడిపండ్లబండి పట్టం బయలుదేరుతోంది. పెద్దకొడుకుని బండితోకూడా పంపుతున్నాడు.

మేం నవ్వుకున్నాం తుమ్మాయ్ తెలివికి.

ఇంతలో హటాహుటిని సుందరం వచ్చేశాడు–సిగరెట్టు కాలుస్తూ. తుమ్మాయి కంగారుపడ్డాడు. మేం దగ్గిరికి వెళ్ళాం.

"దింపవయ్యా! పళ్ళుదింపు. వందపళ్ళు ఇక్కడే అమ్మి నా డబ్బు నాకిస్తానన్నావుగా" అన్నాడు సుందరం. తుమ్మాయి నసిగాడు.

"తొందరపడకు సుందరంబాబూ! బహు కుటుంబీకుడిని. కొంచెం జాలి చూపించు. పళ్లు పట్నంలో అమ్ముకుంటే నాలుగు డబ్బులు ఎక్కువ ముడతాయి. ఈ పల్లెలో ఏం గిడుతుంది చెప్పు, చవకని అమ్ముకుంటే? నామాట వినుబాబూ. ఒక్కరవ్వ ఆగు. సాయంత్రానికి నీ డబ్బు పువ్వుల్లోపెట్టి నీకిస్తా."

"తుమ్మాయిగారూ ఇంక మనం ఇందుగురించి వాదించుకో వద్దు... మొదట అనుకున్న ప్రకారం వందపళ్ళూ దింపండి; అనకే బండి వదుల్తాను." అన్నాడు సుందరం.

తుమ్మాయి మళ్ళీ ప్రయత్నించాడు; కాని ఆటసాగలేదు. గోవిందా! అంటూ వందపళ్ళు– బాగా మగ్గినవి – తీసి ఓ గంపకెత్తి కూలాడి నెత్తిన పెట్టించాడు.

"పద నేనూ కూడా వుంటా. అమ్మించు" అన్నాడు సుందరం.

"చాలా చిత్రంగా వుందే కుఱ్ఱాడి వ్యవహారం! మొత్తంమీద వ్యవహార దక్షుడల్లేనే ఉన్నాడే".... అన్నాడు జగన్నాథం కొంచెం ఆశ్చర్యంతో.

ఊళ్ళో ప్రవేశించాం మెల్లిగా.

"మామిడి పళ్ళు మామిడిపళ్ళు, రసాలు... అరముగ్గినవండి ఆరగించండి" అంటూ కేక వేశాడు కూలివాడు. వాడి వెనక తుమ్మాయి, సుందరం, ఆ వెనక నేనూ జగన్నాథం నడుస్తున్నాం. ఊరు నడిబొడ్డుకి వెళ్ళేవఱకు ఓ చిన్న గుంపు తయారయింది– మా కూడా.

పళ్ళు కొనటానికి ఎవడూ ముందుకు రావటంలేదు. అందరూ వింత చూస్తున్నారు. ఆత్రుతగా. జగన్నాథంగారిల్లు సమీపించే సరికి "ఏయ్, మామిడిపళ్ళూ!" అంటూ గావుకేక పెట్టింది సుబ్బలక్ష్మి గుమ్మంలో నుంచుని.

"బావుంటుందా సుబ్బలక్ష్మి?" అంది కథ వింటున్న పద్మ. సుబ్రహ్మణ్యంగారివేపు కళ్ళు సన్నంగా చేసి చూస్తూ.

"అడగాల్సినచోట అడగాల్సిన ప్రశ్న వేశావుతల్లీ!" అంటూ విరగబడి నవ్వారు సుబ్రహ్మణ్యంగారు. "సన్నగా పొడుగ్గా ఉంటుంది సుబ్బలక్ష్మి. గుండ్రని మొహం. కొట్టొచ్చే ముక్కుకి ఎడా పెడా పకా పకా నవ్వే పెద్దకళ్ళు. కళ్ళునిండామా.

చుట్టూనూ, అలుక్కుపోయిన కాటుక. ఆ పైన దీపమంటి బొట్టు. సన్నని చక్కని పెదిమలు. సైజువారీగా గుచ్చిన ముత్యాల సరమల్లే పొందికగా అమరి తళతళలాడే పలువరస.... ఆc... నవ్వినప్పుడేం. – నవ్వినప్పుడూ ఆ యొక్క గులాబీరంగు లేత చిగుళ్ళూ వాటికింద ధవళ దంతాలూ, చిరిపితే పాలుగారే చెంపలమీద, కనీ కనపడనట్లు రెండు సొట్టలూ, వంపుతిరిగిన సన్నని పెదిమలూ. ఈ మొదలైన యావత్తూ సరంజామా వాటివాటి పనులను అరక్షణం చేసేస్తాయి. అడది విస్తుపోతుంది ఆ నవ్వుచూసి. మొగాడు పిచ్చెత్తిపోతాడు. అన్నట్టు మర్చిపోయాను. ఆవేళ తలంటిపోసుకుంది. ఆ పిల్లతాలూకు ఉంగరాల జుట్టు మహా పొగరుగా అల్లరి చేసేస్తోంది గాలిలో ఎగురుతూ. పొడుగ్గా ఆ జుత్తు పిరుదులవరకూ దిగిపోయింది, అయిందా... ఇంక కంఠం దగ్గిర కొద్దాం.... కంఠం ఎలా ఉందంటే...."

రామదాసుగారు కొంచెం గట్టిగా గొంతు సవరించుకున్నారు పొడి దగ్గుతో. "హి హి హి.... పంతులుగారు కవిత్వంలో పడిపోతున్నారు. కథ చెబుదురూ.... హి హి హి" అన్నారు.

రామదాసుగారి మనసులో అసలు సంగతి గ్రహించారు సుబ్రహ్మణ్యంగారు. కొంటెగా నవ్వి కథ ప్రారంభించాడు:

"ఆc. ఏం చెబుతున్నాను?.... అదేఅదే.... ఆ జగన్నాథం కూతురు సుబ్బలక్ష్మి గుమ్మంలో నుంచుని మామిడిపళ్లు కేకేసింది."

కొయ్యబారి పోయారు జగన్నాధం గారితోపాటు యావన్మందిన్నీ. తుమ్మాయి నివ్వెరబోయాడు. నోట మాట రాలేదు ఎవరికీ ఈ అనుకోని సంఘటనవల్ల.

"ఎలాగ వంద?" అంది సుబ్బలక్ష్మి ధైర్యంగా.

"నాలుగు రూపాయల పావలా అండి. ఒకటే ధర." అన్నాడు సుందరం అందుకుని. సుబ్బలక్ష్మి సిగ్గుతో తలవంచింది. లోపలికి వెళ్ళింది "అమ్మా! నాలుగుంబావలాయేనటే" అంటూ.

అందరం ఊపిరి బిగబట్టి చూస్తున్నాం. సుబ్బలక్ష్మి బయటికి వచ్చింది. అందర్నీ ఓమాటు కలియచూసింది. నిర్లక్ష్యంగా తల తాటేస్తూ "ఏయ్ అబ్బీ! గంపలో ఉన్నవి వందేనా?... అయితే తెచ్చి లోపల పొయ్" అంది. క్షణాలమీద జరిగిపోయింది అంతా.

మెస్మరైజు అయినవాడివలె జగన్నాధంగారు స్వంత ఇంటి గుమ్మం ఎక్కారు. ఈ లోగా తుమ్మాయి డబ్బుకోసం చెయ్యి చాచాడు. కాని సుందరం ముందుకు దూకి తన చెయ్యే ముందుకి జాచాడు. సుబ్బలక్ష్మి మూడు విచ్చురూపాయలూ. అయిదు పావలాలూ సుందరం చేతిలో పోసింది సిగ్గుపడుతూ.

"తుమ్మాయిగారూ! మీరు నాకు బాకీవున్న మూడుముప్పావలా ఇదిగో తీసుకుంటున్నాను. ఇదిగో ఓ పావలా వీడికి కూలీ ఇస్తున్నాను, మిగతా పావలా ఇదిగో మీది" అన్నాడు సుందరం.

కోపంతో, ఏడుపుతో తుమ్మాయి ఆపాదమస్తకం కంపించిపోయాడు. "క్రూరుడివి సుందరం! ద్రోహివి సుందరం!..." అంటూ బోలెడు తిట్టుకుంటూ పెద్ద పెద్ద అంగలువేస్తూ వెళ్ళిపోయాడు– సుందరం చేతిలోంచి లాక్కున్న పావలాని, నేలవేసి కొట్టినంత విసురుగా జేబులో వేసుకుంటూ.

గుప్పిటలో డబ్బుని గుంపుకి చూపాడు సుందరం. "ఇదిగో తుమ్మాయి అప్పు. దీనిమీద మీరందరూ పందెం కాసిన పదహారుంబావలా ఇలా ఇవ్వండి సుబ్రహ్మణ్యంగారూ" అన్నాడు సుందరం.

హాహాకారాలు చెలరేగాయి. గాలి దుమ్ములా లేచాడు జగన్నాధం కూతురిమీద: "నువ్వా–నువ్వా.... నీకు... నీకేమన్నా... ఈ పళ్ళు ఎందుక్కొన్నావు? ఆ?..." అంటూ నాలిక బయటపెట్టి గుప్పిట్లు బిగించాడు.... తలుపు చాటునుంచి ఆయన భార్య అందుకుంది. "చాల్లెండి భాగోతం.... దాని మీదికలా ఒంటికాలిమీద లేచిపోతారెందుకు?.... కొనమన్నదాన్ని నేనూ. ఇవాళ సుందరానికి మన సుబ్బుల్నిచ్చి పెళ్ళి చెయ్యడానికి ప్రధానం జరుపుదాం అనుకుంటుంటే.... అందుకని మామిడి పళ్ళు కొనమన్నాను. మీరు రాగానే చెబుదాం అనుకుంటున్నాం" అంది సన్నగా.

పేరిశాస్త్రిగారు సులోచనాలు తగిలించుకుని పంచాంగం విప్పాడు. "దివ్యమైన ముహూర్తం బాబూ! ఇవాళ. తమరిదే ఆలస్యం. సదస్యులు వచ్చాక" అన్నాడు.

జువ్వలా లేచాడు జగన్నాధం. "నిష్ప్రయోజకుడు. కానీ దాచుకోలేనివాడు...."

"చాల్లే నాన్నా మీకన్నా నయమే" అంది సుబ్బులు.

చాలా చిత్రంగాలేదూ?.... సరే నేను ముందుకొచ్చి తగులుకొన్నాను. "ఎవడయ్యా నిష్ప్రయోజకుడు? అతనా మనవా?....హుఁ.... తెలివంటే అతగాడిది. లౌక్యం అంటే అది... మీకు కాఫీలు, ఇడ్లీలు పెట్టి కబుర్లు చెబుతూనే చదరంగం ఆటలో మీ లోపాలు కనిపెట్టేసి, కిటుకులు నేర్చేసుకుని మీకు ఇంతవరకూ ఖర్చు పెట్టిందీ, మీ దగ్గిర ఓడిపోయిందీ కలిపిన దానికన్నా నాలుగురాళ్ళు ఎక్కువే ఒడేసి లాగాడు మీ దగ్గిర... పైగా తుమ్మాయిలాటి ఉద్దండుడి దగ్గర్నించి సవ్యంగా అప్పు వసూలుచేసి దానిమీద పందేల రూపేణా పదహారు రూపాయలు గెల్చాడు. నీ కూతురికి ఇంతకన్న గొప్పవాడిని ఎక్కడ తెస్తావయ్యా? డబ్బుంది. తెలివి ఉంది. మంచి మనస్సు ఉంది... లౌక్యం తెలుసూ..."

"అన్నిటికన్నా ముఖ్యం అయినది వాళ్ళిద్దరికీ ఇష్టం అయింది" అంది సుబ్బలక్ష్మి తల్లి తలుపుచాటునుంచి. సుందరం ముసి ముసి నవ్వులతో జగన్నాధానికీ, నాకూ , కరణంగారికీ నమస్కరించాడు.

సుబ్బులు జడ ఎగరేసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

"అబ్బో! ఎంత లౌక్యం చూపావయ్యా! ఇక్కడ కూడా" అనుకుంటూ నేను ఫక్కున నవ్వాను.

కథ ముగించారు సుబ్రహ్మణ్యంగారు. కథ విని కిలకిల నవ్వింది పద్మ.

"నీకూ వస్తున్నాడులే, అలాటి మొగుడే–ఇంకో గంటలో.... ఆ మాటకొస్తే ఇతగాడు సుందరాన్ని మించిన సుగ్రీవుడు" అన్నారు సుబ్రహ్మణ్యంగారు. రామదాసుగారు సాభిప్రాయంగా చూశారు సుబ్రహ్మణ్యంగారి వంక.

"సుగ్రీవుడ ందంగా ఉంటాడా" అంది పద్మ.

* * *



రెండు ఝాములు ప్రొద్దు తిరిగింది. ఊరు భుక్తాయాసంతో మాగన్నుగా వుంది. జోరీగల జోడొకటి మునసబుగారి లోగిలి వీధరుగు మీద స్తంభం చుట్టూ తిరుగుతూ ఊరు నిశ్శబ్దంగా ఉందని జాకొడుతోంది. అరుగుప్రక్క నీడలో మగతగా పడున్న ఊరకుక్క మీదిమీదికి జరిగి పడుతున్న ఎండవేపు చిరాగ్గా చూసి ఇంకాస్త వారకి సర్దుకుంది. నెత్తిమీద జోరీగల రొదకి చీదరించుకుంది. ఎదురుగా నాలుగిళ్ల కావల తెలికలవాలరింట గానుగ కీఱ్ఱుమని నిరంతరంగా నిశ్శబ్దానికి నేపథ్యగీతం పాడుతోంది. వీధరుగుమీద పడక్కుర్చీలో మేనువాల్చిన మునసబుగారు వార్తాపత్రికను పడేసి కన్నులరమూసి చింతాలు ఖూనీ కేసు గురించి లీలగా ఆలోచిస్తూ సన్నగా గుర్రుపెడుతున్నారు.

☆ ☆ ☆

చుక్క రొగురుస్తూ తూలిపడబోతూ తట్టుకుంటూ పరిగెడుతోంది. గుఱ్ఱు పెడుతున్న మధ్యాహ్నం మీద. చుక్క కాలి కడియాలూ గొలుసులూ టక్ టక్మని కొట్టుకుంటూ ఉండుండి ఘల్లు మంటున్నాయి. 'నా దేవుడోయ్' అని గొణుక్కుంది చుక్క. 'నా దేవుడోయ్! నా కొంప దీశావురోయ్. సందేళకి నువ్వింక నేవురోయ్ నాయనోయ్'... అంటోంది. మాటమాటకీ రొగురుస్తోంది. శాస్త్రులవారి వాకిలి ముందర నిలిచిపోతూ జుట్టొగదోసుకునేసరికి చుక్క చేతి గాజుల మలారం గలగలమంది. వామనగుంట లాడుకుంటున్న బామ్మగారూ, సీతా 'చుక్కా' అన్నారు. చుక్క పరుగెడుతోంది. 'నాయనోయ్, నా కొంప దీశావురోయ్'...

'కొంపలంటున్నా దేవిషి చెప్మా' అంది బామ్మగారు చుక్క పరిగెత్తినవైపు చూసి.

☆ ☆ ☆

మగత నిద్రలో ఉన్న మునసబుగారికి, చింతాలు కేసులో తలుపుల్నరిదీయ బోతున్నట్లు కలొచ్చింది. సంకెళ్ల చప్పుళ్లు గూడా వినబడినట్టయి గతుక్కుమని కన్ను దెరిచారు. వీధిలో చుక్క పరుగెత్తుతోంది. మధ్యాహ్నపు నిశ్శబ్దంమీది నిశ్శబ్దపు మధ్యాహ్నం మీద చుక్క కాళ్ల కడియాలూ గొలుసులూ ఘల్లు ఘల్లుమంటున్నాయి. చుక్క ఒడిదొడుకులుగా పరుగెడుతోంది. సుడిగాలిలా పరిగెడుతోంది. శివాలెత్తినట్టు ఊగిపోతోంది.

'ఏవిటే చుక్కా' అన్నారు మునసబుగారు.

"నాయనోయ్. నా కొంప ముంచాడయ్యోయ్" అంది చుక్క. అని వెనక్కి తిరక్కుండానే పరుగు సాగించింది కాలవొడ్డువేపుకి.

సుడిగాలి వెనకాల ఆకలముల్లా వస్తున్నాడు చుక్క తమ్ముడు చింపిరిజుట్టూ, బానబొజ్జా ఎగరేసుకుంటూ చిన్న చిన్న అంగలతో అడుగులేస్తూ.

"ఈరిగా, యిల్లా. ఆగు, చుక్కేవిటలా పరిగెడు..."

"పకీర్నొగ్గేశారంటండీ పోలీసోళ్లు. ఆడు మూడుగంట్ల కారు కొచ్చేత్తన్నాడు. తలుపులు మావని సంపేత్తాడంటండి" అని ఏడుస్తూ పరుగెత్తాడు ఈరిగాడు, అక్క చుక్క వెనక. మునసబుగారు పూర్తిగా మేలుకున్నాడు. పిల్లాడి మాట పూర్తిగా నాటుకునేవరకూ ఆయన అయోమయ స్థితిలో పడిపోయారు.

పకీర్నెవరొగ్గేశారు? ఎలా ఒగ్గేశారు? కేసు పూర్తికాందే ఇది ఎలా జరిగింది? పకీరుగాడు ఊళ్లో వచ్చిపడితే ఈసారి ఊరు వల్లకాడవటం ఖాయం. అందరికన్నముందు తలుపుల్ని కాలికిందేసి నల్లిని నలిపినట్టు నలిపేస్తాడు వాడు. కండ కండలుగా తరిగి కాకులకీ గద్దలకీ ఎగరేస్తాడు. రెండేళ్లక్రితం సంకురాత్రి పండగకి కోడిపందాల్లో ఓడినందుకు ఉక్కురోషం వేసుకొచ్చి చూస్తుండగా నరసయ్యని అట్టే పీకనులిమి చంపేశాడు. అంతా అటే గుడ్లప్పగించి నిలబడిపోయారు. మనుష్యుల్ని పోగేసుకు రాబోయేసరికి ప్రాణం పాలొచ్చింది.

పకీరుగాడు పరమ కిరాతకుడు.

"బాబోయ్ కొంపలు మునిగినయ్యండీ" అంటూ వచ్చాడు ముత్యాలు. "పకీర్నొగ్గేశారంటగా. తలుపులెదవ ఒణుకుతో సచ్చేటట్టున్నాడండి. ఏందారి?" అన్నాడు.

మునసబుగారు గయ్‌మన్నారు ఒక్కసారి.

"ఏముంది? ఒక్కటే దారి... అసలాణ్ణే సాక్షానికెళ్లమన్న దెవడంట? యదవలు, ఒక్కడూ ముందర చెప్పినట్టైనడు. ఆ మాత్రం మగసిరి ఇంకోడికి లేదనే బయల్దేరాడేం యదవ. ఇప్పుడేడిచేం లాభం?" అన్నారాయన.

ముత్యాలు మాటాడలేదు. తలొంచుకుని నిలబడ్డాడు. మునసబుగారు కండువా భుజాన్నేసుకుని కరణంగా రింటికి బయల్దేరారు. "నరిసిరెడ్డిని కేకేసుకురా. కరణంగారింటి కాడుంటానన్జెప్పు" అన్నారు.

"ఆ రక్కడే వున్నారండి" అన్నాడు ముత్యాలు.

ముత్యాలమ్మ గుడి మలుపులోనే శివాలు వినిపించాయి మునసబుగారికి. ఇంకో అడుగేసేసరికి గుడిదగ్గిర గణాచారి ఉగ్రంగా ఊగిపోతోంది. తలుపులు నేల

బారుగా సాగిలబడి దండాలెడుతున్నాడు. చుక్క చతికిలబడి, నెత్తి కొట్టుకుంటూ శోకన్నాలెడుతోంది.

తలుపులు పెద్ద పెళ్లాం సావాఁలు ధైర్యం చిక్కబట్టుకు గణాచారిని ప్రశ్నడుగుతోంది. మునసబుగారు అగదల్చుకోలేదు కాని, అంతకితం వరకూ గణాచారి కాబోలు బాగుచేస్తున్న కందుల్ని కాకులు తినిపోతుంటే, 'హష్కాకి' అన్నాడు.

సాగిలపడుతున్న తలుపులు తలిటు తిప్పి చూసి, బావురుమని ఏడుస్తూ మునసబుగారి కాళ్లు చుట్టేసుకున్నాడు.

"నాన్నగారోయ్, నను సంపేత్తాడండోయ్, అడొచ్చేత్తన్నాడండోయ్" అని భోరున ఏడవసాగాడు. 'మావోయ్' అని చుక్క బావురుమంది. గణాచారి ప్రశ్న జెబుతూనేవుంది...

మునసబుగిరీ కొచ్చాక నాయుడుగారు చాలా చూశాడు ఇలాటి సందర్భాలు. బడితల్లాటి మొగవీరులు బావురుమని ఏడవటం అయనక్కొత్తగాదు. కాని తలుపులు ఎన్నడూ ఏడవగా ఆయన చూల్లేదు. సన్నగా బక్కపలచగా పొట్టిగా వున్నా, పది తినే సత్తా లేకున్నా వాడు ఎన్నడూ జంకూ ఝుడుపూ ఎరగడు – దేనికేనా ఎగబడే రకం. ఎదుర్దెబ్బ తినక అలా మిడిసిపడుతున్నాడని అనుకుంటూ వచ్చాడు మునసబుగారు. తలుపులలా కంట తడిబెడితే ప్రాణం బేజారైపోయింది మునసబుగారికి. కంఠం బిగించుకుపోయింది. అందుకనాయన మాటాడకుండానే తలూపి కరణంగారింటివేపు బయల్దేరి వెళ్లాడు.

సావిట్లో అంతా సందడిగా ఉంది. కరణంగారూ, వారి పట్నపల్లుడూ, ప్రెసిడెంటు నర్సిరెడ్డీ, ఇంకిద్దరు మెంబర్లూ, జనాభా లెక్కలు రాసుకోవడానికొచ్చిన ఓ దొరటోపీ మనిషీ రెండు భాషల్లో మూకుమ్మడిగా ఏకటాకీన ఖూనీ కథలూ, బ్రెమ్మరాతా, కర్మసిద్ధాంతం, ఆ బాపతు వేదాంతం, వాళ్ల చిన్ననాటి ముచ్చట్లు, నేతిబీరకాయలో నెయ్యిఉండని వైనం, అమెరికాలో గాంగ్‌స్టర్లు ఖూనీలు చేసే శిల్పం (అల్లుడుగారిది), పకీరుగాడి పుట్టుపూర్వోలూ, తలుపులుగాడి రెండో పెళ్ళాం చుక్కకీ మధుర శిల్పాలలోని అచ్చరలకీ కొట్టొచ్చినట్టు కనబడే పోలికలు (ఎవరో తెలీదు), ఖూనీలు కామాపుజేసేవాళ్ల కథలూ చెప్పుకుంటూ, హఠాత్తుగా 'దయచెయ్యండి' అన్న ఒకమాటని మాత్రం ఏకగ్రీవంగా అన్నారు.

తరువాత, జరిగిన కథను సమీక్షించి కర్తవ్యం గుర్తించి నిశ్శబ్దం తీవ్రంగా ఉపన్యసించింది.

కరణంగారు గొంతు సవరించుకున్నారు. ప్రెసిడెంటుగారు అనుకరించారు.

"అసలు వాణ్ణెలా వదిలేశారూ అంట?" అన్నారు కరణంగారు.

"పారిపోయుండాల" అన్నారు ప్రెసిడెంటుగారు.

"ఇంపాసిబుల్" అన్నాడు దొరటోపీ ఆయన.

కరణంగారి అల్లుడు సాహసించి కలగజేసుకున్నాడు. "వైనాట్? అమెరికా జైళ్లలాటి వాటినుంచే తప్పించుకుంటారు. అక్కడ –"

ప్రెసిడెంటుగారి చూపు చూసి ఆగిపోయాడు కరణంగారల్లుడు.

"నే సెలవు దీసుకుంటానండి" అన్నాడు దొరటోపీ ఆయన.

"తలుపులుగాడి పాణానికి ముప్పే" అన్నాడు ముత్యాలు.

"వాడి పెళ్లాం ఒకటే ఏడుపు, పాపం! కట్టుకుని ఆర్నెల్లు కూడా తిరగలేదింకా" అన్నాడో పెద్ద, ఆర్నెలు తిరిగితే ఫరవాలేదన్నట్లు.

"సార్, జనాభా లెక్కలో జనసంఖ్య ఎంత రాసుకున్నారోగాని, ఒకటి తగ్గించి ఖర్చురాయొచ్చు" అన్నాడు అల్లుడుగారు. విట్టీగా అని చుట్టూ చూసి నవ్వబోయి కొయ్యబారిపోయాడు.

"బాబూ, కాఫీ అయినట్టుంది. ఇంట్లో పిలుస్తున్నట్టున్నారు చూడు" అన్నారు కరణంగారు బాధగా.

☆ ☆ ☆

ప్రెసిడెంటుగారు జనాభా లెక్కలాయన్తో మాటాడుతూ సాగనంపబోయారు.

మిగతావాళ్లు ఆలోచనలో పడిపోయారు. పకీరు మూడుగంటల మెయిలుకారుకి దిగుతాడన్న వార్త అందరికీ తెలుసు. ఏలూరు - బెజవాడ కారులా టైము పరుగెడుతోందనీ తెలుసు.

ఐదు నిముషాలయేసరికి చుక్కా, తలుపులూ వచ్చారు.

"నాన్నగారోయ్, నాకేం దారి చెప్పం"డన్నాడు తలుపులు ఏడుస్తూ.

ఏ నాన్నగారూ ఏ దారీ చెప్పలేదు.

"అసలు నీకెందుకురా గోల? నువ్వెందుకు సాక్ష్యమిచ్చావు? పకీరుతో చెలగాటవేమిటి? అదీ కూనీ కేసులో! మా కామాత్రం దమ్ములేకనా" అన్నారు కరణంగారు.

"సర్లెండి, అదంతా ఎందుకిప్పుడు? ఆడి మొఖానలా రాసి పడేసుంది గావాల, కుదురుగా ఇంటికా డెలాగుండగల్డూ" అన్నారు మునసబుగారు.

"ఊళ్లో యిందరున్నారు జెమా జెట్టీల్లాంటివాళ్లు. ఇందరు కలిసి పట్టపగలు ఒక్క పకీరుగాడికి అడ్డపళ్లేరా" అనిపించింది ఎవరి మటుకు వాళ్లకి. ఆ మాటే చుక్క పైకి అనేసింది.

"అవున్నాన్నగారూ, ఆడు రాగానే బెడిత్తిరగేసీ - " అన్నాడు తలుపులు.

"ఛఫ్, నువ్వూర్కో, ఇలా ఎెదవాలోచన్లు చేసే ఇంతకి తెచ్చుకునావు" అన్నారు మునసబుగారు.

మునసబుగారి మనసు ఆయనకన్న ముత్యాలుకు బాగా తెలుసు. ఇలాటి సమయాల్లో అతనే టీకా తాత్పర్యాలూ భాష్యాలు చెబుతాడు. ఇపుడూ నమ్మినబంటుగా ఆ పని చేశాడు. పకీరుది పాము పగ అని వెల్లడించాడు. పాముతో చెలగాటాలు మంచివి కావన్నాడు. పకీరుగాడు ఇవాళ నలుగురడ్డుపడితే తగ్గినా ఆనక నలుగుర్ని విడివిడిగా పడతాడు. "పొరుగూరెల్లి అక్కడ వాళ్లని చావదన్ని, చంపి రాగల మొనగాడికి పలుకుబడి ఎంతుండాలి?..."

"మరిపు డేటిచేదారి ఏటిదారి?" అన్నాడు తలుపులు.

"దారికేటుంది? ఎవడిదా రాడిదే. నన్నడిగితే అడలా మెయిలుకారు దిగేతలికి నువ్వొట్నించిలా పొలాల కడ్డబడి పో. లేదా పడవెక్కి పట్నానికెల్లిపో. అనక మేమంతా ఆడికి నచ్చచెబుతాం. సల్లబడ్డాక మెల్లంగా రావచ్చు" అన్నాడు ముత్యాలు.

"వాడు శాంతించకపోతే అదేపాయని, పట్నంలోనే స్థిరపడిపోవచ్చు"నని సలహా చెప్పాడు కరణంగారు. పట్నంలో లాండ్రీ పెడితే సుబ్బరంగా నెల కొంద రూపాయలు కళ్లజూసి మారాజులా గుండవచ్చునని గూడా ఆశ పెట్టారు.

తలుపులికి మనసు కొద్దిగా స్థిమితపడుతోంది. కొంచెం కుడీ ఎడమా ఆలో చిస్తున్నాడు. ముత్యాల్లాంటి వాళ్లిద్దరు తన కెడాపెడా నిలబడి, కరణం మున్సబులూ, పంచాయితీ ప్రెసిడెంటూ వెనక నిలబడితే చాలు. పకీరుగాడికి దర్జాగా ఎదురుపడచ్చు..

"ఏటోస్ వల్లకుండావు? ఎల్లదల్చుకుంటే బేగీ లగెత్తు" అన్నాడు ముత్యాలు, తమాషాగా చుక్కవంక చూసి నవ్వి. తలుపులు చుక్కవంక చూశాడు. తలకొట్టేసినట్టయింది.

"బతికుంటే బలుసా కేరుకు దినొ"చ్చన్నారు కరణంగారు.

"అవును మావా" అంది చుక్క కళ్లు చెంగుతో వొత్తుకుంటూ.

తలుపులు చుట్టూ చూసి "ఎదవ నాయాళ్లు. యదవకల్లెదవ నోళ్లు" అనుకున్నాడు.

"మంత్రాలు సతుకుతున్నావా? పకీరుగాడు జడిసే రకం కాదు" అన్నాడు ముత్యాలు.

"నువ్వలాగుండేస్" అన్నాడు తలుపులు చిరాగ్గా.

"ఓరబ్బో. కోపం వచ్చింది దొరగోరికి – ఆ డొచ్చి ముక్కెలిరగదంతే దిక్కే లేదుగాని నేను మాటంటే గుబులేం?"

"మావా! నువ్విలా గూరుకో, ఆడితో నీకేటి? నాన్నగారేం జేయమన్నారూ, నివ్వేటిసెయ్యాలా, అచ్చొచ్చాడు ముంగల" అంది చుక్క.

కరణం, మునసబుగారు ఒక్కమారే బరువుగా నిట్టూర్చారు. "అనేందికేముంది గనక. పకీరు పరమ దుర్మార్గుడు. అన్నింటికీ తెగించినవాడు. వాడికి అడ్డుపడేందికి ఆలుబిడ్డలున్న వాడెవడూ ముందుకు రాడు. అంచేత తలుపులు ప్రాణాలమీద ఆశవుంటే తక్షణం వెళ్లిపోవడం మంచి"దని వారభిప్రాయపడ్డారు.

తలుపులు మరోసారి ఆలోచించుకున్నా ఊరొదిలి పోబుద్ధి కాలేదు. ప్రాణభయం ఎంత పీకుతున్నా కొంపా గోడూ వదులుకుని పారిపోవడం వాడికి అవమానంగా తోచింది. పకీరుగాడు తల్చుకుంటే ఎక్కడున్నా తరుముకు రాగలడు. తప్పకుండా తల్చుకుంటాడు కూడా.

"వాడి బాబు, నా బాబు ఈడనే పుట్టి ఈణ్ణే మట్టిలో కలిశారు. నేనెందుకు పోవాల? నేనేం కూనీల్జేశానా?" అన్నాడు.

కరణంగారు నవ్వారు. "ఇదెప్పట్నుంచిరోయ్ దేశభక్తి? ప్రాణమ్మీదికి ముంచు కొస్తూవుంటే ఈ వేదాంతం ఏమిటి? నీ బాబూ, ఆడి బాబూ ఖూనీ కేసుల్లో సాక్షాలిచ్చి పీకలమీదికి..."

"ఎవరది?" అన్నారు మునసబుగారు వాకిట్లో కొచ్చిన మనిషిని చూసి.

"నేనండీ ఎఱ్ఱెంకన్నని. తలుపులుగా డింకా ఈణ్ణే ఉన్నాడండి, అయిబాబో! పకీర్నొగ్గేశారండి. ఆడొచ్చి సంపేత్తాడండియ్యాల... ఊరంతా."

"అదేనోయ్. పారిపొమ్మంటే. అవునుగాని నీ కెవరు జెప్పారిది? వదల్డం నిజమేనా అని?"

"ఎవరేటండి – దాన్నడగండి, ఆ చుక్కకే తెల్సు. ఇందాక పన్నిండుగంట్ల కారుకి డైవారు రెడ్నాయుడే చెప్పాడటండి."

"అదే, మేం వూరొదిలి పొమ్మంటున్నాం. వాడు శాంతించాకా..."

"ఇంకేడికి పోతాడండి? కబురపుడే అందరికీ తెల్సిపోయింది. ఆడి మనుషులు ఈడు వూరొదిలి పోకుండా కాలవకాడ, తోపుకాడ, వంతినకాడ కాపేశారంటండి. ఆడు మూడుగంటల కారుకొచ్చేత్తన్నాడంట."

"వాయనోయ్" అంటూ చుక్క ఏడుపు లంకించుకుంది. చూస్తుండగానే తలుపులికి ముచ్చెమటలు పోసేశాయి. గజగజ వణికిపోయాడు. రెండు చేతుల్తో తలపట్టుకు కూలబడిపోయాడు. కళ్ళు తిరిగిపోయాయి.

"నా తల్లి ముత్తేలమ్మా!" అంటూ చుక్క వొళ్ళోకి వొరిగిపోయాడు.

☆ ☆ ☆

"అయితే ఏం చేద్దాం?" అన్నారు కరణంగారు.

మునసబుగారు మాట్లాడలేదు.

"చేసేదేముంది? ఎవడి ఖర్మకెవరు కర్తలు? అటు కోర్టు వాళ్ళలా మంచీ చెడ్డాలేకుండా ఖూనీకోర్లని దేశం మీద కొదిలేస్తావుంటే చేసేదేముంది?" అన్నారాయనే మళ్ళీ.

కాస్త ఆగి గొంతు సవరించుకున్నాడు. "చిన్నా పెద్దా మనమంతా కలిసి ఆ డూళ్ళో దిగ్గానే అడ్డపడితే" అన్నారు.

కరణంగారు తల తాటించారు. "మీరేమన్నా అనుకోండన్నారూ! నా కా సాహసం లేదు. కొంప దుంప నాశనం చేసుకోదలిస్తే తప్ప..."

మునసబుగారు ముత్యాలుకేసి చూశారు.

"అవును బాబూ, ఆడేది పొంపగ. తెగించినోడు. అనాయత్తం అదేదో జేశాక ఆణ్ణి మళ్ళా జైల్లో యేసేం. లాభం? సంపేం లాభం? ఈ యెదవ చేసిన తప్పుకి మనవా కాసుకోడం? మనకొద్దు బాబూ. అసలాడి సేతికింద మణుసులెలాటోళ్ళో మీకు తెల్దు. వత్తా బాబూ, పనుంది" అంటూ ముత్యాలు విసవిస నడచి వెళ్ళిపోయాడు.

"వత్తాను బాబో, దండాలు" అంటూ ఎఱ్ఱెంకన్న కూడా వెళ్ళిపోయాడు.

"దారుణం. ఇది ఊరో అడివో నాకు తెలీటం లేదు. ఇందరం ఉండి ఒక్కడి ప్రాణానికి అడ్డు పల్లేకున్నాం" అన్నారు మునసబుగారు లేస్తూ.

"ఏం చేస్తాం? ... పోనీ, పోలీసు రాణాకి కబురంపండి. మనిషినిచ్చి... వస్తా. అల్లుడూ, అమ్మాయీ సినిమాకోయ్ అని గోల బెడుతున్నారు. మాయాబజారుట... మీరూ వస్తారా?" అన్నారు కరణంగారు.

"రాను" అంటూ వెళ్లిపోయారు మునసబుగారు. సందు మలుపు తిరిగాక కండువాతో కళ్లొత్తుకుని ఇల్లుచేరి పడక్కుర్చీలో కూలబడ్డారు.

కరణంగారు చుక్కకి ధైర్యం చెప్పారు. తలుపులుకి స్పృహ వున్నట్టు లేదు.

"రాగానే మీ సవతులిద్దరూ వాడి కాళ్లమీద పడండి. అంతకన్న మార్గం తోచట్లేదు" అన్నారాయన.

☆ ☆ ☆

చుక్క తలుపుల్ని లేవదీసి నెమ్మదిగా ఇంటికి బయల్దేరింది. నెత్తిన ఎండ పేలిపోతోంది. కష్టకాలంలో దురదృష్టంలా వడగాడుపు బలంగా దెబ్బమీద దెబ్బకొడుతోంది.

తలుపులికి ఒళ్ళు మండిపోతోంది. కళ్ళు మూసుకునే చుక్క నానుకు నడుస్తున్నాడు. చుక్కకి పెదిమలు తడారిపోయాయి. గొంతు మండిపోయింది. అమ్మవారి గుడి దగ్గర ఆగి, "గండం గడిచి తెల్లారితే ఉపారా లెత్తుతాను తల్లీ. పెట్టనే యిత్తానమ్మా" అని దండమెట్టుకుంది.

☆ ☆ ☆

ఇల్లుచేరి గుమ్మంలో అడుగెడుతుండగా "ఆడు తొడిగింది కరణంగారి కమీజంట గాదూ, ఎందుకన్నా మంచిది ఇప్పించేసెయ్" అని చెప్పి వెళ్లిపోయాడు కరణంగారింటి పాలేరు.

'థూ' అని ఉమ్మేసింది చుక్క. లోపల సవితి సావాలు పడుకుని ఉంది. అంపకంపాలతో జ్వరం వచ్చేసింది సావాలుకు. కలవరింతలూ కేకలు. చుక్కకి దుఃఖం పొంగి వచ్చేసింది. తలుపుల్ని మంచాన పడుకోబెట్టి దుప్పటి కప్పింది. సావాలు కణతలంటి చూసింది.

"నా కొంప ముంచాడే నాయనో" అంటూ గొల్లుమంది సావాలు. "ఏం సేత్తాం? అన్నింటి కా సల్లన్తల్లుండాది. ఈ గండం గడిత్తే రేపుపారాలెత్తించి పెట్టనేద్దాం. నువ్వు కూడా మొక్కుకో" అంది చుక్క.

"మల్లిద్దర వెందుకులే" అంది సావాలు.

"నీ జిమ్మడ, బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు" అంది చుక్క.

☆ ☆ ☆

తలుపులికి గంజినీళ్లు పోసి, గుడిసెవతలికి వచ్చింది చుక్క.

"మూడు గంటల కారొచ్చుండాలి. ఆడేపాటికే దిగుండాలి. నాతల్లో! నువ్వేదిక్కు" అనుకుంటూ నించుంది.

పకీరొస్తే ఎందుకేనా వుంటుందని రెండు బడితెలూ, ఓ పెద్దగెడా, రెండు కొరకంచులూ తీసి ఓ పక్కన అట్టే పెట్టింది.

చుక్క తమ్ముడు పరుగున వచ్చి "అక్కా అక్కా, కారొచ్చేసిందిగాని అదు రానేదు. నాను చూశా, నాను చూశా. కిల్లీ బడ్డీ రంగన్న కూ్కడా ఒకటే అచ్చిరం, పకీరుగాడు రానేదని" అన్నాడు.

చుక్క ఒక్కలగువున లోపలికెళ్లింది. "అదు రానేదు మావో, అదు రానేదు. అంతా అబద్దం" అంటూ తలుపుల్ని కావలించుకుంది.

తలుపులు మెల్లిగా కళ్లు తెరిచి 'అ' అన్నాడు.

"గండం గడిచింది మావా! అదు రానేదు. మద్దినేళ డైవోరు పరాసికం ఆడుండాల. యదవ సచ్చినోడు. మళ్లీపొ్రలానీ సెప్తా" అంది.

తలుపులు అమాంతం చుక్కని గాఢంగా కౌగిలించుకున్నాడు. అతని కళ్లంట జొటజొట కన్నీళ్లు కారాయి. జ్వరం దిగిపోయింది.

"ఎందుకన్నా మంచిదిగాని, మావా, ఇప్పుడే నావకెల్లి, పట్నంలో పోలీసోళ్లకి సెప్పరాదా? సింతాలు కూనీ కేసులో పకీరుగాడికి జేలు కాయమయేదాకా ఈడ కాపలావుండాలనీ" అంది చుక్క.

తలుపులు చుక్కని దగ్గరికి తీసుకుని వీపు తట్టాడు. జుట్టు సరిచేశాడు. "ఎ్రరిమొకవాఁ, మన కోసం పోలీసాళ్లొత్తార్టే! యె్రరి మొకఁవాని– మొకం చూడు" అన్నాడు. అంటూనే చుక్క మొహం చూశాడు. "ఎంత సక్కని మొకం, కళ్లుబ్బిపోనాయిగాని పాపం, యంతేడిశావో నాకోసం" అన్నాడు.

"సర్లే బాగుండాయి సరసాలు. కాత్తుంటే అడొచ్చి ఈప్మీద రేవెట్టుండేవోడే గందా" అంది సావాఁలు నీరసంగానే నవ్వుతూ.

చుక్క పకపక నవ్వింది. "బుద్ది పోనిచ్చుకున్నావుగాదప్పా. పకీరుగాదు, యములాడొచ్చినా సరే మామ నిలాగే కాయిలించుకు సరసాలాడుతూనే సచ్చిపోతాను. నియ్యల్లే నాకు జెరంరాదు ఆపదలొత్తే" అంది.

"అలాగే అలాగే, ఊసులాడ్డానికేఁవిఁ. మద్దినాల మతిసెడి శోకన్నా లెట్టినాళ్లెవరో... సూద్దారి. అదు మూడు గంట్ల కారుకి రాపోతే తరవాద్దానికి రాడని కరారేటి? కాపీనీల్లో, కల్లునీల్లో తాగుతుంటే కారు తప్పుండొచ్చుగా" అంది సావాఁలు.

తలుపులు పట్టుదప్పినట్టయి తలెత్తిచూసింది చుక్క.

మళ్లీ వె్రరిచూపు పడిపోయింది.

"ఆ! ఏటేటీ, ఎలా గెలాగా?" అంటూ కొయ్యబారిపోయాడు తలుపులు.

"నీ జిమ్మడ. యదవనోరూ నివ్వూను" అంటూ లేవబోయింది చుక్క.

తలుపులే చుక్కని పక్కకి తోసేసి లేచి నిలబడ్డాడు.

"ఆ మాటా రైటే, ఆ మాటా రైటే" అంటూ గబగబ గుడిసవతలికి వెళ్లిపోయాడు.

"యాడ కయ్యోవ్ సామీ!" అంటూ వెంటబడింది చుక్క.

"మల్లొత్తా మల్లొత్తా" అంటూ గబగబా వెళ్లిపోయాడు తలుపులు.

☆ ☆ ☆

పొద్దు వాటారింది. ముత్యాలమ్మగుడి దగ్గర రావిచెట్టుకింద కూచున్నాడు తలుపులు చిత్తుగా తాగేసి.

"నా సావిఁరంగ, రారా, ఇయ్యాల నువ్వో నానో ఇస్లాపైస్లా తేలిపోవాల. పుచ్చెలెగిరిపోవాల నయ్యాల" అని గొణుక్కుంటున్నాడు.

అరమైలు అసింటా అప్పుడే బస్సు దిగిన జెమాజెట్టి పకీరు కూడా అదేమాట అనుకున్నాడు కసిగా. దిగుతూనే ఎదర కిళ్లీబడ్డి లోపలికెళ్లి కూచున్నాడు. బస్సు కదిలింది. బస్సులోంచి ఒకే ఒక ఇస్తోకు దిగింది.

"కాసిని సోడా నీల్లియ్యవో" అన్నాడు పకీరు. బడ్డీవాడు కాళీ సోడాకాయ పట్టుకులోపలికెళ్లి 'నీళ్లు' నింపి ఇచ్చాడు.

పకీరు గడగడ తాగేసీ, "ఇంతకన్న వుట్టినీల్లే సరిపోయేదిగా యదవా" అన్నాడు. బుజంమీద తువ్వాలు తీసి తలపాగా చుట్టుకున్నాడు. లుంగీ సరిచేసి బిగించి కట్టుకున్నాడు.

ఈవల ఒకటే జట్కావుంది. అందులో ఇందాకటి ఇస్తోకు రాణీ కూచుని వుంది. రాజా బడ్డీ దగ్గిరకొచ్చి సిగరెట్లు కొంటున్నాడు. పకీరు బండి దగ్గర కొచ్చి, 'దిగండమ్మా, ఈ బండెల్లదు' అన్నాడు.

బండిలో అమ్మాయి కంగారుపడి "ఏవండీ, ఇటు చూడండి. ఇతనేమిటో అంటున్నాడు" అంది.

"దిగమ్మా తల్లే" అన్నాడు పకీరే విసుగ్గా.

రాజా విసురుగా వచ్చాడు, "ఎవఁడ్రా నువ్వు? ఆడవాళ్లని దబాయిస్తున్నావు, బ్లడీఫూల్" అంటూ.

పకీరు వెనక్కి తిరుగుతూనే ఎడంచేయి తిరిగేసి వెనక్కి విసిరాడు.

'అమ్మో' అని ఒక్క కేకపెట్టి చెయ్యి చెంపని అదుముకున్నాడు రాజా. మళ్లీ మాటాడలేదు. అలా చెంపని చెయ్యేసుకుని గుడ్లప్పగించి మాటలేకుండా జేజెమ్మలా ఆరడుగుల ఎత్తున ఉన్న పకీరువేపు చూస్తూ వుండిపోయాడు. అమ్మాయి మాట్లాడకుండా బండి దిగిపోయి తనే పెట్టె కిందకి దించేసింది. మరచెంబు తీసి చేతబట్టుకుని తిన్నగా భర్త దగ్గిరికి వచ్చేసింది. జెబ్బ పట్టుకుని 'ఇలా రండి' అని అసింటా చెట్టు దగ్గిరికి లాక్కుపోయింది. అతను చెంపని చెయ్యి తియ్యలేదు. కన్నార్పలేదు. పన్నెత్తి పలకలేదు. అలాగే చూస్తూ బొమ్మలా భార్య ప్రక్కన చతికిలబడిపోయాడు.

పకీరు బండిలోకెక్కి కూచున్నాడు. 'ఊళ్లోకి పోనీ' అన్నాడు.

"రోడ్డు బావులేదు" అన్నాడు బండివాడు.

"పోనీ" అన్నాడు పకీరు.

బండి కదిలింది. బండిలో అమ్మాయి జోళ్లుండిపోయాయి. ఇవతలకి విసిరేస్తూ "బుల్లోయ్, జోళ్లాగ్గేసినావు" అన్నాడు పకీరు.

తూము మలుపు దగ్గరనే జట్కా ఆపేశాడు బండతను. బుడ్డోడికి జరం కాసిందని, ఇట్నించిలా ఇంటికెళ్తానని బతిమాలి దింపేశాడు పకీర్ని.

పకీరు నవ్వాడు, "ఎదవనాయాల, ఏ వంబద్దాలాడావురా. ఎంత బయ్యంరా. కూడా వత్తే సొచ్చా లియ్యాలని గదా బయ్యం, నాకు తెల్దేటి? అందుకే బండి దోలుకు బతుకుతున్నావు. ఓడి వోటిచ్చెల్లు" అన్నాడు.

☆ ☆ ☆

రావిచెట్టు దగ్గర బండకానుకుని వెల్లకిలా పడుకుని కాలుమీద కాలు వేసుకుని వెకిలి ధైర్యంతో, ఏడుపులాటి నవ్వుతో పిచ్చిలాటి తెలివితో లొల్లాయి పదాలు పాడుతున్నాడు తలుపులు గట్టిగా. పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. బూతు పదాలు నాలుగు వీధులా వినిపిస్తున్నా ఎవరూ ఈవలకొచ్చి వాణ్ణి మందలించలేకపోయారు. కరణంగారు సకుటుంబంగా సినీమా కెళ్లిపోయారు. ఎందుకేనా మంచిదని ప్రెసిడెంటుగారూ వారికి తోడుగా వెళ్లారు.

దశమినించి చవద్దాకా వెన్నెలబంతులాడే పిల్లలు ఇళ్లలోనే సర్దుకుపోయారు. ఎక్కడా సందడి లేదు. అలికిడి లేదు. ఊరందరికీ ప్రాణం ఖంగారుగా వుంది. మనసు గుబులుగా ఉంది. తెల్లారేలోగా ఓఘాయిత్యం జరగడం ఖాయమని అందరికీ అనిపిస్తోంది.

చుక్క రెండుమార్లొచ్చి తలుపుల్ని బతిమాలింది కొంపకి రమ్మని.

"నాసాంచిరంగా! ఇయ్యాల ఆడో నేనో తేలిపోవాల" అన్నాడు తలుపులు. రెండోసారి వచ్చినప్పుడు "మళ్లీ వస్తే సిగపాయి దీసి తంతా" నన్నాడు. మళ్లీ ఏమనుకున్నాడో వెనక్కిపిలిచి అంతపనీచేసి పొమ్మన్నాడు.

మునసబుగారు పెందలాడే భోంచేసి అరుగుమీద కూచున్నారు చుట్టముట్టించి. ఆయనకి ప్రాణం కుతకుత ఊడికిపోతోంది. చూస్తూ చూస్తూ ఓ మనిషిని మరోడు ఖూనీ చేస్తూ వుంటే దిక్కుమాలినట్టు ఊరుకోవడం ఆయనకి నచ్చలేదు. తను వయసుమీద వున్నప్పుడు, అనేకసార్లు ఇలా కలగజేసుకోకుండా ఉండగలిగాడు. ఈనాడు వయసు తనమీదికెక్కి సత్తా తగ్గినమీదట ఇలాటి బుద్ధి పుడుతోంది. గట్టిగా ఓటి చరిస్తే మూణ్ణెల్లు మంచమెక్కాల్సిన స్థితి తనది. మొన్న పాలేరు మీద నోరు చేసుకుంటేనే ఆయాసం వచ్చి ప్రాణం కడంటింది.

"వొంటో ఓపికున్నవాడికి లేని బెడదలు నాకేల" అనుకున్నాడు కాని సావిట్లో కెళ్లబోతూ ఉండగా చుక్క తమ్ముడు ఎక్కడనించో తుర్రున వచ్చి "బాబుగోరూ, పకీరుగోడు బండి దిగి వచ్చేత్తన్నాడండి. మా మావని సంపేస్తాడు" అనేసి పరుగెత్తాడు – ఆయన జవాబు కూడా వినకుండా.

మునసబుగారు ఓ నిముషం మేనువాల్చారుగాని ఉండబట్టలేక చివాల్న లేచి చేతికర్రపట్టుకొని ఇవతలికొచ్చారు. ఆడవాళ్లు లోపల పనుల్లో వున్నారు. గుమ్మంలో ఓ నిముషం నిలబడి మళ్లీ ఆలోచించారు. చివరికి అడుగు ముందరకేసి నడక సాగించారు మెల్లిగా. పకీరు – తలుపులు కొంపకెళ్లాలంటే ముత్యాలమ్మగుడి మీదుగానే దారి. గుడికి ఎడమవేపున పది గజాల్లో అవతల వేపచెట్టుంది.

అక్కడ లోగడ స్కూలుకని వేసిన పాక కూలిపోయి వుంది. రెడ్డి రెండెడ్లబండి గుమ్మానికడ్డంగా వుంది. మునసబుగారు నెమ్మదిగావెళ్లి చెట్టు మొదట్లో బండి చాటుచేసుకొని కుదురుగా నిలబడ్డారు.

☆ ☆ ☆

తలుపులు నానా గోల చేస్తున్నాడు. వెల్లకిలా పడుకుని వెకిలిగా నానా కూతలూ కూస్తున్నాడు, పాడుతున్నాడు. నక్కపిల్లిక్రముక్క మూరెడున్నది దిత్తమైనదోటి పక్కన పెట్టుకున్నాడు. ఐదు నిమిషాల కోసారి రంగణ్ణి తలుస్తున్నాడు. "నాసావిఁరంగా, మల్లీ ఈ పదం విన్నావా? నిమ్మ సెట్టుకూ నిచ్చెన్నేసి నిమ్మపళ్లే కోయబోతే నిమ్మముళ్ళే రొమ్ముననంటేరా ఓరందకాడ తకడి దిందెకాడ కోడెపందెకాడ"

హఠాత్తుగా తలుపులు పాట ఆపేశాడు.

మునసబుగారు గుండె ఝల్లుమంది. కొంచెం ముందుకు వంగి తొంగి చూశారు. అల్లంత దూరాన యములాడిలా పకీరు.

కాలిమీద కాలేసుకు విలాసంగా పడుకున్న తలుపులికి కాలి సందులోంచి పకీరు విగ్రహం కనబడింది. భయంకరంగా కనబడింది. వాడు దర్జాగా ఏనుగులా వొస్తున్నాడు. పొగరుగా వస్తాదులా వస్తున్నాడు.

కోపంగా పాములా వస్తున్నాడు.

భయంకరంగా పకీరులా వస్తున్నాడు.

తలుపులు పాట ఆగిపోయింది. చూపు ఆగిపోయింది. కదలిక ఆగిపోయింది. ఓ క్షణం గుండె ఆగిపోయింది. హఠాత్తుగా ఒక్కసారిగా మల్లీ ఒళ్లంతా వణకడం మొదలుపెట్టింది. రావిచెట్టుమీది కాకి కావుమని అరిచి టపటప రెక్కలు గొట్టుకొని వేపచెట్టుమీది కెగిరింది. ఎక్కడో కుక్క బొయ్యిమని మొరిగింది. రెండు మూడు ఇళ్ల కిటికీ తలుపులు టపటపమన్నాయి. మునసబుగారు కదిలి అరవబోయారు. మాట రాలేదు. కాలు కదలలేదు. అలాగే స్తంభించిపోయారు.

తలుపులికి వొళ్లంతా చెమట పోసేసి, బిగించుకుపోయిన శరీరం పట్టు సడలింది. పకీరు వచ్చేశాడన్న సంగతి పూర్తిగా బుర్రకెక్కింది. కెవ్వున అరవబోయాడు గాని అంతలో తిరిగి ఒళ్లు బిగించుకుపోయింది. చేతులు నేలకి వాలి పిడికిళ్లు బిగించుకుపోయాయి. గొంతు ఎవరో నొక్కేస్తున్నట్లయింది.

పకీరు శరీరం వచ్చి తలుపుల కెదురుగా కాళ్ల దగ్గిర ఆగింది... క్షణంలో సగం పరకాయించి చూసి ముందుకు వంగింది. వెంట్రుకలతో దిట్టంగా దట్టంగా వున్న చెయ్యి వొకటి ముందుకు వచ్చి తలుపులు కమీజు కాలరు పట్టుకుంటోంది. 'తలుపులేనా' అంటోంది; గేదె కొమ్ముల్లాటి మీసాలు, మీసాల్లాటి కనుబొమలూ ఉన్నమొహం. ఇవన్నీ చూస్తే సాక్ష్యం ఇవ్వాల్సి వస్తుందనీ, మల్లీ ఈ రాక్షసుడు ఏం చేస్తాడోననీ, దూరం ఆలోచించి చంద్రుడు మొహం మబ్బు చాటు చేసుకున్నాడు; సినిమా కెళ్లిన కరణంగారిలా, తప్పుకున్న ముత్యాలులా, ఊరుకున్న ప్రెసిడెంటులా, మునసబులా...

తలుపులు తొడుక్కున్న కరణంగారి కమీజు కాలర్ని పకీరు పిడికిలి బిగించి పట్టుకుంది. కొయ్యబారి నోరుతెరచి, గుడ్లు తేలవేసి చూస్తున్న తలుపులు ఒక్కసారి 'బాబోయ్' అని పెద్ద గావుకేక పెట్టాడు. అతనిలో అణిగిపోయిన మగసిరి తిరగబడి మేలుకుంది. భయం మొండితనమైపోయింది. ఒక్కసారి సర్వేంద్రియాలూ చైతన్యం నిండిపోయి అన్నీ ఎగిరాయి. అతని పక్కన నీరసంగా ఎండిన తోటకూర కాడలా పడున్న రెండు చేతులూ గుప్పెళ్ళలో దుమ్ము తీసుకుని, ముందుకు వాలిన పకీరు మొహంలోకి కొట్టాయి. పకీరు పట్టువదలి 'ఛా' అంటూ రెండు చేతులా మొహం మూసుకుని కళ్లు వత్తుకోబోయాడు. విలాసముద్రలో వున్న తలుపులు కాళ్లు రెండూ తెగిన స్ప్రింగులా తన్నుకుని విడివడ్డాయి. ముడుచుకుని ముందుకురికి పకీరుని పొత్తి కడుపుమీదతన్నాయి.

పకీరు వెనక్కు తూలి తమాయించుకుని పెద్దకేక వూరు మారుమోగేదాకా వేయబోయాడు గాని తలుపులు శరీరం మట్టగిడసలా తన్నుకుని బంతిలా పైకెగిరింది. తల పొట్టేలుమల్లే ముందుకు వంగింది. సన్నగా రివటలా ఉండే తలుపులు తాలూకు శరీరం దాన్ని తీసుకువెళ్లి సరాసరి తూలి తమాయించుకోబోతున్న పకీరుపొట్ట మీదకు గురిపెట్టి కొట్టింది. బాణంలా వెళ్లి తగిలాడు తలుపులు.

పకీరు వెనక్కు పడుతూనే రెండు చేతులా తలుపులు జెబ్బలు పట్టుకున్నాడు. పడీపడగానే పక్కగా ఒరిగి ఒక జెబ్బ వదిలి ఆ చేత్తో తలుపులు రొమ్ముమీద గాఢంగా పొడిచాడు. తలుపులు కిక్కురుమనలేకపోయాడు గాని ఆ బాధలో అప్రయత్నంగా అతని అరచేతి కింది భాగం పకీరు కింది పెదిమకు కొట్టుకుంది. పెదిమ చితికి, హడావుడిగా పకీరు కుడిచేతిని ఓదార్పుకు పిలిచింది. ఎడమచెయ్యి అతని అనుమతి తీసుకోకుండానే, సగంలో వదిలేసిన కళ్లకు సేవ చేయబోయింది.

ఈ విధంగా ఊపిరి తీసుకోవడానికి సదుపాయం సంపాదించిన తలుపులు, ఆ పని పూర్తికాగానే ఇంకో దొర్లు దొర్లి లేచి ఉల్లాసంబరానికి అలవాటైన ఒడుపుతో ఎగిరి శక్తికొద్దీ రెండు మడమలతోటీ పకీరు ఎదురురొమ్ము మీదికి దిగాడు. పకీరుకి ఆ క్షణం ఈశ్వరుడు గురించి జిజ్ఞాస కలిగితే, ఆయన రెండే చేతులు యిచ్చినందుకు తిట్టుకొనేవాడు.

ఉన్న రెండింటికే ద్యూటీ ఫిరాయించి తలుపులు కాళ్లు పట్టుకు లాగబోయేలాగా తలుపులు ఒక కాలుతో పకీరు గెడ్డంమీద తన్ని తూలి ముందుకు పడిపోయాడు.

పకీరు కోలుకునేలోగా తలుపులుకు కర్ర అందితే బాగుణ్ణని చెట్టు చాటునించి చూస్తున్న మునసబుగారు చాలా ఆశబడ్డాడుగాని ఆ సదుపాయాలు కనబడుట లేదు.

తలుపులు లేచి కూచుని వెనక్కి చూశాడు. పకీరు నోటివెంట ఎర్రటి రక్తం తెల్లటి వెన్నెలలో నల్లగా మిలమిల మెరుస్తూ చెంపమీదుగా నేలకి జారుతోంది. తలుపులికి అమాంతం బలం, ధైర్యం తొలిసారి ఆవేశించాయి. కూచున్న ఫళంగానే ముందుకు వంగి రెండు పిడికిళ్లూ బిగించి పకీరు రెండు చెంపలమీదా, ముక్కుమీదా మూడుగుద్దులు గుద్దాడు. పకీరు తిరగబడి లేవబోయేవరకు తలుపులు పైకిలేచి నేలమీద అనివున్న పకీరు కుడిచేతిమీద బలంకొద్దీ అడుగేసి తొక్కేశాడు.

'బాబోయ్' అని పెద్ద కేక పెట్టాడు పకీరు. ఊరు మారుమోగిపోయింది. లోకంలో మంచివాళ్లూ– చెడ్డవాళ్లూ, బలవంతులూ, బలహీనులూ, హింసాప్రియులూ అహింసాపరులూ, ఎవరెవరన్న భేదాలకు అతీతమై అరిచిన బాధ అది. చావుబతుకులు రెంటికీ ఐదు నిముషాలుగా సాగుతున్న ఆ భీకర సంగ్రామంలో చిన్నచిన్న మూల్గులు, నిట్టూర్పులు తప్ప అంతవరకూ వినరాని తొలి పొలికేక అది.

తలుపులు ఈసారి బలమంతా పూన్చిన పిడికిలితో నారి సారించినట్టు చెయ్యి వెనక్కిలాగి ఒక్క ఊపున పకీరు మెడ నరంమీద పోటు పొడిచాడు.

'బాబోయ్' అని మరో పొలికేక వేసి గిలగిల తన్నుకున్నాడు పకీరు.

ఇంకో దెబ్బకి తలుపులు సన్నాహం చేస్తూ వుండగా పకీరు పిడికిట పొదిగి బిగించిన బొటనవేలుతో అతని డొక్కలో గాఢంగా పొడిచాడు.

అర్భకుడు తలుపులు, జాతరలో కోడిపెట్టలా తన్నుకుని లేచి చెట్టుదగ్గరికి పరుగెత్తాడు. అక్కడ నక్కపిల్లి కర్ర వుందన్న సంగతి అప్పుడు తట్టింది. కర్ర తీసుకుని గిరుక్కున వెనక్కి తిరిగాడు తలుపులు.

ఆరడుగుల పకీరు గాయపడ్డ పులిలా చూచి చూచి వొడుపుగా అడుగులేస్తున్నాడు తనవేపు.

పకీరు చేతిలో నాలుగంగుళాల బాకుంది.

ఎత్తిన కర్ర ఎత్తినట్టే ఉంచి అట్టే నిలబడిపోయాడు తలుపులు.

దగ్గరకు వచ్చాడు పకీరు.

"దొంగ..."

"పకీరూ" అని హఠాత్తుగా పెద్ద గర్జన వినబడింది.

త్రుళ్లిపడి కేకవేపు చూడబోయి, ఇటు తిరిగేలోగా పకీరు నెత్తిన తలుపులు శక్తివంచనలేని దెబ్బకొట్టాడు, చేవగల కర్రతో.

'బాబోయ్' అని ముత్యం మూడోసారి కేకవేసి కూలిపోయాడు పకీరు.

తలుపులు తీరికగా కుడివేపు చూశాడు. అందాకా చెట్టుచాటున ఉన్న మునసబుగారు ఇవతలికి వచ్చి వెన్నెలలో నిల్చున్నారు. చేత కర్ర పట్టుకుని గంభీరంగా.

తలుపులు మళ్లీ ఇటు తిరిగి కళ్లు మూసుకుని కసిదీరా పకీరును బడితతో బాదుతున్నాడు.

"ఇక చాలు తలుపులూ" అన్నారు మునసబుగారు.

☆ ☆ ☆

పంచాయితీ ఆఫీసు అరుగు దగ్గర జనం చాలామంది చేరారు. ఆఫీసువారి మూడు హరికేను దీపాలూ ధర్మవిజయంలా ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయి. పకీరు కాళ్లూచేతులూ కట్టేసి అరుగుమీద పడేశారు. ముత్యాలు అతని గాయాలు కడిగి మంచినీళ్లు పడుతున్నాడు. చుక్క పసుపు కుంకాలనీ, తలుపులు తాకతునూ మెచ్చుకుంటున్నారు ప్రేక్షకులు. చుక్క మర్నాడు తప్పకుండా అమ్మవారికి ఉపారాలెడతానంటోంది.

తలుపులు నీరసంగా గోడకి జారబడి పడుకున్నాడు. మళ్లీ జ్వరం వచ్చింది. ఒంటిన తెలివి లేదు.

ఇంకో ఘడియకి కారు అలికిడి వినబడింది. సందడి తగ్గి కొత్త గొంతుక వినబడటంతో మెల్లిగా కళ్లు తెరిచాడు తలుపులు.

ఎదురుగా పోలీసులు. జనం అంతా 'అమ్మయ్య' అంటున్నారు.

"పకీర్ని మీరెలా వదిలేశారండీ" అంటున్నారు మునసబుగారు ఆశ్చర్యంగా.

"తలుపుల్ని పట్టుకోవడానికి. చింతాలు కూనీ కేసులో వీడో పైడు హీరో. వాడూ వీడూ కలిసే చంపుంటారు. వీడెలాగో పారిపోయి, పైపెచ్చు కోర్టుకొచ్చి ప్రాసిక్యూషన్ తరపున సాక్ష్యం ఇచ్చి వచ్చాడు. వీడి ప్రతిభ, ఈ సంగతి మధ్యాహ్నమే తెలిసింది. పకీరు ముందరే చెబితే మేం నమ్మలేదు. అందుకని మేమొచ్చేలోగా పకీరు తొందరపడి మాతో చెప్పకుండా వచ్చేశాడు" అన్నారు ఇన్‌స్పెక్టరుగారు.

"కానీ వీడెంత నాటకం ఆడాడూ, మొగుణ్ణి గొట్టి మొగసాల కెక్కినట్టు. సర్లెండి. దొంగని దొంగే పట్టుకోవాలి" అన్నారు మునసబుగారు.

"బావుంది. ఇప్పుడు మీరంతా కలిసి వాళ్లని బట్టిచ్చారు మరి మీరంతా దొంగలేనా?"

"ఏమో? దొరికాక ఒక్కొక్కడు ఒక్కొక్కరకం దొంగ.... దొరికేదాకా ఒక్కొక్కడూ ఒక్కొక్క దొర" అన్నారు మునసబుగారు.

* * *

# బాల రమణీయం

# విమానం కథ



గాలి రివ్వున వీస్తోంది. నల్లటి మబ్బులతో ఆకాశం అంతా నిండిపోయింది. నాగరాజు బడినించి వస్తూనే సావిట్లోంచి గది మంచంమీదకి పలకా పుస్తకాలు విసిరేసి మరీ పరిగెత్తబోయాడు ఆడుకోడానికి.

వాళ్లమ్మ కేకేసి ఆపింది. వానొస్తుంది, వెళ్లొద్దు బాబూ అంది ముద్దుగా. నాగరాజు మూ మూలుగానే గునిశాడు, అమ్మ పెట్టే నాలుగు అందుకోవడం కోసం. అందుకోసమే వాళ్లమ్మకూడా కోపం తెచ్చుకుంది. గుమ్మం కదిలితే కాళ్లు విరగ్గొడతా అంది.

మళ్ళీ ఎందుకేనా మంచిదని పైకిపద భడవా అని మేడమీదకి తీసుకుపోయి రెండు చేగోడీలూ నాలుగు చివాట్లు పెట్టింది. తరవాత జీకేబుక్కూ, లెక్కలబుక్కూ, పలకాబలపం చేతికిచ్చి గదిలోవేసి గొళ్ళెంపెట్టి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

నాగరాజుకి కోపం వచ్చింది. కొంచెంసేపు ఏడ్చిచూశాడు గట్టిగా. అమ్మ తలుపు తియ్యలేదు. కిందకి వెళ్ళిపోయిందికామోసు. ఇంక నెలాగా వినబడదు ఏడ్చినా. అందుకని నాగరాజు ఏడుపు మానేశాడు. పుస్తకాలూ అవీ ఓమూలకి తోసేశాడు. అమ్మ పెట్టిన చేగోడీలు చప్పని అయిపోకుండా మెల్లిగా నములుతూ, చివాట్లు నెమరువేస్తూ, కిటికీలో కూర్చున్నాడు పిల్లకోతిలా. బయట కోతిపిల్లలు ఆడుకుంటున్నారు. వాళ్ళు పుట్టి పెరిగే భడవలనుకో...ఇంకో రెండు చేగోడీలిచ్చినా బావుండును అనుకున్నాడు నాగరాజు...ఎదురింటివాళ్లింటిమీద గెద్దవాలింది. ఇంటిమీద గెద్ద వాలకూడదుట, వాలితే ఇంట్లోంచి వెళ్ళిపోవాలి... దూరంగా బండరాముడు వస్తున్నాడు. వాడిచేతిలో పకోడీల పొట్లాం వుంది. పొట్లంవాసన చూసుకుంటూ, నాడియావారి వాడియాకీ జై అని అరుస్తూన్నాడు బండరాముడు. పకోడీలు బాగుంటాయి. నారాయణకొట్టులో సాయంకాలం వేయించే ఉల్లిపాయపకోడీలు మరీ బావుంటాయి..నాగరాజుకి నోరూరింది. బండరాముడు పకోడీలపొట్లం పైకి ఎగరేసి పట్టుకుంటూ నాగరాజుకేసి చూసి వెక్కిరించాడు. 'పకోడీలోచ్చి' అన్నాడు. వాడు ఎనిమీపార్టీవాడు. నాగరాజుకి కోపం వచ్చింది. ఎదురింటి మీద గెద్ద వీడిచేతులో

పొట్లం తన్నుకుపోవాలమ్మా, అలాచేస్తే 70 వేల 2 వందల 19 కొబ్బరికాయలు కొడతానమ్మా అని దండం పెట్టుకున్నాడు. సరిగ్గా అప్పుడే గెద్దకూడా బండరాముడి చేతిలో పొట్లం చూసింది. దానికి నోరూరింది. వెంటనే ఒక్కసారి రెక్కలాడించి ఆకాశంలోకి ఎగిరింది. మళ్ళీ రెక్కలాడించకుండానే అలా ఎగురుతూ బండరాముడి నెత్తిమీద నాలుగైదుసార్లు చక్రాలు కొట్టింది. నాగరాజు గెద్దలు ఎగరడం చాలాసార్లు చూశాడు గాని, ఈసారి మాత్రం చాలా ఆశ్చర్యం వేసింది. అసలది కాకిలాగా





బండరాముడి పకోడీపొట్లం తన్నుకుపో_

పిచ్చికలాగా రెక్కలు ఊగించదేం అనుకున్నాడు. వాడికి కూడా ఎగరాలనిపించింది. గదిలోనే ఎగిరిచూశాడు చేతులుజాపి. ఊహూ లాభంలేదు. మళ్ళా కిటికీ దగ్గిరికివచ్చి చూశాడు. పైనతిరుగుతున్న గెద్ద రివ్వున కిందకి వాలి, అమాంతంగా బండరాముడి చేతిలో పొట్లం తన్నుకుని ఝామ్మని మళ్ళీ ఇంటి కప్పుమీదికి ఎగిరిపోయింది. నాగరాజుకి భలేసంతోషం వేసింది.

తరవాత మళ్ళీ ఆశ్చర్యంవేసింది. అసలు ఈ గెద్ద అలా ఎలా ఎగిరిందీ అని. చాలాసేపు ఆలోచించాడు. వాడికి తెలియలేదు.

ఆ మధ్య–అంటే చాలా ఏళ్ళక్రితం చాలా మంది కుర్రాళ్ళకి ఇలాగే బోలెడు సందేహాలు వచ్చాయి.



జేమ్స్‌వాట్

జేమ్సు వాట్ అనే కుర్రాడుండేవాడుట. వాళ్ళమ్మ కాఫీ కెటిల్‌లో నీళ్ళు (వాళ్ళు తెల్ల దొరలులే) కాస్తూంటే మూతెగిరెగిరిపడుతోంది. అది ఎలా ఎగురుతుందీ అని జేమ్స్‌కి సందేహం వచ్చింది. 'ఆవిరి మూలమున ఎగురుచుండెను' అని నువ్వు ఇపుడు చెప్పకోగలవనుకో. అప్పుడు ఎవరికి తెలీదు. మేష్టర్లకికూడా తెలీదు. ఏం? ఆ సందేహం మూలంగానే తరవాత చాలా రోజులికి రైలుబండి తయారైంది. న్యూటన్ అనే ఇంకో కుర్రాడు

ఉండేవాడు. కొంచెం పెద్దాడేలే. ఒక రోజుని అతను చెట్టుకింద బెంచిమీద కూర్చున్నాట్ట. ఒక ఆపిలు గబుక్కుని అతని నెత్తిమీద పడింది. సుబ్బరంగా తినేసి పోవచ్చుగా. న్యూటను మాత్రం దాన్ని చూసి ఈ పండు చెట్టునించి ఊడినపుడు కిందకే ఎందుకు పడాలి, పైకి పోకూడదా అనుకున్నాడు. ఆ సందేహం మూలంగా బోలెడు కొత్త సంగతులు తెలిశాయి. బండరాముడికి అందరి గోళీకాయలు లాక్కోవాలని బుద్ధి ఉన్నట్లే, భూమికి అందర్నీ,




అన్నిటినీ తన దగ్గిరసా లాక్కోవాలని ఒక గుణం ఉందని తెలిసింది.

సిద్ధార్థుడనే అతనికి చిన్నప్పుడే ఒక గొప్ప సందేహం వచ్చింది. ఇంత పెద్ద భూలోకం తయారుచేసి అందులో ఇంతమంది మనుష్యుల్ని పెట్టిన దేవుడు మళ్ళీ వాళ్ళకి కష్టాలు ఎందుకు పెట్టాలి? ఎందుకు జబ్బు చెయనివ్వాలి? ఎందుకు చచ్చిపో నివ్వాలి? అని అతనికి సందేహాలు వచ్చాయి. చాలాకాలం తరవాత అతనే మనుష్యులందరు సుఖంగా బతకడానికి మంచి పద్ధతులు చెప్పాడు, బుద్ధుడు అయ్యాడు.

ఇలా చిన్నపిల్లలికి వచ్చిన సందేహాలు ఎన్నో పెద్దపెద్ద సంగతులు తెలుసుకోడానికి సాయం చేశాయి. వాటి వల్లనే గొప్పగొప్ప పనులెన్నో జరిగాయి. మనందరికి అన్ని రకాల సదుపాయాలు సుఖాలూ వాటివల్లనే కలిగాయి.

ఇపుడు గెద్ద ఎలా ఎగిరిందని నాగరాజుకి సందేహం వేసిందిగదా. ఎలాగేమిటి మామూలుగానే అని మనం జవాబు చెప్పెయ్యవచ్చు. కాని అసలెలా ఎగురుతుంది?

మరి గెద్ద రెక్కలాడించకుండా ఎగురుతుందికదా కాకి అలా ఎగరదేం అని నేను మా మావయ్యని అడిగాను చిన్నప్పుడు. వాడి చిన్నప్పుడు కాదు. నా చిన్నప్పుడులే. ఎలాగో అలా ఎగుర్తుందిలే నీ కెందుకు నీ యేడుపు నువ్వేడు అని మావయ్య విసుక్కున్నాడు.

చాలాకాలం కిందట— విమానాలు రావడానికి చాలాకాలం ముందు— చాలామంది పెద్దవాళ్ళకే ఇలాటి ఊహలు వచ్చాయి. నాగరాజుకి వచ్చినలాటివే. వాళ్ళకీ పక్షులలా ఎగరాలని ఎంతో ఆశగా ఉండేది. ఇపుడైతే విమానాలు తయారుచేశారు కాబట్టే, ఎగరడం గురించి పుస్తకాలనిండా రాశారు కాబట్టి అందరికీ తెలుసుననుకో. ఆ రోజుల్లో మీ అమ్మమ్మగారి చిన్నపుడు రైలుబళ్లు కూడా లేవుగదా. అంచేత పెద్దవాళ్ళకి కూడా ఏం తెలీదు. ఇంకా పెద్దవాళ్ళని అడిగినా ఏమో అనేవాళ్లు. అందుచేత ఎలా ఎగరడం అని ఎవరికి సందేహం వస్తే వాళ్ళే చాలాసేపు ఆలోచించుకుని, "ఓహో ఇలా కాబోలు" అనుకోడం, అలాగే ఎగరడం, దభేలున కిందపడడమూను. మళ్ళీ కాస్త కూచుని ఆలోచించేవాళ్ళు. ఓహో ఇందాక తప్పు చేశాను. ఇలా కాబోలు అనుకుని మళ్ళీ ప్రయత్నం చేసేవారు. ఈ రకంగా తిప్పలు పడేవాళ్ళనిచూసి ఆ రోజుల్లో అందరూ నవ్వేవాళ్ళు. వెక్కిరించి వేళాకోళం చేసేవారు.

ఒకరోజు పొద్దున్నే ఒక పెద్దమనిషి మేడమీదనించి గొడుగువేసుకు కిందికిదూకే వాడు. దభేల్నపడి చట్టవిరగొట్టుకుని అమ్మోయ్ బాబోయ్ అని ఏడ్చేవాడు. ఇంకో ఆయన జెబ్బలకి చేటలో, చేటలలాటి రెక్కలో కట్టుకుని టపటపలాడిస్తూ గబగబ పరిగెత్తేవాడు, ఎగిరిపోతానుగదా అని. చుట్టూరా జనం చూసి పకపకనవ్వేవారు. వెర్రివెంగళాయ అని హేళనచేసేవారు.

కాని నిజంగా వాళ్ళు వెర్రివాళ్ళుకారనీ చాలా తెలివైనవాళ్ళనీ మెల్లిమెల్లిగా తెలుస్తూ వచ్చింది. వాళ్లు ఆ రోజుల్లో ఎవరేనా ఎగరాలని ప్రయత్నంచేస్తే, ముందర పోలీసులకి చెప్పాలి అని ఆర్డరు. వాళ్ళు ఎగిరేటపుడు పోలీసులు కాపలా ఉండేవాళ్లు. అంతెందుకు నేలమీదనడిచే మోటారు కార్లకే కొత్తలో నానాగోలాచేసేవారుట.

గుర్రం లాగకుండా బండి ఎలా పోతుందాని అనుమానం. ఎవరిమీద ఎక్కిపోతుందో నన్న భయం. అందుచేత కారు నడిపేవారు పోలీసులకు చెబుతే తప్ప రోడ్డుమీద కారుని పోనిచ్చేవారు కారు.

ఇలా కాళ్ళు చేతులూ విరుచుకుంటూ, ముక్కుమొహం చితక్కొట్టుకుంటూ, వెక్కిరింపులు భరిస్తూ ఆ రోజుల్లో వాళ్లు ఎగరడానికి పట్టుదలతో ప్రయత్నం చేశారు. దాని మూలంగానే ఇవాళ విమానాలు, హెలికాప్టర్లూ ప్రపంచం అంతా ఎగురుతున్నాయి. పొద్దున్న మెడ్రాసులో విమానం ఎక్కితే మధ్యాహ్నానికల్లా ఢిల్లీ చేరుతున్నాయి. అలాటి ప్రయత్నాలు చేస్తేనే రాకెట్‌లు ఆకాశంలోకి వెళ్తున్నాయి. స్పుత్నిక్కులు చంద్రుడికీ, సూర్యుడికీ కూడా ప్రదక్షిణాలు తిరుగుతున్నాయి.

సూర్యుడంటే జ్ఞాపకం వచ్చింది. మనిషి ఎగరవచ్చుననీ విమానాలు మనుషుల్ని మోసుకు ఆకాశంలోకి పోతాయని పురాణాలలోనే ఉంది. (మనుషులు వాళ్ళంతటవాళ్లు ఇంకా ఎగరటం లేదనుకో) అలా అంటే ఇప్పుడు, నవ్వుతారనుకో. ఈ విమానాలు బాంబులూ అవన్నీ ఎప్పుడో తెలుసునని కొందరు గొప్పలు పోతారులే. అదలాపోనీసానీ, హనుమంతుడు తెలుసుగదా, అతను వాయుదేవుడికి పుట్టాడు. చిన్నప్పట్నించీ ఎగిరేవాడు. ఎగరడానికీ గాలికీ చుట్టరికం ఈ కథలోనే ఉంది. చెప్పొచ్చేదేమిటంటే అంటే హనుమంతుడు చిన్నప్పుడు పై కెగిరి సూర్యుడిని పండు అనుకొని మింగేయబోయి మూతి కాలి పడిపోయాడని ఒక కథ ఉంది. సూర్యుడి దగ్గర చదువుకోడానికి వెళ్లాడనీ, దగ్గరకెళ్లాక ఆ వేడికి ఆగలేక కిందపడిపోయాడని ఇంకో కథ వుంది.

☆ ☆ ☆

ఈ కాలంనాటి కథకు వస్తే ఎగరడానికి ప్రయత్నం చేసిన పెద్దమనిషి ఒకాయన స్కాట్‌లాండ్‌లో ఉండేవాడు.

ఓరోజు అతగాడు ఊళ్ళో పదిమందినీ కేకేసుకొచ్చి, "ఏవర్రోయ్ నేను స్కాట్‌లాండ్‌నించి ఫ్రాన్సుదేశానికి ఎగిరివెళ్తాను, చూసుకోండి మరి కాసుకోండి మరి" అన్నాడు.

జనంఅంతా నవ్వి చప్పట్లు కొట్టారు.

అతడు పక్షిఈకలతో ఒక జత రెక్కలు తయారుచేసి, వాటెని తన జెబ్బలకు తగిలించుకున్నాడు. ఆవటా స్టర్లింగ్ కాసిల్ అనే ఒక పెద్దభవనంమీదకి ఎక్కాడు. అక్కడనించుని మోళీవాళ్లు చేసేటంత గోలచేశాడు. అంతే, ఒక్కసారిగా ఝూమ్మని

ఆ పైనించి ఫ్రాన్సుదేశంవేపు దూకేసి రెక్కలు ఆడించాడు. అయితే అతను అనుకున్నట్టు ఫ్రాన్సుదాకా వెళ్ళలేకపోయాడు. ఎందుకంటే దూకీదూకగానే సరాసరి ఆ మేడతాలూకు గోడదగ్గిరసానే దభీమని పడిపోయాడు.

చుట్టూ ఉన్న వాళ్లందరూ గొల్లుమని నవ్వి, చప్పట్లు కొట్టి వెక్కిరించారు. అయితేనేం కిందపడిన ఆ పెద్దమనిషిమాత్రం సిగ్గుపడి తల దించుకోలేదు. "మామయ్యా, చూడు వీళ్ళు వెక్కిరిస్తున్నారు" అని ఏడవలేదు. బట్టలు దులుపుకుంటూ లేచి, అప్పటికి తోచిన జవాబు రపీమని చెప్పేశాడు. "పొండయ్యా! నేను కాకీఈకల రెక్కలు కట్టుకున్నాను గాని, అదే డేగవైతే తప్పకుండా ఈపాటికి సగందూరం ఎగిరి వెళ్ళే వాడినే. పొరబాటైంది" అన్నాడు.

ఇలా ఎవరేనా హేళన చేసినా సిగ్గుపడకుండా తిట్టినా భయపడకుండా పట్టుదలతో తెగింపుతో ఆ రోజుల్లో ఇలాటివాళ్ళు ప్రయత్నం చేశారు కాబట్టే ఇవాళ విమానాలూ రాకెట్లూ ఇలా ఎగురుతున్నాయి. వాళ్ళు అలా ప్రయత్నాలు చేయడానికీ, అసలు ఎగరాలి అన్న ఊహ రావడానికి పక్షులు—ముఖ్యంగా గద్దలు, గబ్బిలాలూ కారణం.

క్రీస్తుకుపూర్వం 400 సంవత్సరాలక్రితం ఆర్కిటస్ అనే ఆయన ఇలాగే గబ్బిలాలను చూసిచూసి, తనూ ఎగరాలనుకున్నాడుట. అయితే ఎందుకేనా మంచిదని, ముందర ఒక పక్షిని తయారుచేస్తే బాగుంటుందనుకున్నాడు. కర్రతో ఒకటి తయారుచేసి, గబ్బిలంలాగా దానికి గుడ్డతో రెక్కలు అమర్చి ఎగరేశాడట.

ఈ కట్టుకథలూ, పిట్టకథలూ ఎలా ఉన్నా ఆకాశంలో మనుషులు ఎగరాలి అన్న ఆలోచన, దాన్నిగురించిన గొడవ 1750 ప్రాంతాలలో బయల్దేరి, 1800 ప్రాంతాలలో పుంజుకుని, 20వ శతాబ్దంలో జోరు హెచ్చి దరిమిలా బాగా పేట్రేగిపోయింది.

అంతకుముందు ఏవో ప్రయత్నాలు అంతంతగా జరిగాయి. కథలు కావులే. చరిత్రలో మనకి తెలిసిన మనుషులు చేసినవన్నమాట.

లియనార్డో డావిన్సీ అనే పేరు విన్నావా? ఆయన ఇటలీవాడు. బలే గట్టివాడు కూడా. చిత్రకారుడుగా ఆయనకు పేరు ఉంది. ఇంకా చాలా సంగతులు తెలుసు. అసలాయనకి అక్కరలేని విషయం లేదు. అన్నిటి గురించీ తెలుసుకున్నాడు. ఎన్నెన్నో ఆలోచించేవాడు. ఎన్నో కనిపెట్టేవాడు. ఆయన 15వ శతాబ్దం చివరిభాగంలో—అంటే 1490 ప్రాంతాలలోనే విమానాల గురించి ఆలోచన చేశాడు. ఒక పుస్తకం కూడా రాసేశాడు. అందులో విమానాలు ఎలా ఉండాలో, వాటిని ఎలా ఎగరేయ వచ్చునో చూపిస్తూ బొమ్మలు కూడా వేశాడు. అయితేనేం. ఆయన ఎగిరి చూపించలేదనుకో.

దాదాపు వందేళ్ల తర్వాత ఇంకో ఇటాలియను విమానాల మీద ఇంకోపుస్తకం రాశాడు. ఆయనపేరు ఫ్రాన్సిస్ లానా. అందులో ఈయన బెలూన్‌లు అనేవి పైకి ఎగరతాయని చెప్పి, అవి చేసే పద్ధతి చూపిస్తూ బొమ్మలు వేశాడు. ఇంకోరకం విమానంలాంటిదికూడా ఆయన చూపించాడు. ఇక్కడ బొమ్మ ఉంది చూడు. అలాగ ఒక చిన్న పడవ తయారు చెయ్యాలిట. రాగి రేకుతో నాలుగు గోళాలు తయారుచేసి వాటిని ఆ పడవకి ఆ చివరా ఈ చివరా అమర్చాలి. మామూలు పడవలలాగే తెరచాపా చుక్కానీ పెట్టమన్నాడు.



పడవలాంటి విమానం

ఆ రాగి గోళాల్లోంచి గాలితీసేస్తే అవి తేలికపడి పైకి ఎగురుతాయనీ అప్పుడు వాటితోపాటు పడవకూడా పైకి లేస్తుందనీ ఈయన రాశాడు. అప్పుడేమో ఈ తెరచాపా, చుక్కానీ వాడుకుని మన యిష్టం వచ్చిన ఊరికి ఎగిరి వెళ్ళవచ్చునన్నాడు.

ఊహ మంచిదే కాని, నిజంగా యిది ఎగరడానికి వీలులేదు. ఎందుకంటే, రాగిగోళాలలోంచి గాలితీసేస్తే బయటిగాలి వాటిలోకి పోవాలని ప్రయత్నిస్తుంది. ఆ తోపిడిని తట్టుకోవాలంటే ఈ గోళాల గోడలు దళసరిగా బలంగా ఉండాలి. గోడ దళసరి అయితే గోళం బరువు ఎక్కువ అవుతుంది. బరువెక్కువైతే గోళమే ఎగరదు. ఇంక పడవెలా తేలుతుంది? అదీ సంగతి.

ఇదేదో బయటిగాలి లోపలికి, లోపలిగాలి బయటికీ తోసుకు రావడం ఏమిటి అని తికమకపడకు. గాలి బుద్ధి అంతేలే. అరుగుమీద నీళ్ళుపోస్తే అవి రోడ్డుమీదకి ఉరుకుతాయి. గదా. అలా నీరు పల్లానికిపోయినట్లే గాలికూడా ఖాళీగా ఉన్న చోటుకి దూకుడుగా పోతుంది. ఖాళీయేగాదు, గాలితక్కువైన చోటుకికూడా వెళ్ళిపోతుంది. మనకి కనబడదనుకో. కొందరికి చూడు, పక్కింటి వాళ్ళు ఏం చేస్తున్నారో ఏం తింటున్నారో అని ఉంటుందిగదా. కాస్త అలికిడి అయితే చాలు, వీళ్ళ కళ్ళూ చెవులూ బుద్ధీ అన్నీ అటు పరిగెడతాయి. గాలిగుణంకూడా అంతేనన్న మాట. ఎక్కడ కాస్తచోటు దొరికినా తోసుకువచ్చి దూరిపోతుంది. గాలిలేని చోటులేదు.

నీ చుట్టూ, మీ యింటిచుట్టూ, మీ ఊరిచుట్టూ, ఈ భూగోళం అంతటా గాలి వుంది. గాలి బలమైనది. గాలికి బరువుంది. పరి గెట్టినపుడు, సైకిలుతొక్కినపుడు, రైల్లోవెళ్తూ కిటికీలోంచి చెయ్యి బయటకు జాపినపుడూ గాలి బలం ఏమిటో గాలి జోరు ఏమిటో బాగా తెలుస్తుంది.




ఇంక బరువంటావా, నువ్వు అరచెయ్యిజాస్తే, చదరపు అంగుళానికి 14 పౌనుల బరువు మోస్తున్నావన్నమాట. విమానంలాంటివి వేగంగా ఎగురుతూ పోతున్నపుడు దాని రెక్కలమీద చదరపు అంగుళానికి 14 ఏనుగుల బరువుంటుంది. ఇవన్నీ గబుక్కున తెలీవనుకో. గాలిని తూకం వేస్తే బరువు తెలుస్తుంది. అంటే మామూలు కాటాలూ తక్కెడలమీద కాదనుకో. దీనికోసం సున్నితమైన త్రాసులుంటాయి. అద్దాలపెట్టెలో పెడతారు వాటిని. ఓ ఖాళీ సీసా తీసుకో. అది ఎంత ఖాళీ అయినా గాలి ఉంటుంది. దాన్ని ముందర తూచాలి. అది సీసా, గాలీ కలిసి తూగే బరువున్నమాట. తరవాత, సీసాకు చిల్లున్న బిరడాపెట్టి, పంపులోంచి అందులో గాలిని తీసేసి (దానికి సదుపాయాలుంటాయిలే. నువ్విపుడిపుడే చెయ్యొద్దు.) ఆ ఖాళీసీసాని తూచాలి. అపుడు ఇందాకటి బరువునుంచి ఈ బరువుని తీస్తే సీసాలో గాలి బరువు తెలుస్తుంది. ఈ కాంపోజిషన్ అంతా విసుగ్గా ఉంటుందనుకో అయినా చాలా ఆలోచించి తిప్పలుపడి ఎవరో గాలికి బరువు వుందని ఏనాడో ఆసంగతి కనుక్కున్నారు కాబట్టే, గాలికన్నా తేలికైనది గాలిలో తేలుతుందనీ ఇంకెవరో కనుక్కున్నారు. అలా అయితే బెలూన్ తయారుచేసి ఎగరవేయవచ్చునని మరెవరో అన్నారు. అలా కొందరు ఎగిరిచూసి ఇంకోలా ఎగరొచ్చునని ఇంకోరు అనుకున్నారు. 170 ఏళ్ళ క్రితం ఏమయిందో తెలుసా? ఇపుడిలా అంటే నవ్వొస్తుంది కాని, అపుడు గొప్పే. గాలికి బరువుందనే కాకుండా, వేడిగాలి చల్లగాలికన్న తేలిక అని కూడా కనుక్కున్నారు.

ఒక సీసాని తూచి చూచి బరువెంతో రాసుకుని, తరవాత దాన్ని వేడిచేసి చూస్తే బరువు తగ్గినట్లు తెలుస్తుంది. వేడి చెయ్యగానే సీసాలో గాలి వేయించిన అటుకులా ఉబ్బిపోయి, చోటుచాలక బయటికి పోయిందన్నమాట. మిగిలిన కాస్త గాలీ, చుట్టూ ఉన్నదానికన్న తేలికగదా! అంచేత అది తేలిపోవాలని చూస్తుంది. సీసాలో ఉంది కాబట్టి, దాన్ని కూడా ఎత్తివేయాలని కోరుకుంటుందనుకో.

నీళ్ళలో రాయి పడేస్తే, బుడుంగున మునిగిపోతుంది. చెక్కముక్క వేస్తే పైకి తేలిపోతుంది. ఎంచేత అంటే దానికి చాలా కథ ఉందనుకో. నీటికన్న బరువు కాబట్టి రాయి మునిగిందనీ, తేలిక కాబట్టి చెక్క తేలిందనీ చెప్పుకుంటే చాలు. మీ తమ్ముణ్ణి నాన్నగారు ఇట్టే ఎత్తుకుంటారు. ఎగరేసి ఆడిస్తారు. మరి మీ తమ్ముడు మీ నాన్నగారిని అలా ఎత్తుకు ఎగరెయ్యగలడా?

గాలికూడా అంతే. తనకన్న తేలికైనది ఉంటే పైకి ఎత్తేస్తుంది. అయితే ఇంకో లక్షణం ఉంది. బరువైనదీ బలమైనదీ అడ్డునిలబడితే మన కెందుకని తప్పుకుపోదు. దాన్ని గట్టిగా తోసేస్తుంది. ఈ గుట్టు కనిపెట్టే భూమిమీదా, ఇంకా కాలవలమీదా పడవాళ్ళు తెడ్లు వెయ్యడం మానేసి తెర చాపలు ఎత్తుతున్నారు చాలా రోజుల్నించి. 110 ఏళ్ళక్రితం రెక్కలు తగిలించుకుని అలా ఎగరబోయినవాళ్ళంతా దబుకూదబుకూ కిందపడడంచూసి, ఇద్దరు ఫ్రెంచివాళ్ళు – ప్లేటు తిరగేసి కొత్తపద్ధతి ఆలోచించారు. మనం ఎగరడం సంగతి దేవుడెరుగు, ముందర మనం ఎగరేసేదేమైనా పైకి పోతుందా అని ఆలోచించారు. గాలికన్న తేలికైనది తేలిపోతుంది అని తెలుసుగా, అందుకని వాళ్ళు కాగితంతో ఒక పెద్దబుట్ట తయారుచేశారు. ఈ బొమ్మ చూడు ఎంత పెద్దదో తెలుస్తుంది. ఆ బుట్టని బోర్లేసి కాస్త ఎత్తున కట్టారు. కర్రలు అవీ కట్టి తిప్పలుపడి ఉంటారులే. కింద మంట పెట్టారు. పొగ బయల్దేరింది. ఆ బుట్టమూతిలోంచి (తలక్రిందులుగా ఉందిగా) లోపలికి దూరింది. మంట వేడికి



బుట్ట, అందులో గాలీ వేడెక్కి పోయాయి. గాలి విస్తరించి చోటు చాలక ఇవతలకి వచ్చేసింది. ఇంక లోపలేముంది? కొద్దిగా వేడిగాలీ, పొగాను. ఇది మామూలు గాలి కన్న తేలికేగా. తేలికవీ తేలిపోతాయిగా. చుట్టూవున్న గాలి బుట్టని లోకువకట్టి పైకి ఎత్తేసింది. దాన్ని నేలకి కట్టిపెట్టిన తాళ్లు కూడా ఆ బలానికి తెగిపోయాయి. అంత పెద్ద బుట్టా ఒక్కసారిగా బాణంలా రాకెట్‌లా రివ్వుమని ఆకాశంలోకి ఎగిరిపోయింది. ఇదంతా చేసిన ఫ్రెంచివాళ్ళిద్దరూ జై జై అని గెంతులేసి చప్పట్లు కొట్టారు. ఇది భలేగా ఉందనుకున్నారు. ఈ బుట్ట ఎగురుతున్నపుడు దీన్ని పట్టుకుంటే మనం కూడా ఆకాశంలోనికి ఎగిరిపో వచ్చు గదా అనుకున్నారు ఆ యిద్దరు అన్నదమ్ములు, అన్న పేరు జోసెఫ్ మాంట్ గాఫియర్, తమ్ముడి పేరు ఎటియర్. కొన్నాళ్ల తరవాత ఈ అన్నదమ్ములిద్దరూ గుడ్డతోటి ఒక బుట్ట తయారు చేశారు. గాలిపడగకి మనం బాణం కట్టం? అలాగే వెదురు పుల్లలతో చట్రంకట్టి దానికి బిగించారు. ఓ రోజున ఊరందరినీ అద్భుతం చూడండహో అని దండోరా వేసి మరీ పిలిచారు. ఊరి చివర అంతా సిద్ధంచేశారు. గుడ్డతో చేసిన ఆ బుట్టమీద చక్కని బొమ్మలు వేసి అందంగా తయారు చేశారు.




అది 1783వ సంవత్సరం. నెల జూన్. తేదీ 5. ఊరివారంతా చుట్టూచేరి ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. అన్నదమ్ములిద్దరూ బుట్టకింద మంట వేశారు. పొగ లేచింది. కొద్దినిముషాలలో బుట్ట, తాళ్ళు వూడలాక్కుని పైకిలేచింది. అలా ఆకాశంలో ఎత్తుకిపోయింది.

విమానాలు కనిపెట్టడానికి పడిన తిప్పలలో ఇది చాలా గొప్పదని గుర్తుంచుకో.

సరే ఆ బుట్ట పైకిపోయి ఏమైంది తెలుసా? గాలి ఎటుపదమంటే అటుపోయింది. పొరుగూరు పద అంది గాలి. సరే అంది బుట్ట. రెండుమైళ్ళ దూరంలోవున్న పక్కపల్లెటూరుకి వెళ్ళేసరికి బుట్టలోకి చల్లగాలి మెల్లిగా దూరింది. అంచేత అది బరువెక్కి ఆ వూళ్ళో మెల్లిగా దిగింది. అక్కడ వాళ్ళకి ఇది బుట్ట అనీ, పొరుగూళ్ళో ఎవరో ఎగరేశారని తెలీదుగా. ఇదేమిటో ఆకాశంలోంచి దిగుతూంది అనుకున్నారు. భూతం అని భయపడ్డారు. అవటా ఈటెలూ కర్రలూ పట్టుకొచ్చి అది దిగుతూ వుండగానే దానిమీదకి ఈటెలు విసిరి, రాళ్ళు రువ్వి తూట్లుతూట్లు పొడిచేశారు. కిందపడగానే చీల్చిచెండాడి చింపిపోగులుపోసి అమ్మయ్య భూతం చచ్చింది అనుకున్నారు. తరవాత మెల్లిగా తెలిసింది. ఇదీ మనుషులు చేసిందే అని. వాళ్ళకేకాదు దేశంలో అందరికీ తెలిసింది. ఎగరాలి అని ఆశపడుతూ అవస్థలు పడుతున్న వాళ్ళందరికీ ఇది వినగానే మళ్ళా ధైర్యం వచ్చింది. ఇంకాస్త పెద్ద బుట్ట

కడితే మనిషికూడా దాంతో కలసి ఆకాశంలోకి పోవచ్చునని నమ్మకం కలిగింది.

ఇది ఇలా ఉంచు. ఇది జరగడానికి పదిహేనేళ్ళ క్రితమే ఇంకో మంచిసంగతి కనిపెట్టాడొకాయన – గాలికన్నా హైడ్రోజన్ చాలా తేలిక అని. గాలి బరువులో అది సుమారు పధ్నాలుగోవంతు ఉంటుంది. ఈ సంగతి బయటపడ్డ కొన్నాళ్ళకి డా॥ బ్లాక్ అనే ఇంగ్లీషాయన పెద్ద గుమ్మటం ఒకటి కట్టి దాంట్లోకి హైడ్రోజన్ ఎక్కిస్తే అది తేలుతుందీ అన్నాడు. అలా అని ప్రయత్నం కూడా చేశాడు కాని ఆయన కట్టిన గుమ్మటాలు మరీ ఎక్కువ బరువైనందువల్ల, హైడ్రోజన్ ఎంత తేలిక అయినా అవి పైకి ఎగరలేకపోయాయి.

తరవాత కొన్నాళ్లకి కావెలో అనే ఇంకో ఆయన ఒక రోజు ఇంట్లో కూర్చుని ఏం పనిలేక సబ్బునీటితో బుడగలు ఊదాడు. ఇపుడు మనకి ఆట అనుకో, ఆ బుడగలు అలా పైకి తేలి చూరుకి అంటిపెట్టుకుపోయేసరికి ఆయనకూడా అంత ఎత్తుకీ ఎగిరి గంతేశాడు. ఇలా గాలికన్న తేలికైనదాన్ని బెలూన్‌లో నింపితే పైకెడుతుందని అనుకున్నాడు.

ఆనాటికే, ఫ్రాన్సులో చార్లెస్ అనే ఒకాయన అంతపనీచేసి ఊరుకున్నాడు. ఆయన సిల్కుతో గుమ్మటంచేసి అందులోకి హైడ్రోజన్ ఎక్కించేసరికి అది నిజంగానే ఎగిరింది. ఇందాక చెప్పిన మాంట్ గాఫియర్ కాగితంబుట్ట (వేడిగాలివల్ల) 1783 జూన్ 5న ఎగిరితే, ఈ హైడ్రోజన్ బెలూన్ అదే సంవత్సరంలో ఆగస్టు 27న పైకి వెళ్ళింది.

ఇపుడు మామూలు చిన్న బెలూన్ కానీకి ఒకటిస్తే, హైడ్రోజన్ బెలూను అర్ధణాకి ఇస్తారుగదా, అది చూశావుగా. దారంకట్టి పట్టుకుంటే నిటారుగా పైకి ఎగిరి నిలబడుతుంది. దారం వదిలేస్తే బడి వదలగానే నువ్వు ఆడుకోడానికి పోయినట్టు యిట్టే ఎగిరిపోతుంది ఆకాశంమీద.

సరే ఈ సంగతి తెలియగానే ఇంకా చాలమంది ఇలా పెద్ద పెద్ద హైడ్రోజన్ బెలూన్‌లు చేసి ఎగరవెయ్యడం మొదలుపెట్టారు. అయితే ఎవరెన్ని చేసినా, రెక్కలు తగిలించుకుని రోజుకుని పడుతూ లేస్తూ కాకుండా, హాయిగా స్తిమితంగా కూర్చుని ఆకాశంలో ప్రయాణంచేయడం మొట్టమొదట మాంట్ గాఫియర్ పొగ గుమ్మటాలలోనే జరిగింది. (వాళ్ళు ఎగరలేదని చెప్పానుగా) అయితే అది తెలిసిన ఇంకో యిద్దరు ఫ్రెంచివాళ్ళు చచ్చిపోతే చచ్చిపోతామని ధైర్యంచేసి ఎగిరారు. ఒకతనిపేరు – పైలేటర్ డి రోజియర్; ఇంకో అతను మార్క్విస్ డి అర్లాందే.

1783 నవంబరు 21న, మాంట్ గాఫియర్ పొగబుట్టకి ఇంకో తట్ట కట్టి వాళ్లు పైకి ఎగిరారు. అక్కడనించి అది గాలిదేవుడి ఇష్టానుసారం ఐదుమైళ్ళు షికారుపోయి బుట్టలో గాలి చల్లబడ్డాక కిందకి దిగింది.

అక్కడతో ఫ్రాన్సులోనే కాక యూరప్‌లోని ఇతర దేశాలన్నిటా ఈ బెలూన్‌ల పిచ్చి బాగా పట్టింది. చాలామంది ఇవి తయారుచేశారు వారిలో చాలామంది ధైర్యంతో వాటిని పట్టుకుని ఆకాశంలోకి ఎగిరారు.

అక్కడితో ఆగలేదు. సరదాలు అటుంచి, ఎత్తునుంచి చూసి తెలుసుకోతగిన సంగతులు తెలుసుకున్నారు. వాళ్ళ ఊరు, అక్కడ కొండలూ గుట్టలూ, నదులూ

కాలవలూ పైనించి చూస్తే ఎలా ఉంటాయో గుర్తించుకున్నారు. బొమ్మలు వేశారు. వంద సంవత్సరాలు గడిచేసరికి ఈ బెలూన్‌లనే యుద్ధాలలోకూడా వాడడం మొదలుపెట్టారు. యుద్ధాలంటే, ఇప్పటికి మల్లే విమానంమీంచి బాంబులు పడేయడంకాదు. అప్పుడు నేలమీదనే యుద్ధాలు జరిగేవి. అందులో శత్రువుల సైన్యం ఎక్కడ ఉంది, ఎలా ఉంది, ఎంత ఉంది, ఎటువెళ్తోంది? ఇలాంటి సంగతులు తెలుసుకోవాలనుకో, శత్రురాజుకి ఉత్తరంరాసి, అడిగితే చెబుతాడా. చెప్పడుగదా. పోనీ మనమే వెళ్ళి ఓసారి చూసొద్దాం అన్నా వీల్లేదు కదా. అందుచేత ఇవతలివాళ్ళు ఈ బెలూన్‌కట్టి, దాంతో ఎగిరి అలా శత్రు సైన్యాలున్న చోట మీదకివెళ్ళి వాళ్ళసంగతి అంతా తెలుసుకుని చక్కా వచ్చేవారు. ఫ్రెంచివాళ్ళు 1790లో వీటికోసం బాగా డబ్బు ఖర్చుపెట్టి, యుద్ధంలో ఇలా వాడేవారు.

మీ వూరి శివాలయం అంత ఎత్తున పెద్దగుమ్మటం - పట్టుబట్టతో తయారు చెయ్యడము అంటే మాటల్తో పనా? పూర్తిగా డబ్బుతో పని. సిల్కు చొక్కా కుట్టించుకుంటేనే పది రూపాయలు అవుతుంది గదా.

పోనీ చవగ్గా మల్లుతో చెయ్యకూడదా అంటారేమో. పట్టు కున్నంత బలం గట్టితనం మల్లుకి ఉండదు. అదీ సంగతి.

అంచేత ఇలాటివాటికి డబ్బున్న వాళ్లు కూడా ఖర్చు పెట్టరు. లాభం వస్తుందని ఆశ ఉన్నా, అంతా పోతే నష్టంగదా అని భయపడతారు. ఇలాటి పెద్దపనులకు ప్రభుత్వమే ఉండాలి.

ఈ బెలూన్‌లు యుద్ధాలలో శత్రువుల రహస్యాలు తెలుసుకుని గెలుచుకోడానికి పనికొస్తాయని తెలియగానే, ఫ్రెంచి గవర్నమెంటు చాలా డబ్బు ఖర్చుపెట్టింది. తరవాత ఇతరదేశాలు కూడా బాగా ఖర్చు పెట్టారు.

అనకూడదు గాని యుద్ధాలవల్ల ప్రాణ నష్టం జరిగినా, వాటిమూలానే కొత్త కొత్త సదుపాయాలన్నీ కనిపెట్టడం జరిగింది. అందుకోసమని యుద్ధాలు రావాలని అనటంలేదు సుమా. ఇదివరకు జరిగింది ఇది. యుద్ధంలో గెలవాలన్న ఆశకొద్దీ గవర్నమెంటు వాళ్ళు చాలా డబ్బుపోసి, శాస్త్రజ్ఞులను తొందరపెట్టి, బతిమాలి, బలవంతపెట్టి అనేక కొత్త కొత్త సాధనాలు తయారు చేయించారు. గుమ్మటాలూ, ఆ తరవాత విమానాలూ, హెలికాప్టర్లూ, జెట్‌లూ, రాకెట్లూ గబగబ వచ్చేశాయి. తుపాకులూ, మరతుపాకులు, ఫిరంగులూ, బాంబులూ, చేతిబాంబులు, ఆటంబాంబులు, ఇపుడు హైడ్రోజన్ బాంబులూ ఇవన్నీ తయారైపోయాయి.

ఇవన్నీ గొప్పవైనా సంతోషం కల్గించేవి కావు. వీటివల్ల కూడా మంచిపనులు చేయడానికి వీలున్నా ఎక్కువగా చెడే జరిగింది. లక్షలకొద్దీ మనుషులను ఇవి చంపేశాయి. అణుశక్తి ఉందనుకో. దానివల్ల ఎంత మంచిపనులు చేయవచ్చునో అంత చెడ్డపనులు చేయవచ్చు. ఆటంబాంబులు ఉన్నవారు తొందరపడి వాటిని పేల్చేస్తే, ఎంతో నష్టం ఉంది.

ఇంతకీ అసలు కథకి వద్దాం. బెలూన్‌ని కనిపెట్టిన కొత్తల్లోనే ఒక గొప్ప చిక్కు ఎదురైంది.

ఈ గుమ్మటాలు పైకిఎగరడం అయితే ఎగిరేవి. కాని తీరా అక్కడికివెళ్ళాక యజమాని చెప్పినట్లు వినేవికాదు. గాలి ఎటుపొమ్మంటే అటుపోయేవి. ఇంకోవేపు

తిప్పడానికి వీలు అయేదికాదు. ఇక్కడో బొమ్మవుంది చూడు. ఒక పెద్ద బెలూనుకి చుట్టూరా తాళ్ళు పోసి వాటికి ఒక పెద్దబుట్ట వేలాడ దీశారు. అందులో మనుషులు కూర్చున్నారు. బెలూన్‌తోపాటు ఈ బుట్టా అందులో మనుషులూ ఆకాశంలోకి వెళ్ళేవారు. పైన గాలి ఎటుతోస్తే అటుపోయేవారు. దిగడంమాత్రం వీళ్ళకి చేతనయేద నుకో. దానికి రెండుమూడు ఉపాయాలుండేవి. బెలూన్‌నిండా హైడ్రోజన్ ఎక్కిస్తారుగదా. మరి అది అందులోంచి పోకుండా బెలూన్ మూతి బిరడాతో బిగిస్తారుగదా. వీళ్ళు బెలూన్ చేసేటపుడే, దానికి రెండు మూడు చోట్ల చిన్న బిరడాలు అమర్చి ఉంచేవారు. వీళ్ళు ఇంక దిగిపోదాం అనుకున్నపుడు వాటిలో ఒకటో రెండో బిరడాలు కొంచెం తెరిచి హైడ్రోజన్‌ను కొంత బయటికి పోనిచ్చేవారు. అది తగ్గి పోయేసరికి, ఆ బెలూన్, ఈ బుట్టనీ మనుషుల్నీ మొయ్యలేక ఉసూరు మంటూ మెల్లిగా కిందకి దిగేది.



ఇంక పోతూ పోతున్న ఈ గాలి ఓడకి బ్రేక్ వేసి ఆపడం ఎలాగో తెలుసా? సరిగ్గా పడవకి లంగరువేసే విధంగానే. కాకినాడలో పైకి ఎగిరిన బెలూను సామర్లకోటవేపు రాకుండా సముద్రంమీదకి పోతోందనుకో, మరి అందులో ఉన్నవాళ్ళకి ప్రమాదం కాదూ?

అలాంటపుడు, వాళ్లు బెలూన్‌లో హైడ్రోజన్ గబగబా వదలిపెట్టేసేవారుట. అపుడు బెలూన్ నీరసపడి, వీళ్ల బరువుని మొయ్యలేక ముందుకు పోతూఉన్నా అంతకన్న గబగబా కిందకి దిగిపోయేది. ఊళ్లో చెట్లూ చేమలూ ఉంటాయిగా. బెలూన్ బుట్టలో మనుషులు అవి చూసుకుని ఓ పెద్దతాడుకి లంగరులాటి కొక్కాలుకట్టి దాన్ని కిందకి వదిలేవారు. అది ఏ చెట్టుకొమ్మకో తగులుకుని, కళ్ళెం లాగినట్టుగా బెలూనును ఆపేసేది. తరవాత అందులో మనుషులు దబుకూ దబుకూ దూకేసేవారు. లేదా మెల్లిగా తాడులాగి బెలూన్‌ని కిందకు దింపుకుని దిగేవారు. ఇలాటిస్థితిలోనే, ఇద్దరు బ్రిటిష్‌వాళ్లు డా॥ జెఫ్రీస్, బాంకర్ అని వారిపేర్లు– ఒకరోజున గాలి వీలుచూసుకుని డోవర్ దగ్గిర పైకెగిరి ఇంగ్లీషు ఛానెల్‌దాటి ఫ్రాంసులో దిగారు. ఇంగ్లీషు ఛానెల్

బ్రిటన్‌కీ ఫ్రాంసుకీ మధ్యన ఉన్న సముద్రమంత నది. దీనివెడల్పు 22మైళ్ళు. కేవలం గాలివాలు మీద ఆధారపడి ఇంతదూరం ఎగిరి వెళ్ళడం ఆ రోజుల్లో అద్భుతం. ఎవరూ కలలో కూడా అనుకోలేదు. మొట్టమొదటిసారిగా ఇది చేసింది వీళ్ళే 1785 జనవరిలో. ఇది విన్నవారూ కన్నవారూ కూడా దీనిగురించి ఆ రోజుల్లో ఎంతో విడ్డూరంగా కథలు కథలుగా చెప్పుకునేవారు.

విమానాలు తయారైన తరవాత మొట్ట మొదటిసారి ఈ ఛానెల్‌ను దాటినవాడు 'లూయీ లెరాయ్ అనే ఫ్రెంచి అయన. 1909 జూన్ 25వ తేదీన ఈయన ఇది సాధించాడు.

మధ్యలో ఆగకుండా రెండుసార్లు ఛానెల్ దాటిన కీర్తి సి. ఎస్. రోల్స్ అనే బ్రిటిష్ పెద్దమనిషికి దక్కింది. ఇవన్నీ కంఠతా పట్టాలి కాబోలని కంగారుపడకు. ఏం? ఈ రోల్సుగారు ఆర్విల్ రైటు, విల్బర్ రైటు కట్టిన విమానంలోనే ఇది దాటాడు. ఇది 1910లో జరిగింది.

విమానాలమీదకన్న బెలూన్‌మీద ఎగరడమే ఒకవిధంగా గొప్పకదా. ఇందులో ఎక్కువ ప్రమాదం ఉంది. అది మనిషిని ఎక్కడకీ తీసుకెళ్తుందో చెప్పలేం. ఎప్పుడు పేలిపోతుందో, ఎప్పుడు నిప్పంటుకు భగ్గుమంటుందో (అంటుందిలే) చెప్పలేము. అలాటిది జరిగితే కథ కంచికెళిపోతుంది. శత్రుసైన్యం ఏంచేస్తోందో చూసి చక్కావద్దామని ఈ బెలూన్ ఎక్కి వెళ్ళారనుకో. సరిగా ఆ సైన్యం నెత్తిమీద, ఎత్తుగాఉన్న బెలూన్ గబుక్కున పేలిపోతే, గోవిందా అని ఇంగ్లీషుభాషలో అరుస్తూ ఇతగాడు సరాసరి శత్రువుల వళ్ళో పడతాడుకదా,. ఆ తరవాత వాళ్ళు ఇతన్ని మళ్ళీ గోవింద కొట్టించేస్తారు.

ఒకసారి గాషియర్, కాక్స్‌వెల్ అనే ఇద్దరు ధైర్యశాలులు ఇలాగే బెలూన్‌తో ఎగిరారు. గాలి అటూ ఇటూ తొయ్యనందువల్ల అది సరాసరి పైకివెళ్ళిపోయింది ఇంతా అంతాకాదు 87 వేల అడుగులు. అంటే సుమారు 7 మైళ్ళు ఎత్తుకే వాళ్ళని ఎత్తుకుపోయింది. మనం బాగా పైకివెళ్ళినకొద్దీ గాలి తక్కువైపోతుందిలే. వాళ్ళకి పాపం ఊపిరిపీల్చడానికి సరిపడేటంత గాలికూడా అక్కడలేదు. అంతపల్చగా తక్కువగా ఉందన్నమాట. ఊపిరాడక ఒకాయన మూర్ఛపోయాడట., రెండో అతను బెలూన్ బిరడా తీసి, దాన్ని మెల్లిగా దింపాడనుకో.

ఇంకోసారి ముగ్గురు జర్మనీవాళ్లు ఉత్తరధ్రువం చూసివద్దామనుకున్నారు. 1897 జూలై 11న బుట్టలో రొట్టెలు, నీళ్ళుగట్రా పెట్టుకుని ఒక పావురాన్ని వెంటపెట్టుకుని బయల్దేరారు. మూడో రోజున (13వ తేదీ) పావురంద్వారా కబురంపారు. కులాసాగానే ఉన్నామూ, ప్రయాణం నెమ్మదిగా సాగుతోంది అని

మళ్ళీ అప్పటినించి ఇప్పటిదాకా ఉత్తరధ్రువంనుంచి ఉత్తరమ్ముక్క కూడా రాయలేదు వాళ్లు...

ఇవన్నీ చూసి, ఇలాటి కథలు విని, పరిశోధకులు కొందరు కొత్త పద్ధతి రావాలన్నారు. బెలూన్ మనం చెప్పినట్లు విని తీరాలన్నారు.

కొందరు పైకి ఎగిరి వెళ్ళాక, ఆ బుట్టలో కూర్చునే, కాలవమీద పడవలవాళ్ళకిమల్లె గాలిలోనే తెడ్లువేసి ఊహూ ఆడించేవారు. కర్రతెడ్లు కావనుకో. కర్రతో చట్రంచేసి దానికి గుడ్డ బిగించేవారు. దాన్ని గాలిలో ఆడించేవారు. బెలూన్‌ను ముందుకు నడపడానికి. ఇలా చాలాసార్లు తిప్పలుపడ్డాక రెక్కలు నెప్పిపెట్టడం తప్ప ఇంకేమీ లాభంలేదని తేల్చుకున్నారు.

అపుడు బెలూన్ ఆకారమే మార్చేశారు. దానికి ఇంజను బిగించారు. మొట్టమొదటి సారిగా ఇది చేసినవాడు. హెన్రీ జెఫర్డ్. పడవ ఆకారంలో ఈయన బెలూను



కట్టాడు. అదిచూడు. ముందు సన్నగా ఉండి పోను పోను లావుఅయి, మధ్యదాకా వచ్చాక మళ్ళీ క్రమంగా సన్నబడిపోతుందిగదా. ఇలా అయితే అది నీటిని చీల్చుకుంటూ చురుకుగా పోవడానికి వీలు. గాలికి కూడా ఇదే పద్ధతి బాగుంటుందని ఆయనకి తట్టింది. అందుకోసం బుట్టబెలూనును మార్చి పడవలాటి— ఇంకా సరిగా చెప్పాలంటే దొరచుట్ట ఆకారంలో ఉండేలా బెలూను తయారుచేశాడు. చాలా పెద్దదిలే, ఇక్కడ వేసిన బొమ్మలో, ఈ బెలూనుకింద బుట్టనీ, అందులో మనుషుల్నీ చూస్తే, దాన్ని బట్టి ఇదెంత పెద్దదో తెలుస్తుంది. ఇది చేసిన జఫర్డ్ దీనికి ఆవిరియంత్రం ఒకటి బిగించాడు. దాని సహాయంతో తెడ్లు గబగబ, బలంగా ఊపబోయాడు. కాని, ఇంజన్ చాలా, చిన్నదయిపోయినందువల్ల అనుకున్నట్లు జరగలేదు.

అయినా, దీనివల్ల కొత్త ఊహాలు వచ్చాయి. దీనితోటే విమానాలకథ మారిపోయి మంచిదారిలో పడింది. ఓడిపోతున్న కొద్దీ మనిషికి గెలవాలన్న పట్టుదల పెరిగింది. తాతగారు చెయ్యలేని పనిని మనవడు సాధించబోయాడు.

సరే, ఈ ఆవిరియంత్రంతో ఇలా కుస్తీలు పడుతూ ఉండగా, పెట్రోలుతో మరలు తిరుగుతాయని ఎవరో కనిపెట్టారు. ఆ యింజనుకో ప్రొపెల్లరు బిగించారు. గాలి పడవని ముందుకులాగే సాధనం అన్నమాట. 1897లో ఇది వచ్చింది. దొరచుట్టలాటి ఈ గాలిఓడకి కింద ఈ యింజను అమర్చి, ఓ చివర తెరచాప కట్టారు. కప్పీలమీంచి తాళ్ళుపోసి, వాటిసాయంతో, పడవ చుక్కానిలాగే ఆ తెరచాపని ఉపయోగించి గాలిఓడని కుడికీ ఎడమకీ మళ్లించడం నేర్చుకున్నారు. ఇది కనిపెట్టినాయన జర్మన్. పేరు డా॥ ఊల్ ఫర్ట్. ఆయన దీనిమీద ఎగిరినపుడు, ఒక ప్రమాదం వల్ల పెట్రోలు భగ్గుమని మండి, అది బెలూనుదాకావెళ్లి, బెలూను పేలిపోయింది...

దరిమిలాను 1901లో బ్రెజిల్ దేశానికి చెందిన ఒక కుర్రవాడు ఇలాటిదే ఒకటి చేసి పైకెగిరి, ఫ్రాంసులోని ఈఫిల్ టవర్ చుట్టూరా తిరిగి మళ్లీ బయల్దేరినచోటు చేరుకున్నాడు.

"ఓహో! మనం గాలిని ఓడించాం. ఇంకనించి గాలి మనకింద కూలీ. మన యిష్టం వచ్చిన చోటుకి విమానాన్ని తోలుకుపోవచ్చు" అని అందరూ చప్పట్లు కొట్టారు.

యంత్రం నడపడంలో పెట్రోలు తరవాత వచ్చిన గొప్ప సదుపాయం విద్యుచ్ఛక్తి.

ఒకాయన ఎలక్ట్రిక్ మోటారు అమర్చుకుని, ప్రొపెల్లరు తప్పి గాలిఓడమీద షికారు కొట్టేశారు. ప్రొపెల్లరు అంటే విమానాన్ని ముందుకు లాగేదన్నమాట. దీని అసలుపేరు ఎయిర్‌స్క్రూ. అంటే మరమేకు, చెక్కలోకి దొల్చుకుపోయినట్లు ఈ ఎయిర్‌స్క్రూ గిరగిర తిరుగుతూ గాలిని కోసుకుంటూ ముందుకు వెళ్లిపోతుంది. ఇది మళ్లీ తరవాత చెబుతాలే.

మొత్తంమీద ఈ తరహా గాలిఓడలలో అందరికన్న మంచిఓడ కట్టింది ఫ్రెంచివాళ్లు. ఫ్రెంచిప్రభుత్వం ఆ రోజుల్లోనే ఏకంగా, తన సైన్యంలో విమానదళ అంటూ ఒకటి ఏర్పాటు చేసేసింది. మరి ఇది శత్రువుల నెత్తిమీద ఎగిరి వాళ్ళసంగతులు తెలుసుకోడానికి ఎలాగా పనికొస్తోందిగా. కెప్టెన్ రెనార్డ్, కెప్టెన్ క్రెబ్స్ అనే ఇద్దరు ఒక పెద్ద గాలిఓడ కట్టారు. నూటయాభై అడుగుల పొడుగు. చేప ఆకారం. మిగతా వాళ్లలా దీనికి ప్రొపెల్లరు (ఎయిర్‌స్రూ) వ్రేలాడగట్టకుండా దాని ముక్కుకే అమర్చి బిగించారు. ఇది విద్యుచ్ఛక్తితో తిరిగేది. గాలిలోకి తేలిన ఈ బెలూనుని, ఈ ఇంజన్ గంటకి 14 మైళ్లవేగంతో నడిపించింది. ఈ గాలి ఓడకి పుట్టినరోజు పండుగచేస్తే జూన్ 5న చెయ్యవచ్చు. 1783వ సంవత్సరం జూన్ 5న ఇది బాగా ఎగిరి, 'ఓడ' అనిపించుకుంది. దీనికి పుట్టిల్లు ఫ్రాంసు. ఆ రోజునించి వందసంవత్సరాలదాకా ఇది 'పుట్టినింటే' పెరిగింది. ఇతర దేశాలకన్న ఫ్రెంచివాళ్ళే దీన్ని ఎక్కువ బాగా వాడుకున్నారు. ఎన్నో కొత్తవి చేశారు. ఎంతో దూరం ఎగిరారు. ఆ తరవాత జర్మనీ పుంజుకుంది. జర్మనీ అనడంకన్న జెపిలిన్ అని చెప్పడం న్యాయం. ఎందుకంటే ఆయననే ఇందులో బోలెడు ఘనమైన పనులు చేశాడు. ఈ జెపిలిన్ బాగా డబ్బున్న వాడు. బుర్ర ఉన్నవాడు. తెంపరి. యుద్ధశాస్త్రం బాగా తెలుసు. ఈయన పూర్తిపేరు ఫెర్డినాండ్‌వాన్ జెపిలిన్.

జెపిలిన్‌కు ఈ పెద్ద బెలూన్‌లు ఇలా ఎగరడం నచ్చలేదు. దానికె ఏ మూల చిన్న చిల్లుపడినా అదీ మనిషీకూడా పేలిపోతారుగదా. అందుకని ఈయన

కొత్తపద్ధతి కనిపెట్టాడు. ఈ గాలిఓడకి ముందర అల్యూమినియంతో చట్రం కట్టాడు. దానిమీద గట్టి సిల్కుబట్టని బిగించాడు. ఆ లోపల అంతా చిన్నచిన్న హైడ్రోజన్ బెలూనులు వందలకొద్దీ ఎక్కించి నింపేశాడు. ఇలా అయితే, ప్రమాదంవల్ల ఒక బుడగ పేలిపోయినా ప్రమాదంలేదుగదా. ఇంకా కొన్నివందల బెలూనులు అలాగే ఉండి ఓడని మోస్తాయి.

ఏం. ఈ ఓడకి రెండు ఇంజన్లు తగిలించాడు. వాటితో నడిపేసరికి ఈ గాలిఓడ గంటకి 18 మైళ్ళ వేగంతో ఎగిరింది. అంతేకాదు ఎటు వెళ్లమంటే అటుతిరిగి చెప్పినట్టు వింది, మంచిబాలుడు రాములాలా. జెపిలిన్ ఓడచేసేసరికి జర్మనీలో అందరికీ మంచి హుషారు వేసుకొచ్చింది. అదిచూసి, ఇంకా అలాంటివి అంతకన్న మంచివీ వందల కొద్దీ కట్టేశారు. కొద్దికాలంలో జర్మనీ దేశానికి కూడా పెద్ద విమానబలం ఏర్పాటయిపోయింది. జెపిలిన్ కూడా పెద్ద ఫ్యాన్లు పెట్టి మంచి మంచి విమానాలు తయారుచేయించాడు. ప్రపంచమంతా వీటికి పేరు వచ్చింది. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో ఇవి బ్రిటన్మీదకి జోరుగా ఎగిరి దాడిచేసి వచ్చాయి. డజను మంది మనుషుల్నీ బాంబుల్నీ కూడా మోసుకుపోయేవి.

ఇక్కడి కిదంతా ఒకకథ. ఇది బెలూను కథ. ఇంక విమానాల కథ చూద్దాం.

కాశీ మజిలీ కథలు చదివిన వాటిలో రాజుకొడుకు, మంత్రికొడుకు వాళ్లూ దేశాంతరాలు బయల్దేరి ఓ పెద్ద చెట్టు దగ్గిరికి వస్తారు. దానికి రెండుకొమ్మలు చాలా పెద్దవి ఉంటాయి. రాజుకొడుకు తూర్పువైపు కొమ్మఎక్కి అలాపోతాడు అపుడు రాజకుమారి కనిపిస్తుంది. బోల్డుకథ! ఈలాగే ఇటు మంత్రికొడుకు దక్షిణంవేపు కొమ్మమీద పోగాపోగా మంత్రి కుమార్తె కనిపిస్తుంది. అదంతా ఇంకొక కథ. విమానంకథా కొంచెం అలానడిచింది.

బెలూన్ల సహాయంతోటే ఆకాశంలోకి మనిషి ఎగరాలి అనుకున్న వాళ్ళందరూ ఓవేపు ఇంత హడావుడి చేస్తూ వుంటే, మరికొందరు ఇంకో రోడ్డుచ్చుకు బయల్దేరారు. వారు ఎకాయెకిని, ఇపుడు మనం చూసేరకం విమానాలే చెయ్యాలి అని తిప్పలు పడ్డారు. బెలూన్తో ఎగిరేవాళ్ళు ఇటు ఎంతో దూరంపోతే విమానం వాళ్ళు అటు ఇంకెంతో దూరం పోయారు. తరవాత ఇద్దరూ ఒకర్నొకరు చూసుకుంటూ ఇంకొంచెం దూరం వెళ్లారు. చివరికి, "బెలూన్లకన్న విమానాలే బెస్టు" అనేశారు.

పక్షి ఈకలతో రెక్కలుచేసి అవి తగిలించుకు ఎగరడం పాత ఫాషన్ అయిపోయింది. బెలూన్తో ఎగరడం కొత్తఫాషనుగా వచ్చిన రోజులలోనే వాళ్ళకీ వీళ్ళకీ పేచీలు వచ్చాయి.

"గాలికన్న తేలిక అయినదే గాలిలో పైకి లేస్తుంది. ఆ తరవాతనే మనం ఎన్నిఆటలు ఆడినా సాగేది" అని బెలూన్ మతం వాళ్ళు అన్నారు.

"అదేం కాదు లేవోయి పుల్లయ్యా! గాలి కన్న బరువ్వీ తేలుతాయి. ఆ బరువు లెక్కకట్టే పద్ధతి వేరూ" అని విమానాలవాళ్లు వాదించారు.

బెలూను మతంవాళ్లు యీ మాటలు నమ్మలేదు. వీళ్ళు ఉట్టి వెర్రి వెంగళాయిగాళ్ళు అనుకుని, మళ్ళీ ఇంకో బెలూను ఎగరేసుకోడానికి పోయారు.

విమానాలవాళ్ళు మాత్రం తమ పని మానలేదు. సరిఅయిన పద్ధతిలో విమానంకట్టి, దానికి ఇంజనుపెట్టి, గాలిగుణాలు, అందులో బరువు తెలుసుకుని ఎగిరేస్తే గాలికన్నా బరువువైనవి తప్పకుండా ఎగురుతాయని వాళ్లకి నమ్మకం ఉంది.

నమ్మకం ఉందిగాబట్టే ప్రయత్నం చేశారు. ఆ సరియైన పద్ధతి తెలుసుకోడానికి. ఓ తాళం చెవి పోయిందనుకో తాళం అస్సలు బద్దలుకొట్టకుండా పెట్టె తెరవాలంటే పాతతాళం చెవులగుత్తి వెతికితెచ్చి వాటిలో దేనితోనైనా ఇది వస్తుందా అని చూస్తాం. సరిఅయిన చెవిదొరికేదాకా అది రాదుగదా. ఈలోగా మనం అక్కడ కూర్చుని జుట్టు పీక్కున్నా, పిల్లి మొగ్గలు వేసినా, తేలు మంత్రం చదివినా, ఆఖరికి సినిమా పాటలు పాడినా కూడా అదిరాదు. సరియైన పద్ధతి తెలియాలి. దేవుడు గాలికీ, నీటికీ, మట్టికీ, నీకూ, నాకూ, రాయికీ , రప్పకీ, కప్పకీ అందరికీ శక్తిని ఇచ్చాడు. ఆ శక్తిని ఎలా వాడాలో తెలుసుకొంటే అది మనకి గొడ్డు చాకిరీ చేస్తుంది. పంకా ఉందనుకో. అది ఎంత చల్లగా హాయిగా గాలి విసరగలదో స్విచ్ నొక్కితే తప్పా తెలీదుగదా. చేత్తో తిప్పితే ఏం లాభం. అలాగే అదన్నమాట. ఇంకోటికూడా ఉంది. ఈ శక్తికీలకం తెలుసుకోవడంలో ఒక్కొక్కసారి తప్పదారికి పోయామనుకో. అది మీదనుంచి చితగొట్టేస్తుంది. దానికి జాలీ గీలీ లేవు. ఈనీళ్ళలో శక్తి బోలెడుంది. వరదలొస్తే ఆపలేం. ఊళ్ళన్నీ మునిగిపోతాయి. మరి ఆనీటికే ఆనకట్ట కడితే, దానితో ఎంతో చెయ్యొచ్చు. విద్యుచ్ఛక్తి పుట్టించవచ్చు. దానితో ఎన్నో మరలు నడపవచ్చు. గాలి శక్తితో గాలి మరలు తిప్పేవారు పూర్వం. ఇపుడు విమానాలు నడుపుతున్నాం. అలాగే ఏదైనా అది తెలుసుకోడానికే నానా తిప్పలూ పడాలి. ఎంతోమంది దానికోసం ప్రాణాలు అర్పిస్తారు. బతికున్నన్నాళ్లు అదొక్కటే పనిపెట్టుకుని ఆ పనేచేస్తూ ఎపుడో చచ్చిపోతారు. తపస్సు చెయ్యగా చెయ్యగా దేవుడే దిగివచ్చాడు. కాదా. అలాగే ఒకదానిమీద దృష్టిపెట్టి కష్ట పడితే దాని రహస్యం తెలుస్తుంది. ఇది తపస్సే. దానికి ఒకరు చాలకపోవచ్చు వందమంది కావలసి రావచ్చు. ఒక ఏడాది చాలక పోవచ్చు. నూరేళ్లు పట్టవచ్చు, ఇంకా ఎక్కువ కావచ్చు.

**ఇప్పటి విమానాల అప్పటి కథ:**

అనగనగా అమెరికాలో బోస్టన్ అనే ఒక ఊరు. అది ఇప్పుడూ నిక్షేపంలా ఉందిలే, 280 ఏళ్ళ క్రితం ఒకరోజు సాయంకాలం ఆ ఊరిచివర చెరువుదగ్గిర పాతికముప్ఫయి మంది బడిపిల్లలు చిన్నాపెద్దా గుంపుచేరారు. ఆ చెరువు చాలా పెద్దది. దాదాపు మైలు వెడల్పు. చెరువులో పన్నెండేళ్ళ కుర్రాడొకడు ఒడ్డుకు దగ్గరగా కూర్చున్నాడు. గట్టుమీద ఇంకో కుర్రాడు పెద్ద గాలిపడగ ఎగరేశాడు. అది బాగా పుంజుకుని ఆకాశంలో స్థిమితంగా నిలబడేదాకా చూసి తరవాత దారపు ఉండ కర్రని ఆ చెరువులో కుర్రాడి చేతికిచ్చాడు. ఆ పళంగా ఆ కుర్రాడు కొంచెం లోతుకినడిచి వెల్లికిలా పడుకున్నాడు. ఇంకోక్షణంలో కాళ్ళూచేతులూ బాదనవసరం లేకుండానే ఆ కుర్రాడు చిన్నసైజు తెప్పలా తేలుతూ అవతలగట్టువైపు వెళ్ళడం ప్రారంభించాడు.

"బెన్ కాళ్లు చేతులూ అసలు కదపడంలేదు. గాలిపడగే వాణ్ణి లాగేస్తోంది" అంటూ చెరువుగట్టుమీది పిల్లలంతా ఆశ్చర్యపడుతూ చప్పట్లుకొడుతూ చెంకలెగరేస్తూ అరవసాగారు.

చెరువులో కుర్రాడు కొంచెంసేపటిలో అవతలగట్టుకి హాయిగా చేరిపోయాడు.

"ఎలా ఉందిరా బెన్?...గాలి పడగే లాగిందా?" అని కుర్రాళ్లంతా కుతూహలంగా అడిగాడు.

"బేషుగ్గా ఉంది. భలేగా ఉంది. తమాషాగా ఉంది. గాలి గట్టిగా వేసినప్పుడు అది నన్ను గబగబా లాగింది. గాలిజోరు తగ్గితే నా జోరూ తగ్గింది. నాకు జోరుగా వెళ్లాలనిపించినపుడు దారం బిగలాడేవాణ్ణి. పడగ పుంజుకునేది. జోరు మరీ రెచ్చిపోయి భయంవేస్తే దారం బాగా వదిలేవాడిని. అంతే టపీమని వేగం తగ్గిపోయేది. భలేగా ఉందిలెండి యాత్ర" అన్నాడు ఆ కుర్రాడు.

గాలిబలం, గాలిగుణం, దానిలొసుగులూ ఇంత చులాగ్గా కనిపెట్టేసి స్పష్టంగా చెప్పేసిన ఆ కుర్రాడి వయస్సు పదిహేను సంవత్సరాలు ఉంటుందేమో.

ఆ అబ్బాయి పేరు బెంజమిన్ ఫ్రాంకిలిన్. 1770లో కాబోలు బెన్ ఈ సంగతులు కనిపెట్టాడు.

ఇది జరిగిన 174 సంవత్సరాల తరవాత బేడెన్ పవెల్ అనే ఒక పెద్దమనిషి గాలి పడగచేత ఒక మనిషిని పైకి ఎత్తించగలిగాడు. స్కౌటు సంఘాలు మొదలుపెట్టినది ఈయనే.

36 అడుగుల ఎత్తున ఒక పెద్ద గాలిపటం కట్టి ఈయన ఎగురవేశాడు. దాని తోకకి– చాలా పెద్దతోక అన్నమాట. ఓ బుట్ట కట్టాడు. అందులో ఒక అబ్బిని కూర్చోపెట్టాడు. దారం కొంచెం బిగలాగి జోరుగా వదిలేసరికి పడగ ఇంకొంచం పైకి ఎగిరింది. అమాంతంగా దానితోకకి కట్టిన బుట్ట–అందులో మనిషితోకూడా పైకి లేచింది!

ఈ బెడెన్ పవల్ బెలూన్ మతంవాళ్లకి శుద్ధవిరోధి. సరే, ఇలా ప్రయత్నాలు చేశాడు. ఒకసారి చిన్న చిన్న గాలిపడగలు బోలెడు జతకట్టి వాటితోకల కొసలన్నీ కలిపాడు. అక్కడనుంచి ఒక తాడు వేళ్లాడకట్టి దానికో బుట్టకట్టి అందులో మనిషిని కూర్చోమన్నాడు.

ఈ పద్ధతివల్ల ఆ గాలిపడగలన్నీ కలిసి మనిషి కూర్చున్నబుట్టని నూరు అడుగుల ఎత్తుకి తీసుకు వెళ్లాయి. ఆస్ట్రేలియాలో హాక్ గ్రేవ్ అనే ఆయన గాలి పడగలతో ఒక పెట్టె చేశాడు తమాషాగా. దాన్ని పుచ్చుకు వేళ్లాడి కొంచెం పైకిఎగిరాడుకూడా.

అయితే ఒక విషయం. ఈ తమాషాలూ తతంగాలూ, కథ, కమామీషు అంతా గాలిజోరుగా ఉన్నపుడే జరిగేవి. ఎగరాలనుకున్నవాళ్లు గాలికోసం తపస్సు చేస్తూ కూర్చునేవారు.

ఒకరోజున బేడెన్ పవల్‌కి ఒక ఊహ తట్టింది. ఆ వేళ గాలి వీచడంలేదు. ఉక్కపోసేస్థితిలో ఉంది వ్యవహారం, పవల్ గాలిపడగ తెచ్చాడు. ఆ పళంగా రెండు గుర్రాలకి కాడివేసి గాలిపడగ దారాన్ని దానికి కట్టాడు. కొరడా పుచ్చుకొని చెళ్లున ఒక్కటి తగిలించాడు. గుర్రాలు ఝూమని పరిగెత్తేసరికి గాలిపడగ రివ్వున ఎగిరింది.

దానితోపాటు పడగతోకకి కట్టిన బుట్ట అందులో మనిషితోపాటు ఆకాశంలోకి లేచింది. ఈ దెబ్బతో ఒక గొప్పసంగతి బుజువైపోయిందన్న మాట. గాలిపడగ లాంటిదాన్ని గబాగబా ఏదైనా ముందుకులాగేది ఉంటే మనుషులు ఆకాశంలో ఎగరవచ్చొ అని తేలింది.

గాలిపడగ నిటారుగానూ ఉండదు, బల్లపరుపుగానూ ఉండదు. కాస్త ఏటవాలుగా ఉంటుంది. భూమిచుట్టూ తిరిగే గాలి ప్రవాహాలు దాన్ని తోసినకొద్దీ మనం దారం వదలిన కొద్దీ అది పైకివెళ్తుంది. పల్టీలు కొట్టకుండా ఉండడానికి దానికి బరువు వ్రేలాడకట్టాలి. ఒక్కొక్కసారి పెద్దపెద్ద పడగలికి ఎంత పెద్ద తోక కట్టినా బరువుచాలక పల్టీలు కొడుతుంది. మా అన్నయ్యావాళ్ళూ పోటీలు వేసినపుడు తోకకి రాళ్ళుకూడా కట్టేవారు. రాళ్లంటే జ్ఞాపకం వచ్చింది. శివాజీ కథలోనో ఎందులోనో ఒకసారి చదివాను. ఒక కోట ముట్టడించాడు. శత్రువుల కోటగోడలూ తలుపులూ దిట్టంగా ఉన్నాయి. కోటలోనివాళ్ళు పైనించి మరుగుతున్న నూనె వేడినీళ్ళూ గుమ్మరిస్తున్నారు. రాళ్ళూ బండలూ దొర్లిస్తున్నారు.

కోటని ముట్టడించినవాళ్ళు చాలా ఆలోచించి ఒక ఉపాయం చేశారు. కోటలో మందుగుండు సామగ్రి దాచేగదులు ఏవో కనుక్కున్నారు. అవటా ఓ అర్ధ రాత్రివేళ ఒక గాలిపడగకి పెద్దతోక కట్టి నూనెలో ముంచి దానికి నిప్పంటించి ఎగరేశారు. గాలి కోటవేపే వీస్తోంది. దారం వదలగా వదలగా మండుతున్న ఆ గాలిపడగ మెల్లిగా మందుగుండు కొట్టుదగ్గరకు చేరుకొంది. కొద్దిసేపటిలోనే అక్కడ పేలుడు సామగ్రి అంటుకుని చిత్తంవచ్చినట్లు పేలింది. ఆ దెబ్బకి గదులు కోటగోడలు బద్దలై తునకలైపోయాయి. కోటలో ఉన్న సైనికులు చాలామంది చచ్చిపోయారు. ఉన్నవాళ్లు కోలుకుని లేచేలోగా ఆ శివాజీదండు కోటమీదకి దండెత్తి లోపలికి జొరబడిపోయి కోట పట్టుకుందిట.

సరే ఈ గాలిపడగల కథ ఇలా ఉందనుకో. ఇంకోవేపు గ్లయిడర్లు అంటూ ఇంజనులేని విమానాలు తయారుచేసి కొందరు ఎగరడం మొదలుపెట్టారు.

గ్లయిడరు అంటే గాలివాలుమీద అలా తేలిపోయేది. గెద్దలాగా బారజాచిన రెక్కలుండే విమానం అన్నమాట. పూర్వకాలపు గ్లయిడర్లు ఇప్పటివాటికిమల్లే నాజూగ్గా వుండేవి కావనుకో. 1890 ప్రాంతాలలో ముగ్గురు అసాములు వీటితో బోల్డు సాములు చేశారు. జర్మనీలో ఆటో విలియంతార్, ఇంగ్లాండులో పెర్సీ పిల్షర్, అమెరికాలో ఆక్టేవ్ కాన్యూట్, ప్రొఫెసర్ పియర్ లాంగ్లీ అనేవాళ్ళు ఈ విద్యలో గొప్పవాళ్ళు.

మీ మేడమీదనించి ఓ చిన్నరాయి పడేశావనుకో. అది తిన్నగావెళ్ళి నువ్వేసిన చోటునే సరిగా క్రిందపడిపోతుంది. అదే ఓ చిన్న కాయితంముక్క వదిలావనుకో. అది అంత జోరుగా నేరుగా కిందపడిపోదు. అటూ యిటూ ఊగుతూ ఆడుతూ, నువ్వు బడినించి ఇంటికి వచ్చినట్లు మెల్లిగా కిందకి దిగుతుంది. అదీ కొంచెం దూరంగా వెళ్ళి దిగుతుంది. ఏం? అలాగే ఓ అట్టముక్కని పట్టుకుని విష్ణుచక్రంలా గుండ్రంగా కత్తిరించి (కత్తిరించక పోయినా ఫర్వాలేదనుకో)దానిని రివ్వున విసిరావనుకో. అది రివ్వున్నర వేగం గాలిలోంచి దూసుకుపోయి అవతలివీధి కూడా దాటేసి దాని అవతలవెళ్ళి పడుతుంది. దీన్నే గ్లయిడింగ్ అంటారన్నమాట.

ఇందాక చెప్పిన కాన్యూటూ వాళ్లూ ఎగిరిన గ్లయిడర్లు ఇలా వెళ్లినవే. వాటిని అలా తేల్చి తేల్చి తీసుకుపోయి ఎక్కడోదింపేది. వాళ్ళు ఎలా వెళ్ళేవారో తెలుసా

బారుగా రెక్కలు కట్టిన ఒక చట్రం (గ్లయిడరన్నమాట) పట్టుకుని ఓ పెద్దకొండమీదకి ఎక్కేవారు. అక్కడ దాన్ని పైకె పట్టుకుని (అందులో పట్టుకు వేలాడడానికి రెండు ఊసలు ఉంటాయి) అమాంతంగా ఆ కొండమీంచి దూకేసేవారు. దూకే దభీమని కింద పడిపోకుండా గ్లయిడరు రెక్కలు ఆపేవి. అంటే, అది కిందకిపోతానన్నా గాలి ఆ రెక్కలకి అడ్డు అయి ఆపేదన్నమాట. అప్పుడు ఆ రెక్కలు గాలిమీద కొంచెం అటుజరిగి కొద్దిగా కిందికి దిగేది. అక్కడ మళ్ళీ అడ్డొచ్చె గాలి. ఇలా కిందకి దిగేలోపుగా కొద్దిదూరం పోయేది గ్లయిడరు.

ఈ రోజులలోనే ఇంకో రెండు పద్ధతులు కూడా కనిపెట్టారు ఎగరడానికి రెండూ మంచివి కావని వెంటనే తెలిసిపోయిందనుకో. ఈ రకం విమానాలు బొమ్మలు ఆడుకోడానికీ, లేనిపోని ఆశలు పెట్టుకోడానికీ పనికొచ్చాయి తప్ప మనుషుల్ని మోసుకుని ఎగరడానికి కాదు. ఈ రెండిటికీ మూల సూత్రం రబ్బరు తాడే.

పల్చటి చెక్కతో విమానం ఒకటి చేసి దానికి అడే రెక్కలు అమర్చారు. రబ్బరుతాడుని ఇందులో ఓగించి బాగా మెలితిప్పి వదలి పెట్టేశారు. ఆ పురి విడడంలో రెక్కలు కొట్టుకునేవి సీతాకోక చిలుకల రెక్కలలా. అప్పుడు విమానంకూడా కొద్దిగా పైకి ఎగిరేది.

రెండో పద్ధతి కొంచెం మెరుగు. విమానం ముక్కుకి ప్రొపెల్లరు (ఎయిర్ స్క్రూ) అమర్చి దాన్నించి తోకదాకా రబ్బరుతో కట్టి దాని మెలిపెట్టి గిరగిర తిరిగి విమానాలను ముందుకు లాగేది. అయితే అలా ముందుకు పోనిస్తే ఎగురుతుందని ఖచ్చితంగా తెలీదు. విమానాన్ని పైకి నిలబెట్టి పట్టుకుని ప్రొపెల్లరు ఫాను తిరగ్గానే వదిలేసేవారు. రివ్వున పైకెగిరిన తరవాత పురి అయిపోగానే వాలిపోయేది. చివరకివి మనుషుల్ని మోసేందుకు పనికిరావని తేల్చారు. ఒకళ్లిద్దరు ఎగిరిపోయి పడిపోయి కాళ్ళు చేతులూ విరగ్గొట్టుకున్నారు.

పెనాడి, మూర్, సర్ బెయిలీ మొదలైన వాళ్ళు ఇలాటివి చాలా తయారు చేశారు. చివరికి ఇవి పనికిరాలేదు కాబట్టి ఇంక గ్లైయిడర్లు ఏదో ఒకదారి చూపాలని, వాటిమీద చాలా ఆశలు పెట్టుకుని చాలా ప్రయత్నాలు చేశారు. పెర్సీ పిల్చర్, లిలియంతాల్ వీటి కోసమే ప్రాణాలు అర్పించారు.

సరే, ఈ గ్లయిడర్లు పైకివెళ్లాక తేలుతూ వెళ్తే బాగానే ఉంది. కాని, అసలు ఎగరడం ఎలా? ఎన్నాళ్లు వీటేని మోసుకుంటూ కొండ లెక్కి దూకడం—?

ఇలా ఆలోచించగా ఒక ఉపాయం వచ్చింది. ఓ మూడుచక్రాల సైకిలుకి పొడూగుతాడు పోసి దాన్ని ఈ విమానం ముక్కుకు కట్టారు. సైకిలు వేగంగా తొక్కేసరికి గ్లయిడరును లాగసాగింది. గ్లయిడరు కాస్త పైకి లేచింది. అంటే ఇందాక గాలిపడగ గురించి చెప్పలే? పెద్ద పడగకి దారం దాన్ని జోడు గుర్రాలకి కట్టి గుర్రాలుతోలేసరికి పడగ పైకి లేచేదిగదా, అలాగే! సైకిలు కన్న కారు మెరుగని ఒకాయన ఈ గ్లయిడరికి కారు కట్టి లాగించాడు. బాగానే ఎగిరింది కాని ఏం లాభం? కాసేపయాక, అది, అందులో మనిషీ నేలకూలి పోవడం జరిగింది.

ఆ మనిషి వెల్లకిలా పడ్డాడు. పైన ఓ దొర చుట్ట బెలూను నిమ్మళంగా ఎగురుతూంది. అందులో ఓ దొర చుట్టకాలుస్తు కూర్చున్నాడు హాయిగా. ఆ

బెలూన్‌కి ముందర పెట్రోలు ఇంజనుతో ప్రొపెల్లరు తిరుగుతోంది. అది చూడగానే ఈ ఆసామికి అద్భుతమైన ఉపాయం తోచింది. ఆ ఇంజన్‌ని ఈ గ్లయిడర్‌కు బిగిస్తేనో? అనుకున్నాడు. అప్పుడు దీనికి తాడుకట్టి లాగనక్కరలేదు. ప్రొఫెసర్ లాంగ్లీ ఈ పద్ధతితో విమానం కట్టి ఎగిరాడు. అయితేనేం అనుకున్నంత బాగా ఎగిరింది కాదది. గొప్పగొప్ప పనులు అన్నీ ఇలాగే ఉంటాయనుకో. బాగా ఎగరలేకపోయినా, అసలు ఎగరడమంటూ ఎగిరాడు కాబట్టే, యంత్రంతో మొట్టమొదటిసారి విమానాన్ని ఎగరేసిన కీర్తి ఈయనకే దక్కింది.

లాంగ్లీ చనిపోయాకా, ఆయన ఇంట్లో మూలపడి ఉన్న విమానాన్ని బయటకి తీసి కొందరు మళ్ళీ ప్రయత్నించేసరికి అది బాగానే ఎగిరింది! గమ్మత్తుగా లేదూ! లాంగ్లీ విమానం ఒక చిన్న పడవ. దానికి ముందూ వెనకా రెండుజతల రెక్కలుకట్టి వాటి మధ్య రెండు ప్రొపెల్లర్లూ, చివర చుక్కానీ అమర్చారు.

కొన్నాళ్ళ తరవాత అమెరికాలో హీరాంమాక్సిం అనే ఆయన ఇంతకన్న ఎక్కువరెక్కలతో ఎక్కువ హంగులతో ఒక విమానం కట్టాడు.

పూర్వకాలం ఓడలకి బోలెడన్ని తెరచాపలుండేవి చూడు. అలా దీనికీ చిన్నరెక్కలూ చిట్టిరెక్కలూ పొట్టిరెక్కలూ బోలెడు కట్టాడు. పద్దెనిమిది అడుగుల ప్రొపెల్లరు పెట్టాడు. విమానానికి చక్రాలు అమర్చి దాన్ని రైలుపట్టాలమీద ఎక్కించి ఇంజను తిప్పాడు.

ప్రొపెల్లరు గిర్రున తిరిగింది. విమానం మెల్లిగా కదిలి, మెల్లిగానే వేగం హెచ్చించి రైలుబండిలా పట్టాలమీదనే కొంతదూరం పోయింది. తరవాత మెల్లిగా పట్టావదిలి పైకిలేచింది. అలా కొంచెం దూరం ఎగిరి—

—పాపం మళ్ళీ నేల కూలిపోయింది. అయితేనేం విమానాలకథకి ఇది గొప్ప విషయం. ఇప్పుడు విమానాలన్నీ ఈ పద్ధతిలోనే గదా ఎగురుతున్నాయి.

రైటు సోదరులు విమానంమీద తొలిసారి (పన్నెండు సెకండ్ల సేపు) ఎగరడంతోటే, విమానం కథ అనేది అయిపోయిందనవచ్చు. తరవాతిదంతా ఆనాటి విమానంలో హంగులు అన్నివిధాలా నానాటికీ మెరుగౌతూ రావడం కథ; అందులోంచి కొత్త కొత్త విమానాలు, పెద్దపెద్ద విమానాలు పుట్టుకురావడం కథ. మనుషులను మోసేవి, సరుకులను – పెద్దపెద్ద లారీలను, టాంకులనూ మోసుకుపోయేవి, బాంబులను మోసుకెళ్ళి ఎవరినెత్తినో పడేసేవి. ఎన్నో రకాల విమానాలు వచ్చాయి. నిల్చున్నపళంగా ఎగిరి ఆపళంగా, ఎక్కడ పడితే అక్కడ – తట్టుకోగలిగితే మీ యింటి డాబామీద దిగగల హెలికాప్టర్లు (నెత్తిమీద రెక్కలుండేవి) వచ్చాయి. పోనుపోను, ప్రొఫెల్లరు (ఎయిర్ స్క్రూ) అవసరం లేకుండా ఎగర గల జెట్ విమానాలు వచ్చాయి. జెట్‌లు మాత్రం గమ్మత్తయినవిలే.

నువ్వు మీ నేస్తం నెత్తిమీద ఓ జెల్లకాయకొడితే వాడు మళ్ళీ ఒకటి పుచ్చుకుంటాడు గదా. ఇంచుమించు అలాటిది ఈ జెట్ విమానాన్ని నడిపే పద్ధతి అన్నమాట. ఈ సూత్రాన్ని న్యూటన్ (యాపిల్ చెట్టునించి పండు ఊడితే కింద నెందుకుపడాలి? పైకెందుకు పోరాదూ అని ఆశ్చర్యపోయాడే–అతనన్నమాట) కి తోచింది. మనమేం చేసినా అందుకు విరుద్ధమైన పని దాంతోపాటే జరుగుతుందని ఆయన మాట.

తుపాకీ పేల్చినపుడు (నువ్వు పేల్చకేం ఇపుడు వినుచాలు. పెద్దవాడివయ్యాక బాగా తెలుస్తుంది.) అందులో గుండు ముందుకు పోతూన్న క్షణంలో, అది పోయే వేగానికి తుపాకీ వెనక్కి తంతుంది. (అందుకే తుపాకీ పేల్చినపుడు దాన్ని గుండెకు దన్ను పెట్టి మరీ మీట నొక్కుతారు.) పోనీ తారాజువ్వ చూశావుగా. తారాజువ్వ కింద నిప్పంటిస్తే అందులో దూరినమందు కాలి, గొట్టం అడుగునించి రివ్వున మంట, పొగ వస్తాయి. ఆ వేగానికి జువ్వ పైకి ఎగిరిపోతుందన్నమాట. తూటాలు వెలిగించి విసిరినా అంతే, ఇలాగే దేనికైనాను అని న్యూటన్‌గారు సూత్రం చెప్పారు. ప్రతి క్రియకు, ఎదురుగా ప్రతిక్రియ ఉంటుందీ అని ఈ సూత్రాన్నిబట్టి జెట్ విమానం కట్టారన్నమాట. రాకెట్టు అంతే. విమానం రెక్కలలో అమర్చిన గొట్టాలలోంచి పెట్రోలు ఆవిరిఅయి వేగంగాపోతూ ఉన్నపుడు ఆ ధాటీకి విమానం ఎదురువేపుకి పోతుందన్నమాట. అంతేకాని ఇందులో పొగా ఆవిరీ వచ్చి గాలిని తొయ్యబట్టి విమానం ముందరికి వెళ్తుందనుకోకేం. జెట్ విమానాలలోనే ప్రొపెల్లరు ఉండేవికూడా ఉన్నాయి. అక్కడ ప్రొపెల్లరే జెట్‌ల సహాయంతో తిరుగుతుందన్నమాట.

రాకెట్‌లు ఎగరడానికీ ఇదే ముఖ్యసూత్రం. చైనావాళ్లు ఈ రాకెట్‌లను మొట్టమొదట కనిపెట్టారనవచ్చు. 750 ఏళ్లక్రితం వాళ్లు ఇలాటి బాణాసంచా కాల్చేవారట.

ఈ రోజున రాకెట్‌లు రావడంతో విమానాలు పాత ఫాషన్ (కనీసం యుద్ధాలకి) అయిపోతున్నాయి. ఇపుడు మిసిలీలు వచ్చాయి. వీటిని తోలేవాడు అందులో కూర్చోకుండానే, ఎక్కడో నేలమీద ఓ గదిలో కూర్చుని రాడార్ సాయంతో చెబుతాడన్నమాట. ఇవి ఎంతో వేగంతో ఎంతో దూరం పోగలవు.

అందువల్ల ఇపుడు కాకపోయినా ఇకముందైనా విమానాలు మనుష్యులకు ఎక్కువ సేవచేయడానికే ఉపయోగపడతాయని చెప్పవచ్చు. ఇది వరకు రోజులతరబడి ప్రయాణం చేస్తే వెళ్లే దూరాన్ని విమానాలు గంటలలో దాటేంచేస్తున్నాయి. అమెరికా బ్రిటను, రష్యా, ఈ అన్ని దేశాలమధ్య దూరమూ ఈ విధంగా తగ్గిపోయింది. పొద్దున్న బయల్దేరితే సాయంత్రానికి అడంగి చేరిపోవచ్చు. విమానాలు సరుకుల్ని – బరువైన వాటినికూడా, మోసుకుపోతున్నాయి. వీటికోసం పెద్ద పెద్ద విమానాలు కట్టారు. పాసెంజరు విమానాలు కూడా పెద్దవి ఉన్నాయి. వీటిలో డబ్బై ఎనభైమంది పోవచ్చు. అందులో కాఫీ ఫలహారాల గది ఉంటుంది. చిన్న సినిమాకూడా వేసేందుకు సదుపాయాలు ఉన్నాయి.

ఇపుడు విమానాలను మించిపోయిన రాకెట్లు రావడంతో మనం చంద్రుడి దగ్గరకు కూడా వెళ్ళే అవకాశాలు వస్తున్నాయి.

విమానాలకథ మనకి నేర్పే నీతి ఒకటి ఉంది. దేనికైనా సరే సుళువు తెలుసుకోడానికి కష్టపడితే, అదేమిటో తెలుస్తుంది. అదికనక తెలిస్తే ఎవడైనా, ఎంత బలవంతుడైనా మనం చెప్పినట్టు విని సేవ చేస్తాడు. ఆ సుళువు తెలుసుకోకుండా, వాడిని ఎంత చావబాదినా లాభం లేదు. గాలి అంతేకదా. గాలికి ఎంతో శక్తిఉంది. ఇప్పుడేకాదు. విమానాలు రావడానికి చాలాకాలం క్రితం నించీ ఉంది. దాన్ని

వాడుకోవడం తెలిసినమీదట అది ఇన్నాళ్లకి ఇంత సేవ చేస్తోందన్నమాట. విమానం కథలో నువ్వు గుర్తించుకోవలసింది ఇంకోటికూడా ఉంది. నువ్వేదేనా పని చేసినపుడు, అది మంచిపని అని నీకు చేతనవునని నువ్వు అనుకున్నప్పుడు మిగతావాళ్ళు నవ్వినా వెక్కిరించినా, అది పోలీసువాళ్ళుకూడా చెయ్యలేరన్నా, నువ్వు మాత్రం ప్రయత్నం చెయ్యి. ఓసారి సరిగా రాకపోతే మళ్లీ చెయ్యి. మళ్లీ చెయ్యి.

పూర్వకాలంలో చిన్న చిన్న కుర్రవాళ్లు, పెద్దవాళ్లు కూడా అలా చెయ్యబట్టే ఇవాళ రైళ్లు నడుస్తున్నాయి. రేడియోలు మోగుతున్నాయి. దీపాలు వెలుగుతున్నాయి. సినిమాలు ఆడుతున్నాయి. విమానాలు ఎగురుతున్నాయి.

★ ★ ★

# ముళ్లపూడి వెంకటరమణ
# సాహితీ సర్వస్వం

**మొదటి సంపుటం : కథారమణీయం-I** రూ.150-00

సీతాకల్యాణం, ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ, జనతా ఎక్స్‌ప్రెస్, రాజకీయ బేతాళ పంచవింశతిక - ఇతర కథలు.

**మూడవ సంపుటం : బాలరమణీయం - బుడుగు** రూ.80-00

**రెండవ సంపుటం : కథారమణీయం-II** రూ.150-00

ఋణానందలహరి, కానుక, రాధాగోపాలం, సాక్షి ఆకలీ-ఆనందరావు, విమానం కథ - ఇతర కథలు.

## త్వరలో...

**నాల్గవ సంపుటం : సినీరమణీయం-I**

విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు, చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ విదేశీ చిత్రాల సమీక్షలు.

**ఐదవ సంపుటం : సినీరమణీయం-II**

కథానాయకుని కథ (అక్కినేని నాగేశ్వరరావు జీవిత చరిత్ర), చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ, విదేశీ చిత్రాల సమీక్షలు.

**ఆరవ సంపుటం : అనువాదరమణీయం**

ఎనభైరోజుల్లో భూప్రదక్షిణం, పిటి 109.

**ఏడవ సంపుటం : కదంబరమణీయం**

గిరీశం లెక్చర్లు, నవ్వితే నవ్వండి, వ్యాసాలు, పీఠికలు - ఇతర రచనలు.

ప్రతులకు :


**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**

హైదరాబాదు (సుల్తాన్‌బజార్, అబిడ్స్), విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

# రచయిత గురించి



"ఈ భూప్రపంచంలో ఎదుటివాడిలో కృతజ్ఞత ఆశించే కన్నా ఆంధ్రరాజకీయ నాయకుల్లో ఐకమత్యాన్ని ఆశించు... ఆంధ్రుల్లో కార్యశూరత్వాన్ని ఆశించు" అంటూ ఓ కథలో సెటైర్ కొరడాతో తెలుగువాడిని చమడాలొలిచిన వ్యక్తి ముళ్ళపూడి వెంకట్రావ్... అతడే తర్వాత్తర్వాత ముళ్ళపూడి వెంకటరమణగా మారిన వ్యక్తి. నవ్వడం నవ్వించడం పోయి నవ్వుల పాలైన తెలుగువాడి బతుకుల్లో హాస్యం పన్నీటి జల్లు చిలకరించడం - 1945 లో మొదలెట్టినా - 1950 నుండి దీక్షతో ఆరంభించిన వ్యక్తి ముళ్ళపూడి.

తెలుగు సాహిత్యంలోని నక్షత్రకుడి పాత్రను కౌంటర్ చేసే అప్పారావు పాత్రను సృష్టించి, తెలుగువాడు ఆజన్మాంతం తనకు ఋణపడేలా చేసుకున్న వ్యక్తి - ముళ్ళపూడి వెంకట "ఋ" మణ.

నిరాశా, నిస్పృహలు, అడ్డంకులు, అవమానాలు, అదలింపులు, బెదిరింపులు, అసూయలూ, అణచివేతల మధ్య తెలుగువాడి జీవన సంఘర్షణ సాగుతుండడం గమనించి హాస్యాన్ని ఊతకర్రగా అందించాడు. వ్యంగ్యం ద్వారా తెలుగువాడి చూపుకు నైశిత్యాన్ని - హాస్యం ద్వారా తెలుగు "వాడి పలుకు" కు నైర్మల్యాన్ని ప్రసాదించాడు. గాంభీర్యం, గడుసుదనం, వాదన, వేదన కలగలిపి, రస హృదయం, సరస హృదయం రంగరించి, జీవన సాగర మథనంలోంచి పుట్టిన అద్భుత గుళికల్లాంటి ఉపమానాలను జతచేసి తన రచనలన్నింటా మానవత్వం జెండా ఎగరేసిన వ్యక్తి ముళ్ళపూడి. 1931 జూన్ 28న తూర్పు గోదావరి జిల్లాలో పుట్టిన వీరికి 1945లో బాపుగారితో స్నేహం కలిసింది. పదాలతో చిత్రరచన చేసేవారికి, పదాలకు బొమ్మ కట్టే వారి సాన్నిహిత్యం లభించినట్లైంది. ముళ్ళపూడి వారు రచయితగా ఉన్నా, స్క్రిప్టురైటర్‌గా ఉన్నా, పత్రికా రచయితగా పని చేసినా అన్నిటా రమణీయ ముద్రను పసిగట్టగలం. వీరి రచనలకు ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థలెన్నో పురస్కారాలందించాయి. ఆయన సృష్టించిన పాత్రలే వారిని ఎవర్‌గ్రీన్ రచయితగా నిలబెడుతున్నాయి. తెలుగువాళ్ళకు గిరీశం ఎలా తెలుసో - బుడుగూ అంతే. నవ్వుతో బాటు రెండు కన్నీటి బొట్లు కూడా రాల్పించేదే నిజమైన హాస్యం. ఆ "హాస్యం ముళ్ళపూడి వాడి, వేడి, తాకిడికి ఈడేరిందన్న" మాట అక్షర సత్యం.